శ్రీ

# సానందోపాఖ్యానము.



వచనకావ్యము.

ఇది,

నెల్లూరు నివాసులగు. బ్రహ్మశ్రీ,

## పురాణం - పిచ్చయ్యకవిచే

వ్రాయఁబడి.

చెన్నపట్టణం ఆంధ్రకళాశాల కాపురస్థులును
వేదాంత విజ్ఞాన విశారదులును ననేక నవీన గ్రంథ
ప్రచారణధురంధరులునగు

[illegible],

## పమ్మి - త్యాగరాయ శ్రేష్ఠిగారిచేఁ

వారి స్వకీయమైన

శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

1926

 వెల రూ. 1-8-0.

| సంఖ్య. | విషయములు. | పుట. |
|---|---|---|
| 20 | యమధర్మరాజు పుణ్యాత్ముల సన్మానించుట. | ౨౦ |
| | (ద్వితీయ ప్రకరణము.) | ౨౨ |
| 21 | దూతలు పాపాత్ములను యముని సన్నిధికిఁ దెచ్చుట. | ౩౦ |
| 22 | యముఁడు పాపాత్ములను శిక్షించుట. | ౩౬ |
| 23 | యమభటులు పాపాత్ములను బాధించుట. | ౩౯ |
| 24 | సానందముని ధర్మప్రసంగునితో పాపాత్ములనుగురించి ప్రసంగించుట. | ౪౧ |
| 25 | సానందముని పరమేశ్వరుని దివ్యలీలలు వర్ణించుట. | ౪౨ |
| 26 | సానందుఁడుతనయభిప్రాయమునుధర్మప్రసంగాదులకుఁజెప్పుట. | ౪౩ |
| 27 | సానందముని మానసిక పూజఁజేసి విమానమును రప్పించుట. | ౪౪ |
| 28 | సానందాదులు విమాన మెక్కియమపురంబుఁ జూడఁబోవుట. | ౪౫ |
| 29 | నారదుఁడు యమపురికివచ్చి యమునితో సంభాషించుట | ౪౬ |
| 30 | నారదుఁడు శమనునకు సానందాదులరాక నెఱిఁగించుట | ౪౭ |
| 31 | యముఁడు నారదునితో సానందుని నిర్లక్ష్యముఁజేసి పలుకుట. | ,, |
| | (తృతీయ ప్రకరణము.) | ౩౫ |
| 32 | కాలుఁడు భటులవలన సానందునిరాక విని కలతనొందుట. | ౫౫ |
| 33 | శమనుఁడు సానందాది ఋషులఁ గొలువు కూటంబునకు దోడ్కొని పోవుట | ౫౮ |
| 34 | సానందుఁడు యమునితో సంభాషించుట. | ౫౯ |
| 35 | యమభటులు సానందముని రాకను పురంబునఁ జాటుట. | ౬౨ |
| 36 | సానందముని యమపురంబులోనఁ దిరిగిచూచుట. | ౬౩ |
| 37 | యముఁడు సంయమికి పురవాసుల వివరించి చెప్పుట | ౬౬ |
| 38 | యమధర్మరాజు సానందునకుఁ దన పట్టణ ప్రభావం బెఱిఁగించుట. | ౬౭ |
| 39 | యమధర్మరాజు సానందునకుఁ బుణ్యాత్ములు చేసిన కార్యంబులఁ జెప్పుట. | ౬౯ |
| 40 | యముఁడు సానందునకు బుణ్యాంగనల వివరించి చెప్పుట. | ౭౨ |

| సంఖ్య. | విషయములు. | పుట. |
|---|---|---|
| 41 | యముఁడు సానందునకు బుణ్యాంగనల సుకృత విశేషంబులు చెప్పుట. | ౭౩ |
| 42 | శమనుఁడు సానందునితో పుణ్యపురుషుల సుకృతివిశేషంబులఁ జెప్పుట. | ౭౬ |
| 43 | యమధర్మరాజు సానందుని పాపాత్ములుండు చోటుఁ జూడరాదని చెప్పుట. | ౭౮ |
| 44 | సానందుఁడు నరకములనుఁ నరకవాసులనుఁ జూచుట. | ౮౧ |
| 45 | సానందుఁడు పాపాత్ముల బాధలచూచి యోర్వఁజాలకఁకృతాంతుని నాక్షేపించుట. | ౮౪ |
| | (చతుర్థ ప్రకరణము.) | ౮౭ |
| 46 | యముఁడు సానందునకు పాపాత్ములు చేసిన కార్యములు చెప్పుట. | ౮౭ |
| 47 | సానందాదులు వచ్చుటంజూచి కింకరులు పాపులను మఱియు బాధించుట. | ౯౦ |
| 48 | పాపాత్ములు తాముచేసిన దుష్కార్యములఁ దలంచి చింతించుట. | ౯౧ |
| 49 | యమభటులు పాపాత్ములను నిందించి తిరస్కరించుట. | ౯౩ |
| 50 | పాపులు సానందుని తమ్ము రక్షింపుమని ప్రార్థించుట. | ౯౪ |
| 51 | యమభటులుపాపాత్ములదుష్కార్యములఁజెప్పిభయపరచుట. | ౯౫ |
| 52 | యముఁడు సానందునకు పాపాధిక్యతను నిరూపించి చెప్పుట. | ౯౭ |
| 53 | యమధర్మరాజు సానందునకు శరీరతత్త్వము నిరూపణంబు జేయుట. | ౧౦౦ |
| 54 | యముఁడు సానందునకు మనుష్యుల యుత్పత్తి క్రమంబెఱిఁగించుట. | ౧౦౩ |
| 55 | యముఁడుసానందునకు దేహనిర్ణయప్రకారమునుఁజెప్పుట. | ౧౦౭ |
| 56 | యముఁడు సానందునకు జీవస్వరూపంబుఁ దెలుపుట. | ౧౧౧ |
| 57 | యముండు సానందునకు జీవేశ్వరుల నైక్యంబు వివరించుట. | ౧౧౫ |
| 58 | యముఁడు సానందునకు జీవతను చతుష్టయ మెఱిఁగించుట. | ౧౧౮ |

విషయసూచిక సమాప్తము



# నాయక నామగర్భిత రథబంధ కల్పిత విష్ణుస్తుతి సీసము.



సీ. శ్రీధామ విలసత్ప రాధారి నిస్సమ్మి,
తాకార వరద నిత్యా మనోజ్ఞ
సుచరిత్ర మణిగణ ఖచిత విభూషణ,
విమల రాజిత వేష విజయమిత్ర
జలజనయన సురేశ్వర ముఖ్యనుత,
సదాశ్రేయ ప్రదాయక సిద్ధగోష్ఠి
సమ్మోద మాధవ సామగానప్రియ,
ధరణీధ రాచ్యుత దురితదూర,
సకల లోకాదినాయక వికీతరాజ,
గమన చక్రధరా యజ కపటరహిత,
రిపుచయక్షయ రూప నిర్జితమనోజ్ఞ,
ప్రకట గుణ నీలగాత్ర మాం పాహి శాంత.





శౌనకుఁడు సూతుని నారదముని వృత్తాంతముఁ జెప్పుమని యడుగుట.



శ్రీరస్తు

# సానందోపాఖ్యానము.

వచనకావ్యము.



## ప్రథమ ప్రకరణము.



### భగవత్ప్రార్థన.

శా. శ్రీరమ్యంబగు దివ్యతేజకలనా ♦ చిద్రూపమై చేర్మి నె
వ్వారే భంగి దలంతురట్టి గుణ సం ♦ బంధాత్మ తత్వప్రధా
నారూఢిం గనుపించునట్టి సకల ♦ వ్యాప్తున్ జిదానందు వి
శ్వారాధ్యున్ బగు వేంకటేశ్వరు నభీ ♦ ష్టావాప్తికై వేఁడెదన్.

క. తొలుదొలుత సంస్మరించెదఁ,
దలఁపున గజ వదను నేక ♦ దంతున్ జంబూ
ఫలసార భక్షణున్ నుత,
విలసిత ఫణిహారధరుని ♦ విఘ్నేశ్వరునిన్.

క. శర్వేందు ముఖిని సకల సు,
పర్వస్తుత నాశ్రితేష్ట ♦ ఫలదాయకి యా
గీర్వాణిన్ విధిరాణిన్,
దర్వీకర వేణి వాణిఁ ♦ దలఁతున్ భక్తిన్.

క. ప్రాపని నమ్మి భజింతు మ,
హా పావనగుణ కదంబ ♦ యగు మాయంబన్
పాప విదారణి నధికద,
యాపర విమలాంతరంగ ♦ నలమేల్మంగన్.

# సానందోపాఖ్యానము.

గీ. మనవి విని యిందుఁగల మత్ప్ర ♦ మాదలేఖ
నావివేకాది జనితంబు ♦ లైనమించు
సరసులన్నియుఁ గరుణ మ ♦ న్నించుఁ డరసి
విమలమతులార! కవులార! ♦ విజ్ఞులార!.

శా. శ్రీమ త్సమ్మికులాబ్ధి సోముఁడు గుణ ♦ శ్రేష్ఠుండు వేదాంత వి
ద్యా మర్మజ్ఞుఁడు నీతిమంతుఁడును వి ♦ ఖ్యాతుండు సౌత్యాగరా
యాముష్యా యణునాజ్ఞ నీ వరయుపా ♦ ఖ్యానంబు మోదంబుతో
ప్రాముఖ్యంబగు గద్యకావ్య మొనరిం ♦ పన్ బూనితిన్ సమ్మతిన్.

గీ. క్షితిని దేవాంగ సత్కుల ♦ శ్రేష్ఠుఁడనఁగ
నెసఁగు నీ త్యాగరాయ శె ♦ ట్టీశ్వరునకు
పరమశివుఁ డాయురారోగ్య ♦ భాగ్యవిభవ
సిద్ధిఁ బొసఁగించి వేడ్క ర ♦ క్షించుఁగాత.

## —— కథాప్రారంభము ——

శ్రీమ త్సమస్తకల్యాణ గుణగణ పరిపూర్ణుండును, తేజోమయుండును, పరిశుద్ధుండును, నాదిమధ్యాంత రహితుండును, భక్తవత్సలుండు నగు పరమేశ్వరునకు నమస్కరించెద.

సత్పురుషులారా! ఆసేతు సీతాచలపర్యంతంబగు నీ భరతఖండంబునం గల గహనంబులయందు సకల మునిగణ శరణ్యంబగు నైమిశారణ్యంబు జగత్ప్రసిద్ధంబై యొప్పుచుండు. నందు నానాజాతివృక్షలతా గుల్మంబులును, వివిధంబులగు పక్షులును, మృగంబులును, సెలయేళ్లును, కొలంకులును, యెల్లప్పుడును మునులు పఠించు సుస్వర వేదనాదంబులుమించిన యాశ్రమంబులును, గలిగి నేత్రపర్వంబు గావించుచుండును. ఆ వనంబున మున్నొకకాలంబున ఋషులందరునుఁ జేరి సకల సంభారములును సంపాదించి సత్రయాగమను పేరుగల యజ్ఞము చేయుటకు ప్రారంభించి జరుపుచుండిరి. ఆ యజ్ఞంబుఁ జూచుటకు (యేమూలామడల దూరమైనను పోయి యజ్ఞము జూడవలయు) నను సామెత కనుగుణ్యముగా నానాదూర ప్రదేశములనుండియు, పెక్కండ్రు ఋషివర్యులు కుటుంబసమేతులై చనుదెంచి. యజ్ఞకర్తల

వలన సమ్మానితులై సరసపదార్థ సంయుక్త భోజనంబులఁ బరితృప్తులైకూర్చుండి. యాగావలోకనార్థ మచటికి వచ్చియున్న వ్యాసశిష్యుండును, సమస్త పురాణేతిహాస కథావిదుండును, మృదుమధుర చాతుర్యభాషణుండును, నిరంతరము భగవత్కథలఁజెప్పుటకుఁ గుతూహలముఁ గలవాఁడనగు సూతుండను మునివలన పురాణంబులును పుణ్యకథలును విని యానందించుచుండిరి. అట్టి యాఋషులలో శౌనకుఁడను నతఁడు ముఖ్యుఁడు. అతఁడు సమయోచితముగా కథకుఁడగు సూతునిఁ బ్రశ్నించి. తనకును దనతోడి మునులకునుఁ గలుగు సందేహంబులు నివర్తిపరుచుకొనుట కాసక్తిఁగలవాఁడు. మిక్కిలి యోగ్యుడు. సూతుని నేదేని యొక యితిహాసము జెప్పుమను నపుడుగాని, ప్రశ్నింపవలసినపుడుగాని, శౌనకుఁడే యడుగుచుండును. గాన తత్పూర్వము సూతునివలనఁ దామువినిన యితిహాసంబుల వలనఁ దృప్తినొందక మఱియు నొక్కపుణ్యకథ చెప్పించి వినుటకుఁ గుతూహలము గల

శౌనకుఁడు సూతుని సానందు వృత్తాంతముఁ జెప్పుమని యడుగుట.

వారైయున్న మునులవలన బ్రేరేపింపఁబడి సూతునింగని భక్తివినయంబు లెసంగ శౌనకుండిట్లనియె. మహాత్మా! నీవలన ననేకంబులగు పురాణేతిహాసంబులు విని సంతోషిత స్వాంతులమయ్యు మాకింకనుఁ దనివి దీరకున్నది. స్కాందపురాణముం జెప్పినపుడు తదంతర్గతమగు సానందముని చరిత్రంబును, సమయానుగుణ్యముగా బలికితిరిగాని వివరంబుగాఁ బలికిన వారుకారు. మాయందు కరుణించి మహానుభావుండగు నాసానందముని జన్మ ప్రకారంబును, నతడేల నరక లోకంబునకు బోయెనో యచ్చట యాతనల ననుభవించుచున్న పాపుల నెవ్విధంబున నరక విముక్తులఁ గావించెనో యతని ప్రభావమెట్టిదియో. యావృత్తాంతంబును వివరముగా నెఱింగించి. తత్కథాశ్రవణ కుతూహలాయత్త చిత్తులమై యున్న మమ్ముఁ గృతార్థులఁ జేయుమని ప్రార్థించిన, మించిన సంతోషంబున శౌనకాదులగు నమ్మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియె.

మునీంద్రులారా! మీరు నన్నిపుడే మహాత్ముని చరిత్రమును జెప్పుమని. ప్రియంబున నడిగితిరో యతని వృత్తాంతమును బలుకుచు

యందు మీవలెనేనును గుతూహలముఁ గలవాఁడనై యున్నాను మీరు వినుట కెంత శ్రద్ధవహించితిరో యంతశ్రద్ధ వివరించుటయందు నాకును గలదని తలఁపుఁడు. పావనంబగు సానందుని వృత్తాంతంబు వినదగినదియు, సమస్త పాపహరంబును, శుభస్కరంబును, నగుటం బట్టి దానిని మీకు వివరంబుగాఁ జెప్పెద. శ్రద్ధావధాన మనస్కులరై యాలింపుఁడని సూతుండు తన మనంబున భగవంతుండగు వ్యాసుని దలఁచి నమస్కరించి సంతసంబెసఁగ తాపసోత్తములఁగని యిట్లని చెప్పఁదొడంగెను.

సూతుఁడు శౌనకాదులకు సానందుని చరిత్రముఁ జెప్పుట.

సుగుణగరిష్ఠులగు ఋషిశ్రేష్ఠులారా! సంసారదుఃఖం బనెడి మేఘపటలంబు నెగరఁగొట్టుటకు పెనుగాలియు, నపేక్షయను శైలం బులఁ ద్రెంచు వజ్రాయుధంబును, నింద్రియంబులను మదించిన యేను గుల జంపుటకు సింహంబును నరిషడ్వర్గంబను దావానలంబు నడగిం చుటకు వర్షంబును, పాపపుంజంబను మండూకంబుల హరించుటకు భయంకర సర్పంబును, దుఃఖమను సముద్రము నింకించుటకు బడ బాగ్నియునై లోకప్రసిద్ధంబును పావనంబును నగు బదరికాశ్రమం బున మున్ను వేదవేదాంత తత్వరహస్యంబు లెఱింగినవాఁడును, గుణ వంతుఁడును, శాంతి, దయ, యోర్పు, భక్తి, వివేకము, సదాచార సంపద, సత్యప్రియము, పరోపకారచింత, యతిథిజనుల నారాధిం చుటయందాసక్తి మొదలగు లక్షణంబులు గలవాఁడును, తేజస్వియు నైన పూర్ణచిత్తుఁడను తాపసోత్తముఁడు నిత్యకర్మానుష్ఠాన నిష్ఠాగరిష్ఠుం డై యెల్లపుడును పరమేశ్వరు నారాధింపుచు కాలంబుఁ గడపు చుండె. నతని ధర్మపత్నిపేరు భద్రదంతి. యామె సకల శుభలక్ష ణంబులకు నాటపట్టై రతీదేవింబోలె నెక్కుడగు చక్కదనమును విలా సంబును గలిగి తన పతియైన పూర్ణచిత్తుని గుణంబుల కెందును దీసి పోవక భర్తయే తనకు దైవంబని నమ్మి యతనియందు భక్తి విన యంబు లగ్గలింప నెడబాయక నిరంతరమును సేవించుచుండెను. బంగా రమునకు పరిమళిత్వ మబ్బినలాగున నొప్పుచున్న యా దంపతులకు సంతానములేకుండుట దక్క మఱి యెందునే కొఱంతయు లేకుండెను.



(౮-వ పుట.) సూతుఁడు శౌనకాదులకు సానందుని చరిత్రముఁ జెప్పుట.

సంతాన వాంఛమాత్రము వారికి నెక్కుడుగా గలదుగాని యది దైవికముగదా! ఒకనాఁడు పూర్ణచిత్తుఁ డరుణోదయంబున వాడుక ప్రకారము మేల్కాంచి పరమేశ్వరుని ధ్యానించి శిష్యజన పరివృతుండై గంగానదికిం జని స్నానంబొనర్చి ధౌతవస్త్రంబుఁ గట్టి ముఖంబునను దేహంబునను విభూతినలంది రుద్రాక్షహారంబులు ధరించి. యా తీరంబున నొక పరిశుద్ధప్రదేశంబున గూర్చుండి యనుష్ఠాన క్రియలు నిర్వర్తించి యింటికిఁ జనుదెంచి దేవపూజయు నతిథిజ నార్చనంబును జేసి పతివ్రతాశిరోమణియగు భద్రదంతివలన నిడఁబడిన రసోదనంబు భుజించి కొలన బ్రహ్మచారులు వేదపాఠంబులు వల్లించుచుండ కుటీరమున విశ్రమించి యున్నతఱి నతని పత్నియు నిష్టపదార్థంబులాహరించి గృహకృత్యంబులు శీఘ్రంబుగా నిర్వర్తించికొని పతిచెంత కరుదెంచి శుశ్రూష చేయుచుండె. నా సమయంబున భద్రదంతి తన మనంబునఁ దత్కాలంబునఁ బొడమిన సంతానవాంఛ కడుంగడు నతిశయించుటయు నిజవల్లభునిఁ జూచి చిరునవ్వొలయ మృదుమధుర భాషణంబుల నిట్లనియె

## భద్రదంతి తన భర్తయగు పూర్ణచిత్తుని తపంబునకు బోవ పురిగొలుపుట.

ప్రాణేశ్వరా! మన మొందును గొఱంతలేని వారలమయ్యును సంతానవిహీనులమై యున్నవారము. చంద్రుఁడులేని రాత్రివలెను, దీపంబులేని గృహంబులాగునను, కల్పకంబులేని నందనవనంబు భంగిని, హంసంబులేని కొలంకులీగునను, సంతతిలేనివారి గేహము శోభారహితమై వ్యర్థంబగునని పెద్దలు చెప్పుదురు. అపుత్రకులకు సద్గతి గలుగదను సూక్తి మీ రెఱుగనిది కాదు. ఎల్ల సంపదలు నొసంగిన పరమేశ్వరుఁ డేలనో మనల నపుత్రకులఁ జేసి యున్నవాఁడు, మఱియు నడవిగాచిన వెన్నెలవలె సంతానవిహీనుల భోగ, భాగ్య, విలాస, సంతోష, గౌరవంబులును, ధన కనక వస్తు వాహనా రామ మందిరాదులును నిరుపయోగంబని తలంచెద. నదియునుంగాక నుదయంబున నిదుర మేల్కాంచి యపుత్రవతి ముఖంబుజూచిన మహా పాపంబు సిద్ధించునని విజ్ఞులు వచియింపఁగా వినియున్నదాన. గాన నే నీ దుఃఖంబు భరింపజాల. సర్వజ్ఞులగు మీకు ధర్మంబులు దెలుపు నే

కొంతటిదానను, మీ కెఱుఁగరాని దేదియును లేదు. మీవంటి మహాను
భావుల పుత్రకులై దుర్గతినొందుట యుచితముగాదుగదా! కావున
నావాక్యంబుల మనంబున నిలిపి భక్తజన సంరక్షణ దక్షుండగు నిట
లాక్షునిఁ బ్రార్థించి పావనచరిత్రుండైన సుపుత్రుండు గలుగ వరం
బు వడయుము. దానంజేసి మనము కృతార్థుల మగుదుము. అని
పెక్కుభంగుల బోధించిన యా కాంచనాంగి మాట లాలించి యది
సత్యంబని యెంచి యీశ్వరు నారాధించి పుత్రుని వడయువరంబు
గాంచినం గాని తనజన్మంబు సార్థకంబుగాదని నిశ్చయించి మైపుల
కింప భార్యం దిలకించి పూర్ణచిత్తుం డిట్లనియె. మనోహారీ! భద్ర
దంతి! నీవు మిగుల వివేకవంతురాలవు, గుణనిధివి; ధర్మంబు
నెఱింగి సత్యంబుఁ జెప్పితివి. నీవచనంబు లమోఘంబులు, కర్తవ్యం
బిట్టిదయ్యె, కరుణామయుండగు శంకరునిఁ బ్రార్థించి పుత్త్రుండు
గలుగ వరంబుఁ గాంచెద. సర్వమయుండును, సర్వజ్ఞుండును, సర్వే
శ్వరుండును, దేవతా సార్వభౌముండును, భక్తపరాధీనుండును, నగు
శర్వు నారాధించినవారికి వడయరాని కోరిక లెవ్విగలవు? దేవేంద్రు
నకు, సుర రాజ్యాధిపత్యంబును, కుబేరునకు నవనిధులును విష్ణువు
నకు చక్రంబును, బ్రహ్మకు సృష్టిగావించుశక్తియు, విఘ్నేశ్వరునకు
విద్యాగురు పట్టంబును, నాశ్రితులకు వాంఛితంబులును, పార్వతికి
దేహార్థంబును నిచ్చినవాఁడును, గంగను జటాజూటంబునందును, చం
ద్రుని మౌళియందును, ధరించినవాఁడును, నగు నంబరకేశుని పాదాం
బుజంబులు మనంబున నిలిపి పరమభక్తి సంయుక్త హృదయుండనై
యారాధించెద. నమ్మహాదేవుం డాశ్రిత జనావనుండుగాన నవశ్యంబు
మదీయవాంఛితంబు నొసంగఁగలండు భగవంతుని నమ్మినవారి కెట్టి
కొఱంతలును గలుగవు, నేనిప్పుడ గదలిపోయి యొక విజనప్రదేశంబుఁ
జేరి తపంబుఁ గావించెద. నని చెప్పి సాధ్వీమణియగు భద్రదంతి నింట
నునిచి తత్సమీప సిందువాల తక్కోల హింతాల రసాల సాలప్రియా
ళు జంబు జంబీర నారికేళాశ్వత్థ వట కుటజ కురంటక కోవిదారాది
వృక్షనికరావృతంబై సారస చక్రవాక, బక బలాహక, చక్రాంగ కో
యష్టిక, జల కుక్కుటాదులగు పక్షులు గలిగి, రక్త శ్వేత కమల కల్హార

వారపూరిత మధుర రసాస్వాదనాగత బంభర ఝుంకార విరాజితంబుగా నొప్పు నొక్కకొలంకుఁగట్టున నిర్మలస్థలంబున, శుచియై కూ

### పూర్ణచిత్తుఁడు తపంబుఁ జేయుట.

ర్చుండి భస్మరుద్రాక్షమాలికాధరుండై భక్తిమీర పంచాక్షరీ మహామంత్రంబు జపించుచు, స్మరహర నామస్మరణానంద పరవశుండై తత్త్వజ్ఞులెఱుంగునవియు, నంతస్థలమున నధోముఖంబులైనవియునగు, కమలంబుల నారింటిని మీఁదికిఁద్రిప్పి తొమ్మిది ద్వారంబులను బంధించి ప్రాణవాయువును బిగియఁబట్టి యచలుండై చలికిని, యెండకును, గాలికిని, వానకును, జడియక మహోగ్రంబగు తపంబు గావించఁ దొడంగిన, నతని తపోమహిమవలనఁ గలిగిన వేఁడిమికి నోర్వఁజాలక నింద్రుండు పెక్కువిఘాతంబులు గలిగించినను వానిని సరకుసేయక స్థిరత్వంబున నుండుటయుఁ గొంతకాలంబున కీశ్వరుండు దయాళుండై యతని కభీష్టంబులొసంగఁదలఁచి ప్రసన్నుండగుటయు, విభూతినలం

### పూర్ణచిత్తునకు శంకరుఁడు ప్రత్యక్షంబగుట.

దిన తెల్లని దేహముగలవాఁడును, పులితోలుఁగట్టినవాఁడును, శూలాయుధంబు ధరించినవాఁడును, సర్పములను హారములుగా ధరించినవాఁడును, మూఁడుకన్నులు గలవాఁడును, జడలుముడిచిన శిరస్సు గలవాఁడును, చంద్రునిమౌళియందు గలవాఁడును, గంగాదేవినౌదల ధరించినవాఁడును, తనదేహంబున సగము పార్వతీదేవి కొసంగినవాఁడును, నందివాహనారూఢుండును, దేవతలచేతను, మునులచేతను, సిద్ధులచేతను సేవింపఁబడుచున్నవాఁడును,దయాస్వరూపుఁడును, నగు నప్పరమశివునిఁ గని పూర్ణచిత్తుఁడు. సంతోష పరిపూర్ణచిత్తుండై తదీయ లక్షణంబుల వలన నుమాధవునింగా నెఱింగి సాష్టాంగ దండప్రణామంబులుగావించి భక్తియుక్తంబుగా నిట్లనిస్తుతించె.—దేవా! నీవు

### పూర్ణచిత్తుఁ డీశ్వరుని స్తుతించుట.

పరంజ్యోతి స్వరూపుఁడవు, ప్రకృతియనఁబడు మాయకవ్వల వెలింగెడి పురాణపురుషుఁడవు, విశ్వమయుఁడవు, విశ్వవ్యాపకుఁడవు, విశ్వాకారుఁడవు, విశ్వాధికుఁడవు, మూలపురుషుండవు, మహాదేవుండవు, నీచేత మోహితంబైన పంచభూతమయమైన ప్రపంచంబున చరా

చరంబులగు సమస్తభూతంబులును, ప్రజాపతులును, రుద్రులును, దేవేంద్రుఁడు మొదలుగాఁగల దేవతలును, సూర్యాది గ్రహములును, గరుడగంధర్వ సిద్ధ విద్యాధరు లాదిగాఁగల దేవయోనులును, యక్ష రాక్షసగణంబులును, శేషుఁడు వాసుకి తక్షకుఁడు మొదలగు మహా నాగంబులును, నైరావతము సార్వభౌమము మొదలగు దిగ్గజంబులును నుచ్చైశ్శ్రవమాదియగు తురంగంబులును, సంతానము పారిజాతము మొదలగు దేవవృక్షంబులును, నారదుఁడు, వశిష్ఠుఁడు, కపిలుఁడు, విశ్వామిత్రుఁడు మొదలైన మహామునులును, రంభాదులయిన యప్సరసలును, పంచభూతంబులును, కులపర్వతంబులును, సప్తసముద్రంబులును, ద్వీపములును, గంగాది పుణ్యనదులును, మహారణ్యంబులును, నాలుగువేదంబులును, వేదాంగంబులును, పురాణములును, దినములు, వారములు, పక్షములు, నెలలు, ఋతువులు, అయనములు సంవత్సరములు, నిమిషంబులు, గడియలు, ఝాములు, రాత్రియుఁ బగలును, నీమొదలుగాఁగల కాలంబులును, సమస్తంబును, నీస్వరూపంబుగాని, నీవుగాని దేదియును లేదు. ఇట్టిలోకంబులు నీయుదరంబున నెన్నియోగలవు, సూర్యుఁడొక్కఁడై యుండియు ననేకజలఘటంబులఁ దోఁచులాగున గనుపించుచుండువాఁడవు, నీలోనజగంబులు నెలయు జగంబులకు నీవొక్కరుండవు కర్తవై ప్రకాశించుచుందువు, శంకరా! ఇట్టి నీమహిమ బ్రహ్మాదులైన నెఱుంగఁజాలరు నన్నుఁగొని యాడుటకు నేనెంతవాఁడ. కొందఱు వేదాంత తత్త్వం బెఱింగిన పెద్దలు పంచభూతముల కూడికచేఁ గలిగిన దేహంబుపై మోహమువిడిచి, జ్ఞానేంద్రియములైదింటిని, విషయంబులైదింటిని, కర్మేంద్రియములైదింటిని, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ననునాలుగింటినిఁ గడచియవ్వలితత్త్వంబుఁ దెలిసి సర్వంబును నీవుగాఁ గనుఁగొని యానందించుచుందురు. నిన్నుఁ గొందఱు సగుణస్వరూపుఁడవనియు, కొందఱు నిర్గుణస్వరూపుఁడవనియు నిశ్చయించి, తమతమ చిత్తంబులఁ దోఁచిన విధంబున, చంద్ర కిరీట, డమరు, త్రిశూల, సర్పహారంబులుగల యుమాపతివనియు, శంఖ, చక్ర, గదా, శార్ఙ్గ ముఖాయుధంబులు గలిగి కనకవసనము, మణికుండల కిరీట గ్రైవేయ హార కేయూర

వనమాలికాది చిహ్నంబులు వెలయనొప్పు నీల మేఘాకారుండగు రమావల్లభుండవనియుఁ నిన్నుఁ దలంతురు. కొందఱు మంత్ర రహస్యంబవనియు, కొందఱు నాదబిందు కళా తీతుండవనియుఁ దలంచి హఠయోగాదు లవలంబించి యమ, నియ, మాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి, నిష్ఠాగరిష్ఠులై నీస్వరూపం బెఱుంగఁ బ్రయత్నింతురు. నదు లెన్నివంకలఁబోయినను తుద నవి సముద్రముం జేరుచందంబున నెన్ని నామంబుల నెన్ని విధంబులఁ దలంచినను, నవియన్నియు నీయందె వర్తించుచుండును. సర్వేశ్వరా! నీవు నిర్వికారుఁడవు, నార్తరక్షకుఁడవు, నఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడవు. నిన్నుఁ జూచుటవలన నేను ధన్యుఁడనైతిని, నా పాపంబులు నశించెను, నాకోరికలు ఫలించెను. దేవ దేవుఁడగు నో స్వామీ! నీపాద సేవకుఁడనగు నాయందు కరుణించి నన్ను రక్షింపుము రక్షింపుమని యిట్లనేక విధంబుల స్తోత్రముఁగావించిన భక్తుల యందు మిగుల దయఁగలవాఁడగు శంకరుఁడు సంతోషించి పూర్ణచిత్తునిఁజూచి యిట్లనియె.

ఈశ్వరుఁడు పూర్ణచిత్తుని తపంబునకు మెచ్చి వరంబిచ్చుట.

ఓయి విప్రోత్తముఁడా! నీవు మిగుల యోగ్యుఁడవు నేను నీతపమునకుమెచ్చితిని, సంతోషించితిని, నీవేమి కోరెదవో చెప్పుము, నీవు కోరినవరమునిచ్చెదను, అని పలికిన చంద్రశేఖరుని మాటలువిని పూర్ణచిత్తుడుసంతసించి దేహము గగుర్పాటుఁజెంద మరల సాగిలఁబడిమ్రొక్కి చేతులు జోడించినిలచి. జగదీశ్వరా ! నీభక్తుఁడనగు నాయందు కరుణించి వరంబొసంగెద నటుగుమంటివి. తండ్రీ! అలాగున నిచ్చెదవేని నాకు యోగ్యుండగు నొక్కకుమారుం గలుగులాగున వరంబిమ్ము నేను సంతానముకొఱకే తపంబుఁజేసితిని,మంచి గుణములు గలవాఁడును, జ్ఞానముఁగలవాఁడును నీపాద చింతనయందు నెల్లపుడును తొలఁగని మనసుఁగలవాఁడును, వినయ, విధేయ సంపన్నుఁడును, నగు నొక్కపుత్రుని దయచేసి నన్ను కృతార్థునిఁజేయు మిదిదక్క నేనింక నేదియుఁ గోరఁజాల. దయానిధీ! యనుగ్రహింపుమని ప్రార్థించిన నీశ్వరుండు మిగుల దయఁగలవాఁడై యో ముని

శ్రేష్ఠుఁడా ! నీవు కోరినలాగున, మంచిశరీర పటుత్వముగలవాఁడును, మంచిగుణములు గలవాఁడును, కోపములేని వాఁడును, పరుల కుపకారము సేయుటయందు ప్రీతిగలవాఁడును, కల్లమాటలు పలుకని వాఁడును, మిక్కిలి తెలివిఁగల వాఁడును, వేగంబున నెల్ల విద్యలను గ్రహింపఁగల శక్తిఁగలవాఁడును, మహిమఁగలవాఁడును, కరుణఁగలవాఁడును, పెద్దలయందు వినయము, విధేయత, మొదలగు మంచి లక్షణములు గలిగి నడుచుకొనువాఁడును, ధర్మము, సదాచారము నెఱిఁగి మెలఁగువాఁడును, నాకు భక్తుండై యెల్లపుడును నన్ను సేవించువాఁడును, నగు పుత్త్రుఁడు నీకుఁ గలుగులాగున వరంబిచ్చితిని. యతని మూలంబున జనని జనకులగు మీకు సద్గతి గలుగఁగలదు చింతమాని యింక నీ గృహంబునకుఁ బొమ్మని యానతిచ్చి దేవతులు జయజయధ్వనులు సేయుచుండ పరమేశ్వరుండు కనుమొఱంగిపోయిన, యంత పూర్ణచిత్తుఁడు సంతోషమును, భక్తియు, మించిన మనస్సుగలవాఁడై, భర్గునకు వందనముఁజేసి ధ్యానించుచు నింటికరిగి నడిచిన వృత్తాంతమంతయు భార్యయగు భద్రదంతితో వివరముగాఁ జెప్పిన విని యామె మిగుల సంతోషించి పార్వతీపతిని సంస్మరించి యీశ్వరానుగ్రహమువలనఁ గృతార్థులమైతిమని తృప్తి వహించియుండె నటులఁ గొన్నిదినంబులు గడచిన భద్రదంతికి గర్భము

భద్రదంతి గర్భము ధరించుట.

ధరించిన లక్షణములు పొడకట్టఁదొడఁగెను ఆమె ముఖంబు తెల్లబాఱెను. చనుమొనలు నలుపెక్కెను. పరమేశ్వరుని వరప్రసాదంబునఁ గలిగియుండుటవలన గర్భస్థుఁడగు శిశువుయొక్క మహిమవలన నామెకు మంచివిషయములు పెద్దలవలన వినవలయుననియు, ఉమాపతియొక్క విమానముమీఁద నెక్కి విలాసముగా తిరుగవలయు ననియు, నరకలోకమున వెతపడు పాపులను కష్టములు తొలఁగించి మిక్కిలి సుఖకరమైన కైలాసంబునకుఁ జేర్చిన బాగుగానుండుననియు, నెల్లపుడును దయార్ద్రుఁడైన శంకరుని దలఁచుచుండి, పూజఁజేసి యానందము నొందవలయుననియు, ఇట్టి మంచి తలంపులు గలుగుచుండెను. బదరికాశ్రమమున నుండు యితరమునుల భార్యలా భద్ర

దంతికి వలసిన యుపచారములు సేయుచుండిరి. భర్తయగు పూర్ణచిత్తుఁడామె కేకొఱంతయు గలుగనీయక కోరినవస్తువులు దెచ్చిపెట్టుచుండెను. ఈలాగున జరుగుచుండ క్రమముగా తొమ్మిదినెలలు నునిండి యామెకు గర్భవేదన ప్రారంభమయ్యెను. మునుల భార్యలందఱునుఁ జేరి యాబిడ కుచితమగు పనులఁజేసి యుపచరించుచుండ

భద్రదంతికి పుత్త్రుం డుదయించుట.

స్థిర యోగముతోఁ గూడిన శుభముహూర్తమున శుక్రుఁడు, గురువు, సూర్యుఁడు మొదలగు శుభగ్రహములు యేకాదశస్థాన కేంద్రగతులై యుండు సమయంబున భద్రదంతి గర్భమున నుండి కుమారుండు జనించె. నంత నామాటవిని పెన్నిధిఁగన్న పేదవానివలె పూర్ణచిత్తుఁడు మిగుల సంతోషమును జెందెను పుట్టినపుడే మిక్కిలి చక్కదనమును కాంతియుఁ గల యాశిశువునుఁ జూచి బదరికాశ్రమవాసులగు ఋషులందఱును శంకరుని మహిమను గొనియాడఁదొడంగిరి. అంత మునిసతులు శిశువునకు పుట్టినవేళఁ జేయవలసిన పనులన్నియును గావించి జలకమార్చి తల్లిచెంత బరుండఁబెట్టిరి. ఉమాపతికి సమానుఁడగునట్టి యా శిశువుపై సురలు పుష్పవృష్టిఁ గురియించిరి. పిమ్మట పదునొకండవ దివసంబున కావలసిన వస్తు సంభారములును, పనివారలను సమకూర్చి పెక్కుమంది మునులను మునిపత్నులను రావించి వారి సమక్షమున నుత్తముఁడైన యా పూర్ణచిత్తుఁడు పుణ్యాహవాచన జాతకర్మములు నిర్వర్తించి మునివరుల యనుమతిఁగొని కుమారునకు "సానందుఁ"డని నామకరణముఁ గావించె, నపుడు మంగళతూర్య రవంబులు చెలఁగె నంత నా బ్రాహ్మణశ్రేష్ఠుఁడు వచ్చియున్న తాపసోత్తముల కేకొఱంతయు లేక సరసపదార్థంబులతోఁ గూడిన భోజనంబుబెట్టించి తృప్తినొందఁ జేసి ధనమును, వస్త్రములును, గోవుగులును, శాలువలును, మొదలుగాఁగల బహుమతులు గావించి యనిపిన

సానందుని బాలక్రీడలు.

వాఁడాయె. నంత బాలకుండు శుక్లపక్ష చంద్రునివలె దినదినాభివృద్ధిఁజెందుచు పరమేశ్వరుని వరమువలనఁ బుట్టిన గొప్ప మహిమఁగలవాఁడుగావున లోకము నిత్యముగాదు. యిట్టి యనిత్యమగు దాని

తో నేమిపనియని యోచించుచున్న వానివలె కన్నులు మూసియుండియు, మోహమనెడి త్రాడును విదళించువానివలె కాళ్లు, చేతులు, నాడించి యాడియు, పూర్వము చేసిన కర్మవలనఁ బుట్టి మరల జన్మము గలుగునోయని పరాఙ్ముఖుఁడై పొరలువానివలె నేలఁ బొరలియు, శాశ్వతమైన కైవల్య సింహాసనమునఁ గూర్చున్నవాని లాగునఁ గూర్చుండియు, జననీజనకులకు సంతోషముఁ గలుగఁజేయుచుండ పూర్ణచిత్తుం డారవమాసంబున నన్నప్రాశన మొనరించె నది మొదలు తల్లియగు భద్రదంతి కుమారునకు స్నానముఁజేయించి తడియొత్తి ముఖంబున విభూతిరేఖలు దీర్చి కంఠంబున రుద్రాక్షపుదండలు వైచి యలంకరించి సంతోష మొందుచుండెను. ఇట్లు కొంతకాలము గడచినంత నైదేండ్లవాఁడగుటయు తండ్రి యతనికి చౌలోపనయనములు

## సానందుఁడు విద్యాభ్యాసము సేయుట.

గావించి. యనంతర మక్షరాభ్యాసము చేయించి విద్యాగురువుల నియమించి చదివించఁ దొడఁగిన విశ్వేశుని వరంబునఁ బుట్టినవాఁడు గావున కుశాగ్రబుద్ధియై యెట్టి విషయంబైనను నొక్కమారు వినిన గ్రహించి చెప్పుచు కొలఁది కాలంబుననే నాలుగువేదములును, వేదార్థములును, ఆరు శాస్త్రములును, ధర్మములును, నితిహాస పురాణాదులగు నన్నివిషయములును చదివి యెఱిఁగినవాఁడై యందఱికంటె నెక్కుడు జ్ఞానముగలవాఁడును, యెల్లపుడును పరమేశ్వరునియందు భక్తిఁగలిగి యారాధించుట కిచ్ఛగలవాఁడును, నిర్మలమైన మనస్సుఁ గలవాఁడును, కులచారము తప్పనివాఁడును, శాంతముగా మాటలాడువాఁడును, వేదాంతతత్వమును బాగుగా పరిశోధించి తెలిసిన వాఁడును, నుత్తమ లక్షణములును, మంచికాంతియు, నెప్పుడును సంతోషము, సంతుష్టియుఁ గలవాఁడును, హరునకుం బ్రియంబగు విభూతి, రుద్రాక్ష, బిల్వపత్ర ధారణంబు మాననివాఁడును, నిరంతరమును శర్వగుణాభివర్ణన సద్గోష్ఠినుండువాఁడునునై యుండఁ దొడంగెను. శివభక్తులతో మాటలాడుటయు, శివునికథలు వినుటయు, శివమంత్రమును జపించుటయు. శివునిగుణంబులు వర్ణించుటయు, శివయోగులచెంతఁ జేరుటయుం దక్క యన్యచింత యతని కెందును లేద

ర్యోను లోకంబు శివమయంబని నిశ్చయించి యితరమంత్రముల జప ముఁజేయుట, తుచ్ఛములగు భోగములనుగోరుట, మాని తల్లిదండ్రుల మాటకు జవదాటక పెద్దలయందు భక్తిఁగలిగి శివపూజా తత్పరుఁడై యుండి క్రమక్రమముగా వర్ధిల్లి పదునాఱేండ్ల ప్రాయముఁగలవాఁ డయ్యెను. ఆ సమయంబున శివుని చిహ్నంబులగు దండము, కమండలువు, కావివస్త్రములు, రుద్రాక్షసరములు, విభూతిపూఁత మొదలగు వానిచే నలంకృతుఁడై రెండవ యీశ్వరుఁడో యను లాగునఁ బ్రకాశించు చున్న వాఁడయ్యెను. అతని తపోనిష్ఠకు ఋషులందఱును నాశ్చర్యముఁజెంది పొగడఁదొడఁగిరి. ఇట్లా మహానుభావుఁడగు సానందుఁడు శివభక్తి పరాయణుఁడై రాత్రియనక పగలనక నెల్లవేళలను,

సానందుఁడు ధర్మప్రసంగుని యాశ్రమంబున కరుగుట.

యెండకును, వానకును, చలికిని, గాలికిని, మంచునకును, యెలుగుబంట్లు, పులులు, మొదలగు మృగంబులకును, వెఱవక పరమేశ్వరునియందు స్థిరంబుగా మనస్సును నిలిపి తపం బొనరించుచుండి యొక్కనాఁడు తపంబుఁ జాలించిన పిమ్మట వనంబునంగల విశేషంబులఁగని యీశ్వరుని సృష్టివిలాసమును వర్ణనఁజేసి యానందించుచుండి యచ్చటికి సమీపముననుండు ధర్మప్రసంగుఁడను పేరుగల మునీశ్వరుని యాశ్రమంబునకుఁ బోవుచుండ నతఁడచ్చటికరిగిన సమయంబున పెక్కుమంది మునులచే పరివేష్టింపఁబడి కూర్చుండి సద్విషయంబులఁ బ్రసంగించుచున్న ధర్మప్రసంగుఁడు సానంద మునివర్యునిఁ జూచి యానందంబుఁజెంది లేచి యెదురేగి యభివందన పురస్సరముఁగాఁ దోడ్కొనివచ్చి, తగిన యాసనంబునఁ గూర్చుండఁ జేసి పూజించి, మహాత్మా! నేడిచ్చటికి మీరువచ్చుటవలన నాతపోవనంబు పావనంబైనది నేనునుధన్యుండనైతిని. నాతపంబు ఫలించినదయ్యెనని విన్నవించిన సానందుఁడా శివయోగి సత్తముని నభినందించి యిట్లనియె. మునివర్యా! నేనిచ్చటికి వచ్చుటవలన మీ కెంతటి యానందము గలిగెనో యంతకంటె నెక్కుడగు సంతోషము. శివయోగులగు మిమ్ముఁ జూడఁగనే నాకుంగలుగుచున్నది. మీరు పరిశుద్ధమనస్కులరైన శివ

—∘— సానందుఁడు ధర్మప్రసంగుని ప్రశ్నించుట. —∘—

స్వరూపులు. మీవంటివారి సాంగత్యము లభించుట దుర్లభముగదా! సంసార తాపత్రయమును వీడి మాయచే యావరింపఁబడిన ప్రపంచ సుఖమును గోరక పరమశివునియందు బుద్ధిని నిశ్చలంబుఁగా నిలిపి యుండు మీవంటివారికిసమానులెందుగలరు? పుణ్యాత్మా! మీరిపుడు గావించు సద్గోష్ఠికి నారాకవలన భగంబు వాటిల్లినది మన్నింపుఁడు. మీరిపుడు ప్రసంగించి చెప్పుచున్న విషయమెద్ది? శాస్త్రమో, ధర్మమో, లేక యితిహాసమో. యదినాతోడఁ జెప్పఁదగునేని విననోరితి నానతిండని యడిగిన చిఱునవ్వోలయు నతనికి ధర్మప్రసంగుఁ డిట్లనియె.

—∘— సానందుని ప్రశ్నలకు ధర్మప్రసంగుఁడు జవాబుఁ జెప్పుట. —∘—

అయ్యా! మీరు పలికినమాటలు విఁతలుగానున్నవి. మమ్మింత గొప్పఁజేయనేల? సాక్షాత్తు పరమేశ్వరునిఁ బోలు మీరు మమ్మగ్గించుటకు మీరు చెప్పినంతటి గొప్పతనము మాయందులేదని సత్యముగాఁ జెప్పుచున్నాను. మాయందు తమకుంగల దయావిశేషంబున మీరు మమ్ముఁగొప్పగాఁ దలచుచున్నవారు. గాని యన్యముగాదు. మేమెంతవారము? ఇదిగో యామునివర్యులు కోరి యడిగినందున నిపుడునాకుఁ దెలిసినవఱకును, పుణ్యముఁ జేసినవారికిఁ గలుగుసుఖమును, పాపముఁజేసినవారు పొందు దుర్గతియునుఁ జెప్పుచున్నవాఁడ. నిందునకు మీరరుదెంచుటవలన భంగమా? యెంతమాట, ఇది మీరెఱుంగనిదిగాని, మీరువినరానిదిగాని, యగునా? మీరిట్లు తలఁచిన మావంటివార మేమనఁగలవారము? అనిపలికిన మందహాసముఁ గావించి, ఋషిశేఖరా! నేనాడినమాట వ్యర్థముగాదు సత్యముగానే చెప్పితి. నది యట్లుండెఁగాని యిపుడు మీరు పలికిన పుణ్యపాపముల తారతమ్యమును, నందువలనఁ గలిగెడి మంచిచెడుగులను, నేనింతకుమున్ను వినియున్నవాఁడఁగాను. ఇదినాకు క్రొత్తవిషయము. కావున వివరముగా దీనిని నేనెఱుంగవలయును. తేటపడం బలికి నామనంబునం బొడమిన యపేక్షనుదీర్పుము. ఇది విన్నదిమొదలు నాకనేక సందేహంబులు బొడముచున్నవి. వృథా కాలయాపన మొనరింపక, పుణ్య పాపములును, వానినాచరించిన వారొందు సుఖదుఃఖములును వివ

రింపుమని యడిగిన సంతసించి ధర్మ ప్రసంగముని యిట్లని చెప్పం దొడంగె.

[ధర్మప్రసంగుఁడు సానందాదులకు పుణ్యాత్ములకుఁ గలుగు సద్గతి ప్రకారంబు చెప్పుట.]

మునీంద్రులారా! వినుండు మనుష్యులు లోకంబునఁ బెక్కు దానంబులు జేసియు, ధర్మములు జేసియు, పరుల కిడుములు వచ్చినపు డుపకార మొనరించియు, వనములు వేయుట, బాటల యందు బావులు, కోనేళ్లు త్రవ్వించి దారినడుచు వారికి యెండదాహము లేక యుండులాగున చలువపందిళ్లు పెట్టించుట దేవాలయములు గట్టించుట, అన్నసత్రము లేర్పఱచి పేదసాదులకుఁగల యాకలిఁదీర్చుట, మొదలగు మంచిపనులు గావించియు, దేవోత్సవంబులును దేవపూజలు నొనరించియు, యజ్ఞములు, యాగములు, వ్రతములు, జపములు, తపములు, హోమములు జేసియు, నింకను గలుగు సత్కార్యము లొనరించియు పరిశుద్ధులైన పురుషులు దీర్ఘాయువుఁగలిగి యీ లోకంబున సకలసుఖముల ననుభవించి సంతోషమును, తృప్తియును జెంది యవసానకాలంబున కుమారులును, భార్యలు, చెలికాండ్రు, బంధువులు మొదలగువారలందఱు చుట్టునుఁజేరి సేవఁ జేయుచుండ నందఱితోడను తగిన రీతిని మాటలాడుచు ననాయాసంబుగా కర్మ శరీరంబువిడిచి సుకుమారమైన వెలుపులవంటి రూపముదాల్చి యమ దూతలు శాంతముఁగల యాకారములతో మిక్కిలి వినయవిధేయు తలు మీఱఁ దోడ్కొనిపోవ సూర్య కుమారుండగు శమనునిపట్ట ణంబునకు రమ్యమైనదారియందు పోవుసమయంబున నచ్చటచ్చటను, నట్టివారి కెండసోకకయుండునటుల చలువపందిళ్లును, విశ్రమించుటకు చావళ్లును, స్ఫటికపురాలతో కట్టఁబడిన మెట్లుగలచోటులును, చంద్రకాంతపు రాళ్లతోనిర్మించిన యఱుఁగులును పసిడిమంటపములును, ముత్యాలతోరణములును, చల్లని పానీయశాలలును, వెలలేని వింత వింతలగు భూషణములు, వస్త్రములుఁగల మందిరములును, మంచి వన్నెగల గుఱ్ఱములును, శుభలక్షణము లమరియుండు గొప్పగొప్ప యేనుఁగులును, రథములును, తేటఁగలిగిన తియ్యని నీరు నిండుకొని యుండు దిగుడుబావులును, మిగుల చక్కఁదనముఁ గలవారును, వయ

న్నమించనివారునగు సుకుమారవతులగు చెలువలును, గమగమ వాసనలతో చల్లగా వీచుచుండు తెమ్మెరలును, గందపు మ్రాకులు, పనస, తియ్యమామిడి, టెంకాయ, పొన్న, మఱ్ఱి, ఖర్జూరము, నేరేడు, వెలగ, మారేడు, రావి, మొదలగు నీడగలిగించు చెట్లవరుసలును, ననఁటి, మామిడి, మొదలైన పండ్లుగల నానావిధములగు వనములును, మొల్లలు, మల్లెలు, సంపెగలు, జాజులు, గేదంగులు, నాదిగాఁగల పూఁదోటలును, బంగారుతామరలు, కలువలు నిండుగాఁ గలిగిన కొలంకులును. రాయంచలు నెమళ్లు, చిలుకలు, పావురములు, గోరువంకలు, చెవులకింపుగాఁ బలుకుచుండ, తుమ్మెదలు రొదలు సేయుచుండ మిగుల వేడుకగాఁ గనుపట్టు నృత్త ప్రదేశములును, నేయి, పెరుగు, పాలు, తేనె, మధురములగు పండ్లరసములు నిండి పారుచుండు వంకలును, కుంకుమపూవు, కస్తూరి, పునుగు, జవ్వాజి, పచ్చకప్పుర, మాదియగు వాసనవస్తువులఁ గలిపిన పన్నీరు గంధముఁ గల, బంగారుచేతను, రత్నములచేతను, జేయఁబడియుండు పాత్రలును, గంధర్వులపాటలును, అచ్చరల యాటలును, మింటనుండి దేవతలు కురియించు పూలవానల జల్లులును, తెల్లనిగొడుగులును, ఛత్రములును, చామరములును, పల్లకీలును, తీవెయిండ్లును, చిగురుటాకుపానుపులును, గలిగి శోభాయమానంబై యొప్పుచుండ, యమకింకరులు వారికి నేకొఱంతయుఁ గలుగనీయక పరివేష్టించి వీణెలు, పిల్లనగ్రోవులు, తంబురలు మొదలగువాని నాదంబులు చెలంగగా, కోటిసూర్యులకాంతి గలిగి వెలుఁగు విమానముమీఁదఁ గొందఱి నెక్కించి కొందఱినిగుఱ్ఱముల మీఁదను, గొందఱి నేనుఁగులమీఁదను, గొందఱిని పల్లకులయందును, గొందఱిని రథములమీఁదను నిడి మహావైభవముతో మెల్ల మెల్లగాఁ గొడ్కొని చనుచున్న వేళ. సురవనితలను చక్కఁగా గొడుగులు బట్టుడనియు, గంధర్వుల నింపుగాఁ బాడుఁడనియు, దేవవేశ్యల నింపుగా నాట్యముఁ జేయుఁడనియు, కిన్నర వనితల హాయిగా వీవనలవిసరుఁడనియుఁ జెప్పి వారిచే నాయాకార్యములు జాగరూకలై చేయించుచు. విశ్రమించిన సమయంబున. పుణ్యాత్ములారా! ఇదిగో! మంచిగంధము బాగుగాఁ బూసికొనుఁడు, కస్తూరితిలకము దిద్దుకొనుఁడు, మేలైన

యీ పూలదండలను ధరింపుఁడు. నిలువుటద్దములయందు, మీయలంకారమునుఁ జూచుకొనుఁడనియు, నొసంగుచుండుదురు, మఱియు, రత్నకంబళ్లును. పట్టుపరుపులును, దిండ్లును, పూవులచెండ్లు, గుగ్గిలాగరుధూపములు, గంధవడులు, పుష్పాళ్లు, కాంతిగల యద్దములు, నెమలిఁగూకల విసనకఱ్ఱలు, కర్పూరపు తాంబూలములు, పన్నీరుచెంబులు, పట్టెమంచములు, దంతంపు పావుకోళ్లు, తమ్మపడిగలు, మధురఫలపానీయంబులు, మీకు వలసినట్లు గైకొని భోగింపుఁడని ప్రార్థించుచు, నయ్యలారా! ఇవిగో మేలగు వస్త్రములు, కట్టుకొనుఁడు, భూషణములు ధరింపుఁడని చెప్పుచు, వడలు, నతిరసములు, నిడ్డెనలు, నప్పడంబులు, దోసెలు, చక్కిలములు, సుకియలు, పాలు, తేనె, పంచదార, పానకము, నీరుమజ్జిగ, టెంకాయనీరు, పండ్లరసము, చారులు, కూరలు, పాయసాన్నములు, నుక్కెరలు, పచ్చళ్లు, నూరుగాయలు, కలవంటకములు, కజ్జాయములు, నానబాలు, మీగడ, పెరుగు, నెయ్యి, మొదలగు పదార్థంబులచేఁ బరితృప్తి నొందించుచుఁ జనిచని యముని రాజధానియగు సంయమనీపురంబునకుం జేరి గవని వాకిట నిర్మలప్రదేశంబున నాపుణ్యపురుషులడించి యంతకు దూతలు పోయి నిండుకొలువున నున్న ధర్మస్వరూపుఁడగు కాలునకు భయభక్తి వినయంబులొప్ప నమస్కరించి చేతులు మోడ్చికొని నిలిచి దేవా! మీయాజ్ఞానుసారముగా మేము భూలోకమునకుఁబోయి పుణ్యాత్ములను దోడికొనివచ్చినారము. వారందఱునిపుడు పురద్వారమువద్దనుండెదరు. మీకీవృత్తాంతముం జెప్పుటకు మేము మాత్రమిచ్చటికివచ్చితిమి. యింకనేమి యనుజ్ఞయొసఁగెదరో యని కాచియున్నవారము, అని పలికినవిని, సంతసమెలర్ప నంతకుఁడు దిగ్గన కొలువు చాలించి లేచి, సురులు సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు గంధర్వులు మునులు యతులు మొదలగువారు పరివేష్టించి సేవించుచుండ గణకుఁడగు చిత్రగుప్తుఁడు వెంటఁ జనుదేర వెడలి పురద్వారము వద్దకుం బోయి, మిక్కిలి కాంతిఁగలిగి యొప్పుచున్న పుణ్యపురుషులను, పుణ్యస్త్రీలను, గనుంగొని ప్రీతుండై వారికి తగిన మర్యాదలుగావించి తనచెంతఁగాచి నిలిచియున్న చిత్రగుప్తునివంకఁజూచి,

### యముఁడు చిత్రగుప్తుని పుణ్యాత్ములుచేసిన సత్కార్యంబులడుగుట.

చిత్రగుప్తా! యీ మహాత్ములెప్పుడెప్పు డేయేపుణ్యకార్యముల నొనరించిరి ? యెట్టియుత్తమశీలంబునఁ బ్రవర్తించిరి ? వీరిధర్మంబులెట్టివి ? వివరముగా నాకెఱిఁగింపుము. యీ పుణ్యాత్ములఁగనిన నాకెంతయు నానందముగలుగుచున్నది. చక్కఁగాఁ బరికించి వేఱువేఱుగా వినిపింపుము. ఆలస్యము సేయకుమని యడుగుటయు చిత్రగుప్తుండు

### చిత్రగుప్తుండు సమవర్తితో పుణ్యాత్ములుచేసిన ధర్మంబులు వివరించిచెప్పుట.

దేవా ! తమయాజ్ఞప్రకారము వీరుకావించిన ధర్మవిశేషంబులు విన్నవించుచున్నాను వినుండనిపలికి తన వెంటఁదెచ్చియున్న పుస్తకమును విడఁదీసివారు వారొనరించిన ధర్మంబులు వ్రాసియున్న పుటలంద్రిప్పి చూచియిట్లని చెప్పందొడంగె— ఓస్వామీ ! ధర్మరూపా ! యీ పుణ్యాత్ములు, ప్రాతస్స్నానముఁజేసి సూర్యునికి నమస్కరించి బ్రాహ్మణులఁ బూజించినవారును, దయతో పేదలను రక్షించినవారును, పరకాంతలను తోడఁబుట్టువులుగాఁ దలంచుచుండినవారును కల్లలువలుకనివారును, పెక్కుదానములు చేసినవారును, వివాహములు చేయించినవారున , నసత్యపుపనులు చేయనివారును, గురువులను, వేలుపులను భక్తిఁగలిగి సేవించినవారును, తీర్థయాత్రలు గావించినవారును, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబులనెడి మనుజులకు కలుగరాని యాఱుగుణంబులు లేనివారును, నీమొదలగు పుణ్యకార్యము లొనరించిన వారై యున్నారు. వీరియందెవఁడెవఁడే యేపనిఁ జేసినదియు వేఱువేఱుగా విన్నవించెదఁ జిత్తగింపుఁడు

ఈ మహానుభావుఁడు పెక్కుయాగములు గావించె. నితఁడు శివతీర్థములయందు స్నానము గావించె, నితఁడు మంచి మనస్సుఁగలవాఁడై యెన్నోనోములు నోచె, నితఁడు పెండ్లిండ్లుఁ జేయించె, నితఁడు యోగ్యులగువారికిని బిరుపేదలకును తనకుఁగల సొమ్మునుఁ బంచియిచ్చె, నితఁడు విప్రులకు కోరినలాగున నెల్ల వస్తువులునిచ్చె, నితఁడు శివుని పూజసేయువారి కొఱకు పూలతోఁటలు పెట్టించె సజ్జనుల కప్పులిచ్చి వారిని మరల నీయఁజాలనపుడు బాధించక విడిచె, నితఁడు భక్తులకు కానుకలు సమర్పించె, నితఁడు

పరుల కపకారముఁ జేయనివాఁ డితఁడు సదా పరోపకారమొన
రించుచుండినవాఁ డితఁడు యెండకాలమున బ్రాహ్మణులకు విసన
కఱ్ఱ లొసంగె, నితఁడు కఱవుదినములలో మఱుగుజొచ్చిన బీదలకుఁ
గూడుగుడ్డలు నిచ్చినవాఁ డితఁడు దీనుల బాధలుదీర్చె, నితఁడు చెడి
చిక్కిన బంధువులనుఁగాచె, నితఁడు యుద్ధములో వెఱవక పగవారి
నెదిరించి పోరినవాఁడు, యితఁడు గోవులను దానముఁజేసె, నితఁడు
భూదానముఁగావించె, నితఁడు వస్త్రములును, నితఁడు వాహనంబు
లును, నితఁడు బంగారమును, నితఁడు గృహంబులును, నితఁడు ధనం
బును, దానముఁగావించి, యితఁడు వేదమును ప్రియముతో శిష్యులకుఁ
జెప్పినవాఁ డితఁడు శివునిగుడియందు దీపారాధనఁజేసె, నితఁడు హరి
హరులకు గుళ్లును, మంటప గోపుర ప్రాకారములును గట్టించె. నితఁ
డు శ్రీశైలము కాశి మొదలగు పుణ్యస్థలములకుఁ బోవువారి కన్నపా
నాది సదుపాయముల నేర్పఱచె, నితఁ డట్టివారికగు వెచ్చమునకుఁ
గావలసిన ధనము నొసంగె, నితఁడు రొక్కముఁ దీసికొనక నిరుపేద
లగు రోగుల కౌషధమిచ్చి రోగంబులుమాన్చె, నితఁడు శివభక్తుల
యందు భక్తిగలిగి పూజించె, నితఁడు దేవతలకు తిరునాళ్లును, నభి
షేకములను జేయించె, నితఁడు కలలోనైన బొంకనివాఁడు, మఱియు
నితఁడు కోవెలయందు భజనలును, నాటపాటలును జరుగుచుండు
నటుల నొనరించె, నితఁ డీశ్వరునికి తేరుఁజేయించె, నితఁడు శివునకు
గుఱ్ఱములు, నితఁ డేనుగులు, నితఁడు గోవులను, నితఁడు యెద్దులను,
నిచ్చిరి. వీరియం దితఁ డీశ్వరార్పణముగా కోనేళ్లుగట్టించె, నితఁడు
వనంబువేయించె, నితఁడు ధర్మసత్రంబులును, చావళ్లును, నిర్మాణముఁ
జేయించె, శివప్రీతిగా నుపవాసలుజేసె నితఁడాఁబోతుల దేవతలపేరిట
నచ్చువేయించివిడిచె నితఁ డతిథులకు నభ్యాగతులకును, బంక్తిభేదము
లేక నన్నపానాదులు విచారించి యొసంగె, నితఁడు తల్లిని తండ్రిని దేవ
తాసములుగా భావించి యెల్లపుడును వారికి పాదసేవఁగావించుచుండిన
వాఁడు, యితఁడు కులాచారము విడువక ధర్మము తెలిసి సత్యంబుఁదప్ప
క మెలంగినవాఁడు వీరిలో నితఁడు చెడిపోయిన గుళ్లును, సత్రములు
మొదలగువానిని బాగుఁజేయించి ప్రసిద్ధినొందె, నితఁడు పరకాంతల

యందును, పరుల యాస్తియందును నాశవహింపక పరులకలిమికి నోర్వలేనితనము గలిగియుండక, పరులను దూఱక, పెద్దలఁ బరిహసింపక మంచివారితో చెలిమిఁగలిగి, కీర్తివంతుఁడై యున్నవాఁ డీతఁడు, సర్వేశ్వరున కంకితంబుగా గ్రంథములు, పద్యములు, పాటలు రచించి యర్పించె, నితఁడు శాస్త్రములెఱిఁగిన పెద్దలచే దెలుపఁబడిన సాంప్రదాయ కర్మలు క్రమముఁదప్పక నడుపుచుండె, నీతఁ డేకపత్నీ వ్రతము విడువనివాఁ డీతఁడు భగవంతుని సంబంధమైన కథలును పురాణములునుఁ జెప్పించి శ్రద్ధయు, భక్తియుఁగలిగి వినుచుండినవాఁ డీతఁడు జీవహింసఁజేయక, యన్నిప్రాణులయందును, దయఁగలిగి యుండిన వాఁ డీతఁడు పరుల కెగ్గుదలంపక తనవలననైనంతవరకును మేలుఁజేసిన వాఁ డీతఁడు. శర్వునిదర్శించి పూజించుటకై కాశి మొదలగు చోటులకు జను శివభక్తులకు పాదరక్షలును, గొడుగులును, విభూతిపండ్లును, రుద్రాక్షదండలును, స్ఫటికలింగంబులు నీమొదలగునాగలవి యొసంగి వారివలన దీవనలందినవాఁ, డీతఁడు భక్తులకు గంధము పూవులు తాంబూలంబులు నిచ్చుచుండినవాఁ, డింకను వీరు చలి పందిరులు వెట్టించినవారును, సాలగ్రామ దానముఁ జేసినవారును, వేదాంతవిచారమున మగ్నులై యున్నవారును, పంచాక్షరీ మంత్రమును జపముఁ జేసినవారును నీశ్వరుని ధ్యానించుచుండినవారును, నై నిర్మలులైవిఖ్యాతిఁజెందిన పుణ్యవంతులని వివరించి చెప్పిన శ్రార్ధదేవుండు సంతుష్టిఁ గలవాఁడై ప్రసాదభావంబున నాపుణ్యాత్ములఁ జూచి పెక్కుగీతులఁబొగడి చేతులుమోడ్చి వినయంబుమీఱ, నోపుణ్యస్వరూపులారా! యోమహాత్ములారా! మీరిచ్చటికి వచ్చుట నాయదృష్టము

## యమధర్మరాజు పుణ్యాత్ముల సమ్మానించుట.

మీవంటివారిని చూచి సేవఁగావించి ధన్యుఁడనగుటకు యెల్లప్పుడును నేనుమిక్కిలి యపేక్షఁగలవాఁడనై యుందును, నేఁడుమీదర్శనము గలుగుటచే మాకుమిగుల సంతోషముచేకూఁరినది, అయ్యలారా! దూరప్రయాణమువలన మీరు మిక్కిలి బడలియుందురు. అట్టి ప్రయాసఁ గలిగించినందు కలుకవహింపక మా నేరములు మన్నించవలెనని మిమ్ము వేడుకొనియెదను. నాయందు దయయుంచవలయును, మీ



(౩౦-వ పుట.) యమధర్మరాజు పుణ్యాత్ముల సన్మానించుట.

రఱుదెంచునపుడు మీవెంట వచ్చిన మాభటులు పదరి మీ మన
సునకు నొప్పిగలుగునటుల నేమియుఁ బలుకలేదుకదా! మీరు చెప్పిన
లాగున విని మీ యిష్టానుసారముగా పనులు చేయుచుండిరిగదా!
ఇపుడు చాలప్రొద్దైనది కోపింపవలదు. త్వరగా మీ కందఱకును
తగిన సకలభోగంబులతో గూడిన విడుదుల నేర్పాటుచేసెదనని విన
యోక్తులుఁ బలికి యంత మణులచేతను, బంగారముచేతను, చేయఁబడి
న సొగసైన విమానములు గావించి వేఱువేఱుగా వారి నందఱి
నెక్కించి సేవసేయుటకుగా నచ్చరకాంతల వెంటనిచ్చి, వేగముగా
దేవేంద్రుని నివాసమగు నమరావతీ పట్టణమునకు బంచిన, భేరి,
మృదంగము, డమరు, ఢక్కా, వేణు, వీణాదులగు వాద్యముల ధ్వను
లు మించ, పైనుండి దేవతులు పూవుల వాన గురిపించుచుండ మిగు
ల నానందంబుతో వారలు స్వర్గలోకంబునకుఁ బోవుటయు, చారుల
వలన వారిరాక యెఱింగి భయభక్తి, వినయంబులు మీఱ నింద్రుడు
వేగముగా నెదురేగి తగినమర్యాదలతో దోడితెచ్చి, వారివారికిం దగి
న విడుదులు నియమించి విడియించిన, సమస్తభోగములు ననుభవిం
చుచు, శాశ్వతానందమున నొప్పుచుండిరి. యో ఋషిశ్రేష్ఠులారా!
పుణ్యాత్ములగు జీవులు పొందునట్టి సుఖంబును మీకుం జెప్పితి. నింక నె
య్యది మీకిష్టం బెఱిగింపుఁడనిన. సానందప్రముఖు లానందంబుఁ జెంది.
మునివరా! ధర్మప్రసంగుఁడను పేరు నీకు సార్థకంబైయున్నది. నీమధుర
వాక్ప్రసంగంబు మాకందఱకును, కర్ణపేశలంబుగా నొప్పుచున్నది.
మాయందనుగ్రహించి పాపాత్ములుపొందు దుర్గతి విశేషంబు నెఱిం
గింపుమని ప్రార్థించిన, సంతసించి యతం డిట్లని చెప్ప నారంభించెను.

— గద్యము —

ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ చతుర్విధ కవితా
విశారదుండగు, పురాణం - పిచ్చయ్యకవిచే రచియింపఁ
బడిన సానందోపాఖ్యాన వచనకావ్యమునందు
ప్రథమ ప్రకరణము.
సంపూర్ణము.





# సానందోపాఖ్యానము.

## వచనకావ్యము.

---

## ద్వితీయ ప్రకరణము.



క. శ్రీరమ్య చిత్స్వరూప బు,
ధారాధిత ! యక్షగ ! తు ◆ రా ! వ్యక్తా ! వ్య
క్తారవ బిందుకళా తీ,
తా ! రాగవిదూర ! ఫణివ ◆ రాద్రివిహారా !.

దేవా ! అవధరింపుము, శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లని చెప్పందొడంగె. నట్లు సానందప్రముఖ మునిగణంబులడిగిన వారికి ధర్మప్రసంగుఁడను మునివరుం డిట్లనియె.— మునులారా ! వినుండు ముందుమీకుఁజెప్పిన పుణ్యపురుషులవలెగాక పాపాత్ములకు, గలుగు దశ ఘోరమును, భయంకరమునునై యుండు నదియెట్లన్న లోకంబున జనులు, తమకుఁ దటస్థించు చెడుగుఁదలఁపక మత్తులై చేయరాని చెడుకార్యంబులెల్లఁజేసి మిక్కిలి పాపము నొడిగట్టుకొని బ్రతికియున్నవరకును తమ కెదురులేదని వర్తించుచుండి యంత్య కాలము తటస్థించినపుడు, వాతము, పిత్తము, శ్లేష్మము మొదలగు తత్త్వభేదములుగల రోగములకు లోఁబడి పీడితులై నానాటికిని కృశించి పడరానికష్టముల ననుభవించి యాయాసపడుచున్న తఱి కాలుని దూతలు భయంకరమగు రూపములుగలవారై వచ్చిజడిపించి మిక్కిలి కోపముఁగలవారై తాము వెంటఁగొని వచ్చిన పగ్గములను జీవులమెడలకుఁ దగిలించి యించుకైనను దయఁజూపక లాగి యాతనా శరీరములయందుఁ జేర్చి కఱుకుఁగల యినుపగోలునులు దగి

లించి పట్టుకొని కుక్కను దీసికొనిపోవులాగున నీడ్చుకొనిపోవుదు రా
లాగుకొని పోవునపుడు మంచిమార్గములు విడిచి, దట్టమైన ముండ్ల
కంపలును, కఱుకు రాళ్లును, గలదియు, పులులు, సింగములు; రేచ
కుక్కలు, నక్కలు, నెలుగుబంట్లు, చిఱుతలు, సివంగులు, పెను
బాములు, తేళ్లు మొదలగు దుష్టజంతువులు నిండుగాఁగలదియు, సైఁప
రాని యెండవేడిమిగలదియు, శాకిసీ, ఢాకిని, మొదలగు చెడు పిశా
చములుం దిరుగుచుండు నట్టిదియు, నిప్పులవానయు, రాళ్లవానయుఁ
గురియుచుండునదియు, చెడువాసనఁగల గాలి వీచుచుండునదియు,
బెబ్బులుల రొప్పులును, సింగముల గర్జనలును, భూతముల కూత
లును, నక్కలు మొదలగు జంతువుల యఱపులును, వినఁబడుచు
మనస్సు చలింపఁజేయుచుండునదియు, అచ్చటచ్చటమంటలుగలదియు,
గొప్పగొప్ప కొండలును, కనుమలును, పెద్దపెద్ద యిసుకబైళ్లును,
నిర్జలప్రదేశములును, గచ్చపొదలును, వసనాభితోటలును, మలము
మూత్రము కలిసి పాఱుచుండు యేఱులును, నినుప ముక్కులు గలిగి
పైబడిపొడుచు కాకులును, గ్రద్దలును, బోరువలును, గాడిదల లద్దె
గుట్టలును, చచ్చి మురిగిన జంతువులును, పాడుబావులును, నుప్పునీటి
కాలువలును, యెండ వేడిమికి గ్రాఁగిన పెనుబండలును, నెత్తురునదు
లును, పెంటకుప్పలును, లోతుగల గుంటలును, పల్లేరుగాయలు,
గుల్లలు, గొప్ప చీమలును, కణుదురీగలును, చెడు పురుగులును,
బురదలును, తుకతుకనుడుకు సున్నపుటేళ్లును, చీకట్లు గ్రమ్ము గొప్ప
పొదలును, కండ్లు తెరువ వలనుగాని దుమ్ముగాలియు, నింక ననేక సంక
టములు గలిగినదియు, నగు దారియందు, యమభటులు కొనిపోవు
సమయంబున, నెత్తురు ద్రాగుటకై పైఁబడిన పులులు మొదలగు
దుష్టమృగములచే బాధింపఁబడువారును, యినుపముక్కు కాకులు
కండ్లు బొడిచిన హాహాకారము సేయువారును, గండు కణుదురీగలు
కఱచిన తల్లడిల్లువారును, నోడలుడుకెత్తఁ గాయు నెండకును, మంటల
వేడిమికిని తాళఁజాలక కుప్పగూలువారును, కాళ్లకుఁ జుట్టుకొని
యట్టిట్టు గదలనియకున్న పెనుబాములఁ దప్పించుకొనఁజాలక క్రిందఁ
బడి పొరలి పొరలి తేళ్లపాతరలలో వడి యవికుట్టుచున్న నేడ్చు

వారును, దప్పిమించి నాలుక లెండి నీరుగానక మేనులుడుక నున్నపుళ్ళఁబడి యల్లాడువారును, కాళ్లుపగిలి నెత్తురుగారుచుండ నా గాయంబులయందు కటుకురాళ్లు నీరముండ్లును, బల్లేరుకాయలును, గ్రుచ్చుకొనుటచే బాధకోర్వలేక చిక్కుయడుగులు తడబడ రోదన మొనరించుచు నడుచువారును, మిక్కిలి బలముగా వీచు సుడిగాలిచే నెగిరి ముండ్లపొదలలోఁ బడిలేవనేరక కష్టపడువారును, భయంకర ధ్వనులతో పిడుగులును రాళ్ల వానయు మీఁదఁగురియుచున్న తప్పించుకొనవలనుగాక తల్లడిల్లువారును, నిప్పులవానకు సహింపలేక యాకులులేని గొప్పచెట్లచెంతకుం బోయిన దిగ్గున పెనుగొమ్మలు మీఁదఁబడి యలయువారును, నాకలికి నిలువతరముగాక నెట్లుజూచినను మూత్ర పురీషములు గలనదులుదప్ప నొండేదియుఁగానక తహతహ పడువారునునై, పాపాత్ములు నానాకష్టంబు లనుభవించుచుఁ జనుచుండ నా యమభటులు కనికరములేనివారై, పేములును, గుదియలును, కత్తులును, చవుకుటనుఁ బూని దేహంబుంనులడి రక్తము గారునట్లు కొట్టియు, నెట్టియు, తిట్టియు, తన్నియు, నుమిసియు, పడద్రొబ్బియు, సీడ్చియు, మెడలు నులిమియు, మేనులు నలిచియు, మూటలుగాఁగట్టి మూత్రకూపములలోఁ బడవైచియు, కుక్కల నిసుకొల్పి కఱపించియు, చెడుమెకంబులను, దుష్ట పిశాచములను గలియఁ దోలియు, ముసలుచుండు నూనె వాఁగుల బలాత్కారముగా ముంచియు, కాకులు గద్దలు మొదలగు వానిచే కండలు బెరికించియు, కొండలెక్కించి క్రిందికిం ద్రోసియు, కనుమలనుండి మెడలకుఁద్రాళ్లుగట్టి మీఁదికిఁజేఁదియు, సూదులు దబ్బనములు, శూలములు మొదలగువానిచేఁ బొడిచియు, కడకాళ్లుపట్టి గిరగిరఁ ద్రిప్పి బండలపై బట్టల నుదికినట్లుదికియు, పెనురాళ్లు తలలపైనుంచి మోయించియు, పరువులెత్తించియు, నోడిసెలలు రువ్వి నొప్పించియు, పెనుబాధలచే చీకాకుపడి కుయ్యో మొఱ్ఱోయని కూతలుపెట్టి రోదనంబు జేయుచుండినను విడువక మిక్కిలి దూరంబును నడిపించుకొని పోవుచున్న యా చెనటులగు పాపాత్ములు, నొచ్చియు, విచ్చియు, నలసియు, సొలసియు, పడరానిపాట్లు పడుచు, కారుచిచ్చులు చొచ్చియు

నెత్తురు టేరులుదాటియు, మలపు కొండలనెక్కియు, సున్నపు వంకల నీదియు, ముండ్లపొదలదూఱియు, వేడియిసుకలనడిచియు, నాకలికి దేహంబులు వాడ, దాహంబుచేపెదవులెండ డగ్గుత్తిక వడి మొరపెట్టుచు జాతరకుం గొనిపోవు బాఁతి గొఱ్ఱెల విధంబున దూతల వెన్నంటి పోవుచుండి తమలో మున్ను తాము కావించిన పాప కృత్యములను దలంచికొని కటకటా! యొకనాఁడైనను, పరమేశ్వరుని నామము నుతలంచనైతినిగదా! యని యొక్కఁడును, చేయెత్తి యెన్నఁడును ధర్మము చేయనైతిమిగదా యనియును, మంచి కార్యంబులు సేయనొల్లక యోగ్యులగు వారిని బాధించి, గురువు దైవము నని యోచించక నిరాకరించి గర్విష్ఠులమై యడ్డంబులేదని ప్రవర్తించుచుంటిమిగదా యనియు, నీశ్వరార్పణంబుగా నేదేని యొకపనిఁ జేయుటగాని, సర్వేశ్వరుని నారాధించుటఁగాని భగవద్భక్తుల సంతుష్టి పడునటులఁ జేయుటగాని, పెద్దలను పూజించుటగాని యిత్యాదులగునవి యేవియు నొనరింపనైతిమిగదా! భగవంతుని గురించి చెప్పఁబడిన గ్రంథములు చదువుట, పుణ్యస్థలంబులకుబోయి వేల్పుల దర్శించుట పుణ్యనదులయందు స్నానముఁ జేయుట మొదలగు పనులయందున నిష్టములేక పరసంపదను జూచి యోర్వలేక, మంచివారలకు కష్టములు గలిగించి, యెల్లపుడును పరస్త్రీలపైఁ దలంపుఁ గలిగి నోటఁ బలుకరాని యక్రమముల నొనరించి, దురాశయనెడి పగ్గముచేఁ గట్టఁబడ్డవారమై దుర్వృత్తులకు వెఱవక యిష్టము వచ్చినట్లెల్లఁగావించిన మన కార్యంబులకుఁ దగిన ఫలంబు ననుభవించుచున్నారము. "అయ్యో! ఇప్పటివరకును సహింపరాని బాధల నెట్లో సహించితి మింక నేమేమి కష్టము లనుభవింపవలయునో యెట్టిపాట్లు పడవలయునో కదా కండక్రొవ్వుచేత తెలిసిన వారును, నిర్మలమైన మనస్సుఁగల వారును, సాధువులును, నగు పెద్దలు యెంతచెప్పినను, మనము వారిమాటలు లెక్కసేయక వారిని పరిహాసించితిమి. ఆఫలమిపు డనుభవించుచున్నారము. ఇచ్చట మనకు దిక్కెవ్వరు? మనయందు దయగలిగి మనకష్టముల నివారించు వారెవ్వరు? యెవరికి మనపైఁ గనికరము జనించును? కటకటా! ఈబాధలుగాక యింతకు

మించిన మహాకష్టములింక నెన్నాళ్లనుభవించవలయునో యిప్పటికే
తాళజాలక వెతపడుచున్న మనమింక మీఁదనెట్లు సహింపగల వా
రము? హా! హా! పాపఫలమా! నీశక్తిమాకిపుడు దెలియవచ్చినది
పుణ్యకార్యములఁ దలంపక, పాపమనిన వెఱవక ప్రవర్తించినట్టి మా
పై నీకుంగల పగదీర్చుకొనుటకు. సమయము వచ్చినది. ఓపాపమా!
నీకువందనములు. నీపై మాకుఁగల యల సభావము వీడిపోయినది,
పూర్ణముగా నీచేతఁజిక్కి తపించుచున్నారము. అని బహువిధంబులఁ
దమచేసిన యకార్యంబులఁ దలంచి కన్నులనీళ్లుకాలువలైపార నేడ్చు
చు నలువంకలంజూచి యచ్చట తమకుఁ గనఁబడు భయంకర విష
యంబులకుఁ గంపి గాత్రులై తహతహపడుచున్న యా పాపకర్ము
లనుఁ గనుఁగొని, గొప్పగొప్ప దేహములు గలవారును, పొడవైన
కోరలుగలిగి, నిడుదనాలుకలు వెలికిజార గుహలవలె. భయంకరము
గాఁగనుపట్టు నోళ్లుగలవారును, వేండ్రపు చూపులును మిడిగ్రుడ్లనుఁ
గలవారును, ప్రళయకాలపు కారుమబ్బులవలె నల్లని వర్ణముఁగల
వారును, కత్తులు, నీటలు, గొడ్డండ్లు. శూలములు, బాకులు, రోక
ళ్లు, గుదియలు మొదలగు నానావిధములయిన యాయుధములు గల
వారును నగు యమభటులు మిక్కిలి కోపముఁగలవారై పటపట పం
డ్లుగీఁటుచు ముఖంబులయందు క్రోధము తాండవమాడుచుండ నట్టహా
సముచేసి, గద్దించి నిరాదరంబుగాఁ జూచి యిట్లనిరి ఓరి నీచంపు పా
పులారా! ఏల యేడ్చెదరు, మీరుమున్ను చేసికొనిన యకార్యముల
ఫలము ననుభవింపకఁ దీరునా? పెద్దలగువారు. పాపకార్యంబులు చే
యరాదనియుఁ, జేయకుఁడనియు, నెంతజెప్పినను వినక పాపమనునది
యొకటికలదా! యీదేహంబు విడిచిన పిమ్మట ప్రాణ మెందుబోవునో
యెవరెఱుంగుదురు? మీరుప్రాణము బోయినతరువాతఁ గలుగు ఫలం
బిట్టిదనివలుకుట కాధారమేమి గలదు? మీరుచూచితిరా? వట్టిభ్రమ
వ్యర్థపు మాటలఁజెప్పి మమ్మేమఱింపఁ జూచెదరా, చీ! చీ! మీమా
టలు మావంటివారు వినఁదగినవి కావు. పొండని వారినిరాకరించి
దూషించి పరిహసించి వారి నసత్యవాదులఁ జేసి మీయిష్టాను సా
రంబుగా కామమోహముల నిమగ్నులై ధనమదంబునఁ గన్నుఁగానక

భోగాసక్తి మించి చరించిన మీరిపుడు చింతించిన నేమిఫలము? ఈనరకబాధలు మీరుగాక నెవ్వ రనుభవించెదరు! యిప్పటికి తీరినదని తలంచి యిష్టాలాపంబు లాడుచుండెదరు కాబోలు నోరి వెడగులారా! యిప్పటి కేమయినది. మీగతి యింకమీఁదఁ దెలిసికొనఁగలరు. ఈ మూత్ర పురీషములును, మురిగిన కుక్క నక్క మొదలగు జంతువుల నంజుఁడును, గాడిదలద్దియు, నిది మొదలు మీరు తినవలసినదిగా నెఱుంగుఁడు మీయందు మేము కనికరించు వారముగాము, మీముఖములుగనిన మాకుఁగూడ పాతకము సిద్ధించును, మీ యేడుపుల వలనఁ బ్రయోజనంబు లేదు. కదలుండు, బిరబిరఁ బరువిడుఁడని ఘర్షణఁ జేసి త్వరపెట్టి నడువకున్న నిర్దయులై మొత్తుచు జగమతులారా! మదము, మత్సరముఁ గలవారలై యుండియు, ఆలు బిడ్డలను గాపాడుకొనుటకయ్యెడి ధనాకర్షణకొఱకు చేయరానిపనులన్నియుఁ జేసియు, పరలోకమే లేదని వాదించుచుండిన వారుగదా మీరు; ఇసీ! నోరు మూయుఁడు చెడుపనులన్నియుం జేసి ధనమార్జించి పోషించిన మీ భార్యలు బిడ్డలు బంధువులు మొదలగు వారిలో నొక్కరైనను, నిపుడు మీవెంటవచ్చిరా? మీరు పడుచున్న కష్టములలో వారించుకేనియు పాలుఁగొనిరా? యెవరుచేసిన పుణ్యపాపములు వారేగాక పరులనుభవింతురా? ఈజ్ఞానము ముందు మీకేల లేకపోయినది? మీగర్వమే మిమ్ముఁ జెరిచినది చాలుఁ జాలు నేడ్పుటమాని కదలుఁడు భూలోకమునకు ధర్మాత్ముఁడగు యమధర్మరాజు పట్టణము యెనుబదియారులక్షల యోజనముల దూరమునందున్నది. మనమిపుడు గుమ్మడికాయలో నావ గింజంత దూరమైనను రాలేదు. తక్కిన దూరమంతయు నడుచుచున్నదు? మీ కాలస్యంబుఁ జేసితిరేని మాకు మా రాజువలన నుపద్రవము కలుగును, గాన మీ యాలస్యపునడత మాని వేగముగా నడువవలయును, నడువరేని మీరువడు వెతలు చెప్పి తీరునవికావు - ఛీ! కదలుండని వారు నడువఁజాలక తప్పటడుగులు వెట్టుచున్న కోపంబుమీఱ కన్నుల నిప్పులురాల బొమలు ముడివడ పండ్లుఁ గొఱుకుచు భయంకరమగు వెడద నోళ్లు దెఱచి యార్చి హుంకరించి తోలుచున్నట్లు కొట్టియు, దగదగఁ గాలుచో-

హాపు గుఱ్ఱముల నెక్కించియు, ముండ్లకంపల మీఁదను కఱుకు రాల మీఁదనుఁ బడవైచి లాగియు, పదంబులఁ దన్నియు, బాకులచేఁ గండలు చెదరఁబొడిచియు, కత్తులచేఁ జెక్కియు వివిధములగు దుష్టమృగములఁ బైకిఁదోలియుఁ గోలకొక్కు రాయఁగట్టి యండవేడిమిం గ్రాగి నబండలపైఁ ద్రోసియు, భారంబగు రాళ్లు శిరములపైఁ బెట్టియు, వీనికి పూలదండలపై మిక్కిలి ప్రీతిగలదని యొకని మెడయందు తేళ్లు దండగాఁగట్టి కంఠంబునఁ దగిలించియు, హారంబు లిష్టంబని యొకని మెడయందు క్రూరపు సర్పములను చుట్టియుఁ దృప్తినొందక మిరియంబులు నూరి కండ్లయందుఁ గొట్టి పరిమళములయం దాసఁగలవాఁడని యొకనికి గంధంబునకు మారుగా, పంది కుక్క మొదలగు జంతువుల మలంబుఁ గలిపి పూసి పన్నీరుఁ జల్లుకొనుమని మురికి జలదారుల నీరు మీఁదఁ బోసియు, దాహంబని తపించిన నుప్పుఁ దినిపించియు, వేప నూనెయు, ముష్టిపండ్లునుఁ జేర్చి నూరి యుచ్చలోఁ గలిపి త్రాగించియు, దూరద గొండియాకును శరీరమంతటను దట్టముగా రాచియు, నాకలియని కూఁకలిడినవానికి జిల్లేడు పాలలో క్రొత్త సున్నముఁ గలిపి త్రావించియు, నయ్యో! పాపము! వీఁడు నంజుడు లేక భోజనముఁ జేసి యెఱుఁగఁడు వీనికిప్పుడును నదిపెట్టుట మంచిదని వానిశరీరమునేఁగోసి వానిచే దినిపించియు, తగరము నిత్తడిని కఱఁగించి గొట్టాంబులతో పొట్ట నిండంబట్టి బలాత్కారంబునం బోసియు, బాధించుచుం బోవుచుండ సహింపఁజాలక మొరవెట్టుచుండ నయ్యాతనాశరీరుల దుఃఖాలాపంబులు మిన్నుముట్ట చట్టున మెడలువట్టి నెట్టుచుం గట్టల్కదొటి యట్టిట్టుఁ జేసి తుట్టతుద, జీవహింసఁ జేసితివని యొకనిని, పరస్త్రీలఁ బొందితివని యొకనిని, ధర్మంబు సేయవైతివని యొకనిని, ద్రోహకార్యములఁ జేసితివని యొకనిని, తప్పు సాక్ష్యముఁ బలికితివని యొకనిని, కల్లమాటలాడితివని యొకనిని పూజ్యుల నిందించితివని యొకనిని, దేవతలను, యతులనుఁ బరిహసించి పూజింపవైతివని యొకనిని, తల్లిదండ్రుల కన్నపానంబులొసఁగి పోషింపక నల్లాడించితివని యొకనిని, పరులధనము నపహరించితివని యొకనిని, గురుద్రోహముఁ గావించితివని యొకనిని, స్త్రీహత్య,

శిశు హత్య, బ్రహ్మ హత్య, గోహత్య, మొదలగు హత్యలం జేసితివని యొకనినిఁ, గొట్టుచుం దిట్టుచు, దెప్పుచు, రొప్పుచు, డాయుచుం, ద్రోయుచు, నేచుచుఁ, దాచుచుఁ, బొక్కినం గ్రుక్కుచుఁ, జిక్కినం జెక్కుచు నిట్లు లెక్కలేని కష్టములు గలిగించి నడిపించుచున్న వగ మీఁటి తాఁటి, సొక్కి, సోలి నేలఁ ద్రాలిన, వారిం జేరి నవ్వుచుఁ జుట్టు ముట్టి చేతులుదట్టి గంతులువెట్టి అయ్యో! వీరు నడువఁజాలకఁ జాల నలసిపోయి మూర్ఛఁ జెందిన లాగునఁ బడియున్నవారు. పాపము వీరికొంత శైత్యోపచారములు చేసి తేర్చి తోడుకొని పోవుట మంచి దని దయఁగలవారివలెఁ బలుకుచు నది నిజమని నమ్మి యూరటఁ జెందుచున్న యాపాపకారులకు పల్లేరుగాయలు పడకలుగా నమర్చి, తల గడ్డలని గండకత్తెరల మొదలకుఁ దగిలించి యావపిండియుఁ గ్రొత్త సున్నమునుఁ జవిటి మట్టియు బొంతజెముడు పాలును, నరకాళ్లకును, నరచేతులకును మర్దనముఁ జేసి, కన్నులకు మిరియపుకారమును మొత్తి, పన్నీరని సలసల మసలు నూనెను పైఁ బైఁ జిలకరించి పార్శ్వముల దగదగ మండు నిప్పుకుంపటుల నునిచి, క్షారోదకములును, జెముడు పాలును ద్రాగించి కంపముండెలుగొని విసరుచు, పెద్దకొయ్య తుండ్లొక్కొకటి ప్రక్కను వెట్టి, యొద్దికతో మున్ను మీరు మోహించి కవిసియుండిన మీప్రియురాండ్రు వీరుగో వచ్చి మీచెంతఁ బరుండి యున్నారు. వీరితోడఁగూడి యాసఁదీర్చుకొండు మేము మీకుఁ జేసెడి యుపచారములివియే ? ఇందువలన మీదేహంబులకుం జలువబుట్టఁ గలదని వారిని పరిహాసింపుచు నట్టిపనులచే నోర్వరాని సంకటంబులకులోనై తమచేసిన యకృత్యములను దలంచుకొని మిక్కిలి రోదనంబుసేయుచున్న కన్నులెఱ్ఱజేసి యోరిదుర్మార్గ ప్రవర్తకులగు పాపకర్ములారా మీగతి యిప్పటికేమయినది? యింకనుఁ జూతురుగాకయని బెదరించుచుఁ గ్రమక్రమంబుగా యమపురంబునకుం గొనిపోయి రాజద్వారంబుకడ నిలిపి దూతలు లోపలంజని యచ్చట సభాకూటంబున, మహాభయంకరమగురూపముఁగలవాఁడును, నిప్పులురులుచు మిగుల నెఱ్ఱదనముఁ గలిగి వేడిచూపులుగలగుండ్రని పెద్దపెద్దకన్నులు గలవాఁడును దండము, పాశము, గద, మొదలగు నాయుధములు

చేతులయందుఁ బట్టియున్న వాఁడును, ధర్మాధర్మము లెఱింగిన ఋషు లు, దేవతులుఁ గొలుచుచుండ నొప్పిన వాఁడును, బండికందెన వంటి మేనిచాయఁ గలవాఁడును, నీలమణులు చెక్కిన భుజకీర్తులు, హార ములు, కిరీటముఁ గలిగినవాఁడును, నెత్తైనసింహాసనంబు మీఁదఁ గూ ర్చుండి పెక్కుమంది దూతలచేఁ జుట్టఁబడి వారివారికిం దగిన పనుల నేర్పాటు చేసి యనుపుచుండు నట్టివాఁడునునైన యమధర్మరాజును సమీపించి సాష్టాంగముగా నేలఁబడి దండముల నర్పించి చేతులు మొగిచికొని నిలిచి భయము, భక్తి వినయముఁ గలవారై ధర్మస్వ రూపుఁడవైన యోదేవా! సేవకులమగు మామనవి నాలకింపుము. దేవరయుత్తరవు ప్రకారము భూలోకంబునకుం బోయి పాపాత్ములఁ

దూతలు పాపాత్ములను యముని సన్నిధికి దెచ్చుట.

బట్టి నానా బాధలంబెట్టుచును దోడ్కొనివచ్చి మొగసాలయందు నిలి పియున్నారము. తమయాజ్ఞ యైనయెడల నిచ్చటికిఁ దోడితెచ్చెదము, మాకే మానతిచ్చెదరో యని కాచియున్నారమని విన్నవించిన వారి మాటలాలకించి మహోగ్రంబుగా పండ్లుగొఱుకుచు మండిపడి కో పాతిశయంబున కన్నులు మిక్కిలి యెఱ్ఱబారి బొమలుముడిపడ నట్ట హాసంబుఁజేసి సభలోనుండు వారందఱును వెఱపునొంది గడగడవణం కుచుండగా నిట్లనియె. నోరీ! భటులారా! యీకష్టాత్ముల లగు పాపకా రుల, ధర్మదూరుల, సించుకయైనఁ గనికరముంచక మీఁవలన నైనంత వరకును బాధఁబెట్టుచు శీఘ్రముగా నిచ్చటికిందోడితెండు, అనియాజ్ఞా పించిన, చిత్తము చిత్తము, మహాప్రసాదమని ప్రమొక్కులిడి దూతల చటనుండి కదలి వేగముగా రాజద్వారంబుఁ జేరనేగి యచట నేడ్చు చుండు యాతనా శరీరధారులఁ దిట్టుచుఁ గొట్టుచు నెట్టుచుబట్టుకొని యూపంబునకుం గట్టఁగొని పోవునప్పటి యజావళింబోలె లాగుకొని పోయి కాలునిముందర నిలిపిన వారిలంజూచి దండధరుఁ డుద్దండభీకర రవంబునఁ గన్నులు గిరగిరఁ ద్రిప్పుచు, కోపంపుదివిపుప గాఁశీకుఁడును, నాప్తుఁడును నగు చిత్రగుపునిఁజూచి చిత్రగుప్తా! ఈకష్టుల కృత్య ములను వివరింపుము తామసము సేయకుమని యడిగినఁ జిత్రగుప్తుం డు పుస్తకమువిప్పి, పుటలుత్రోసి, పాపాత్ముల లెక్కపత్రములఁ జా

గుగానిటునటుఁ ద్రిప్పిచూచి, యోదేవా! వీరలు దేవతలను విరోధముతో పూజసేయని వారును, వేదములను నిందఁజేసిన వారును, బ్రాహ్మణుల కపకారముఁ జేసినవారును, గోహత్యలు గావించిన వారును, శివద్రవ్యమును హరించిన వారును, లోకులను పీడించి కష్టపెట్టినవారును, పరకాంతలపై మోహముఁగొని యెల్లపుడును వారితోఁ గూడి చేయరాని యక్రమములు చేసినవారును, వేశ్యాలోలురై యున్నవారును, చెడ్డనడవడి గలిగించెడు పనులు జేయుటయందు మిగుల ప్రీతిఁగలిగి యుండిన వారును, లోభముచేతను, నోర్వలేనితనముచేతనుఁ బరుల కపకారము నొనరించిన వారును, సారాయి కల్లు మొదలైన నిషేధింపఁబడినవానిఁ బానంబుఁ గావించి మత్తులై యొడలెరుంగక పెక్కుపోకలం బోయినవారును, గురునిందఁ యొనర్చిన వారును, సంసార బాహుళ్యంబు గలిగి, భార్యను, బిడ్డలను, గృహంబును సంరక్షణఁజేయు నిమిత్త మెన్నెన్నియో మాయలు పన్ని యన్యులను మోసపుచ్చి ధనము సంపాదించి తమ కార్యములఁ జక్కఁబఱచుకొనిన వారును, స్వంతలాభము కొఱకు పరులకుఁ గీడుగలిగించిన వారును, దయలేక జీవములను హింసించిన వారును, భగవన్నామమనిన గిట్టని వారును, నసత్యవాదులునై పెక్కువిధములుగాఁ గలుగు దుష్కార్యములను జేసినవారుగా నున్నారు. గాన వీరియం దెవ్వరెవ్వ రేయే పాపపుపనులు గావించినదియు వివరముగా వేర్వేర వేర్పఱించి చెప్పెదను. సమవర్తీ! యాలకింపుమని యొక్కొకనిఁజూపి వాఁడువాఁడుచేసినపనులఁ జెప్పనారంభించి యిట్లనియె నయ్యా! ఇదిగో! వీఁడెన్నఁడును, శివాలయంబున నడగైనం బెట్టినవాఁడుగాడు, వీఁడుపాపాత్ములతో మైత్రిఁజేసినవాఁడు. వీఁడు విప్రవిరోధి, వీఁడుపెద్దలం దిట్టెను. వీఁడు శివునిబూజింపఁడయ్యె, వీఁడు హరికథలనాలకించకఁ దొలంగినవాఁడు వీఁడుకులభేదము పాటింపక జారుఁడై మెలంగెను. వీఁడన్యుల ధనము మోసమునఁ గైకొనియెను, వీఁడు కలలోనైనను మంచికార్యము సేయఁదలంచనివాఁడు. వీఁడు మదంబునఁ బర్వదినములగు నమావాస్యసంక్రాంతి యుత్తమంబులగు తిథులు మొదలగు కాలంబు లెఱింగియు, లెక్కసేయక పరస్త్రీలతో భోగించెను. వీఁడు దేవస్థానముల

యందును, సత్రములయందును చలిపందిరుల యందును. కామక్రీడ లొనరించెను. వీఁడు శివునికి ధనికులచే నీయబడినవియు, బ్రాహ్మణులు సంపాదించికొనినవియు నగు మాన్యభూముల నక్రమముగా నపహరించెను. వీఁడుమిత్రుని వంచనఁజేసి ద్రోహముఁ గావించెను వీఁడు మద్యము కల్లుఁద్రాగి మత్తెక్కి పెక్కు చెడ్డపనులు చేసెను వీఁడు గురువులను పెద్దలను నిందించెను. వీఁడు పేదవారికిచ్చెదనని యాసఁజెప్పి మోసపుచ్చెను వీఁడు తనమేలునకై యితరులకుచెఱుపుఁగలిగించెను. వీఁడు సూర్యుని కెదురుగాఁ గూర్చుండి మలమూత్రములు విడిచెను. వీఁడు యుద్ధభూమియందు వెఱచి పరువిడెను, వీఁడురాత్రులందు భార్యతోఁ గలిసి యున్నపుడు దీపమును చూచెను, వీఁడుతానెఱుఁగనిదాని నెఱుఁగుదునని తప్పుసాక్ష్యముఁ జెప్పెను. వీఁడు తన కన్నముఁ బెట్టినవానికిఁ జెఱుపుఁజేసెను. వీఁడు ధర్మముచేయు వారినిఁజేయనీక యడ్డపెట్టి భంగముఁగలిగించెను. వీఁడు భగవద్భక్తులను పరిహాసముఁజేసి వారిని కష్టపెట్టెను. వీఁడు తనవాకిట నాకలిచే బాధపడుచుండు నతిథినివిచారించక సంతుష్టిఁగాభుజించి హాయిగా నిద్రించెను. వీఁడన్యుల యిండ్లను తగులఁబెట్టెను. వీఁడుదాయాదులు మట్టములు నాదియగు వారినలయించెను. వీఁడు తల్లిదండ్రుల నానాకష్టముల పాలుఁజేసి వారి ననాదరించెను. వీఁడుద్రవ్యవంతుఁడై యుండియు నర్థులకు కాసైనను ధర్మము సేయఁడయ్యెను. వీఁడు సమయము వేచియుండి యధికారులకు లంచములిచ్చి యితరులకు కష్టములు గలుగులాగునఁ జేయించెను. వీఁడునిరపరాధులగు జంతువుల భుజింపఁగోరినిర్దయుఁడై వానిని హింసించెను. వీఁడు ధర్మమునకుఁ ద్రవ్యింపఁబడిన బావులుదొరువులు కోనేళ్లు చెఱువులు మొదలగువానిఁ బూడిపించెను, వీఁడు సత్రంబులను, దేవమందిరంబులను నిడియఁ గొట్టించెను, వీఁడుత్రాగెడి నీళ్లయందు దశుద్ధంబుఁ గలిపించెను. వీఁడు ఋణము నిచ్చి యడగినవానిఁ దన్నెను, వీఁడు ఋతుమతియైన స్త్రీతో సంగమించెను, వీఁడు వరుసగా శిశుహత్య, గోహత్య, స్త్రీహత్య, బ్రహ్మహత్యఁజేసినవాఁడు, వీఁడు స్వకుల ధర్మమువిడిచిన భ్రష్టుఁడు వీఁడుమిత్ర ద్రోహముఁజేసిన వాఁడు, వీఁడన్నదమ్ములకు న్యాయముగా పాలుఁబంచి యి



(౧౩-వ పుట.) అసిపత్రవనము.



(౩౨-వ పుట.) దూతలు పాపాత్ములను యమునిసన్నిధికి దెచ్చుట.

వ్యాక మోసమొనరించెను, వీఁడుంతల్లిదండ్రులకు తద్దినము మానినకు మతి, వీఁడు భోజనకాలమున పంక్తిభేదముఁగా వడ్డించెను వీఁడు భార్యమాటలువిని తలిదండ్రులను, తోఁడఁబుట్టిన వారిని బాధపెట్టెను, వీఁడు, భిక్షుకులఁ దిట్టికొట్టి కుక్కల నిడుకొలిపెను, వీఁడు వావివరుసలనెన్నక యింతులతో రమించెను. వీఁడు దేవదూషకుఁడు, వీఁడు శివరాత్రి మొదలగు నుపవాసదినములలో తుష్టిగాభుజించి శివభక్తులఁ బరిహసించు చుండెను, వీఁడు మిత్రుని భార్యతో సంగముఁజేసెను, వీఁడు శివనిర్మాల్యముఁ గాలఁదాఁచెను, వీఁడునమ్మి తనయింటఁబరుండిన వానిని నిదురించునపుడు గొంతుఁగోసిచంపెను, వీఁడు దయనునది యెపుడును నెఱుఁగక ప్రవర్తించెను, వీఁడన్యుల ధనముదొంగిలించికొనిపోయి భోగమువారికిఁబెట్టి వారితో క్రీడించుచుండెను, వీఁడు జూదమాడి పరుల మోసపుచ్చి ద్రవ్యము సంపాదించి మద్యపానమున కుపయోగించు చుండెను, వీఁడు నుతియొకఁడు దానముచేయుటను చూచి యొప్పక వాసికడ్డపడినాను. వీఁడు తనకు చెల్లుబడిగలదని అక్రమముగా జనులపై సుంకవిధించి నిర్బంధముఁజేసి కైకొనియెను. వీఁడు తీర్థయాత్రకేగువారులకు మార్గములలో కష్టములుకలుగునట్లుచేసెను, వీఁడుతోఁడబుట్టినయిల్లాలిని గలుకొన్ననీచుఁడు, వీఁడు బ్రాహ్మణస్త్రీలనుఁబొందెను, వీఁడు విధవలఁగూడి వారికి గర్భముఁగలిగించెను,వీఁడు నిత్యకర్మలను విసనాఁడెను, వీఁడు పూటకూళ్లు పెట్టి యన్న విక్రయముఁజేసెను, వీఁడు పాపకార్యార్జితమైనడబ్బు నప్పులిచ్చి యొకటికి రెండతలు వడ్డిఁగొని లోకుల నల్లాడించెను, వీఁడు తప్పు తూనికఁ దూఁచి మోసగించి ధనము కూడఁబెట్టెను, వీఁడు శరణుజొచ్చినవానిని పగవానికిఁ బట్టియిచ్చెను, వీఁడు దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించుటకు మారు శిష్టులను శిక్షించి దుష్టులకు మేలు చేసెను, వీఁడు నిరపరాధులపై నపరాధములఁ గల్పించి వానిని దుఃడింపఁ జేసెను, వీఁడు కొండెముఁజెప్పి తగవులుబెంచి వేడుకజూచు చుండెను. వీఁడు తప్పులెక్కలనుఁ దప్పు పత్రములును వ్రాసి లేని యప్పులను మోపి పేదలవలన ధనముఁగైకొనెను, వీఁడు వంటఁజేసిన పదార్థములలో విషముఁగలిపిపెట్టి నమ్మిన తనయజమానునిజంపెను

వీఁడు కుక్కలను, గాడిదలను, పందులను, పిల్లులను, కాకులను,
ఎలుకలను, కోళ్లనుఁ, బేడివానిని, కుష్టురోగిని, మద్యపానముఁ జేసిన
వానినిఁ దాకి స్నానముసేయక శుచిఁగలవానివలె నటించెను, వీఁడు
శివాలయంబునను, విష్ణ్వాలయంబునను, విభూతియుఁదులసీదళంబును
నొసంగిన నవిగైకొన నొల్లక నీసడించి పారవైచెను, వీఁడు శివపురా
ణ మాలించి యాదియబద్ధమని వాదముఁగావించెను, వీఁడు విభూతి
యు, రుద్రాక్షలును, ధరించి శివ భక్తిపరాయణులై యున్నవారినిఁ
జూచి యోర్వలేకదూషించి వెడలఁగొట్టెను, వీఁడు పరమేశ్వరునికి
తిరునాళ్లు సేయుకాలంబున స్వామి యూరేగి వచ్చునపుడు, యిసీ,
యెక్కడిదేవుఁడు, యిట్టి దేవుళ్లనుసేవించుట మిక్కిలి పాపమని యిం
టితలుపు మూసుకొని చూడనొల్లక లోపలఁ గూర్చుండెను, వీఁడు
సొమ్ములుచేసి యిచ్చెదనని మంచి బంగారుఁగొని యందుసగము
మోసముగా హరించి తక్కిన సగములో యితర లోహముఁగలిపి
యిచ్చెను, వీఁడు తనకు పెద్దవానికంటె ముందు తానుపెండ్లిఁజేసికొనె
ను, వీఁడు తన ప్రభువుయొక్కగుట్టు శత్రువులకుం జెప్పి రాజ్యముఁజె
రిచెను, వీఁడు భూసురులభార్యలఁ జెఱఁబట్టెను, వీఁడు కన్నకూఁతురిని
విక్రయించెన, వీఁడు విందుబెట్టెద రమ్మనిపిలిచి మందుబెట్టి దాయా
దులఁ బెక్కండ్రఁజంపెను, వీఁడు పొరుగింటఁ గన్నముఁబెట్టించి దొరిక
నసొత్తులో పాలుఁగొనెను, వీఁడు తన్నుఁదాను పొగడుకొని యితరుల
దూషణఁజేయుచుండెను, వీఁడు పంచాక్షరీ మంత్రమును నోటఁబలు
కుట కిచ్చయించనిఖలుఁడు, వీఁడు వైద్యము తెలియక, నాడీ లక్షణ
మెఱుఁగక తనకుసర్వముం దెలియునని చెప్పి రోగులనమ్మించి ఔష
ధంబులకని ధనముఁ బుచ్చుకొని చెడుమందుల నుపయోగించి ప్రాణ
ములఁదీసెను, వీఁడు శివకథా ప్రసంగములు విన్నవారిని శిక్షిం
చెను, వీఁడు కళాశాస్త్రము, వేశ్యలకథలు వీనియందుగల యాస
శివపురాణమునందును, సంసారముపై గల శ్రద్ధభగవధ్యానమునం
పాక్యములకుంబోవు వాంఛ పుణ్యస్థలములకేగుటకును, లే
క సూర్యుఁడుదయించినది మొదలస్తమానమువరకును చెడ్డ
వారలఁజేరి చెడుకార్యము లొనరించుచుండెను, వీఁడు సూర్యో

దయు, సూర్యాస్తమాన కాలమందు నిద్రించుచుండెను, వీఁడు దారులుగాచి బాటసారులఁగొట్టి యున్న వస్తువులఁ గొనిపోవుచుండెను, వీఁడు తిరునాళ్ల కాలంబున వేడుకఁ జూడవచ్చిన యాఁడువారినిఁగని గుంపునడుమనుండి వారి చన్నులబట్టి కౌఁగలించి ముద్దుఁగొని పాఱిపోయెను, వీఁడు యాచకుఁడువచ్చి చేఁజాచి ధర్మంబడిగిన కలదు లేదని చెప్పక గర్వంబున భుజించి నిద్రబోయినవాఁడు, వీఁడు దినము, వారము, నక్షత్రము, యోగము, కరణము, నను వానినిపాటింపక నెపుడు తలంపుగలిగిన నపుడు క్షౌరముఁ జేయించుకొన్నమూర్ఖుఁడు వీఁడు పతివ్రతయగు తన యిల్లాలి నల్లాడించి పరాంగనలఁ బొందెను, వీఁడు గురువునని వచ్చిన పెద్దలను మెడఁబట్టి త్రోయించెను, వీఁడు మొదట తాను దానమునొసఁగిన, భూమియు నిల్లును, మరలఁదీసికొని నేను నీకిచ్చినది లేదనివాదించెను, వీఁడు విపత్కాలమున సహాయము జేసెదనని వాగ్దానమొసంగి సమయమువచ్చినపుడు తొలంగి నావలనఁ గాదని నిరాకరించెను, వీఁడుప్రక్షాళనముఁ జేయక పాదరక్షలతో దేవాలయంబున కరిగెను, వీఁడు సాధువుల కర్థాన్నంబుఁబెట్టి చాలదనినఁగొట్టెను, వీఁడు సిద్ధముఁగానుండు వివాహకార్యమును భంగముఁగావించెను, వీఁడు పశువుల కాహారంబగు గడ్డిప్రోవులఁ దగులఁబెట్టెను, వీఁడు దౌర్జన్యముఁజేసి యితరుల చేనులకు నీళ్లుపాఱనివ్వక తన భూములకుఁ బాఱించుకొని నష్టముఁ గలిగించెను, వీఁడు మాంస విక్రయముంగావించెను, వీఁడు చెడుదానములుగైకొని ప్రాయశ్చిత్తము జేసుకొనకపోయెను, వీఁడు గోవు మొదగుజంతువులతో రమించెను, వీఁడు తల్లులకును, బిడ్డలకును, భార్యాభర్తలకును, నెడబాటుఁ గలింగిచెను, వీఁడు దారులకడ్డముగా ముండ్లకంపలు నాటించెను, వీఁడు జాతిభ్రష్టుఁడై కుడువరాని కూళ్లం గుడిచెనని యిట్లు వేఱువేఱుఁగా వారింజూపి బ్రాహ్మణ హత్యజేసినవారు, సురాపానముఁ జేసినవారు, బంగారు దొంగిలించిన వారు, స్త్రీలను, గోవులను, బిడ్డలను, జంపిన వారు, దేవదూషకులు, వేదములను నిరాకరించినవారు, దేవుఁడే లేడను వాదముఁ జేసినవారు. దుర్మతము లవలంబించినవారు, చెడునడవడికఁ గలిగి యుండినవారు నె మొదలగు నానాజాతుల పాపకర్ములఁజెప్పి వా

రువారు చేసిన పాపంబులు వివరంబుగా నుగ్గడించి చిత్రగుప్తుండు పుస్తకముం గట్టివైచిన కాలుండంతయు విని భయంకరముగా మండు మంటల నేయిఁ బోసినవిధంబున కోపం బతిశయింప పండ్లు పటపటం గొరికి కండ్లు గిరగిరఁ ద్రిప్పి ప్రళయభైరవాకారంబు తనర మాటి మాటికిఁ దీర్ఘముగా నుచ్ఛ్వాసము నిశ్వాసము బొడముచుండ నాగ్రహంబున చెక్కు లదరుచుండ కనుబొమలు ముడివడ చేనుండు గద నొక్కమారు దిగ్గున భూమిఁ దాక దాటించి దిక్కు లదరునటుల నట్టహాసముం జేసి తలయూఁచి వెడనవ్వు నవ్వి సభాసదులు భయంబు నొంది గడగడ వడంకుచుండ కాలదండంబును, బ్రహ్మాండంబు దాకు నల్లెగర వైఁచి పట్టి యట్టిట్టును సిలిహుంకరించి లోకభయంకరుఁడై తనకు కెలంకులం జేతులు గట్టుకొని నిలిచి యాజ్ఞకు నిరీక్షించుచున్న కింకరులఁ దిలకించి యోరీ! భటులారా! విజ్ఞానేశ్వరీయము మొదలగు ధర్మశాస్త్రములఁ జక్కఁగా శోధించి యెఱింగిన యిచ్చటనుండెడి ధర్మజ్ఞులగు మునులవలన నేర్పఱచఁబడిన చట్టంబున ననుసరించి యీమహాపాపకర్ములకు నేను నిర్దాక్షిణ్యంబుగ నిక్రిందఁ జెప్పబోవురీతిని శిక్షవిధించుచున్నాను, నాయాజ్ఞ పద్ధతిని వీరిం గొనిపోయి కనికరము లేక నరకంబులఁ ద్రోసి నానాబాధలను బెట్టుం డెట్లంటిరా వినుండు.

## యముఁడు పాపాత్ముల శిక్షించుట.

యిండ్లు తగులఁబెట్టిన వారిని దగదగమండు మంటలోఁ గాల్పుఁడు, గురువుభార్యఁ గలసిన వారిని వాడిగలకత్తుల యాకులుగల యసిపత్రమను పేరుగల నరకమునఁ ద్రోసి యలయింపుఁడు, విద్యను, కన్నకూతురిని, యన్నమును, విక్రయించినవారిని గానుగలలో బెట్టి త్రిప్పుఁడు, మాంసముఁ దిన్నవానిని కల్లుఁ ద్రాగినవానిని, నసహ్యమై దట్టమగు చీకటిఁగల యంధకూపమను నరకమునందుఁగల బావులలోఁ బడవేయుఁడు; నీతిమాలి పశులకు చెరుపుఁ జేసినవారిని మంగలములలో వైఁచి వేయింపుఁడు, కొండెము జెప్పిన వానిని కండలు కండలుగాఁ గోయుఁడు, శివద్వేషులై శివదూషణఁ జేసిన వారి నాలుకలు గోసి వండి కాకులకు వేయుఁడు, శివకథలు విన నొల్లనివాని చెవులలోఁ జక్కఁగాఁ గాలిన యినుపనారసములఁ జొప్పింపుఁడు, పరమేశ్వరుని



(3≡-వ పుట.) యముఁడు పాపాత్ముల బాధించుట.

దర్శన మొనరించని వానికన్నులను కత్తిమొనలఁ గ్రుచ్చి యూడబెరికి గ్రుడ్లులేని కంటిబిలములలో నుప్పు కారము సున్నము మెత్తుఁడు. భగవంతుని బూజఁ జేయుట కిష్టపడని వానిచేతులు తుండ్లు తుండ్లుగా నరికివేయుఁడు. శివాలయములఁ జొరక నిరాదరణఁ గావించిన వారిని బెబ్బులులముందు పడవేయుఁడు, శంకరుని తలంచుటకు సమ్మతించని వారినోట సీసముఁ గరగించిపోయుఁడు. పర్వదినములలో స్త్రీలనుఁ గలిసిన దుష్టులను భయంకరమగు విషముఁ గ్రక్కు పెనుబాములచేఁ గఱపింపుఁడు, వరుస వావి నెంచక కామాతురులై దొరికిన కాంతలతో నెల్ల సంభోగముఁ జేసిన కర్ములను బగబగమండుచున్న యినుపబొమ్మల కౌఁగిటఁ గట్టుండు అక్రమముగా పగఁ గొని తోడఁబుట్టినవారిని బంధువులను మిత్రులను తూలనాడి వారికి కష్టములు గలిగించిన వారి నెత్తిమీద గొప్పగొప్ప రాతిబండలు వేయుఁడు గిరిజాపతియగు శర్వునికి మ్రొక్కరాదనియు, పూజింపరాదనియు పెడవాదంబులు చేసిన వారిని క్రూరదంతములుగల కుక్కలచేఁ గఱపించి రొమ్ములమీఁద నేనుఁగుల నెక్కించి త్రొక్కింపుఁడు, లోభమతులై పరుల కపకారముఁ జేసినవారిని నిమిష కాలంబున శరీరంబులు రంధ్రములు గావించి పీడించు భయంకరములగు వజ్రదంష్ట్ర పురుగులు మెండుగాఁగల బావులలోఁ ద్రోసివేయుఁడు, నమ్మకద్రోహ మొనరించిన వారి యుక్కుకొక్కెలఁ గూతలుపెట్టి మొత్తుకొన దిగ్రవేయుఁడు వేదములను, బ్రాహ్మణులను నిందించిన దుర్మతులను కఱకుటంపములఁ గొని పటపటఁ దెగఁ గ్రోయుఁడు, కల్లలు పలుకుచుండినవారిని వాడిసలచే దేహంబులం జెక్కుఁడు. దానముఁ జేసిన దానిని మరలఁ గైకొన్న నీచులను సున్నపురాళ్లలో విరియఁ బోయుఁడు. జూదగాండ్రను కాళ్లకు పగ్గములు గట్టి క్రిందఁ ద్రోసి కక్కురాళ్ల మీఁద లాగుచుండుఁడు సాధుజనుల పరిహాసించి యపకారముఁ గావించిన వారి తలల నినుపరోకళ్లతో నలియదంచుఁడు, నోరెఱుఁగని బీదజంతువుల నాహారార్థము వధించిన కఠినులను సలసలఁ గ్రాఁగుచున్న నూనెతొట్లలోఁ బడవేయుఁడు, తప్పుసాక్ష్యముఁ జెప్పి యితరులకు నష్టకష్టములు గలిగించిన వారి చర్మములొలిచి శరీరమునకు నుప్పును కారపుకాయ

లును, మూగి పట్టించుఁడు, తమకు మేలుచేసిన వారికి కీడుఁదలంచి బుద్ధి హీనుల నిప్పుల గుండములలోఁ బడనెట్టి నూనెఁబోయుఁడు, పరసతుల పై మోహముఁజెంది వారితోఁగూడి యగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన భార్యల నలయించిన కర్ముల మర్మరంధ్రములలో నినుప సూదులఁ జొప్పించుఁడు, శరణుఁజొచ్చినవారి కపకారముఁజేసిన వారికండలు గోసి భూతప్రేత బ్రహ్మరాక్షసాదులగు దుష్టగ్రహంబుల కాహారము గావింపుఁడు, భగవద్భక్తులను, పెద్దలను, యోగులను, నవమర్యాదఁ గావించిన వారింగని లేవక పరిహాసముఁజేసిన వారిని యినుప పెను ముల నెఱ్ఱఁగాఁగాల్చి వానిపై గూర్చుండఁబెట్టుఁడు కులాచారపు పనులు మాని చెడుదారులఁద్రొక్కి యక్రమంబు లొనరించినవారినిఁ బట్టి కుమ్మా, మొఱ్ఱోయని రోదనంబులు జేయుచుండ నిలువఁబెట్టి యినుప గుదియలతో శిరంబులు వగులఁ గొట్టియు, నంగంబు లూడఁబెఱికియు బాధింపుఁడు, పరులధనము నపహరించిన వారిని కొలుములలో బెట్టి క్రాగనూదుఁడు, అతిథులఁబూజింపక యనాదరించి విచారింపని మదయోగ్యుల వ్రేలఁగట్టి పందలను దుర్మార్గులు వధించి కాల్చెడి విధంబునఁ గ్రింద మంటఁబెట్టి కాల్పుఁడు, నమ్మించి విషంబుఁబెట్టి యితరులఁ జంపినవారిని విషమే దినుచుండునటుల గరళపు బావులలో దూకుఁడు, చేసిన మేలుమరచి యపకారముఁ గావించినవారిని మలము మూత్రము పురుగులుఁగల లోతు గుంటలలో దిగవ్రేయుఁడు, పత్నీభేదం బొనర్చిన పాపమతులఁ దేళ్ల పాత్రలలో వేయుఁడు, నీటి పట్టుల వెంబడి నురులొడ్డి పక్షులు మొదలగు నిరపరాధ జీవులఁబట్టి వధించిన దోషకారుల కత్తుల బోనులలోఁ బడవైచి గిరగిరం ద్రిప్పుఁడు, మఱియు ని యీపాపంబుఁజేసిన వానికీ యీవిధంబున రౌరవంబును కుంభీపాకంబును, నసిపత్రంబును, నసల లోహస్తంభంబుగాఁ, గ్రిమిభోజనంబును, గరళకూపంబును, నాదియగు మహా నరకంబులయందుఁ బడవైచి నాయాజ్ఞ దప్పకుండ మీ మీనేర్పులు మెఱయ నిమిష కాలంబైన నెడతెఱపి గలుగనీక దయాదాక్షిణ్యములు విడిచి సకల విధంబుల నవస్థలంబెట్టుచు, భూమియు, నాకాశంబును, సూర్యచంద్రులును, నక్షత్రంబులు నున్నంత కాలము వరకును బాధించుచుం

డుఁడు మీాకు ముమ్మాటికి శలవొసంగితి నింకనీ దుష్టజీవ్రులంగొని పొందని యొప్పగించి యాభటుల కగ్రేసరుండగు వీరసేనుఁడను వానింబిలిచి తనవ్రేలి రాజముద్రికనిచ్చినవాఁడు భయభక్తులెసంగ వినయపూర్వకముఁగా పుచ్చుకొని యాయుంగరమునుఁ గన్నులనద్దు కొని శలవుఁబొంది దండముఁబెట్టి వెడలి రాజాజ్ఞ తనసహచరులకు విశదపరిచి యమభటులందఱును గుమిఁగూడి భూతములు ప్రేత ములు, పిశాచములు, బ్రహ్మరాక్షసులు, కామినీ, మోహినీ, శాకినీ, ఢాకినీ, గ్రహంబు లాహాకారము సేయుచుం జుట్టిముట్టి పైఁబడిపెటికి తినుటకుఁ గమకించుచుండ, కత్తులు, గొడ్డళ్లు, శూలములు, సీలలు, గుదియలు, గడ్డపారలు, సులులు బాడిశలు చిల్లకోలలు, బాకులు కట్టులు, బెత్తములు, అంపములు, సూదులు, దబ్బనములు, సురులు, చిక్కములు, పగ్గములు, మోకులు, గొలుసులు, గండ గత్తెరలు, సూరు కత్తులు, పిడిసనలు, చీలలుఁ, ద్రోపుడులు, చీర్ణములు, సమ్మె టలు, తంతులు, గోరుగోలలు, మొదలగు సకల సాధనంబులునుఁగైఁ కొని యంకించుచుఁ బెడబొబ్బలు వెట్టుచు వెఱ్ఱినవ్వులు నవ్వుచు నెగిరి గంతులు వైచుచు, నాడుచుం బాడుచు కిలారించుచు నా యాతనా శరీరములు పొందియున్న పాపుల బట్టుకొని కొట్టుచుం దిట్టుచు తన్ను చు, గ్రుద్దుచు, నీడ్చుచుఁ, ద్రోయుచు, యెత్తి కుదియ వ్రేయుచు నీ రీతి పెక్కు బాధలు బెట్టుచుఁ దోడుకొనిపోయి యాపట్టణమునకు దక్షిణపు దిక్కున నినుము ఉక్కులచే నిర్మింపఁబడిన ప్రాకారమును బురుజులును, ద్వారములును, తలుపులును, గలిగి మిక్కిలి నాడలుపును నిడుపునుఁగల ప్రదేశంబున భయంకరములగు నరకము లొక్కొక్క దానియం దొక్కొక్కనిఁ బడవైచి తమ యేలికయైన కాలుని యుత్తరువుమేర కిసుమంతయుఁ దప్పక జీవుల యాతనలం బెట్టఁదొడంగి

## యమభటులు పాపాత్ములఁ బాధించుట.

నొకనిఁగోసియు,నొకనిఁవ్రేలవేసియు,నొకనిఁగొట్టియు, నొకనిఁగట్టియు, నొకనిఁ జీల్చియు, నొకనిఁ గాల్చియు, నొకనిఁ జెక్కియు, నొకనిం గ్రుక్కియు, నొకని నడచియు, నిల్లువిడువక, హింసింపఁదొడరి యమ భటులు, మరుగుచున్న నూనె కాగులలో వేయువారును, సున్నపు

రాళ్లలో విఱియఁబోయువారును, పాములు, తేళ్లు, మొదలగు వానిచే కఱపించువారును, పులులు, సింహములు, నాదిగాఁగల దుష్ట మృగములముందుఁ బడవేయువారును, నగాధంబులగు కత్తులు దాఁచిన చీఁకటి బావులలోఁ ద్రోయువారును, మూత్ర పురీషములచే నిండి యున్న లోతుగుంటలలో బూడిపోవ దిగవేయువారును, నినుప ముక్కుల కాకులచేఁ బొడిపించు వారును, వాడి కత్తులుగొని యింతింతలుగా కండలుగోసి గద్దలకును, బోరుపలకునుఁ దినిపించువారును, అంపములచే దేహంబులఁ గోయువారును, బాడిసలతోఁ జెక్కువారును, కండ్లు బెరుకువారును, తోళ్లూడఁదీసి యుప్పు కారము మెత్తువారును, అంగంబుల విడదీయువారును, శూలంబులఁ బొడుచువారును, మంటలలో మాడ్చువారును, కంటకంబులు కరకు రాళ్లుంగల చోటులఁ బడఁద్రోసి యీడ్చువారును, యెఱ్ఱగాఁ గాలిన పెనములమీఁదఁ గూర్చుండఁ బెట్టువారును, వజ్రదండములఁ మొదలగు క్రూరపు పురువులు నిండుగాఁగల నూతులలోనికి దింపువారును, దగడగ మండుచున్న యుక్కు గంబముల కంటగట్టువారును, కరగి ప్రవహించు సీసపు నీటి యేఱులలో ముంచువారును, గొడ్డండ్లుగొని తలలు పగులఁగొట్టువారును, మర్మాంగంబుల సూదులు దబ్బనములు గ్రుచ్చువారును, వ్రేలఁగట్టి క్రింద పెద్దపెద్ద మంటలు వేసి యలించువారును, కాళ్లుఁ జేతులు నంటఁగట్టి పట్టిరాళ్లపై నుతుకువారును, భూత ప్రేత పిశాచములనుఁ గవియించువారును, కన్నులూడఁబెఱికి కారము మెత్తువారును, ప్రూకుల కంటఁబెట్టి చీలలు గొట్టువారును, గదలఁగొని కండలు చిదియ మోదువారును, యినుపరోళ్లలో నునికి నవినవిగా దంచువారును, గానుగలలో నునిచి త్రిప్పువారును, యేనుఁగలచే ద్రొక్కించువారును, గొఱ్ఱులపై దిగవేయువారును, పిల్లకోలలఁ గ్రుచ్చి యెత్తువారును, కత్తుల బోనులలోఁద్రోసి క్రిందుమీఁదుగా దొర్లించువారును, పెద్దపెద్దబండలను తలలపై నేయువారును, తల్లక్రిందుగా శూలంబులమీఁదఁ దిగవేయువారును, కత్తులపైఁ బరుండఁ బెట్టువారునునై, నానావిధంబుల బాధించుచున్నట్టి సమయంబున యాతనా శరీరంబులు ధరించిన పాపాత్ములు హాహాకారంబులఁ జేయుచు మొత్తుని రోదనమొనరించుచుఁ

(౪౦-వ పుట.) యమభటులు పాపాత్ములను బాధించుట.











బడరాని యిడుములకులోనై యలయుసమయంబున దాహంబుఁగొనిన మూత్రంబును, నాకలిఁగొనిన పురీషంబునుఁదక్క యొండు నొసంగక నేచుచున్న జావులేక, జచ్చియు బ్రతుకుచు శరీరంబులు నలిగియు మరల నేర్పడుటం జేసి పడరాని నరకబాధలను పెద్దకాలం బనుభవించుచుండుదు. ఇది పాపాత్ములగు వారికి నరకలోకంబునం గలుగు ఫలంబని ధర్మప్రసంగుఁడు చెప్పిన నందఱును విస్మయించిరందు సానందుఁడు మిగుల నాశ్చర్యముం జెంది మిక్కిలి కరుణఁగల మనసుతోడఁ గూశిన వాఁడగుటఁబట్టి కటకటంబడి శివస్మరణఁజేసి మేను జలదరింప

## సానందముని ధర్మప్రసంగునితో పాపాత్ములను గురించి ప్రసంగించుట.

ధర్మప్రసంగునిం జూచి యిట్లు ప్రశ్నించెను. ఋషీశ్వరా! మీరిపుడు చెప్పిన పాపాత్ములగురించిన కథ నామనసునకుఁ దృప్తిఁ గలిగించునది కాదు. మఱియి శేషం జేమన నందువలన నాకాశ్చర్యముబొడముచున్నది. సకలప్రాణులు నొకటియై యుండియుఁ గొందఱు సౌఖ్యమనుభవించుచుండఁ గొందఱు పడరాని బాధలఁబడి తల్లడించుచుండు టేమిన్యాయము? మీరు మొదటఁ దెలిపిన పుణ్యవంతుల చరిత్రమువిని వెంటనే పాపులకథ వినుటఁదలంపఁగా జక్కెరఁ దినినతోడనే ముష్టిపండ్లు దిన్నట్లు తోఁచుచున్నది. కటకటా! దయాసముద్రుండగు పరమశివుని సంకల్పము యిట్టిదేలనయ్యెనో కదా! సర్వసముఁడని పేరుఁబొందిన గాకీవల్లభుండు పుణ్యాత్ములని కొందఱకు మేలుఁజేసి కొందఱిని దీనులై దిక్కులేక వేదనలనుఁ బొందునటులఁ జేయుట యుచితమగునా? భగవంతుఁడు, కరుణామయుండనియు, సర్వప్రాణులకును మంగళ దాయకుఁడనియు, సర్వకార్యములకుఁ గర్తయుఁ గారణమైన వాఁడునునియు, కర్మములకు సాక్షియై యుండువాఁడనియు, వేలుపులకు వేలుపనియు, దిక్కులేనివారికి దిక్కగువాఁడనియు, దీనులను, శరణుఁజొచ్చినవారిని రక్షించువాఁడనియు, నాపద్బాంధవుఁడనియు, శాంతిదాయకుఁడనియు, నింకను లెక్కలేని శుభలక్షణములు గలిగినవాఁడని, వేదంబులును, శాస్త్రములును, పురాణములును, నితిహాసములును, చాటుచున్నవి. యట్టి పరంధాముని దయ గలుగకుండుట యా పాపాత్ముల దురదృష్టము గాక మఱేమనవచ్చును. నిజముగానది వారి దురదృష్టమే యు

గును. కాకున్న—పూర్వము, దేవతలును రాక్షసులునుగూడి మందర

—— సానందముని పరమేశ్వరుని దివ్యలీలలు వర్ణించుట. ——

పర్వతమునుఁ దెచ్చి పాలసముద్రమున వైచి వాసుకియను సర్పమును తరిత్రాడుగాఁ జుట్టి తలతట్టున నొకరును, తోఁక వైపున నొకరునుఁ బట్టి చిలుకుచుండ నాయొత్తిడికి సహించలేక యాసర్పము హాలాహలమను విషముఁ గ్రక్కిన నది మహాభయంకరంబుగా లోకంబులు దహించుచుం బ్రవహించుచుండ దాని వేఁడిమికి నిలువఁజాలక బ్రహ్మయు, నింద్రుఁడును, నాదిగాఁగల దేవతలు జడిసి హాహాకారంబు లొనర్చుచుం బలుచుచున్న దీనదయాళుండగు నీశ్వరుం డదిచూచి వారిని రక్షింపఁదలంచి యాభయంకర విషమును గుటగుటఁ ద్రావి భువనంబులకు మేలు గలిగించెను. దేవతల కందఱికినిఁ బెద్దవాఁడగు బ్రహ్మ గర్వించి తానేయెల్ల లోకములకును నధికుఁడనని హరిహరులనుఁగూడ సరకుసేయక నిరాకరించిన నతని తలఁగోసివైచెను, తనయందు పగఁ బూని లక్ష్యముసేయక శివుఁడన నెంతవాఁడు, మిగుల నల్పుఁడు శుష్కదరిద్రుఁడు, దయ్యాలపోతు, కపాలమున తిండిఁదినువాఁడు విరూపమగు కనులుగలవాఁడు దిగంబరుఁడు హీనుఁడని దూషించి తన్నారాధించుట మాని శివ రహితంబగు జన్నముఁ జేయుచున్న దుర్మార్గుఁడగు దక్షుని తలను ఖండించెను. తమ కెదురు మూఁడులోకములయందు నెవ్వరును లేరని మదించి యెల్లవారిని మిగుల బాధలపాలుఁ జేసి యలయుచుచుండిన మహాబలశాలులును, శూరులునునైన త్రిపురాసురులను పూర్తిగా నాశముఁ జేసెను. ప్రపంచమంతయుఁ దనమహిమవలన నుఱ్ఱూటలూఁచి మోహ విభ్రాంతులఁ జేసి కలంచునట్టి వాఁడును, బలవంతుఁడును, చాతుర్యవంతుఁడును నగు మన్మథుఁడు తరాతరంబుల యోచింపక నెదురులేదని కవిసి తనపై పూవుటమ్ములఁ బఱగింపఁ బూనిన తఱి మొగమునఁగల మూఁడవ కన్నుఁ దెఱచిచూచి యందువలనఁ బుట్టినమంటచే దహించెను. భువనంబులనుఁ బుట్టించుటకును రక్షించుటకును, నాశనముఁ జేయుటకునుఁ గర్తయై వెలిచెను. మఱియు, జలప్రళయము గలిగి లోకములన్నియు నీటమునిఁగి పోయినప్పుడు చిన్న బిడ్డవలె నీటిపైఁ దేలుచున్న శ్రీమన్నారాయణమూర్తిని

మునిఁగి పోవసీక తాను వటపత్రమై యతనికి సహాయముఁ జేసెను. తనపై నిశ్చలభక్తిఁ గలిగి పూజించుచు నేమరక సంస్మరించుచున్న మార్కండేయునిఁ గొనిపోవుటకు శమనుండు స్వయముగాఁ జనుదెంచి పాశంబునఁ బంధించి లాగికొనిపోవఁ గమకించినసమయంబున భక్తపరాధీనుండుగాన కాలుని గర్వంబడఁచి యామునికుమారునిఁ జిరంజీవిం జేసిరక్షించెను. మత్తులై లోకకంటకులై ప్రవర్తించిన వ్యాఘ్రాసురుఁడు, గజాసురుఁడు, నంధకుఁడు మొదలగు దుష్టరాక్షసుల సంహారముఁ గావించి శుభముఁ గలిగించెను. శరణాగతులను సంరక్షించుటకు దీక్షవహించి దేవతలాదిగా నెల్లవారికి నభయమిచ్చి కాచెను. చెప్పఁబూనిన నీశ్వరుని లీలలనంతములై యుండునట్టి మహాదేవుండు, సర్వేశ్వరుండు, తాండవమను పేరుఁగల నాట్యమునాడి మూఁడుజగంబులనుఁ బ్రఖ్యాతివహించిన మహానటుఁడు, దీనులై ప్రలాపించునట్టి పాపులనేల మరచెనోకదా! స్వేచ్ఛావిహారియైన శంకరుని చరిత్రములు, చిత్రములు, నామములు దురిత విరామములు, లక్షణములు జగద్రక్షణములు, కపటనాటక సూత్రధారియైన యతని వర్ణింప నవరితరము? సర్వజ్ఞుఁడని కీర్తిఁగొన్న యాదేవదేవుఁడు పుణ్యులనియుఁ బాపులనియు నిటు తెగ లేర్పఱచి కొందఱు సుఖమునుఁ గొందఱు దుఃఖమును ననుభవింపఁ జేయ నేల? యందఱును సౌఖ్యము నొందునటులఁ జేసిన తనబండారము తఱిఁగిపోవునా? తన గొప్పతనమునకు లోటుగలుగునా? తనకపకీర్తివచ్చునా? కాదేని మఱిదానేల యవ్విధమునఁ గావించెను? తనకు సంతోషమా, విలాసమా! లాభమా, నాకేదియుం దోచకున్నది. మునిశ్రేష్ఠా! చంద్రశేఖరుఁడైన యుమాపతి సంకల్పమెఱుంగ బ్రహ్మాదులకైనను సాధ్యముగాదందురు కపర్దికరుణకు దూరులైన పాపాత్ముల దౌర్భాగ్యము నేమని చెప్పవచ్చును? శివశివా! హరహరా! యెంత ఘోరము, యెంత ఘోరము, చిదానందున కిట్టి పన్నియు విలాసములనీ భావించెదను, లేకున్న నిటులఁ జేయనెంచునా? సాధ్యముగాకనా శక్తిలేకనా, యిట్టివే భగవల్లీలలు కానిమ్ము ఋషివర్యా! నేనిపుడింపున కొక యుపాయము నాలోచించితిని.

—సానందుఁడు తనయభిప్రాయమును ధర్మప్రసంగాదులకుఁ జెప్పుట.—

నాయందు కరుణించి యిచ్చటనుండెడి మీరందఱును, నాతలంపునకు బద్ధులు కావలయునని ప్రార్థించెద. నేనుతలంచిన యుక్తికి మీరనుకూలముగా ప్రవర్తించుట వలన మీకెక్కుడు పుణ్యము చేకూఱును, సత్యము. నామాట నంగీకరింపుఁడని పలికిన నచటనుండెడి ధర్మప్రసంగుఁడు మొదలుగాఁగల మునులందఱును, సానందమునిపైఁ దమకుంగల గౌరవమునుఁబట్టియు, నతనితపోమహిమ యధికమైనదగుటఁబట్టియు, నతనిమాటలకు సంతోషము నొంది యయ్యా! మంచిది మీయాజ్ఞపద్ధతిని నడుచుకొనుటకు బద్ధులమైయున్నారము. మీరేమి సెలవిచ్చెదరో తెలుపుఁడని వినయంబుమీఱఁ బలుకుటయు సానందుఁడు వారిఁజూచి, మునివరులారా! వినుండు నేనిపుడు సంయమనీపురంబునకుం బోవఁదలంచితి నచ్చటికరిగి సూర్యుని కుమారుఁడైన యా యమధర్మరాజునుఁజూచి కొంతసేపుప్రసంగించి యతనిచిత్తము మాఱునటులఁజేసి మహాదుఃఖము ననుభవించుచుండెడి పాపకర్ముల బాధలు నివారించి రావలయునని నాకు బుద్ధిపుట్టినది. యట్లుచేయకుండిన నాకుఁదృప్తికలుగదు. యెవ్విధముననైన నీకార్యమునుసాధింపవలయును. మీరందఱును నాపలుకు లంగీకరించి నావెంటరావలయు, నిదియే నేను మిమ్ముఁ బ్రార్థించినది. యనిన నందఱు నందుకు

### సానందముని మానసికపూజఁజేసి విమానమును రప్పించుట.

సమ్మతించి రంత సానందుండు మానసపూజఁ జేయఁదలంచి సర్వేశ్వరునిధ్యానించి తన హృదయ కమలమునఁ బ్రతిష్ఠఁజేసి మనస్సనెడి పరిశుద్ధమైన నీళ్లచే స్నానాభిషేకముఁ గావించి సత్యమనెడి పట్టువస్త్రము నర్పించి, పుణ్యమనెడి చందనముఁబూసి, నిష్ఠయనెడి పూవులతోఁ బూజఁజేసి, శాంతియు, నోర్పును, నను హారములర్పించి, భక్తియనెడి ధూపము సమర్పించి, జ్ఞానమనెడి దీపము నివాళించి, వైరాగ్యమనెడి పండును నైవేద్యముఁజేసి, నమ్మకమనెడి కర్పూర తాంబూలంబు నొసంగి సంతోషమను విసనకఱ్ఱతోఁ జల్లఁగావిసరి. స్థిరచిత్తుఁడై యరగన్నులుమూసి, హరహరా! పరమేశ్వరా! శంకరా! దయాస్వరూపా! పార్వతీరమణా! దేవదేవా! త్రిపురాసుర సంహారకా! గంగాధరా! శూలపాణీ! భక్తవరదా!

౧



(౨౨-వ పుట.) సానందముని మానసికపూజఁజేసి విమానమును రప్పించుట.

పరంధామా! రక్షించు, రక్షించు, నాతలంపు వ్యర్థముఁగానీక నెర
వేరఁజేయుము, జగదీశ్వరా! తండ్రీ! నీకు పదులు నూరులు వేలు
లక్షలు కోట్లు కోటానకోట్లు ప్రదక్షిణ నమస్కారములని యాత్మ
ప్రణామంబులాచరించినఁ, దత్క్షణంబున గొప్పగొప్ప దేవమణులఁ
జెక్కి, బంగారుతోఁ జేయఁబడి, దగదగమని దిక్కులకు వ్యాపించు
కాంతులుగలదై, చూచుటకు మిగుల నందమైనదియు, విశాలమై
నదియు, నిర్మలముగా నుండునదియు, క్రొత్తదియునగు నొక పుష్పక
విమానము మింటనుండి తటాలున యామునిపుంగవుల ముందఱ
భూమిపై వచ్చినిలిచిన, యచ్చటి ఋషులు దానింగని యాశ్చర్యముఁ
జెంది సానందునిఁగని, మునినాథా! నీమహాత్త్వంబును, నీశీలంబునుఁ
దెలియమావంటి యల్పులగువారికి తరముగాదు, నీవు శివస్వరూపుఁ
డవు, నీదర్శనంబుఁజేసిన మాత్రంబున సమస్త దోషంబులును, పెను
గాలిచే విరిసిపోవు మబ్బువలె పటాపంచలై పోవును, మాపుణ్యవశం
బున నేఁడుమాకు సంపూర్ణానందము చేకూఱెనని యనేకవిధంబుల
స్తోత్రముఁగావించి రంత సానందముని సర్వంబును నీశ్వరాధీనంబులని
పలికి, మునులారా! మీరింక నాలస్యముఁజేయక విమానము నెక్కుఁ

సానందాదులు విమాన మెక్కి యమపురంబుఁ జూడఁబోవుట.

డు, శీఘ్రముగాఁబోవుదమనిన వారందఱును మిగుల సంతోషముఁ
జెంది విమానంబు నెక్కిరి. పిమ్మట సానందుఁడును నెక్కి నప్పు డందు
శివదూతికలు వృషభ టెక్కెముఁగల యావిమానము మీఁదఁజేరి
మంగళవాద్యములు ప్రయోగించువారుకొందఱును, పిల్లనగ్రోవులూదు
వారు కొందఱును, వీణెలు వాయించువారు కొందఱును, సుస్వరం
బున పాటలఁబాడువారు కొందఱును, నాట్యముసేయువారు కొంద
ఱునునై, సానందాదుల కానందంబుఁ గలిగించుచుండ రపుడు విమా
నంబుపై కెగసి యంత రిక్షమార్గమున యమునిపురంబు మొగంబై
యొక్కుమ్మడి వాయువేగంబునఁ బోవందొడంగె నిట్లు మునిగణముల
తోఁగూడి విమానముమీఁద సానందముని జనుచున్న సమయంబున
నట యమపురంబున నడిచిన వర్తమానంబు వినుండని సూతుండు
శౌనకాదుల కిట్లనియె. ఇట్లు సానందాదులు శమనుని పట్టణ

## నారదుఁడు యమపురికివచ్చి యమునితో సంభాషించుట.

మునకు వచ్చుట నెఱిఁగి సకల సద్గుణ విశారదుఁడగు నారదుఁడు త్వరితముగా సంయమనీ నగరమునకు వచ్చి యందు, న్యాయమున న్యాయమును పరిశీలించి తెలుపుచుండు సకల ధర్మశాస్త్రములను చక్కఁగా నెఱిఁగిన మునులును, కనుసంజ్ఞవలననే యభిప్రాయము తెలుసుకొని కోరిన పనులు జాగ్రతతో చేయుచు సిద్ధముగాఁ గాచుకొని చేతులు కట్టుకొని నిలిచియున్న యక్షులు, గరుడులు, పన్నగులు, నను భేదములుగల దేవతలును, వినుట కింపుగా వీణెలు వాయించినలాగున నుండు స్వరములతో వినోదకరముగ లుగునట్లు పాటలుపాడి మెప్పునొందుచున్న గంధర్వ జాతి వేల్పులును, శాస్త్ర రీతులుదప్పక చూచువార లాశ్చర్యమొంది సంతోషముమీర పొగడునటుల నాట్యము సేయుచున్న యప్సరలను, జాతి యమరకాంతలును, చేతులఁ గంకణములు కదలుటచే కణిల్లు కణిల్లున శబ్దము గలుగుచుండ, వింజామరలుపట్టి ప్రక్కలనిలిచి చల్లనిగాలి సోకునట్లు మెల్లమెల్లఁగా విసరుచున్న చారణులను దేవతాస్త్రీలును, మొదలగు వారు బలిసి కొలువ ముత్యాల మంటపమునందు మణులు దాపి దగదగమెఱయుచున్న బంగారుమయమయిన సింహాసనముమీఁదం గూర్చుండి యముండు కొలువుండు సమయంబున హజారమువద్దికిం జనుదెంచినిలిచిన, నచ్చటనుండెడి మొగసాల కావలివారగుభటులు, రాగి తంతులవంటి మెరుపురంగుఁగల వెంట్రుకలు పెనఁగొన్న జడలను చేర్చికట్టిన ముడితోఁ గూడిన తలఁగలవాఁడును, శాటీలను కావిగుడ్డలు ధరించుకున్నవాఁడును, చుట్టఁబడి దారముతోఁగట్టి చంకకుం దగిలించుకొన్న జింకతోలు చుట్టఁగలవాఁడును, యెల్లప్పుడును దనకుఁదానై హరినామములఁ బలుకుచుండు వీణెను చేతఁ బట్టియున్నవాఁడును, హంసకోలయు, జన్నిదమునుఁ గలవాఁడును, నీటిబుఱ్ఱఁ బట్టుకొనియున్నవాఁడును మిక్కిలి కాంతిమించు శరీరముఁగలవాఁడును, నగు మునిశ్రేష్ఠుఁడైన యానారదునిం జూచి నేలనాగిలఁబడి దండముబెట్టి వేగముగఁ బోయి, యమధర్మరాజునకు వందనములర్పించి, యోదేవా! త్రిలోకసంచారి యగు కలహభోజనుఁడు వచ్చి మొగసాల నిలిచి యున్నవాఁడని

చెప్పిరి. ఆమాటవినఁగానే యమధర్మరాజు తటాలున సింహాసనము నుండి దిగి బిరబిరంబోయి సాష్టాంగముగా తన కిరీటమతని పాదంబులు సోకులాగున నేలఁబడి నమస్కారముఁ జేసి, భటులు తన యుత్తరువు లాగున వెంటఁ దెచ్చియున్న పరిశుద్ధజలములతో మునివరుని పాదములు గడిగి యానీరుఁ దలపైఁ జల్లుకొని పూజఁజేసి చేతులు జోడించుకొని నిలిచి, దేవరా ! మీరువచ్చుటచేత నాపట్టణమును, నేను నివసించు మందిరములును పావనములైనవి. నేనుమిక్కిలి ధన్యుఁడనైతిని లోపలికిదయచేయుఁడని తిన్నఁగాఁ దోడుకొనివచ్చి తనసింహాసనమునకు సరియైన రతనాలుచెక్కిన యెత్తుగుపీటపైఁ గూర్చుండఁబెట్టెను. నారదుఁడా ధర్మాత్ముఁడైన యమధర్మరాజునుఁజూచి, "యో సూర్యకుమారా ! నీకు సకల శుభములునుఁ గలుగునుగాక నీకు కుశలమా ? నీభార్యయుపతివ్రతా శిరోమణియునైన శ్యామలాదేవికి క్షేమమా ? మఱియు నిచ్చటి మానీంద్రులకును, భటులు, పారకులు, నటులు, వైణిక, మారజిక, గాయక, మార్దంగికాదులగు నీ పరివారమునకును సౌఖ్యమేకదా" ! యని యడిగిన సంతసము మీఱ వినయముతో "స్వామీ! మీకరుణవలన నందఱికినికుశలమే. మిమ్మువంటి వారి ప్రీతికి పాత్రులమైయుండు మాకే కష్టములయినను గలుగునా ? కలుగవు" అనిచెప్పి యముండు వెండియు నమ్మునివర్యుని నుద్దేశించి. "అయ్యా మీరు సకలలోకములును సంచారముఁజేసెడి వారుకదా ! నేను వినఁదగిన వింతయైన విషయమేదేనియుండిన దయచేసి నాకెఱిఁగింపవలయునని ప్రార్థించెద. అనియడిగెను. వైవస్వతుఁ డాలాగడుగుటయుఁ దలయూఁచి యించుకసేపు యోచించి నారదుం

నారదుఁడు శమనునకు సానందాదుల రాక నెఱిఁగించుట.

డతని కిట్లనియె. ఓయిశ్రాద్ధదేవా ! నీవడిగితివిగాన చెప్పెద నొక్కవిశేషంబుగలదు వినుము. వేదములును, వేదాంతమును, మొదలగు సమస్తశాస్త్రములునుఁ జక్కఁగాఁ దెలిసినవాఁడును, ధర్మాధర్మములు గుర్తెఱిఁగిన వాఁడును, నిత్యనైమిత్తికాది సదాచార నిష్ఠలు విడువక నడుపువాఁడును, దయ, శాంతము, నోర్పును, తిన్నఁదనమునుఁగలవాఁడును, ఆశ, కోపము, లోభితనము, గర్వము, విరో

ధము, నిత్యాదిగుణములు లేనివాఁగును, కల్లమాటఁ బలుకనివాడు
ను, నెల్లపుడును, సంతుష్టియు, సంతోషమునుఁ గలవాఁడును, నిరం
తరమును, శివపూజయు శివనామస్మరణయు, శివకథా శ్రవణమును,
నేమరనివాఁడును, శివ భక్తులలో మొదటివాఁడని యెన్నఁదగిన
వాఁడును, చక్కని శరీరమును, తేజస్సుమించిన ముఖమునుఁగల
వాఁడును, మునులలో నుత్తముఁడును, పూర్ణచిత్తుఁడను పేరుఁగల
మహా తపస్విధుండగు మౌనియొక్క, శంకర వరప్రసాదంబునఁబుట్టి
న కుమారుఁడును, నైన సానందుఁడను ఋషి, గౌరీ పతి యనుగ్ర
హంబునఁగలిగిన, విచిత్రమై, క్రొత్తయై యెనిమిది దిక్కులను వెలి
గించు తళతళ కాంతులుమించి వాయువేగంబున నడువఁగల శక్తి
గలదై యొప్పు పుష్పక విమానంబుమీఁద పెక్కుమంది మునులు వెం
టనుండ నెక్కి యీపురంబునకు వచ్చుచున్నవాఁడు. కొంచెము సేపటిలోన
నిచ్చటికిఁ జేరఁగలఁ డామహాత్ముని యుద్దేశముకడుగొప్పది. నిన్నుఁజూచి
నీతో మాటలాడి నీచే శిక్షింపఁబడి యీపట్టణంబునందలి నరకములలో
నానాబాధలు ననుభవించుచుండెడి పాపాత్ముల నందఱను వారుపడు
కష్టములనుండి తొలఁగించుటకుఁదలఁపుఁ జేసెను. అందుకొఱ కేయతఁడు
వచ్చుట. నీవుమాయందు మిక్కిలిభక్తిఁగలవాడవగుటవలన నీమేలుఁ
దలంచి జరుగఁబోవువృత్తాంతమునుఁ జెప్పితి. నతఁడు మిక్కిలి ప్రభావ
సంపన్నుఁడు, గొప్పతపస్వి, శివభక్తుఁడు. తలంచిన నెంతపనినైననుఁ
జేయఁగల శక్తిఁగలవాఁడు, గనుక నీవు చక్కఁగాయోచించి యతఁడు
రాకముందే యిందుకుందగిన యుపాయమేదేని నిశ్చయించుకొనుము.
లేకున్న నీపట్టణము పాడువడుటయు, నీగొప్పతనమునకు భంగము
గలుగుటయు, సిద్ధము, తప్పదుసుమీ! నావలనఁ దప్పులేక తెలిపిన
దియు జరుగఁ బోవునదియునగు వృత్తాంతమునుఁ జెప్పితి. నింకమీఁద
నీయిష్టమని పలికెను. ఆశ్చర్యకరములగు నారదుని మాటలువిని

యముఁడు నారదునితో సానందుని నిర్లక్ష్యముఁజేసి పలుకుట.

చిఱునవ్వు మోమునఁ బొడమఁ దలయూఁచి యిట్లనియె. అయ్యా!
మీమాటలు నిజముగానే యుండునుగాని నాకు మిక్కిలి వింతగాఁ
దోచుచున్నవి. యేలనందురా? యా సానందుఁ డెంతటి వాఁడైనను,

నతఁడు తలంచిన కార్యము నెటుల నెరవేర్పఁగలఁడు? సాధ్యమా? వెఱ్ఱి తలంపు తనవలనఁ గాని పనినిఁ జేయుతలంపతని కేల గలిగెనో గాని యది కొనసాగునదికాదు. వృథాకష్టమునకుఁ బూనినాఁడు. లోకములో నెందఱెందఱో మహా తపస్సంపన్నులగు ఋషులు గలరు. వారొక్కొక్కరును నిదివఱకెన్నఁడును తమవలనగాని పనియగుట దెలిసి యుండుటవలననీకార్యమునకుఁబూనలేక మానియున్నవారు, వారందఱి కంటె నితఁడేమి యధికుఁడు? వింధ్యమనెడి గొప్పకొండయొక్క శిఖరములు విఱుఁగఁద్రొక్కి లోకములో ప్రసిద్ధిఁజెందిన యగస్త్యుని కన్నను, నీశ్వరునిఁజూచి యోయి శంకరుఁడా! నీకు మూఁడు కన్నులుండుట గొప్పఁగాఁదలంచితివి కాఁబోలు, నాకును మూఁడుకన్నులున్నవి. నీకొక కన్ను ముఖంబునందున్నది. నాకు అరకాలియందున్నది యిదిగో! నామూఁడవ కన్నుఁ జూడుమని చూపిన తపోనిధి యగు గా ముని కన్నను, బ్రహ్మదేవుని నెదిరించి నాకంటె నీవెందు గొప్పవాఁడవు? నీవు చేయుపనిని నేనును జేయనేర్తును చూడుమని, సృష్టికిఁ బ్రతిసృష్టింజేసి పేరొందిన విశ్వామిత్రునికంటెను, బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, నీముగ్గురిలో నెవఁడు శాంతుఁడో కనుఁగొనవలెనని వారలందన్నిన భృగుమహాముని కన్నను, కను చూపుచేతనే సగర చక్రవర్తి కుమారులందఱును మండి బూడిదయై పోవునట్లు చేసిన కపిలఋషికన్నను, దేవేంద్రునికి శాపమిచ్చిన దుర్వాసుని కన్నను, సమస్తమునులచేతను బొగడఁబడిన మహిమఁగల వసిష్ఠుని కన్నను, నీసానందుఁ డధికుఁడా? ఏటిమాట, మఱియు మాండవ్యుఁడు, శాండిల్యుఁడు, కౌండిన్యుఁడు, కశ్యపుఁడు! మార్కండేయుడు యత్రి, భరద్వాజుఁడు, మొదలుగాఁగల మహాత్ములెందఱో గలరు. వారిలో నీసానందుఁడెవ్వఁడిఁ జోలును? సకలదేవతలును, మునులును, సేవింపఁగా పద్మాసనాసీనుండై జీవకోటులను సృష్టిఁగావించు పైడికడుపు వేలుపునకు పుత్త్రులరై, మూఁడు లోకములందును పేరుఁబడసిన సనకసనందన సనత్కుమారులకు తోడఁబుట్టినవారై భూతభవిష్యద్వర్తమాన కాలంబులను, వచ్చునవి పోవునవియునగు మేలుఁగీడులఁ దెలిసికొని చరించు మహాతపస్సంపన్నులును, తేజోవంతులును,

మూఁడు లోకములలోను బొగడ్తఁజెందినవారునగు మీరొక యల్పుఁ
డగు మునికుమారునిఁ బేర్కొని మిక్కిలి వర్ణించి యబ్బురపడి నన్ను
వెఱచునట్లు సేయఁదలంచి పలుకుటఁదలంచిన నాకెంతయుఁ గ్రొత్త
గాఁ దోఁచుచున్నది. మునీంద్రా సర్వము నెఱింగిన మీరె యిటులఁ
బలికిన మీమాట కౌను కాదని యడ్డుఁజెప్పుటకు మాకుశక్యమా?
నేనిపుడు తమ సన్నిధానంబున మనవిఁజేసిన మునీశ్వరులు మీరు
చెప్పిన సానందునికెందు తక్కువైనవారు? మీకుఁ దెలియదా?
అయిననేమి? రానిండుచూతము యెంతెంత గొప్పగొప్ప ఋషులో
వచ్చిరి మాటలాడితిని. వారెవ్వరు నిట్టిపనికిఁబూనినది లేదు నేనింత
వరకు నిట్టి విచిత్రవర్తమానము విని యెఱుంగను. మున్నెవ్వరునుఁ
జేయఁదలంపనిదియుఁ జేయలేనిదియునగు పని నాసానందుఁడెట్లు
సాధించునో చూచెదనుగాక చూచుటకేమున్నది? యతఁడిచ్చటికి రానే
వచ్చిన నాలుగువీధులనుఁ దిరిగి వచ్చినదారిఁబట్టి పోవలసినదే!
యంతకంటె నేమియుం జేయనేరఁడు మహాత్మా! యొక్కమాట, యెం
డమావుల నీరునఁ గుండలలోఁ బోయవచ్చును తెల్లగాయుండు
శేషాహి నెత్తిదనముఁ గలుగునట్లు చేయవచ్చును. బూడిదను గానుగ
లోఁబోసి తైలమునుఁ దియవచ్చును. నాలుకలు చాచుచుండు పెను
మంటను మ్రింగవచ్చును. గొండలను బంతులవలె నెగరవైచి యా
డవచ్చును. సముద్రము నీఁదియావలిగట్టునకుఁ బోవచ్చును. మీఁది
కెగిరి యాకాశము నంటవచ్చును. గాని, నాచే న్యాయంబుగా శిక్ష
విధింపఁబడి నరకబాధల ననుభవించు పాపాత్ములకు కైలాసపదవి
నిప్పించుట కెంతవారికిని సాధ్యముగాదు. ఇట్లనుటచే నన్ను నేను
పొగడుకొనినట్లగును, అయినను జెప్పెద నంతకుని యాజ్ఞాబద్ధులై
వెత నొందువారిని వదలించుట సానందుఁడు సులభమనితలంచె నే
మో! ముఖమునఁ బెట్టుకొని చటుకునఁ దుడుచుట కిది బూడిదబొట్టు
కాదు. నేనిందుకై భయపడవలసినది లేదు తేజోమయా! మఱి
యొక విజ్ఞాపనము కలదు. మున్ను చెప్పమరచితి వినుండు నాచేఁబంపఁ
బడు దూతలు లోకంబున నాయువునిండని వారింబట్టి తెచ్చుటలేదు.
కాలపరిమితి యైనవారినే గొనివచ్చెదరు. అలాగు తేఁబడినప్పుడు

నేను వివేకములేక విచారింపక శిక్షవిధించుటలేదు. నేను న్యాయ
మును బాగుగా యోచించియే నేరముఁజేసిన వారి కే శిక్షయర్హ
మో దానిని విధింతును. అన్యాయమనిన నాకుగిట్టదు దానినిఁ బట్టియే
నాకు ధర్మరాజని పేరుగలిగినది పుణ్యముఁజేసిన వారిని, పాపముఁ
జేసినవారిని, వారివారికిఁ దగిన సౌకర్యములతో జీవులను దూతలు
కొనివచ్చి నాముందునిలిపి నపుడు విమర్శించి పుణ్యాత్ములను గౌర
వము, మర్యాద, సౌఖ్యముఁ, గొఱవడక యుండులాగున నేర్పాటుఁ
గావించివారిని సమస్త వైభవములతో దేవేంద్రలోకమునకుఁ బంపు
టయు, పాపాత్ముల నరకంబులఁబడవైచి బాధలుబెట్టి శిక్షించు
టయు, నాకాచారము. ఇదియ ధర్మమా? అక్రమమా? నావడ
వడియందే లోపమును లేకుండునటుల నేను జాగ్రతగా ప్రవర్తిం
చువాఁడను. ఇట్టి ధర్మపాలనఁ జేయునాచే శిక్షితులైనవారినిఁ
దప్పించి నారాజ్య గౌరవమును, నాగౌరవమును, చెడఁజేసి హానిగ
లిగించుట కతనిశక్యము గానేరదు. నేనిట్టివారినెందఱినో చూచి
యున్నాను. ఈ సానందునికే నేను వెఱచునెడల నింక నాప్రభుత్వ
మును, ప్రతాపమును, శాసనమును, నేమిగలదు? దీనికై నా
కెంతమాత్రమును సంశయములేదు.'' అని తృణీకరించిపలికెను.
నారదుఁ డతని మాటలువిని తనలో నవ్వుకొని, యో దండధరా! నే
నెఱింగిన విషయమును నీకుఁ జెప్పితి. ఇది నిన్ను వెఱపించుటగాదలం
పకుము. హాని వృద్ధులను యోచించుట మంచిదని మాత్ర మింకొక
సారి చెప్పుచున్నాను. లోకంబున ప్రభావసంపన్నులగు ఋషులు నీవు
చెప్పినట్లు పెక్కండ్రుకలరు. కాని, సానందముని వారి యందఱికంటె
నధికుఁడని నాయభిప్రాయము. నిమనంబున నతని నల్పునిఁగాఁదలంపక
యప్రమత్తుఁడవై యుండుట మంచిది. చాలాప్రొద్దైనది ఇంక
నేను పోయివచ్చెదనని చెప్పి మరలఁ దన్నుఁబూజించి నమస్కరించిన
యంతకునిదీవించి యచ్చోటనుండిన మునులచే ననుజ్ఞఁగొని, పయనం
బైపోవుచు, చెప్పి చూచితి నామాటలఁదలంచి తగు యోచనంజేసి
తప్పించుకొనఁడేని యీయంతకుఁడు నిక్కముగాఁ జిక్కుపడఁగలఁడు.

పోనిమ్ము. యెవరెట్లుచెడిన నాకేమి? యనితలంచుచుఁ గైలాసంబున కుంబోయి సర్వేశ్వరుని సందర్శించి వినుతించి, యటనుండి వైకుంఠంబునకరిగి రమావల్లభుండగు శ్రీమన్నారాయణమూర్తిం బొడగని దండప్రణామంబు లాచరించి నుతించి, యంత సంతోషంబువిూఱ తనచేతియందలి మహతి యను నూరుతంత్రులుగల వీణె తనకుఁదానై నారాయణ నారాయణయని మ్రోగుచుండ వానంద పరవశుండగుచు, సత్యలోకంబు దారింబట్టి పోయిన వాడాయెను.

 గద్యము.

ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ చతుర్విధ కవితా విశారదుండగు, పురాణం - పిచ్చయ్యకవిచే రచియింపబడిన సానందోపాఖ్యాన వచనకావ్యమునందు ద్వితీయ ప్రకరణము.

సంపూర్ణము.





శ్రీ ః స్తు.

# సానందోపాఖ్యానము.

వచనకావ్యము.

## తృతీయ ప్రకరణము.

క॥ శ్రీవిశ్వ ! విశ్వమయ ! భ,
క్తావన ! కరుణాలవాల ! ♦ యజ్ఞపురుష ! ని
త్యా ! వేదవేద్య! ఫణిరా
డ్గిరిస్థిత ! వేంకటేశ ! ♦ కలుషవినాశా !

శౌనకాది మహామునులం జూచి సూతుండు తర్వాత జరిగిన వృత్తాంతంబు నిట్లని చెప్పందొడంగె.

అవ్విధంబున నారదుం డరిగినంతఁ గొంతవడికి తూర్పుదిక్కున నుదయించిన సమయమునందు సూర్యుని కాంతివంటి కాంతిఁగలదియు, తొలకరి వాన మబ్బునుండి తళ్కుతళ్కున మెఱయు మెఱుఁగుతీగవలె వెలుగునదియు, నాకాశ లక్ష్మి కిరీటముమీఁదఁ జెక్కఁబడిన గొప్పరత్నమువలె దగ దగ కాంతులు మించునదియు, నింద్రుని కిరీటమువలె శోభిల్లునదియు. దేవ పారిజాతపుష్పములు, మల్లెలు, మొల్లలు, సంపెగలు, కలువలు, తామరపూవులు, మొదలగు వాని వాసనలు గుబులు కొనుచుండునదియు, పార్శ్వములయందు నానా విధములైన చిత్తరువుపనులు చేయఁబడినదియు, సొగసైన యద్దములఁ దాపినదియు, వినోదకరమైన యలంకారములచే నొప్పునదియు, నందిని వేయఁబడిన టెక్కెము కట్టఁబడినదియు, దేవతల యాటపాటలచే

నానందముఁ గలిగించునదియు, మిక్కిలి వేగముఁగలదియు, నగు సానందుని పుష్పక విమానమా శమన పురంబునకువచ్చి యంతరిక్షంబునఁ బొడకట్టిన నప్పురంబునంగల పౌరులు దాని నిదానించి చూచి యాశ్చర్యమొంది యారా! యెంతవింత యెంత; యిట్టిదాని నే కాలంబుననుఁ జూచినదిలేదు యదెయదె విమానమొకటి వచ్చుచున్నది దానియలంకారమును కాంతియువర్ణింప తరముగాదు. బళి! బళీ! యనిమెచ్చుచు గోపురముల మీఁదను, ప్రహరిగోడల మీఁదను, మిద్దెలమీఁదను, మేడల మీఁదను, యిండ్లకప్పుల మీఁదను, చెట్లమీఁదను నెక్కి, పిల్లలు, వయసువారు, ముసలివారు నందఱును విచిత్రముగా తలలెత్తి యొకరి కొకరు వర్ణించి చెప్పుచుం జూచుచు, నిది బ్రహ్మాదియో, విష్ణుని నిదియో, శంకరునిదో కావలయునని కొందఱును, నింతకుపూర్వము మనము చూచిన విమానము లెవ్వియు దీనికి సమముగా నేరవని కొందఱును, నేఁడు నారదుండు రాజసభయందు సానందుఁడను ముని విమానము మీఁద నిపురంబునకు రాఁగలఁడని చెప్పిపోయె. నిది యదియేఁ గాఁబోలునని కొందఱును, నెవరిదైననయ్యె నింతటి సౌందర్యమైన విమానము మూఁడు లోకములందును మఱియొకటి యుండబోదని కొందఱును నిట్లు వారివారికిం దోచినలాగునం జెప్పుకొనుచుండిరి. మఱియుం గొందఱు గుంపులు గుంపులుగాఁ జేరి "నేఁడు సుదినము. మహాతపస్వియు, నీశ్వరుఁనిబోలినవాఁడునగు సానందముని రాక మిక్కిలి శ్రేయస్కరము. మన యదృష్టమువలన నా మహానుభావుని దర్శనము మనకు లభింపఁబోవుచున్నది. మేలు మేలు , మునికులచంద్రుఁడగు సానందమౌని యింక నీ పట్టణమున నరకబాధల ననుభవించువారి నెల్ల శివసాయుజ్యము నొందఁ జేయునట. దయామయుఁడగు నతఁడెంత పనియైననుఁ తలంచినమాత్రన జేయఁగలఁడని దేవముని చెప్పఁగా వింటిమికదా! యది యసత్యముకాదని తోఁచుచున్నది. యెందువల్లననఁగా కేవలము శివభక్తిఁగలిగి శివునారాధించువారి కిట్టి కార్యము లొక లెక్కలోనివిగావు. సూర్యుని కాంతిచే విరిసిపోవు చీకటుల విధంబునను, పెనుగాలిచే పటాపంచలై చెదరి విచ్చిచను కారుమబ్బు లాగునను, నింద్రుని వజ్రాయుధము యొక్క దెబ్బలవలన

పిండి పిండియగు పెనుగొండలరీతిని, దావాగ్ని కవిసిన మండి భస్మ మైపోవు ఘోరకాననంబు విధంబునను, చంద్రశేఖర పూజాధురంధరుండును, పరమ శివభక్తుండును, తేజస్సుఁగల వాఁడును, నైన సానంద ముని ప్రభావంబున, నీశ్వరానుగ్రహంబున, సానందయోగి యత్నము తప్పక ఫలించఁగలదు. పాపాత్ములు నరక బాధయను మహాసముద్రమును సానందమునియనెడి తెప్పవలన దాటి సుఖించఁబోవుచున్నారు. తప్పదని పలుతెఱంగుల తమలోనొండొరులు ప్రసంగించుకొనుచు, విమానముపై చూడ్కులు సారించి యదిగో వచ్చె నిదిగో వచ్చెనని కేకలు వేయుచు కోలాహల ధ్వనులు కావించుచుండ తద్వృత్తాంతంబు నెఱింగి కొందఱుభటులు సంభ్రమంబును తత్తఱపాటునుఁ గదురవేగముగా కొలువున్న కాలుని పొలికింజని వందనములుజేసి, దేవరా! మనవి. తమతో నింతకుమున్ను నారదులవారు చెప్పిన చొప్పున

### కాలుఁడు భటులవలన సానందునిరాక విని కలఁతనొందుట

పెక్కండ్రు మునులతోఁగూడి దేదీప్యమానముగా వెలుంగుచుండునదియు, సమస్త వైభవములును కొఱంతలేక కలిగియుండునదియు, మిగుల విచిత్రమును, సుందరమునుగల శిల్పకల్పనలచే నొప్పునదియు, నగు పుష్పక విమానము మీద నెక్కి యదె యరుదెంచుచున్నాఁడు. యిప్పటికి పురమధ్యంబున నావిమానము వ్రాలియుండును, తమకీ వృత్తాంతమునుఁ దెలుపుటకు వేగముగా మేము పరుగెత్తి వచ్చినారమని చెప్పిరి దూత లీమాటలు చెప్పఁగానే, నారదునితో సంభాషించినప్పటి బింకము యముని కా సమయంబున లేకపోయెను. యెందువలననో గాని యతని మనసున నొక విధమైన భయమును, సంకోచమును, సంభవించె. మేను కంపింపం దొడంగెను. యేమి చేయవలెనో యది యతనికిఁ దోఁచదయ్యెను. తనలో నేమేమో యోచన లంకురింపఁదొడగెను. సంభ్రమ మతిశయించెను. మేను చమర్చెను. పలుకుటకు మాట వెలువడకుండెను, యిట్టి లక్షణములు గలవాఁడై యతఁడు తనలోనిట్లని చింతింపఁ దొడంగెను. ఔరా! నే నెంతయోచన లేనివాఁడనైతిని? నా మేలుఁ గోఱకై దయచేసి దేవముని యీసందర్భమునుగురించి యెన్ని విధములనో చెప్పెను.

గర్విష్ఠుఁడనై యపు డతనిమాటలు నిర్లక్ష్యముఁ జేసితిని. సానందుని సామాన్యునిఁగాఁ దలంచి తూలనాడితిని యతని మాటలను వినినపుడు శాంతముగా తగిన యోచన నడిగి యుంటునేని, యుక్తిగా నేదో యొకయుపాయముఁ జెప్పియుండును. నే నటుల నడుగనైతిని. ఇపుడన్ననో నాకు ధైర్యము లేకున్నది. మనసున కుదురుపాటు కలుగదయ్యె. నేమిసేయుదును? సానందుఁడు మిక్కిలి ప్రభావముఁ గలవాఁడనియు, శివ వర ప్రసాదియనియు, శివభక్తుఁడనియు, నెంత పెద్దకార్యమైననుఁ జేయఁగలవాఁడనియు, నారదుఁడు మిగుల శ్లాఘించి చెప్పెను. త్రిలోక పూజ్యుఁడగు నతఁడు సామాన్యులఁ బోగడునా? యెంత వెఱ్ఱితలంపుఁ దలఁచితిని? సమయము తటస్థించినది. నేనిపుడు నడుచుకొనవలసిన లాగిట్టిదని నిర్ణయించుకొనఁ జాలకున్నాను. లోక భయంకరుడనైన నేనే నేఁడు భయపడవలసి వచ్చినదికదా! యని యనేకవిధంబుల చింతింప నారంభించెను. ఇంతలో మఱికొందఱు దూతలు పరుగెత్తివచ్చి దేవా! యదిగో సానందులవారి విమానము మొగసాల డిగ్గి నిలిచినది. యని తెలియఁజేసిరి. ఇంకే త్రోవ? యమధర్మరాజునకు వేగిరపాటును భీతియు మునుపటికంటె నెక్కుడయ్యెను. యేమైననేమి, జరుగవలసిన కార్యములను జరిగింపక తీరునా? యతఁడెటులనో మిక్కిలి ప్రయత్నమున మనసున నొక్కింత ధైర్యమువహించి, పూజా ద్రవ్యంబులును, శుద్ధోదక పాత్రంబులును, పరిచారకులుకొని వెంటనే తేరఁగా, సభాసదులందఱును బరివేష్టించి వచ్చుచుండ, నడుగులు తడఁబడ, అంసభాగంబున నుండి పీతాంబరంబు జారి నేలజీరాడ, బిరబిర మొగసాలవద్దికిం జనియెను. యముడచ్చటికిఁ బోవుటకుమున్నె సానందుఁడును, నతనితోఁ గూడివచ్చిన ఋషులును, విమానమునుండి దిగి నిల్చియున్న, మన్మథునివంటి రూపముఁ గలవాఁడును, తామర రేకులఁబోలు కన్నులుగలవాఁడును, మొలకు పులితోలుఁగట్టి శాటిని యుత్తరీయముగా ధరించినవాఁడును, తెల్లనిజందెమును, రుద్రాక్షల దండలును ఱొమ్మున వ్రేలుచుండువాఁడును, చంద్రబింబమువంటి మోముఁగలవాఁడును, పెదవులపై చిఱునవ్వు మొలకలెత్తుచుండువాడును, దేహమంతయు విభూతినలందుకొని యున్నవాఁడును, తలయందు

పెనచిచుట్టిన జడలముడిఁగలవాఁడును, హంసకోలయు, కమండలువను నీటిబుఙ్గయు చేతులఁ బట్టియున్నవాఁడును పాదంబులయందు యోగ పావలు గలవాఁడును, పరిపూర్ణ పరమేశ్వర ధ్యానాసక్తిఁ గలిగిన వాఁడును, శివస్వరూపుఁడును, సదాశివుని నారాధించు శివభక్త శ్రేష్ఠుఁడును, నతిశయమైన బ్రహ్మతేజస్సుఁ గలవాఁడును, మునులచేఁ జుట్టఁబడియున్నవాఁడును, మహానుభావుఁడునగు సానందుముని చంద్రుఁ డిఁగనుఁగొనియెను. ఆమహాత్ముని సందర్శింపఁగానే యమునకు నారద మౌని చెప్పినమాటలన్నియుఁ దలంపునకు వచ్చెను. సాక్షాత్తు శంక రునివలె తోచు సానందునిఁజూచి ఆహా! యెక్కడిరూపము? యెక్కడితేజస్సు? యెంతశాంతము? యీమహానుభావుఁ డీశ్వరుని యపరావతారముగాఁగనుపించుచున్నాఁడు, నేనెఱింగిన యేఋషియు నింత ప్రభావసంపదఁ గలిగియున్నది లేదని తనలో తలంచుచుం జే రం జని మునులచేఁ బరివేష్టితుఁడైయున్న యామునిచంద్రునకుఁ బ్రద క్షిణముఁజేసి సాష్టాంగ దండప్రణామములు కావించి చేతులు జోడించి స్తోత్ర మొనరించి మానులతోఁగూడ నతనికి పాదంబులు గడిగి యా పావనజలంబులు శిరంబునం జల్లుకొని పూజాద్రవ్యములఁ గొని భక్తి యుక్తుఁడై నానావిధంబులఁ బూజఁజేసి మరలమరల వందనములఁజేసి వినయంబుమీఱ నిల్లనియె. ఓస్వామీ! మహానుభావా! పుణ్యస్వ రూప! యుమానాథునిఁబోలు మిమ్ము సందర్శించుటవలన నేను ధన్యుఁ డనైతిని. యీసంయమనీపట్టణము పావనమయ్యె నిందలి పౌరులు మొదలగు నందఱును కృతార్థతఁజెందిరి. మాకుంగల కొఱఁతలన్నియు నేటితో తీఱిపోయెను. మహాత్మా! మీదివ్య పాదములు నాగృహం బు సోక లోనికివిచ్చేయుఁడు. తామసము సేయనేల? యనివిన్నవించిన చిఱునవ్వు ముఖంబున మొలకలెత్త సానందముని తృప్తినొందిన వాఁడై యమునిఁజూచి ధర్మస్వరూపుఁడవును, న్యాయశీలుఁడవును నైన యోసూర్యకుమారా! దండధరా! నీకును, నీయర్థాంగలక్ష్మి యగుభార్యకును, యిచ్చటి యుత్తమోత్తములగు మునులకును, నితరి జనంబులకును, మిత్రులు మొదలగువారికిని కుశలమేకదా? నీవు రాజ్యతంత్రములయం దేలోపమును, గలుగనీయక నడుపుచున్నావు

కదా? నీప్రతాపమున కెప్పుడు నెంగాను నెదురులేక యున్నదికదా! యని క్షేమంబడిగెను. మృదువులగు సానందునిమాటల కలరి కాలుండు, స్వామీ! తమవంటి గొప్పవారికరుణ మాపైఁ గలిగియుండగా మాకెందును నెప్పుడును నేకొఱంతయుఁ నేలగలుగును? తమయను

**కాలుఁడు సానందాది ఋషుల కొలువుకూటంబునకుఁ దోడ్కొని పోవుట.**

గ్రహంబునం జేసి మేమందఱమును క్షేమముగానుండెదము మాకెందునుఁ దక్కువ కలుగదు, మీరింక దయచేయుఁడని తన చేతితో పుణ్యాత్ముఁడగు సానందుని చేయిపట్టుకొని మునులును దేవతలును, భటులు, నటులు, గాయకులు, పాఠకులు, వైణికులు, మారజికులు, మార్దంగికులు, నితర పరిజనంబులుఁగొలువ మెల్లమెల్లఁగా నడిపించుచు నచ్చటచ్చట నొక్కొక్క విశేషంబుఁగని నిలిచి దానినిగురించి మునివరుండడిగెడి ప్రశ్నలకు సదుత్తరంబుఁ జెప్పుచు, పెక్కు వాకిళ్లుదాటి, యేనుగలుండు పెద్దపెద్ద కొట్టంబులును, గుఱ్ఱపుశాలలును, ధనమును, బంగారు, వెండి, రత్నములుఁగల మందిరములును, క్రమక్రమంబుగాఁ గడచిచని, యనంతరంబున, ధగధగమెఱయు బంగారుమయమైనదియు, దేవపారిజాతపుష్పముల తోరణములు కట్టియుండునదియు, ఘుమఘుమవాసనలు వెదజల్లుచుండునదియు, పగడంపు స్తంభములును, వజ్రపుదూలములును, వైడూర్యపు ద్వారబంధములును, కెంపులచట్టములును, గరుడపచ్చల తలుపులును, నీలముల కిటికీలును, చంద్రకాంతపు రాళ్లమెట్లును, నపరంజి యోడుబిళ్లలును, ముత్యాల ముగ్గులునుఁ గలిగి, యనేక చిత్రవిచిత్రంబులైన చిత్తరువులు గలిగి జూచుట కింపును సొంపును గలిగి, శోభాయమానంబుగా నొప్పు శృంగారింపఁబడిన లోపలి కొలువుకూటంబున నవరత్నములు చెక్కిన యందమైన సింహాసనముమీఁద నతనిఁ గూర్చుండఁజేసి. తక్కిన మునులకందఱకిని నుచితంబులగు పీఠములమర్చి మరల షోడశోపచార పూజనములుగావించి యంత నతనివలనను, మఱియుంగలుగు ఋషుల వలనను, నుత్తరువుపొంది యమధర్మరాజు మునిసమీపమునఁ దాను నొకపీఠంబుపైఁ గూర్చుండి, యామహానుభావుం డేమి యాజ్ఞాపించునోయని మాటకు కాచియున్న సమయంబున, శివభక్తాగ్రేసరుండైన

సానందమును యందఱువినుచుండ నయ్యమునింజూచి యిట్లనియె.

## సానందుఁడు యమునితో సంభాషించుట.

ఓయి సత్యవంతుఁడవును న్యాయవంతుఁడవునైన యమధర్మరాజా! నీశుభలక్షణంబులును, నీనీతియు, నీకీర్తియు, నీధర్మప్రభుత్వ పాండిత్యమును, గొప్పవారగు పెక్కండ్రు ఋషు లనేకపర్యాయములు మిక్కిలి వర్ణించిచెప్పుకొనుచుండఁగా విని నిన్నుఁజూచి పోవలయుననెడి కోరికమించి యిచ్చటి కిపుడువచ్చితి. నిన్నుజూచి నీమర్యాదయు, గౌరవమునుఁ, దెలిసికొనినంతట నేను ముందువిన్నంతకంటె నెక్కుఁడువిశేషలక్షణములు నీయందుగలవనితోఁచెను నీవుమిక్కిలి యోగ్యుఁడవు. గొప్పవాఁడవు. ధర్మరాజనుపేరు నీకు సార్థకమైనది. నీవున్యాయవంతులలో న్యాయవంతుఁడవు. సత్యసంధులలో సత్యసంధుఁడవు. పుణ్యస్వరూపుఁడవు. నీవుమాపట్లఁగనఁబఱచిన యాదరమునకును, నీవుకావించినపూజలుకును, సంతృప్తివహించితి. నీసత్కారములన్నియు, త్రిలోకరక్షకుఁడను, భక్తవరదుఁడుననగు, గౌరీవల్లభుఁడు కైకొనియెను. మావంటి వారినిఁ జూచినపుడు తిరస్కరింపక యాదరించి మర్యాదసేయుట మిక్కిలి యుత్తమలక్షణము, నీయందాలక్షణము పూర్ణముగాఁగలదు. మేలుమేలు. లోకంబున ప్రభువుల కొకసమయంబున దయయు, నొకసమయంబున కోపమునుఁ గలిగియుండుట వారిస్వభావము. యెక్కుఁడదయయు, నెక్కుఁడు కోపమునుఁ గలరాజు తప్పకచెడిపోవును, యెవనియం దెంత దయఁజూపవలయునో, యెవనియం దెంతటి కోపమునుఁ గనపరచవలయునో యది చక్కఁగానెఱిఁగి, తారతమ్యవివేచనాశక్తిఁగలవాఁడై, ప్రవర్తించు రాజు కీర్తివంతుఁడై, సుఖించును. నీవీధర్మంబుఁ జక్కఁగా తెలిసినవాఁడవు. కావుననే న్యాయంబుఁదప్పక నీసరివారగు దిక్పతులందఱును బొగడుచుండునటుల రాజ్యమును పాలించుచుండెదవు. అని యనేకవిధంబుల మెచ్చి పలికిన కాలుఁడు సానందుంజూచి అయ్యా! యిదేమి? మిక్కిలి యల్పుఁడనగు నన్నింతపెద్దఁజేసి పల్కెదరు మీరుచెప్పినన్ని మంచిగుణములు నాయందుఁగలుగునా? స్వామీ! నేనెంతవాఁడను? మాబోఁటివారిని నగ్గించుటఁ దమవంటివారి కుచితమా? యొకవేళ నాయందు

మీరు చెప్పిన లక్షణములలో నేదేనినొకటి కలిగియుండిన యది మీాద యావిశేషమునఁ గలిగినదేకాని యన్యముకాదు. శంభునింబోలు మిమ్ముఁజూచుటచేతనే మాయందుఁగల దోషంబులు పటాపంచలై మేము పరిశుద్ధులమైతిమి. సదా మీావంటివారిదర్శనము లభించవలయుననియే నేను కోరుచుందును. నా పుణ్యాతిశయంబున నేఁడు మిమ్ముఁ జూచుభాగ్యము చేకూరినది. పావనమూర్తీ! తమ పాదసేవకుఁడనైన నన్ను మీరు పొగడరాదు నేను చేసిన మర్యాదలయందును, పూజలయందును, నేను కనబఱచిన భక్తియందును, నేదేని లోపమున్న యెడల లెక్కసేయక దాసుఁడనగు నన్ను మన్నింపవలసినది. యిదియే నాప్రార్థన. మునీంద్రా! మఱియొకటి మనవిఁజేసికొనియెద. నింతదూరము తామేనిమిత్తమున దయచేసితిరో, నావలన నేదేనికార్యముగావలసినది యున్నదేమో యది తెలియకున్నది. నిమిత్తమును శలవిచ్చి నన్ను మన్నింపవలయునని వేడెద. కరుణానిధీ! యానతిమ్ము. అని యడిగిన చిఱునగవు తనర శమనుని తిలకించి యొక్కింత యోచించి సానందుఁ డిట్లనియె. అయ్యా! కృతాంతా! నిన్నును నీపురంబునుఁజూచిపోవ వచ్చితి. నిచటికరుదెంచుట కిదియేనిమిత్తమని యింతకుమున్దే చెప్పితినిగదా! యిపుడు మరల కారణమునడుగనేల? నిన్నుఁ జూచి కన్నులపండువుగా నీప్రభావముం గని సంతసించి తృప్తినొందితి నిఁకనపట్టణముకడకుం దిలకింపవలయుననెడి కోరిక యొక్కటి కొఱంతి యున్నది. మేము పురముఁ జూడఁబోవఁదలంచి యున్నారము. నీవును మావెంటవచ్చి యందందుఁగల విశేషంబులఁ గనఁబఱచి యెఱిఁగింపవలయునని కోరుచున్నాను. లెమ్ము పోవుదము. తడవుం జేయకుమని యెను. కాలునకా మాటలు వినఁగానే గుండెలు జల్లుమనియెను. నారదునిమాటలు తలంపునకువచ్చెను. మాఱుఁబలుకుట యతనికిఁ నోచకత్తఱంపఁదొడంగె. నేమైన నడ్డుఁజెప్పుదమా యని యోచించెఁగాని, యాయోచన యతనికంత తృప్తిగా నుండదయ్యెను. తానేకవెళనేదైన సలంకముంజెప్పినను ప్రయోజనము కలుగదని తోఁచెను. యింతదూరము తదర్థముగా వచ్చినవాఁడు చెప్పినమాత్రమున తనతలంపు మార్చుకొని యూరక వచ్చిన దారిఁ బట్టి పోవునా?

యొక్కఁడిమాటఁ;యది వ్యర్థప్రసంగము. నాబుద్ధికే మోసమువచ్చినది.
నారదుఁడు చెప్పినపు డాతని నే ప్రార్థించియుండిన నీశ్వరుని చెంతకుఁ
బోయి చెప్పి యేదో యొక యడ్డుఁగలిగించి యపాయము నివారించు
నటులఁ జేసియుండుదునుగదా! నే నాలాగు చేయనైతి. యిదియు నా
యవివేకము. సమయముఁ బోవిడిచి, యపుడుబలికిన బింకపు మాట
లన్నియు మరచి యిపుడు తలఁకిచింతించిన నిది యెఱింగిరేని
యందఱును నన్నుఁగని నా యవివేకమునకు నవ్వకుందురా?
కర్తవ్యమేమి? యీ మునివరుండడిగిన మాటలకు సమాధానము
నేమని చెప్పుదును? గొప్ప సంకటము సంభవించెనే! ఋషులు
సామాన్యులుగారు. త్రిమూర్తులనుఁగూడ మించినవారని చెప్ప
వచ్చును. వారిప్రభావమిట్టిదని పలుకుటకు సాధ్యముకాదు. వారు
తలంచిరేని నిమిషములో మిక్కిలి గొప్పదగు మేరు పర్వతమును
గడ్డి పోచ యంతటి తేలికఁగలదానినిగను, గడ్డిపోచను మేరు పర్వత
మంతటి బరువుఁగలదిగనుఁ జేయఁగలరు వారు తలంచిన చేయనేరని
దెద్దియు లేదు. చూచుటకు మిగుల దయఁగలవారుగాఁ దోచుచుండు
దురు. కాని కోపము వారికి ముక్కుమీఁదనేయుండును. సాధారణ
ముగా తాపసులు లోకంబున పరోపకారముం జేయుటకుం గోరుచుం
దురు వారు చేయఁదలంచినపనికి భంగముంగలిగించుట పాడిగాదు.
యేదేని యడ్డిఁజెప్పినఁ దటాలునశపింతురు పిమ్మట నేమిగతి? పూర్వ
మెందఱు ఋషులటులఁ జేయలేదు ? నాకుఁదెలిసిన వరకు నెంతి
మందియో కలరు. దేవేంద్రుని భోగభాగ్యములను నిమిషములో నొ
కఁడు సముద్రమునఁ గలిసిపోవునట్లుచేసెను. పెక్కు యజ్ఞములు
యాగములుఁజేసి లోకమున మిక్కిలి ప్రసిద్ధివడసిన యొకచక్రవర్తి
నొకడు కొండ చిలువయగునట్లు శపించెను. వేలకొలందిగల సగరుని
కుమారులను త్రుటిలో కంటిచూపుచే నొకఁడు భస్మముఁగావించెను.
రాజాధిరాజైన హరిశ్చంద్రుని నొకఁడు చండాలుని గొలుచునటు
ల నొనరించెను. మఱియు నెందఱో యెన్నెన్నియో పనులు గావిం
చిరి. యవి తలంచుకొనిన భయంబు బుట్టించుచున్నవి. మునులు
చల్లఁగా మాటలాడిన మాత్రమున సంతోషపడి వారిని నమ్మరాదు.

వారు చపలచిత్తులు. వారితో చెలిమి. నాగుబాముతో చెలిమిచేసిన విధంబగును. కావున నారదుఁడు చెప్పిపోయిన లాగున నేదేనియుపాయంబు నూహించుటమేలు. కాని యితనియొద్ద నాచాతుర్యము లేశమైన నుపయోగించునట్లు కనఁబడలేదు. యెట్లును నితఁడు తన యత్నమును మానునట్లుండలేదు. కానిమ్ము నేనతని యిష్టప్రకారము కొంతవరకును నడుచుకొని పిదప నేదేని యాటంకముఁ జెప్పి మోసపుచ్చి పంపెదను. యిదియే యిప్పటికిఁదగు యోచన. యని నిశ్చయించి, భక్తివినయంబు లెసంగ సానందునింజూచి, దేవరా! మీరు మాపట్టణముఁజూడఁ గోరుట మా యదృష్టముగాని వేరుకాదు. తమ యిష్ట ప్రకారము చేయ వచ్చును నేను తమవెంట వచ్చుటకు సిద్ధముగా యున్నాను. ఇదుగో! యిపుడే యందుకుం దగిన సన్నాహము గావించెదనని చెప్పి, దూతలం బిలిచి, మీరు వేగముగాబోయి సానందమునిశ్రేష్ఠులవారు పట్టణముఁజూడ వచ్చెదరనియు, పురము నందఱను నలంకరించ వలసినదనియుఁ జెప్పి. యన్నివీధుల యందునుఁ జాటించిరండని పనిచెను. తత్క్షణంబున నతని యాజ్ఞ ప్రకారమున

### యమభటులు సానందముని రాకను పురంబునఁ జాటుట.

భటులు పట్టణము కడకును చాటించిరి. పురవాసు లదివిని మహానుభావుఁడైన సానందముని దర్శనము తమకు లభించఁబోవుచున్నదని సంతోషభరిత మనస్కులై యొకరికంటె యొకరు మించి వివిధరీతుల తమతమ గృహంబుల నలంకరించిరి. యట్టి యలంకార మంతకుపూర్వ మెప్పుడునుఁ జేసినదికానిదై యుండెను. వాకిళ్ల కిరుపార్శ్వంబులను నరటిస్తంభములు నిలిపి, బంగారు కలశములెత్తిన యిండ్లును, గరుడపచ్చల తోరణములుగట్టి కస్తూరి కలయంపిఁజల్లి ముత్యాలముగ్గులు బెట్టిన యిండ్లును, చూచుట కెంతయు సుందరమైయుండెను. మఱియు, వీధులయందు చలువపందిళ్లు వేయఁబడి యచ్చటచ్చట నగరు సాంబ్రాణి ధూపధూమములు గమగమ వాసనలతో నెగయుచుండెను. సకలాలంకార శోభితులై యేయింటఁ జూచినను, స్త్రీలును, పురుషులును, బాలురును, బాలికలును సంతోషముతో మునీశ్వరుని రాక కెదురు చూచుచుండిరి. యేయింటఁ గనినను మృదంగ తాళశబ్దంబు

రాది వాద్యములు మ్రోయించుచు భక్తిరసము నిండారఁగా భగ వన్నామస్మరణ గావించుచు తత్సంబంధమగు పాటలుపాడి యానం దించు వారును నెందు గనుఁగొనినను, వివిధ మంగళ తూర్యధ్వని నాదంబులును, గలిగి మునీంద్రుని రాక కానందించి యాపురలక్ష్మి దేవతలను చూడ రమ్మని పిలుచు చున్నదో యనులాగున విలా సరవంబులు మిన్నుముట్టుచుండెను. ధ్వజంబులును, టెక్కెంబులును, ప్రకాశించు చుండెను. యేనుగులును, గుఱ్ఱములును, నొంటెలును, నలంకారయుక్తములై వీధుల బడిం దిరుగుచుండెను. యిట్లు సకల విధంబుల శృంగారింపఁబడి శోభాయమానమై యొప్పుటంగని కింకరు లావృత్తాంతమును యమధర్మరాజుతో విన్నవించిరి. యంత నంతకుఁడు ఋషివర్యునితో మీరింక వెడల వచ్చునని చెప్పి బం గారుతో చేయఁబడిన, నవరత్నములుపొదిగిన, యందమైన పావుకోళ్ల ను స్వయముగాఁదెచ్చియిచ్చెను. సానందుఁ డానందమునొంది వానినిఁ దనపాదంబులఁగీలించిలేచి పయనంబైన, శమనుం డతనికికైదండయొ సఁగి ధర్మప్రసంగుఁడు మొదలగు మునీశ్వరులును, చిత్రగుప్తుఁడును, మఱియుంగల మిత్రు లాదిగాఁగల సభాసదులును, కింకరులు మొద లగుపరివారంబులును,పరివేష్టించివచ్చుచుండ సభాకూటంబువెలువడి.

—— సానందముని యమపురంబుఁ దిరిగిచూచుట. ——

భేరీ,మృదంగ, కాహళ, పరవా,శంఖనిస్సాణాదిధ్వనులు సెలంగ తెల్ల గొడుగులుపట్టువారును, వింజామరలవీచువారును, బంగారుకఱ్ఱలఁ బట్టుకొనినడుచువారును, జయజయధ్వనులు కావించువారును, పొగ డువారును,చూడవచ్చి వీధులమూఁగిన పట్టణవాసుల నెడగలుగ నటు నిటుఁ బాయవడఁజేసి దారిఁ గలిగించువారునునై గజిబిజింబడుచుండ మెల్లమెల్లఁగాఁబోవుచున్న సమయంబున శమనుండా మునీంద్రునకు క్రమముగా నందందుఁగలవిశేషంబులు వివరించి చూపుచుండెను.తత్స మయంబున వాకిట నరుగులెక్కి నిలిచిచూచెడి వేదాధ్యయన సంప న్నులును, ధర్మవేత్తలును, పుణ్యవంతులును సమస్త శాస్త్రముల యందును మిక్కిలి నిపుణులైన బ్రాహ్మణులను, రాముని, పరశు రాముని, సవ్యసాచిని, మించిన శౌర్యవంతులును, బలాఢ్యులును,

వివేకవంతులును, నీతిపరులును, దానశీలులును, భోగభాగ్యములు గలవారునునగు క్షత్రియులును, కుబేరుని భాగ్యమునకన్నను నెక్కుఁడగు ధనకనక వస్తు వాహనంబులును, వజ్ర వైడూర్యాది నవరత్నంబులును, గలిగి ప్రసిద్ధివహించి ధర్మాత్ములై యొప్పుచుండు వైశ్యులును, దేవతలయందును బ్రాహ్మణులయందును భక్తిగలవారును, ధర్మపరులును, న్యాయమునందే బుద్ధిఁగలవారును, మంచియోచనఁగలవారును నైన శూద్రులును, పులిమీసములు పట్టి యూడఁబెఱికిఁ తేగలధైర్యబలయుక్తులును, కోరపంపుల క్రూరదంతములు పట్టి యట్టునిట్టులాగి గిరగిరం ద్రిప్పి విసరివేయుశక్తిఁగల జట్టీలును, మదించిన యేనుఁగులకొమ్ములపట్టుకొని ముందువెనుకకునూఁచి కూలఁద్రోయు బాహుబలముఁగల యోధులును, కోరసింగములతోకలను చేతులకు మెలిఁబెట్టుకొని లాఘవంబునమీఁదికెగరవైవఁగల శౌర్యవంతులును, బంగారుకడియములు, నందెలు మొదలగునవి తమకు బిరుదులుగాధరించి యెంతకైనఁజాలుదుమను వీరభటులును, గాలికంటెను, మనస్సునకంటెను. వేగముగా పరుగెత్తునట్టివియును, మంచిలక్షణములు గలిగినవియు, చక్కఁదనముఁ గలవియునైన గుఱ్ఱములును, దిక్కులయందుండు వానికన్నను గొప్పవియు, సుందరమైనవియు నగు నేనుఁగులును, బంగారుచే నిర్మింపఁబడిన చక్కనిశిల్పంబులు గలిగినవియు, నవరంజి స్తంభములును, మేలుకట్టు పెక్కులును, శోభిల్ల రత్నఖచితములై యొప్పుగలిగి కనులపండువుసేయు రథంబులును, వేడుకగా వేడుకకాండ్రతో సరససల్లాపములు సేయుచు నచ్చటచ్చటనిలిచి పూవుఁబొమ్మ మించు బోడలును, పలువిధములసొమ్ములుధరించి మేలైనపావడలు గట్టి సొగసుమించు సన్ననివస్త్రంబులు పైటవైచికొని తిలకంబుదిద్ది కాటుకరేఖలుదీర్చి నిడుపైన జడలమొదట పూవులదండలు కైసేసి, మట్టియలు నందెలు గజ్జలు మ్రోయుచుండ బంగారుబొమ్మలకైవడిఁ గానవచ్చుచు. మందగమనంబున దేవాలయంబులకుంబోవు బోగముపడుచులను నేలువేలుంజూపుచు. చిగురులవంటిపాదములును, పరిపొట్టలను బోలుపిక్కలను, నంటికంబముల వలెనుండు తొడలును, నిసుకదిన్నెల ననుకరించు పిఱుఁదులును, సింగమునడుమును సరిసేయు నడు

ములును, తంబచారగనుపించు పలుచని కడుపులును, కొండలవలె
తోఁచు గొప్పచన్నులును, తీగెల సొంపుమించు చేతులును, సంకువం
టి మెడలును, మెఱుగుటద్దముల తీరుగల లేఁజెక్కులును, దొండ
పండులాగున నొప్పు పెదవులును, ముత్తెములవంటి దంతములును,
చిలుకలకు సరియగు పలుకులును, తామర రేకులను మించుకన్నులు
ను, సింగణివిండ్లవలెనుండు కనుబొమలును, నువ్వుపూవున కెనయైన
నాసికయు, చంద్రబింబముఁబోలు ముఖంబును, శ్రీకారములకు
సమమగు చెవులును, తుమ్మెదగుంపును మరపించు ముంగురులును, ఇం
ద్రనీలముల కాంతి నతిశయించు. నిడుద వెండ్రుకలును, నక్షత్రములను
గెలుచు గోళ్లును, పగడపు తీగెలవంటి వ్రేళ్లును, నురుది బంగారునుబోలు
దేహములును, హంసలవంటి నడకలును, గలిగి యెక్కుడు చక్కఁదన
మును, చాతుర్యమును, తెలివియు, మర్యాదయు, దయ, దాక్షిణ్యము,
శాంతము, సంతోషము, తృప్తి, మంచిపనులయందు వాంఛ యిత్యాది
శుభలక్షణంబు లతిశయింప, సాధ్వీమణులన వన్నెవాసినిఁగాంచి మిం
చి, సకలాభరణములును, వెలఁగల వలిపెంపు పట్టుపుట్టంబులును,
కంచుకంబులును ధరించి తమయందంబునకుం దగినలాగున సంగరా
గాదులఁగై చేసి క్రొక్కారు మెఱుఁగులచాడ్పున నొప్పుచొప్పాల
కుప్పలగు కప్పురగంధులును గుంపులుగూడి చంద్రకాంత శిలానిర్మి
తంబులును, రత్నమయంబులును నగు నెత్తైన మిద్దెలు మేడలు గోపు
రము లు నాదియైన యున్నతప్రదేశంబులపై నిలిచిచూచి యానందించి
పూవులు దోగిలించి చల్లుచుండ, నెడనెడ పసిడిగోపురంబులును, వజ్ర
మయధ్వజంబులును, వివిధమణిశికర కల్పితంబులగు ప్రాకారమంటపం
బులును, గలవియు, నిరంతరము భక్తజనములు సేవించుచుండ నే
కొదువయు లేక, ధూపదీపనైవేద్య పూజావిధానంబులు కాలంబు
దప్పక జరుగుచుండు శివాలయముల నెఱిఁగించిన, నిమీలితనయ
నుండై యాత్మప్రదక్షిణ నమస్కారము లొనర్చి శంకరుని ధ్యానించుచు,
జనుచుండ సంయమికన్యయిట్లను "దేవా! ఇదిగో! చూచితిరా!
యది యజ్ఞయాగములు చేసి కృతార్థులైన సోమయాజుల మేడలు,
వానికవల స్పటికంబములు నిలిపి తోరణములు గట్టిచూచుట కింపు

యముఁడు సంయమికి పురవాసులవివరించి చెప్పుట.

గానుండునవి యన్నదానముఁ జేయువారి నివాసములు. వానితర్వాత నుండు మణిమయములై మెఱయునవి గురుభక్తిపరులుండు నిలయములు, వానివెంబడిఁగలవి సత్యవంతులుండు బంగారుమయమైన గృహంబులు, వానిచెంత నొప్పు రమణీయములైన పసిఁడి కలశములు నిలిపి యాకాశము నొరయునంతటి యెత్తుగలవి శివకేశవులను భేదమెంచక కొలుచుచుండు వారి గేహములు, వానిదాపున గలవి, నీతియుతులై దయఁగలిగి సకలజీవులను, దమవలెచూచువారును మిగుల ధర్మాత్ములునునుండు నివేశంబులు, మఱియు, నలంకరింపఁబడిన యేనుఁగులను, గుఱ్ఱములను, తేరులను, నందలములను, బల్లకులనునెక్కి సకలభోగంబుల ననుభవించుచుండునట్టివారందఱునుఁ బుణ్యపురుషులు, వీరెప్పుడును నిష్పరంబున వసించుచుండువారని దండధరుండు పలుకుచుండ మునికులమండనుండు సంతోషంబు మెండుకొన, ఘుమఘుమవాసనలు వెదఁజల్లు పూవుదండలఁ జేతఁబట్టి యటునిటు దిరుగుచు విక్రయించు బోటులతోటి సల్లాపంబులు నెఱపు విటచంద్రను, ధగద్ధగాయమానంబులగు శతనంబులఁ బ్రోవులు ముందిడుకొని క్రయవిక్రయంబులు నెరపు వర్తకులను, రథములను, యేనుగులను, గుఱ్ఱములనునెక్కి తిరుగుచు నెదురుగావచ్చు సత్పురుషులను, మేడలపైఁ జేరి కిటికీలనుండిచూచి సంతోషించుచున్న కాంతాజనులను, భక్తిరసము వెల్లివిరియ. శ్రుతియుక్తముగా గానముఁ జేయు భగవద్భక్తులనుఁ జూచి యానందించుచుం జనువేళ నప్పురంబునఁ గలి కప్పురగంధులా మునిచంద్రుని సాంద్రతేజో విశేషంబులుగాంచి మెచ్చి యతనిమహాత్త్వంబు నెంచి యాహా! ఈ మహనీయమూర్తి లోకంబులు సృష్టిఁజేయు పరమేష్ఠియో, ముజ్జగంబులను పాలింపకర్తయైన వైకుంఠపతియో, భువనంబులను నశింపఁజేయువాఁడైన సాంబమూర్తియో లేక హిమగిరికి మూలమైయుండు పరబ్రహ్మమో. కావలయు, సామాన్యులకింతటి ప్రభావ మెక్కడిది? యని యొకతెయు, హాలాహా, నేనుగుతోలును, శిఖయందు చంద్రుని, గంగను, పార్వతీదేవిని నందివాహనమును, సర్పహారములును, మూడవకన్నును, విషకంఠమును

లేడిని విడిచి మహానిరూపంబుఁదాల్చి విలాసముగా విహారముసేయు శంకరుఁడుగాని యన్యుఁడుకాదని యొకతెయు, నిట్లుపలువిధంబులవర్ణించి, శివభక్తి పరిపూర్ణుఁడును, నరకవాసుల నుద్ధరించుటకుఁ బూనిన వాఁడును, గురులకు భయభక్తి విశ్వాసవినయంబులు మీఱ సేవించు వాఁడును, మునీశ్వరులలో శ్రేష్ఠుఁడునునగు నితనిదర్శనము మనకు లభించుటవలన మనకోరిక లీడేరెనని సంతుష్టినిఁ జెందినవారై, యానందంబున మాటిమాటికి ముత్తెములును, బూవులును, నతనిపై జల్లుచుండి రపుడమ్మహానీయుం డనేకవీధులును, ద్వారంబులును, కొలంకులును, నారామంబులును జూచుచు దాటి కొంతదూరంబుచనిన యంతనంతకునిం గవింతపడి పాపరహితుఁడవైన యోసూర్యపుత్రా!

యమధర్మరాజు సాంగునకుఁ దనపట్టణ ప్రభావంబెఱింగించుట.

నీపురంబున నెందుఁజూచినను, మొదటఁగనిన లాగుననే భేదమేర్పడకున్నది చూచినదే మరలచూచుచున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. దీని కేమినిమిత్తము ? యిందేమో విశేషము గలిగి యుండవలయును, కాదేని యిట్టివిభ్రమమునాకుఁగలుగనేల ? యీమర్మంబు నెఱింగించి నామదింగల సందేహమునివారింపుము, అని యడిగెను సానందమహాని యివ్విధంబున నడుగుటయు, నతనికిఁ ధర్మరాజిట్లని చెప్పదొడంగెను.

మహాత్మా ! యిందలివిశేషంబు వివరించెదవినుండీపట్టణంబున నెల్లధర్మాధర్మంబులెఱింగి న్యాయమునుఁ దెలుపువారును, నకార్యములిట్టివనినిర్ణయించువారును, యేయేపుణ్య కార్యమునకేమేమిఫలమో యదియు, నేనేదుష్కార్యముల కేయేశిక్షయో యదియు నిశ్చయించు వారును, నగు మహాశ్రేష్ఠులగు సంయములుండుటంబట్టి దీనికి సంయమినీపురంబనెడి పేరుప్రసిద్ధికెక్కెను, ఈపట్టణం బిరువదియైదువేలామడలపొడవును నంతియె వెడల్పునుంగలిగి, యినుముతోడను, వెండితోడను, బంగారముతోడను నిర్మింపఁబడిన మహాబలీయములైన కోటలచే నొప్పుచున్నది. మఱియు నీకోటలకు తూర్పున మరకతమణులవలనను, పడమట బంగారువలనను, నుత్తరమున వెండివలనను, దక్షిణమున నినుమువలనను కట్టిన నాలుగు బురుజులు గలవు, నాలుగు బురుజులకును ముందుభాగమున నాలుగు గొప్పగొప్ప

గోపురము లున్నవి. పట్టణమున కంతకును, నూట తొమ్మిదివేలు ముఖ్యములగు వాకిళ్లుగలవు. వాని కన్నిటికి నన్ని రత్నమయములైన గోపురము లొప్పుచుండును, నన్నూట పదహారువేల రాజవీథులును, డెబ్బది యైదువేల శివాలయ ములును, నన్నియు విష్ణ్వాలయం బులును, గలిగి పదివేలకోట్ల బలవంతులగు వీరభటులతో గూడుకొని మహా విభవంబున రాజిల్లు నిందేవంకఁ జూచినను, శిల్పి కల్పనా చాతుర్యంబు వలనను, మదీయంబగు నేర్పాటువలనను నెంతయు భేదముగాన్పింపక నేకంబుగాఁ గనుపట్టుచుండుఁ గ్రొత్తగా జూచినవారు యిందలి వ్యత్యాసంబుఁ దెలిసికొనుట దుర్లభంబగు నిదిమహాత్ములగు మునుల ప్రభావంబును, ననుగ్రహంబునుం గాని మఱి యొండుగాదు. నాచే వర్ణింపఁబడిన పడమటి దిశయందుండు గోపుర ద్వారంబిచటికి సమీపముగా యున్నది. మీఁబోఁటివారు చూచుటకచ్చోటు యోగ్యంబై యుండుగావున నిపు డచ్చటికిం బోవుదమని సానందఋషివర్యునిఁ దోడ్కొని యాగోపురము వద్దికిం జనియెను, అపుడా మునీంద్రుని రాక నెఱింగి యచ్చటనుండు తేజోవంతులగు పురుషులు సంతోషమతిశయింప నతనికి నమస్కరించిన సానందుఁడు వారల నాదరంబునఁగని మీరెవ్వరని యమధర్మరాజునడిగిన నతండు, స్వామీ! వీరు ధర్మస్వరూపులు, లెక్కలేని సత్కార్యంబులుచేసి దేహాంతంబున కర్మదేహంబులు విడిచి దివ్యశరీరంబులు ధరించి సుకుమార దివ్యమంగళా కారులై, వజ్రవైడూర్య నీల గోమేధికాది రత్నముల కాంతులు వెదజల్లు వినోదంబులగు విమానములమీఁద నెక్కి నాదూతలు సకలోప చారములును, సేయుచుండ విద్యాధర కాంతలును, గంధర్వ స్త్రీలును నచ్చర మచ్చకంటులును నాడుచుం బాడుచు నుల్లాసంబుఁ గలిగింప భేరులు, మద్దెలలు, కాహళములు, శంఖములు మొదలగు వాద్యము ప్రోగుచుండఁ జనుదెంచి యీమహా గోపురంబుఁజొచ్చి యిచ్చట బంగారు మేడలయందును, బంగారపు టిండ్లయందును, బంగారపు మిద్దెల యందును, బంగారపు చంద్రశాలల యందును బంగారపు వేదికల యందును, వసించి, చల్లని నీటికొలంకుల కెలంకులయందును, పోక







౭౮-వ పుట.) యమధర్మరాజు సానందునకుఁ దన పట్టణప్రవే
శపెట్టించుట

తోటలు, నారింగతోటలు, తియ్యమామిడి తోటలు, ననటితోటలు, పనసతోటలు, పూవుతోటలు, ప్రబలిన ప్రదేశములు నందమైన పచ్చికబయళ్లు మొదలగు స్థలములయందు తమతమ యిచ్ఛవచ్చినట్లు చక్కని దేవతావనితలఁగూడి విహరింపుచుఁ గ్రీడింపుచు, చెడని, పదవిఁజెంది తృప్తిచహించి యుండుటకరనిన సానందుఁడు సంతసించి, ధర్మదేవా! వీరే యేపుణ్యకార్యంబులఁజేసి యిట్టి మహాభోగంబుల ననుభవించెదరు? చెప్పవేయనిన శమనుండతని కిట్లనియె. నయ్యా! వినుండు వీరు దారినడుచువారికి కష్టము గలుగక యుండులాగున

యమధర్మరాజు సానందునకు పుణ్యాత్ములుఁ చేసిన కార్యంబులఁ జెప్పుట.

నీటివసతిఁ గలిగింపఁబూని యచ్చటచ్చట దారుల వెంబడి కోనేళ్లు కట్టించియు, బావులు త్రవ్వించియు, చెఱువులు వేయించి యుప కారముఁ జేసినవారును, పెక్కుగోదాన, భూదాన కన్యాదానాదు లను చేసినవారును, సదాచార సంపత్తిగలిగి పర్వకాలములయందు పితృవులకు తర్పణంబులొసంగి స్నానము సంధ్యజపము మొదలగు విధులు తప్పకనడుపుచుండిన వారును, యుద్ధభూమియందు జడియక శత్రువుల నెదిరించి మేనుఁదొఱంగిన వారును, కష్టపడి న్యాయ ముగా ధనము సంపాదించి యాధనంబుతో ధాన్యమునుఁ గొని కఱవు కాలములయందు లాభమపేక్షింపక పడినిముంతగా తప్పు కొలతఁ గొలువక పేదసాదులకిచ్చి రక్షించిన వారును, పగవారి నైనను నొవ్వఁబలుకక యాకలిగొనిన వారికన్నపానము లొసఁగిన వారును, పెద్దలయందు భక్తిఁగలిగి వారిని సేవించుచుండిన వారును, గతిలేనివారి కష్టాలిచ్చినవారు మరల నివ్వనేరకున్న బాధింపక వారి నభివృద్ధిఁ జెందఁజేయఁ బ్రయత్నించి పాటుఁబడినవాడును, యేక పత్నీ వ్రతులును, భగవంతుని నిరంతరమును ధ్యానించు చున్న వారును, యెల్లపుడును భక్తియుక్తులై శివపూజఁ జేసినవారును, భాగవతము, స్కాందము, వారాహము ఈమొదలుగాఁగల పురా ణములను పారాయణము చేసినవారును విన్నవారును, జీవహింస చేయక సకల జంతువులును దమవంటివేనని భావించి దయాళువులై యుండినవారును, సదా పరోపకార చింతనులై ప్రవర్తించినవారును,

కొల్లాపురము, కుంభకోణము, వృద్ధకాశి, చిదంబరము, వారాణసి, గోకర్ణము,కంచి, కాళహస్తి, వేంకటాచలము, శ్రీశైలము, నహోబిలము, వరాహక్షేత్రము, శ్రీరంగము, రామేశ్వరము, నరుణాచలము, వేదాద్రి, జనార్దనము, వైద్యనాథము, మధుర, జంబుకేశ్వరము, మధ్యార్జునము మొదలైన మహాపుణ్యస్థలములకుఁబోయి వేల్పుల దర్శించి సేవించి కృతార్థులైన సజ్జనులును, గంగ, యమున, గోదావరి, కృష్ణ, పినాకిని, వైఘు,కావేరి,తామ్రపర్ణి, మొదలగు పావననదీ జలంబుల మహోదయము, నుత్తరాయణ, దక్షిణాయనములు, సంక్రాంతులు, సూర్యోపరాగ, చంద్రోపరాగములు, నీ మొదలగు కాలంబులయందు స్నానము గావించి పేదలకును బ్రాహ్మణులకును దానధర్మము లొనరించినవారును, యేజంతువైనను మంటలలోఁ జిక్కుకొని తప్పించుకొనఁ జాలక ప్రాణభీతిచే పరితపించు సమయంబున రక్షించినవారును, యేప్రాణినైననుఁ జంపఁబూనినపు డట్టి వారికి రొక్కమిచ్చిగాని మఱియే యుపాయము వలనఁగాని ప్రాణములు కాపాడినవారును, పాములవాఁడు పాములనుఁబట్టి వాని స్వేచ్ఛావిహారంబునకును తృప్తికిని భంగముఁ గలిగించి కష్టపెట్టుచున్నపు డతనికి ధనమిచ్చి పాములచెఱ విడిపించినవారును. యెండ కాలములయందు చెఱువులును గుంటలును వట్టిపోయి పశువులు నీరు దొరకక దాహమున నల్లాడు కాలంబునఁ బ్రీతిఁగలవారలై కుండలు బిందెలు మొదలగు పాత్రములతో బావులనుండి నీరుఁ జేది పోసి యాపశువులు మొదలగువాని దాహముఁదీర్చి రక్షించిన వారును, చిక్కువడి దారితప్పి యకాలములయం దింటికి వచ్చిన బ్రాహ్మణులకు తగిన యుపచారములు జేసి శయ్యనిచ్చి వారిదైన్యమును పోగొట్టి నట్టివారును, నొకరావిచెట్టును, నొకవేపచెట్టును, నొక మఱ్ఱిచెట్టును, పది చింతచెట్లును, మూఁడు మారేడుచెట్లును, నాలుగు మామిడిచెట్లును, నైదుశిరిక చెట్లును, మూఁడు వెలగ చెట్లును, నొక్కబావియుఁగల తోఁపులు బాటలవెంబడి నేర్పఱచి యెండ కాలములయందు చలిపందిరులు పెట్టి దారినడుచు వారికి నీరొసంగి దాహముఁ దీర్చినవారును, నట్టిధర్మ పరులకు సహాయ

పడి తమకుంగల ధనంబంతయు వెచ్చపెట్టినవారును, శిథిలములైన దేవమందిరములు, మంటపములు గోపురములు ప్రాకారములు చక్కంగాంగట్టించి పునరుద్ధారణంజేసిన వారును, ఇండ్లులేని వారి కిండ్లును, గుడ్డలు లేనివారికి గుడ్డలును, అన్నము లేనివారి కన్నము నొసంగినవారును, గుడులు చక్కంగాం గడిగించి ధూళిధూసరములు లేకుండంజేయించి శ్రద్ధయుభక్తియుం గలిగి సర్వేశ్వరుని నారాధించినవారును, శంకరునికి దాసీలై నాట్యముం జేసినవారును, దేవునికి గొడుగులు పడిగెలు, వాహనములు చప్పరములు తేరులు భూషణములుం జేయించి యొసంగినవారును, నంబరములర్పించిన వారును, గుళ్లయందుకాలముదప్పక దీపధూపనైవేద్య పూజాదులుజరుగుటకుం దగినయేర్పాటుం జేసినవారును, దేవునికి గొడుగులుబట్టియు తేరునీడ్చియు వాహనములమోసియు సేవం గావించినవారును, గయ ప్రయాగ మొదలగు స్థలములయందు పితృలకు తీర్థశ్రార్ధములుచేసి తృప్తినొందించినవారును, శరణుంజొచ్చినవారిని భయంబుందీర్చి రక్షించిన వారును, నూలివస్త్రములు రోమములతో నేసినశాలువలు, నుశిరిక కాయలు, జింకతోలు ఉప్పు, మంచము, మంచముమీందిపడక, యినుము, నూనె, మినుములు, బూడిద గుమ్మడికాయలు, చెఱుకుగడలు, సొమ్ములు, నెయ్యి, పండ్లు, బెల్లము, నీటితో నింపినచెంబులు, తాంబూలము, దాసి, మేకలు, మొదలగువానిని దానముంజేసిన ధన్యులును, యెల్లపుడును మోదుగువిస్తళ్లలో నన్నముందినుచు, నతిథులకునభాగ్యవంతులకునుమోదుగాకులలో నన్నముంబెట్టుచుండినవారును పులివాతంబడినగోవులను కాచినవారును, సత్యసంకల్పులై యుత్తములను గుర్తెఱింగి వారికి సకలోపచారములును సేయుచుండినవారును నైయున్న సత్పురుషులుకావున వీరు సకలసౌఖ్యముల ననుభవించుచున్నారు. అని మఱియుం గొన్నివిశేషములంజెప్పి, మునినాథా! యలదె యుత్తరగోపురంబుల. అదిగొ రత్నలమైన ధవళకాంతులు విలసిల్లకైలాసగిరివలె నొప్పుచున్నది మాముపుడుచటికింబోవుడమసన, సానందదయముంచిదని సమ్మతించెన, అంత వారచ్చటనుండి యుత్తరద్వారంబున కాపురప్రభావంబువలన నిమిషకాలములలో చేరిరి. యచ్చట

ననేకులు దివ్యాభరణవస్త్రమాల్యాంగరాగశోభితులైన సౌందర్యవతులైనస్త్రీలు సంతోషంబుగా విహరించుచుండి మహాత్ముండైన సానందునింజూచి నమస్కరించిరి వారికిని దీవించి యాతండీ యంగనామణు లెవరని యమధర్మరాజు నడిగిన నతండిట్లనియె. ఈ యోషారత్నములు మహాపతి

యముండు సానందునకు పుణ్యాంగనల వివరించిచెప్పుట.

వ్రతలై మెలంగి ప్రాణాంతకాలంబున తమతొంటిదేహంబు భూతలంబున విడనాడి దివ్యసుందర శరీరములు గైకొని వేలుపుల కర్హములైన పువ్వులును, గందములును, వస్త్రములును, సొమ్ములును, ధరించి మిక్కిలి కాంతిం గలవారై తేజరిల్లుచు. పుష్పకవిమానముల నెక్కి దేవతాంగనలు, గొడుగులు పట్టువారును, వింజామరలు విసరువారును, కోరిన వస్తువులం దెచ్చియిచ్చువారును నై సకలోపచారములను గావింప మహావైభవం బనుభవించుచుం దమ పతివ్రతా మాహాత్మ్యమువలనను, పుణ్యంబువలనను, దమ తమ పతులసద్గతిం జెందకుండులాగు కాచికొని యీమహాగోపురంబుం జొచ్చి యిచటనుండు, వెండితో గట్టంబడిన యిండ్లయందును, మిద్దెలు మేడలు మంటపములు మొదలగు వానియందన వారివారికిందగిన చోటులం గాపురము సేయుచు, తామరలచేతను కలువలచేతను. మిగులనందముగా రాణించునవియు, జలపక్షులు తుమ్మెదలు మొదలగువాని ధ్వను లతిశయించినవియు, నిర్మలములైన తియ్యనినీరుచే నిండియుండునవియు, చంద్రకాంతపు రాళ్లచే మెట్లు గట్టబడి యున్నవియు, చుట్టున నానాజాతి ఫలవృక్షములును, పూవు పొదలును నాటి వృద్ధిచేయంబడినవియు, నగు కొలంకులలో జలక్రీడలాడుచు, మెత్తని చిగురుటాకులు పువ్వులు పడకలుగాం జేసి వానిపైం బవళించుచు, ఘుమఘుమ యని పూవుల వాసనలు నలుదిక్కులకుం బ్రసరించుచుండ చల్లనినీడలు గలిగించు దట్టంపుకొమ్మలు గల పొన్నచెట్లు, పొగడచెట్లు, సంపెగచెట్లు, తియ్యమామిడిచెట్లును, పోకచెట్లు, టెంకాయచెట్లు, మొదలగు నితరములైన చెట్లనుగల వనంబులలో విహరించుచు, చిలుకలు, గోరువంకలు, కోకిలములు, నెమళ్లు, హంసలు, పావురములు, నాదియగు పక్షులు పలుకు పలుకుల కానందించుచు, పూవు పొదలలో వినోదంబుగా శయనించుచుం



(౭౨-వ పుట) యముడు సానందునకు పుణ్యాంగనల వివరించి చెప్పుట.

చలువ చప్పరంబులలోఁ గూర్చుండి యలసటఁ దీర్చుకొనుచు,
గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరు లాదిగాగల దేవతాజాతి యువతీ
మణులతో విలాసంబుగా మాటలాడుచు, పిల్లనగ్రోవులు, వీణెలు,
మొదలైన వాని నాదంబులకు సొక్కుచు, నామోదించుచు, తమ
ప్రాణవల్లభుల మదన క్రీడలవలనను, కౌగిలించుట వలనను, ముద్దు
లిచ్చుటవలనను, మోవి యానించుటవలనను, రతియందు బంధనై
పుణిఁ గనఁబఱచుటవలనను, మృదువులైన సరసభాషణంబుల వల
ననుఁ గరగించుచు, నిర్విఘ్నంబున నిచ్చోట శాశ్వతభోగంబు లను
భవింపుచుండుదు రనిన సంతసించి, యో యమునాభ్రాతా! యో
పాశహస్తా! వీరీ యేసుకృతంబులఁ జేసిరో వినుపింపుమని యడిగిన
శమనుఁడా యతిశిఖామణికి వారుచేసిన పుణ్యక్రియల నిట్లని చెప్పం
దొడంగె దేవా! పతివ్రతల మహత్త్వంబు మీ రెఱుంగనిది కాదై
నను నన్నడిగితిరి కానఁ జెప్పెదను, పురుషుఁడు మహాపాపియైన కతంబు
న మద్భటులు వానినడచిపట్టి బంధించి తెచ్చుటకు యత్నించు తఱి
నతనిభార్య తన పతివ్రతా మహాత్మ్యము వెల్లడియగునట్లు భర్త
నుదహించు చితియందతనితో నగ్నిఁజొచ్చిన యామె ప్రభావంబు
నకు తదీయపతిని డాయనోడి భటుల పరుగిడివచ్చిన యా సాధ్వీ
మణి పుణ్యంబు కతన దంపతు లిరువురును దివ్యవిమానారూఢులై
యుచ్చోటికిఁ జనుదెంతు రామెసుకృతంబువలన భర్తయు సుకృతి
వంతుఁడగు కావున పతిమృతిఁజెందినపుడు భార్య సహగమనంబుఁ
జేయుటకన్నను నుత్తమంబగు ధర్మంబు లేదని మీవంటిపెద్దలు సెప్పు
దురు. ఆలాగుసేయు పతివ్రతయొక్క భర్త పార్శ్వంబునఁ బదు
నాలుగు తరంబులవారును, తండ్రివంక నేడు తరంబులవారును, పునీ
తులై స్వర్గాదిభోగంబు లనుభవింతురు. అదియట్లుండె నిచ్చట
నుండెడి మచ్చకంటుల సుకృత విశేషంబులఁ జెప్పెద నాకర్ణింపుఁడు.
భర్తమరణించినపుడు వేదననొందక సఖులును, బంధువులును, నితర

యముఁడు సానందునకు పుణ్యాంగనల సుకృతవిశేషంబులు చెప్పుట

జనంబులును, బిడ్డలును, దుఃఖించుచుండ వారినందరిని నూరార్చి
శాంతచిత్తులఁ జేసి ధైర్యముతో పతిపాదంబులు మనస్సున స్థిరముగా

నిలిపి ధ్యానముఁ జేయుచు నతనితోఁ గూడి చితిపైఁ బరుండి శరీరమగ్ని కర్పించిన వారును, కలనైనను పతిమాట కెదురాడక యతనికిఁ దృప్తిగా భోజనంబిడి యతఁడు భుజించిన పిమ్మట శేషించిన యన్నమును హేయపడక భుజించియు, పరపురుషులఁ దలయెత్తి చూడక యొరులపైఁ గోపగింపక భర్త కెదురాడక కలకొద్దిలో నిష్టులను, బంధువులను, నతిథులను, నభ్యాగతులనుఁ, దృప్తిపఱచుచు, పతియిష్టంబుఁ దెలిసి నడుచుకొనుచు పనిలేక యూరుగు పొరుగిండ్లకుఁ బోక లోకంబున నందగునఁ బొగడులాగునఁ బ్రవర్తించినవారును, అత్త మామలను మగలను నన్నదమ్ములను, పెద్దలను, చిత్తము నొవ్వఁబలుకక సుగుణవతులై పతులకుఁ బ్రియంబులగు కార్యంబు లొనర్చుచు వారిని విలాస క్రీడా వినోదంబులఁ బరితృప్తి నొందించుచుఁ బ్రసిద్ధివడసినవారును, ప్రతి దినంబును భర్తలకంటె ముందు మేల్కొని కాల్యకృత్యంబులు నెరవేర్చి వారు మేలుకొన్నంత భక్తివినయంబులెసంగ వారికిఁదగిన సేవ లొనరించి సంతోషింపఁ జేయుచున్నవారును, పతులు పరదేశంబులకుఁ బోయినపు డలంకారములుమాని నిండుగా భుజింపక భూమిపై శయనించుచు కాలముఁ గడుపుచుండి వారువచ్చినపుడు యెదురేగి తోడితెచ్చి పదములు గడిగి సేదఁదేఱునటుల పానీయం బొసఁగి యుపచారంబులు నడిపి విశ్రమింపఁ జేసి వేగంబుగా మేలగున పదార్థంబులువండి, మజ్జనమున కుష్ణోదకములు సిద్ధపఱచి స్నానమైనంత ధౌతవస్త్రంబులు తెచ్చి కట్టనిచ్చి యుపచారయుక్తంబుగా భుజింపఁజేసి పడకనమర్చి వారుశయనించినంత దానుశీఘ్రంబుగా భుజించి యలంకరించుకొని చనుదెంచి పతులపాదంబు లూరువులపైఁ జేర్చి యొత్తుచు వారిప్రియంబునకు పాత్రులగునట్లు వర్తించి క్రీడావిశేషంబులఁదేల్చి సంతోషింపఁ జేయుచున్నవారును, పతులు సంతోషపడిన తాము సంతసించి పతులు దుఃఖపడిన తాము దుఃఖపడుచుఁ బతుల కష్టసుఖములు తమవిగా భావించియు, తన భర్తలకు మిత్రులైన వారియెడల మిక్కిలి మర్యాదయు, శత్రులయందు తిరస్కారబుద్ధియు గలిగియు, భర్తలాచరించు వ్రతంబులు భక్తితో తాము నాచరించియు, వల్లభుల యాజ్ఞలకుబద్ధులై వారు తమపై

కోపించినపుడసూయఁజెందక నలిగినపుడు మదిఁగరగించి యభిముఖ మనస్కులఁజేయుచు వారిపాదంబుల కడఁ బరుండుచు, నంటువడి నపుడు నాలుగవనాడు స్నానముఁజేసి మంచివస్త్రములఁ ధరించి తిల కంబుదిద్ది తొలుత వల్లభులఁజూచికాని యన్యులఁ గనకయు, విభుల యితరకాంతల మీఁద మరులొంది యున్నప్పుడు వారియం దసూయఁ జెంది పల్లెత్తుమాటయైన వెగటుఁగాఁబలుకక సత్ప్రవర్తనఁ గలిగి యున్నవారును, సరస్వతీ వ్రతము, లక్ష్మీ వ్రతము, గౌరీ వ్రతము, చారుమతి వ్రతము, విత్యాది సువ్రతములను నిష్ఠాభక్తియుతులై [illegible]
[illegible]
కడిగి తోరణంబులుగట్టి ముగ్గులు బెట్టియు పూజకు పుష్పంబులు దెచ్చి యిచ్చియు సేవఁగావించినవారును, మఱియు దేవార్చనకు గంధము దీసియిచ్చి మంగళహారతులమర్చి పాటలుపాడి భక్తిమీఱ ప్రదక్షిణ నమస్కారంబు లర్పించుచున్నవారునునై యున్న నారీ రత్నంబులని మఱియుం బెక్కువిశేషంబులు సెప్పి యటనుండి కదలి రత్నముల కాంతులచే దిక్కులు వెలిగించునదియు నాకాశంబు నంటు నంతటి పొడవుగలదియు మిక్కిలి యలంకారమైనదియునగు తూరుపు గోపురము వద్దకుం బోవుదమురమ్మనిశమనుం డమ్మునిందోడ్కొని చని యచట విహరించుచుండెడి పుణ్యపురుషులంజూపి మహాత్మా ! వీరలు మిక్కిలియోగ్యులు జ్ఞానముఁగలవారు వీరు మరణకాలంబున సకల మయిన వాంఛలును వీడ నిర్మలమును నిశ్చలమును నగు మనస్సులు గలవారలై బాధంబుల విముక్తిం జెంది కారణశరీరంబును విసర్జించి దేవత్వంబునొంది పావనదేహులై వజ్రవైడూర్య మాణిక్య పద్మ రాగాది మణులచే శోభాయమానమై యొప్పు హారములును, కిరీట ములును, కడియములును, కుండలములును, భుజకీర్తులును, ఉంగరము లును మొదలుగాఁగల సమస్తభూషణంబులును ధరించి వెలలేని పట్టు వస్త్రంబులుగట్టి కుంకుమపువ్వు, నత్తరులు, పునుగు, జవ్వాజి, పన్నీరు, మొదలగు వాసనవస్తువులు మిళితముఁజేయఁబడిన గంధంబు శరీరం బుల నలందుకొని ఘుమఘుమ తావులు గుబాళింప దేహకాంతులు

నలుగడలం బర్వ మిక్కిలి సంతోషముతో దేవతల వాద్యముల శబ్దం బు మిన్నుముట్టుచుండ గొప్ప మాణిక్యములం దాపిన యందమగు విమానంబులపై నెక్కి ఆకాశ మార్గంబున నిచ్చటికి వచ్చెడి వేళ నాగ కాంతలును, గంధర్వ భామినులును, యక్ష యువతులును, చారణ రమణీమణులును, కిన్నర సుందరాంగులును, వారి కెదురేగి పరిచర్యలు చేయుచుండ, యా యుపచారక్రియలకు మిగుల నానందంబుం జెంది నా చేత సత్కృతులై యా మహాగోపురంబుం జూచి యిచ్చోట మరకత మణులు మెట్లుగాఁ గలవియు, యింద్రనీలముల స్తంభములు గలవియు, ముత్యముల తోరణములు కట్టంబడియుండునవియు, చల్లని గాలి వీచునటుల వజ్రములతో వెడల్పుగా నిర్మించియుండు కిటికీలు గలవియు, చిత్రవిచిత్రములైన రతనంపు బొమ్మలచే నొప్పుచుండు నవియు, చంద్రకాంతపు రాలతోఁ గట్టిన యరుఁగులు గలవియు, తామరలచేతను, జలపక్షులచేతను, శోభిల్లుచుండు బంగారుమెట్లు గల తియ్యనినీరు నిండియుండు కొలంకుల చెంతఁ గలవియు, పార్శ్వంబుల నానాజాతి ఫలంపు చెట్లును, పూలచెట్లును గలిగి మిక్కిలి చల్లదనముతో నొప్పునవియు, నగు మేడలయందు వసించి దేవతా వేశ్యలతోఁ గూడి విమానంబులెక్కి విహరించుచు, సమస్త విధముల నిచ్ఛా భోగంబు లనుభవింపుచు, శాశ్వతానంద మగ్నులై యొప్పుచుండెదరు. అని చెప్పిన నానందమాని సంతోషమును నాశ్చర్యమును జెందినవాఁడై. దండధరా! వీరే యే పుణ్యంబుఁ జేసిరి వివరించి చెప్పుమని యడిగిన మార్తాండుని పుత్త్రుం డిట్లని చెప్పందొడఁగె.

### ⁂ శమనుండు సానందునితో పుణ్యపురుషుల సుకృతివిశేషంబులఁ జెప్పుట ⁂

స్వామీ! వీరిపుణ్య విశేషంబులు వినుండు. అరుణోదయంబున నిదుర లేచి శివనామ నామస్మరణంబును, విష్ణునామ స్మరణంబునుం జేసి, శివభక్తులను, విష్ణుభక్తులను దలంచి, పుణ్యతీర్థంబులను, కాశి మొదలగు పుణ్యస్థలములను, పుణ్యగిరులను, నుతించి సూర్యుఁడాదిగాఁ గల నవగ్రహముల ధ్యానించి, సత్పురుషులను పతివ్రతలను కొనియాడి సూర్యుఁ డుదయింపఁగానే దంతధావ స్నానాదికములు దీర్చి తమతమకు యోగ్యంబులైన నిత్యకర్మంబులు తప్పక నెరవేర్చి

యతిథులకును, నభ్యాగతులకునన్న దానధర్మంబు లొనర్చుచు, ధర్మపరులై యుండినవారు కొందఱును, మాఘమాసము, కార్తీకమాసము, పర్వతిథులు, గ్రహణకాలములు మొదలగు సమయములయందు తప్పక భక్తియుక్తులై స్నానమాచరించి భగవన్నామస్మరణఁ జేసి పేదలకును, సాధులకును ధానధర్మములు చేయుచుండినవారు కొందఱును, మనుష్యుఁడు భోజనముఁ జేయుఁడగిన ముప్పదిరెండుకబళములలో చంద్రునికళవృద్ధిక్షయము లనసరించి శుక్లపక్షమున ప్రతిపత్తుమొదలుకొని యొక్కొక్క కబళమ నెక్కువఁ జేయుచు, కృష్ణపక్షమున పాడ్యమిమొద లొక్కొక్కబళమును తగ్గించి యమావాస్యనాటికొక కబళముభుజించుచుండు చాంద్రాయన మనెడి వ్రతమునాచరించియు భూప్రదక్షిణముఁ జేసియు సకలపాపములవలన విడువఁబడినవారును, ఉపవాస వ్రతములొనరించి దేవతలనారాధించియు, వృద్ధులగు తల్లిదండ్రులకు సకలోపచారములును గావించుచు వారిచే దీవెనలందుచుండినవారును, సత్యముఁదప్పక స్త్రీలకులోఁబడి చెడుకార్యములుసేయక భగవద్భక్తిపరులై పేదలనాదరించుచు న్యాయమునందు దృష్టినిలిపి మంచినడవడికతో కాలమును కడపినవారును, గంగ, యమున, బ్రహ్మపుత్ర, గోదావరి, కృష్ణ, పినాకినీ, ప్రయాగ, వైఘు, కావేరి, తామ్రపర్ణి, మొదలైన నదులయందును, సముద్రజలంబులయందును, పుణ్యతిథులు, గ్రహణములు, మొదలగుకాలములయందు స్నానముఁజేసి దేవపితృతర్పణ బ్రహ్మయజ్ఞము లొనరించినవారును, యెల్లపుడును యేకాదశి, కృష్ణాష్టమీ వ్రతంబులును, శివప్రీతికరంబులగు సోమవాసరవ్రతంబును నియతిఁదప్పక యాచరించి శివకేశవులను, పెద్దలను బూజించుచుండినవారును, మఱియు, నియతిఁదప్పక, సూర్యనమస్కారములుచేసినవారును, శివునిగుడికిని, విష్ణుగుడికినిఁబోయి ప్రదక్షిణములుచేసి వందనము లర్పించుచుండినవారును, నవగ్రహజపంబులుచేసి దానంబులిచ్చినవారును, నశ్వత్థవృక్షమునకుఁ బ్రదక్షిణములుచేసి బ్రాహ్మణులకు, శోడశ మహాదానంబులు చేసినవారును, హరిహరుల కంకితముగా కృతులురచియించి యర్పించి కృతార్థులైనవారును, పరులను మంచిపనులుచేయులాగు పురికొల్పి తామును

ధర్మపరులై తామొరులకు చేసినదానముగాని, మేలుగాని యితరులతో చెప్పక పరమేశ్వరార్పణముగా నొంచినవారును, దేవకార్యములయందును, పితృకార్యములయందును, తమయింటఁజేసిన పదార్థము లన్యులకిడక, తక్కిన దినములయందు జేసిన పిండివంటలు మొదలగు పదార్థములను యోగ్యులకుఁబెట్టి కాని భుజింపనివారును, అలేఖములుగట్టియదు. రామాయణము, శివపురాణము మొదలగునవి స్వహస్తమునవ్రాసి బ్రాహ్మణుల కుచితముగా నర్పించినవారును, కత్తియములు. నుంగరములు హారములు, పట్టువస్త్రములు, శాలు [illegible] పెద్దలకొసఁగి [illegible] పట్టినవారును. [illegible] క్రమముగా [illegible] జేసినవారును, విఘ్నేశ్వర, సరస్వతీ, లక్ష్మి, గౌరీ, మహామంత్రంబులును, నారాయణమంత్ర పంచాక్షరీ మంత్రంబులును, శ్రద్ధాభక్తులుగలిగి జపముఁజేసి శీఘ్రతర్పణ, హోమాదికములకు విధులు నిర్వర్తించిన ధన్యులును, కుతపకాలమనగా మధ్యాహ్నము పదునేనుగడియలకు మీఁద కొంతసేపు వాకిటనిలిచి యతిథులెవరైన వచ్చెదరాయని కాచియుండి యెవరేని వచ్చినవారికి ప్రదక్షిణ నమస్కారము లాచరించి తోడ్కొనిపోయి పదంబులుగడిగి తనపంక్తిని గూర్చుండఁబెట్టుకొని కలిగినంతవట్టుఁ దృప్తిగాఁబెట్టించి తాము ను గుడుచుచుండినవా పరకాంతలను, తల్లులవలెను, తోడఁబుట్టువులవలెను భావించుచుఁ, బరులకలిమికి సైఁపలేక వారికి చెఱుపుఁ గలిగించుటమాని, తమకుఁ గలిగినంత వరకుఁ దృప్తిఁ గలిగి, యత్యాశ విడిచి, యున్నంతలో పరుల కుపకార మొనరించుచు సదాసంతోషముతోనుండినవారును, నైన మహాపుణ్యధనులు. వీరుచేసిన మహాసత్కార్యంబులింక నెన్ని యోగ్యంబు, వీరివృత్తాంతం బిట్టిదియని చెప్పి యముఁడు వెండియునిట్లనియె మునీంద్రా! మీరు కోరినలాగున

యమధర్మరాజు సానందుని పాపాత్ములం జూడరాదని చెప్పుట.

నాపట్టణమునందుఁగల నాలుగుదిక్కుల గోపురములో, తూర్పు, పడమర, యుత్తరములయందలి గోపురములును, నందుఁగల విశేషంబులును, నందుండు పుణ్యపురుషులను, పతివ్రతలనుఁ జూపితివి

గదా ! యింక దక్షిణ గోపురంబు కొదువయున్నది. కాని యది మీవంటివారు చూడఁదగినదికాదు, అందు మహాపాపము లొనరించుటవలన నాచేశిక్షితులై నానాబాధలు ననుభవించు వారుండెదరు. అట్టిఖలుల మీవంటి పావన స్వరూపులు చూడరాదు, కాన మన మింక మరలుదము, అస్థలము మిక్కిలి భయంకరమైనదియు, చొచ్చి పోవుటకు కష్టతరమైనదియు, మహా దుఃఖకరమైనదియు, చూచి సహింపరానిదియు, మనస్సున కసహ్యముఁగా నుండుటయు, చూచుటకుఁగాని, వినుటకుఁగాని, యర్హము గానిదియునై, బ్రహ్మహత్య, స్త్రీహత్య, శిశుహత్య, భ్రూణహత్య, గోహత్య, మిత్రద్రోహము, చేసిన మేలు మఱచి యపకారము చేయుట, వేదనిందచేయుట హరిహరాది దేవతలను దూషించుట, వేశ్యాగమనము, పరకాంతాగమనము, కల్లుద్రాగుట, జూదమాడుట, స్వామి ద్రోహముఁజేయుట యీ మొదలుగాఁగల చెప్పరాని, చూడరాని, తలపరాని, ఘోర పాపములు చేసిన దుర్మార్గులచ్చట, నానాబాధలు పడుచుండుదురు. అట్టివారియొద్దకు మిమ్ముఁదోడుకొని పోవుట నాకుయుక్తమని తోఁచకున్నది. సంయమీంద్రా ! మీరింక మరలిపోవుట కనుమతించుట మంచిదియని చెప్పిన సానందుం డలఁతి నవ్వునగి యోదండధరా ! మంచిమాటలు చెప్పితివి. ఇందుకు నేను వెఱచువాఁడఁగాను, నాకు సుఖమును దుఃఖమును సమానమైనవి. లోకంబున నెవ్వఁడు మంచి చెడుగులు రెంటిని సరిగానెంచక, సుఖము కలిగినపుడు సంతోషించి కష్టము వచ్చినపుడు పరితాపము పొందునో, యతఁడు నీతిలేనివాఁడు, అట్టివాఁడు తప్పక నరకమునకుఁ బాత్రుఁడగును, మాఁబోటివారు సర్వసమత్వమును పాటింపవలయును, ఇదియే సత్పురుష లక్షణము, నన్ను లేనిపోని యడ్డుమాటలుచెప్పి, వెఱపింపకుము నేను తొలుత నేమి సంకల్పించితినో, యా కార్యమును పూర్ణముచేయక విడచువాఁడను కాను, యెవఁడు పూనినపనిని కడముట్టింపక నడుమ విడుచునో, యట్టివాఁడు తెలివిలేనివాఁడను, యత్నించిన కార్యఫలముఁ జెందలేనివాఁడును, నగునని పెద్దలు చెప్పుదురు. కావున నోధర్మ స్వరూపా ! నాయత్నమున కాటంకముఁ గలిగించుటవలన బ్రయో

జనములేదు. విఘ్నములు చెప్పక యాదక్షిణ గోపురమునకుఁ బ్రయాణము సాగింపుము. నేనదియునుఁ జూచి తలంచిన పనిని పూర్ణముగా నిర్వహించిన వాఁడనయ్యెదను ఆగోపురమునుఁ గూడఁజూడ వలయునని నాహృదయము నన్నుఁ ద్వరబెట్టుచున్నది. ఆలస్యము చేయకుమని చెప్పెను. ఇట్లు సానందుఁడు పట్టువీడకుండుట తనలో యోచించి, నారదుని మాటలు తలంచి, యింకేమి సేయవచ్చు నిమ్మునివరుఁడు పట్టువీడకున్న వాఁడు యెట్లును నితఁడచటికిఁ బోక మానఁడు నేనొకవేళ నింకను నొత్తిచెప్పి, యేదే విఘ్నములు గలిగించి నేని తటాలున కోపముఁజెంది శపించిన పక్షమున నేమి గతి. కావున నేమైననయ్యె నితని యిష్టానుసారముగాఁ బ్రవర్తించుటయే మంచిది. యని నిశ్చయించి ఋషిమండల మండనుండగు సానందునిఁజూచి మిక్కిలి వినయముతో నిట్లనియె దేవా! నేను చెప్పిన మాటలను తప్పుగాఁ దలంపకుఁడు. నేనిటులఁబలుకుటకు రెండుకారణములు గలవు. తటాలున మిమ్మచటికిఁ దోడ్కొని పోయిన నచ్చోట జరుగుచుండు దుఃఖకరమైన కృత్యములుచూచి మీరేమి కోపగింతురోయను సందేహము పొడముట మొదటి కారణము, చూడరాని యాపాపస్థలమునుఁ జూచుటవలన తమకేదేని కీడు సంభవించునోయని తోఁచుట రెండవకారణము పై రెండు విధములను దలంచి యచటికి పోవుట యోగ్యము కాదంటిని. కాని మఱియొండభిప్రాయముతో చెప్పిన వాఁడనుకాను మన్నింపుఁడు. చెప్పవలసిన మాటఁజెప్పితి. మీకుసమ్మతమేని పోవుదమనియెను. సానందుఁ డతనిమాటలయం దించుకయైన నాదరమునుంచక తనయత్నము ప్రకారము జరుపఁదలంచి, కృతాంతా! ఇంక మారుమాటఁ బలుకక యానోటికిం బ్రయాణమగుము. నీవు చెప్పిన కారణములు రెంటితోడను నాకు సంబధములేదు. నేను భయమొందుటగాని కీడు నొందుటగాని, కోపము వహించుటగాని కలుగదు, కైలాసపతియగు శంభుఁ డన్నిటికిని కర్తయైయున్నవాఁడు. అతని నమ్మి భజించువారికి, యే చెఱుపును గలుగదు, భయము శివభక్తులకు కలుగనే కలుగదు. వారికి కోపమనుమాట కలలోనైనను లేదు. వారు సర్వసములు,

(౮౧-వ పుట.) సానందుఁడు నరకములను నరకవాసులను చూచుట.











నేనును పరమేశ్వరుని నమ్మినవాఁడను దేవదేవుండగు వామదేవుని కరుణవలన నాకన్నియు శుభములే యగును పోవుదముపద. యని పయనంబయ్యెను. అంత మున్ను వెంట వచ్చుచుండిన వారందఱును వెంటవచ్చుచుండ శమనుఁడు దారిఁజూపఁగా వెడలి యినుముతోఁ దృఢముగాఁ గట్టబడియున్న భయంకరమైన దక్షిణగోపురము వద్దికిఁ బోయిన వాఁడాయెను. అంత శమనుని యుత్తరువు ప్రకార మచ్చటఁ

## — సానందుఁడు నరకములను, నరకవాసులను చూచుట. —

గాచియున్న భటులా గోపురద్వారమును బంధించియున్న తలుపులను, భోరనఁదెఱచిరి. భయంకరులగు కాలకింకరుల యరపులును, పాపాత్ముల హాహాకారంబులతోఁ గూడిన రోదనధ్వనులును మిన్నుముట్టు లాగున నుండు ఘోషయచ్చటికి వినవచ్చుచుండెను అపుడంతకుఁడు మునివరునింజూచి అయ్యా! మీరీఘోరంబగు స్థలముఁ జొరనెంచుట నాకాశ్చర్యముగా యున్నది. యనిన సానందుఁడు పదములు తొట్రుపడ పాపుల యార్తనాదమునకు మనసు సంచలింప పినాకహస్తుని నాత్మగతంబున సంస్మరింపుచుం గొంతదూరంబరిగి నంత నా భాస్వంత పుత్త్రుఁడు, మునిశ్రేష్ఠా! యిచ్చటి వారిస్థితి నెప్పెద వినుండని యిట్లనియె. యీగోపుర ప్రదేశము యినుప ప్రాకారముతోఁ గూడినదియు, నమోమయంబునునై యుండునని మీకు మున్నే చెప్పియుంటినిగదా! దీని వెడలుపు నాలుగులక్షల యామడల దూరమును, నంతియు వెడల్పునుఁ గలిగియున్నది. యిందు, రౌరవము మొదలగు మహా భయంకర నరక ప్రదేశములు లెక్కకు మిక్కిలిగా యున్నవి, భూలోకంబున దుష్టచిత్తులైన మానవులు మహాపాతకములు, నుపపాతకములుచు, చేసి కడపట నఁగా ప్రాణావసాన కాలంబున, కర్మశరీరంబులు విడిచి, ప్రేతదేహంబులు ధరించి, యంతట, నవియుఁగూడ వదలిపెట్టి యాతనాదేహంబులు గైకొని, నాయొక్కకింకరులు తోడుకొని వచ్చునపుడు, మార్గంబునఁ బెట్టునానా బాధలు ననుభవించుచు వచ్చివచ్చి దాహకడ్డముగా నుండునదియు, కరఁగినయుక్కునీరు దగదగమండుచు పాఱుచుండునదియు వెడల్పు గలిగి చూచుటకు భయంకరముగా నుండునదియునగు, 'వైతరణి,

యను పేరుఁగల మహానదిని దాటఁజాలక నల్లాడుచు కింకరులు బలవంతముగాఁబట్టి యందుఁద్రోసిన, నార్చుచుఁ బెడబొబ్బలుబెట్టి యేడ్చుచు, నానదియందుఁ బడి మునుగుచుం, దేలుచు, నీదుచు, మిక్కిలి కష్టపడు చుండఁ, గొంతకాలమునకు నాయుత్తరవునుఁ గైకొన్నవారై, దూతలు వారల వెలికి నీడ్చి యిచ్చటికిం దెచ్చి యిచ్చోటనుండు, సేనాధిపతులును, కావలి కాండ్రును, మొనగాండ్రునుఁగూడి వారలఁ బెట్టుబాధలు చెప్పుటకును, చూచుటకును, తలంచుటకును, సాధ్యముగానివై యుండును. సకల జంతుకోటులును, నాభటులవలన నిట్టికష్టములు నిరంతరము ననుభవించుచుండుదురు. తాపసోత్తమా! ఇచ్చోటనుండు విశేషంబిదియే! అని యమధర్మరాజు సానందునకు నరక విశేషములు వివరించి చెప్పుచుండ, తమ దొరయగు కృతాంతుఁడును, తపోనిధియగు సానందమునియుం, దముచేయు కార్యములఁజూడ వచ్చుచున్నారని యెఱింగి వారిముందు తమతమ నేర్పును, కార్యములయందు తమకుగల శ్రద్ధయుం గనపరచి వారిచే మన్ననఁ బొందవలయునని యుద్దేశించి యమభటులు భయంకరముగా పాపాత్ములపైఁగవిసి, కొందఱిని పదములకు పగ్గములు కట్టి అసిపత్రవనమను కత్తుల యాకులుగల చెట్లయొక్క నేల జీరాడుకొమ్మల నడుమనుండి దేహము తెగి చీలి మాంసమును నెత్తురును వెడలివచ్చులాగున, నివలి కావలికి లాగువారును, కొందఱిని కాలిన బండలమీఁదఁ బడవైచి కాళ్లుపట్టుకొని వస్త్రములవలె యుతుకువారును, కొందఱిని గుదియలుపట్టి యెముకలు పొడిపొడియై చెదరిపోవులాగునఁ మోదెడివారును, పదునుగల వాడిసలుగొని కొందఱిని చెక్కి కాచిన నారసములు చెవులయందును, ముక్కులయందునుఁ జొనిపి బాధించువారును, కొందఱి నినుపరోళ్లలోఁ బెట్టి నలియునట్లు బలువులైన యిరుకురోకళ్లతో పొడుచువారును, కొందఱిని గానుగలలోఁజొనిపి దేహములు ముద్దగు తెఱఁగునఁ ద్రిప్పువారును, కొందఱికి సానఁదీరిన కత్తులతో నాలుకలు గోయువారును, కఱుకు ఱంపములతో కొందఱి తనువులను కోయువారును, కొందఱి మెడలకుఁ గాలిన గాలములనుఁ దగిలించి వ్రేలఁగట్టి చర్మంబు లొలుచు

వారును, పొడవైన యినుపకొక్కులమీఁదఁ గొందఱిం బట్టి దిగవేయు వారును, కొందఱి కండ్లు గోరు గోలలతోఁ దీసివైచి యుప్పును, కారమును, మెత్తువారును, గనగనమండెడి యినుప కంబములకుఁ గొందఱి నంటఁగట్టువారును, కొందఱిని బెబ్బులులవాతఁ బడవైచు వారును, కొందఱిని సర్పములచేతను, తేళ్లచేతనుఁ, గఱపించు వారును, కొందఱిని మదించిన యేనుఁగులచేఁ ద్రొక్కించు వారును, కొందఱిని చీకటి కూపములలో పడవేయువారును, కొందఱి నినుప ముక్కుల కాకులచేతఁబొడిపించియు, కొందఱిని గండు కణుజులగములచేఁ గుట్టించియు, చెడు పిశాచములచే కొందఱి నెత్తురునుఁ ద్రావించియు, నలుచువారునునై నానాబాధలు బెట్టుటయు, నాశోతలకును, నాఁ ద్రేటులకును, యాపోటు కును, కాలకింకరులు పెట్టుచున్న యితర కష్టములకును నోర్వఁజాలక యా పాపాత్ములయ్యో! కుయ్యో! మొఱ్ఱోయని మొత్తుకొని మిక్కిలి దీనాలాపంబుల యమభటుల మన్నింపుఁడని ప్రార్థించుచు తాము భూలోకంబునఁజేసిన పాపకృత్యములను దలంచుకొని పశ్చాత్తాపంబున, పార్వతీ పతియైన శూలిని ధ్యానింపమైతిమి, దేవతలఁ బూజింపమైతిమి, పంచాక్షరి మొదలగు మహామంత్రములు జపింపమైతిమి, సర్వేశ్వరుని సేవింపమైతిమి, శివపురాణమును, శివకథలును, విష్ణుపురాణమును, విష్ణుకథలునుఁ, జదువమైతిమి, వినమైతిమి, శివకేశవుల యాలయంబులకుఁ బోయి యొక్కనాఁడైనను భక్తితో మ్రొక్కమైతిమి, విభూతినలంది రుద్రాక్షదండలు ధరించి గౌరిదేవిని దర్శించి శంకరు నారాధింపమైతిమి, కటకటా! మత్తులమై యొకలేనియు మంచి కార్యమునుఁ జేసిన వారము కామైతిమి, మనకపుడు నేటి యమబాధలు తోచవయ్యెను. యెవరైనఁ దెలిసినపెద్దలు మంచిదారింజూపిన, వారిని తిట్టి వెక్కిరించితిమి. తత్ఫల మిపు డనుభవించుచున్నారము. మనలఁ దయఁ [illegible] రక్షించు పుణ్యాత్ము లిచ్చట నెవ్వరున్నారు? ఉండినను మహా [illegible] ము లొనరించిన మనపై నెవరికేనియు నేల దయగలుగును? ఈబాధ లెంతకాల మనుభవించవలయునో కదా! మనకా కాలంబున [illegible]టి దర్బుద్ధి యేల బుట్టవలెను? శివకథలు విననొల్లని వారి చెవులలో

ఱెుట్టఁగా కాలిన నారసములఁ జొప్పించుచున్నారు. భక్తియుక్తులై దానధర్మములు సేయని వారి చేతుల తునుకలు తునుకలుగాఁ దెగఁ గొట్టుచున్నారు. పుణ్యస్థలములకుఁ బోవ నిష్టపడకుండినవారి కాళ్లు అంపములతోఁ గోయుచున్నారు. మున్ను భగవంతుని ధ్యానించి స్తుతించుట విడిచి సాధువులను పెద్దలను దూఱిన వారి నాలుకలు వాడి కత్తులతో కోయుచున్నారు. మఱియు నేయే పాతకము నొనరించిరో యందునకుం దగిన శిక్ష వారివారికిం గావించుచున్నారు. మన మిపుడు దుఃఖించుచుండిన నేమి ప్రయోజనము గలదు ? అనుభవించకఁ దప్పునా ? యని యొండొరులు చెప్పుకొని వాపోవుచుండ యమదూతలు వారిమాట లాలించి యో కర్మచిత్తులారా ! ఇల్లు గాలుచుండఁగా బావిఁ ద్రవ్వ నారంభించినలాగున మున్ను తెలివిలేక చేయరాని కార్యములు చేసి యనుభవమునకు వచ్చినపుడు చింతించిన ఫలమేమి ? ఛీ! ఛీ! నోళ్లుమూసుకొనుఁడు. అదిగో! మహారాజుగారు వచ్చుచున్నారు వారు మీ ప్రలాపంబులు వినిరేని మిమ్మింత యజాగ్రతగా యుంచి యున్నందుకు మమ్ము శిక్షించును. మీవలన మేమేలకష్టముల పాలుగావలయును? మీయందు మోమోటముగాని, కనికరముగాని మాకుగలుగనేరదు. మిమ్మింకను నెక్కుడుగా బాధింతుముగాని విడువము, మీప్రసంగ మింతటితోఁ జాలింపుఁడని గద్దించి వారలఁ జుట్టుకొని పెడబొబ్బలుబెట్టి యార్చుచు, పిడికిటి పోటులచేతను, వాడియగు బాణములు మొదలగు నాయుధములచేతను నొప్పించం దొడంగిరి. యప్పటి యమకింకరులు చేయు మహోపద్రవము వర్ణింప నలవిగాకుండెను. ఆబాధలకు తాళజాలక దీనులగు పాపులు సేయు రోదనధ్వనులు మిన్నుముట్టుచుండెను. తత్ప్రకారం బంతయుం జూచి సానందమునిచంద్రుఁడు శమనునింజేరి యిట్లనియె నయ్యా ! యమధర్మరాజా! నీభటులు నిర్దయామతులై బాధపెట్టుటకు సైరింపలేక

సానందుఁడు పాపాత్ముల బాధలుచూచి యోర్వజాలక కృతాంతుని నాక్షేపించుట.

ప్రార్థించి ప్రార్థించి యేడ్చుచుండెడి యీజీవులం జూచుచు, నిసు

మంత్రైనఁ గనికరించి, యింకఁ జాలింపుఁడని పలుకకున్నాఁడవుగదా! ఆహా! నీహృదయం బెంత కఠినమైనదనవచ్చును? ఇంతనిష్కరుణునకు ధర్మరాజను పేరెటులఁగలిగెను? ఇదిధర్మకార్యమా? శివశివా! యెంత ఘోరము యెంత ఘోరము. ఇట్టి కఠిన మానసుఁడవగుట వలననే నీకీ ప్రభుత్వ మబ్బినది. ఈదారతనము నీవంటివానికే తగునుగాని మఱియన్యులకు తగదు. నీచిత్తమయోమయంబైనదని నేనెఱుఁగ నైతిని. నీవంటివానిని నేనెందునుఁ జూచినది లేదు. ఈయకృత్యములు నీకుం దగినవిగానే యున్నవి ఇవి ధర్మలక్షణములు కావు. దొరవగు నీవువచ్చియుండి నీవుచూడఁగనే నీకింకరులు చేయు విపరీత శిక్షలను జూడుము. యిసీ! యన్యాయ మన్యాయము. యిట్టి నీతి విహీనుఁడ వగు నీతో నింక భాషింపరాదు. ఛీ! శమనా! నీ ధర్మ పరిపాలన ప్రకారముఁ దెలిసికొంటిని. నెంతదృఢమనస్కునకైనను నీ దీను లగు జీవుల మొఱవినిన హృదయము కరఁగకుండునా? చాలుఁజాలు. పేరునకుందగిన గుణంబులు లేకున్నవి. యని తిరస్కరించిపలికెను. అతని మాటలకంతకుఁడునవ్వి, అయ్యా! శాంతము వహింపుము. నేన ధర్మమునఁ బ్రవర్తింపలేదు. న్యాయముగానే చేయుచున్నాను, చేయించుచున్నాను. ఇట్లుచేయుట నాకువిధి. వీరికి నేనువిధించిన శిక్షను నేనే వలదని చెప్పదగునా? వీరికినావలన విధింపఁబడిన శిక్షయుక్తము గానే యున్నది. గాని యధికముగాదు. వీరుచేసిన పాపము లనంత ములు. వీరిముఖముఁ జూచినవారికిం గూడ పాపము సిద్ధించును. అయ్యా! మీరు పెద్దలు సకలమగు మంచిచెడుఁగులుఁ దెలిసినవారు. శివుని వరమువలనఁ గలిగినవారు మఱియు మాకుగురువులు. మీరు మాయందేదైనను తప్పు గలిగినను, మేము చేయుపనుల యందే దేనియు, పొరబాటుండినను, మన్నించి చక్కఁజేయ వలసిన భారము మీయందున్నయది. గాని, యిపుడు తాముసెలవిచ్చిన మాటలలో దేవర నుంతి పొరఁబడినట్లు తోచుచున్నది లేకున్న నన్నివ్విధంబునఁ జులకఁజేసి వచియింపరు. దుర్వర్తనులగు యీ పాపకర్ములు బాధ లకు పడఁజాలక మొఱఁబెట్టుట నాలకించి దయాస్వరూపులగు మీకు మనసుకరఁగి యీలాగు చెప్పితిరి. కాని యన్యాయముకాదని భావించెద.

నాయందును నాకార్యములయందును నించుకైనను, నక్రమము గలుగదు. మీరు బాగుగా యోచింపుఁడు. అని చెప్పెను. యముఁడీప్రకారముగా ధైర్యముగాఁ జెప్పినమాటలువిని, యొక్కింతసేపు యోచించి తలయూఁచి సానందమౌని యతనింగని వైవస్వతా! నీ వివ్విధంబున నాకు సమాధానముఁ జెప్పుచున్నాఁడవు. మంచిది. కాని ఆలాగేని వీరిలో నెవఁడెవఁ డేయేపాపకార్యము నొనరించెను? ఆపాపములకు నీవు వీరికెట్టి శిక్షలను విధించితివి? వివరింపుము ? అని యడిగెను. ఆలాగడిగినమునికి శమనుండిట్లని చెప్పఁదొడంగె. ఓ మునికుల సార్వభౌమా ! తమ యానతిచొప్పున నీపాపాత్ములు చేసిన యక్రమములును, నధర్మములును నగు కార్యములను తమకు వివరముగాఁ దెలిపెదను. వినుఁడని చెప్పఁదొడంగెను.

అని సూతుండు, సానందమునికిని, యమునకును నడిచిన సంభాషణ ప్రకారమును శౌనకుఁడు మొదలగు మునీశ్వరులకుం జెప్పిన వారు మిగుల నానందమును, నాశ్చర్యమునుఁ జెందిన వారలై, మహాత్మా! సానందుని ప్రభావంబును, నతని కార్యంబులును, నెంత వినినను తనివి గలుగుటలేదు యింతవరకును నతనిచరిత్రము కర్ణానందముగా వింటిమి. దయచేసి యటుపిమ్మట కాలుండుచెప్పిన విషయంబులును, సానందుని కార్యంబులును, వివరించి మమ్ము కృతార్థులఁ జేయుమని ప్రార్థించిరి.

గద్యము.

ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ చతుర్విధ కవితా
విశారదుండగు, పురాణం - పిచ్చయ్యకవిచే రచియింపఁ
బడిన సానందోపాఖ్యాన వచనకావ్యమునందు
తృతీయ ప్రకరణము.
సంపూర్ణము.





శ్రీరస్తు.

# సానందోపాఖ్యానము.

## వచనకావ్యము.

### చతుర్థప్రకరణము.

క. శ్రీ భవన ! భువన వర్ధన !,
శోభాజిత పద్మమిత్ర ! శుభకర ! వరదా
వైభవ పరిపూర్ణ ! ముకుం,
దా ! భూనుత ! శేషశైల ధామ ! సుశీలా !.

దేవా ! అవధరింపుము.

శౌనకాది మహామునులకు, సూతుఁడు సానందుని చరిత్రంబు నిట్లని చెప్పనారంభించెను. ఓ ఋషివర్యులారా ! సానందునిం జూచి యమధర్మరాజు చెప్పిన సమాధానంబు వింటిరి గదా ! ఇంక నతఁ డతనికి పాపాత్ములు చేసిన దుష్కార్యంబులు తెలిపినరీతియు నటుపిమ్మట జరిగిన విశేషంబులునుఁ జెప్పెదవినుండు. ఆలాగున నడిగిన మునివరునకు, యమధర్మరాజిట్లనియె స్వామీ ! ఇదిగో ! వీరిని వేరువేరుగాఁ జూపి చెప్పెద నాకర్ణింపుఁడు, వీఁడు కలలో

యీ సుఁడు సానందునకు పాపాత్ములు చేసిన కార్యములు చెప్పుట

నైనను, నొకమారుఁగూడ [illegible] ధ్యాన[illegible]మొనర్ప వీఁడు శివదర్శనము చేయుట కొల్లక, శివాలయ మున్న చోటునకు సయితము పోరాదని దూరముగాఁ దొలఁగి పోయినవాఁడు, వీఁడు

భగవంతునికి పూజచేసి తీర్థము, ప్రసాదము, నిచ్చిన పుచ్చుకొని యవి నిరుపయోగంబులని పారవైచెను. వీఁడు శివభక్తులను, హరి భక్తులనుఁజూచి యెగతాళిచేసి తిట్టి కష్టపెట్టెను. వీఁడు శివ పురాణంబని నకంటగించి యట్టి పురాణముం జెప్పెడి వారిని తన్ని వెడలనడఁచెను. వీఁడు శివాలయంబుల మలినం బొనర్చెను వీఁడు శివ సంబంధముగల తీర్థములలో స్నానము చేయరాదని లోకులకు బోధించి తానును మానెను. వీఁడు మున్దెన్నఁడో యేపుణ్య పురుషులో కట్టించియుండి చక్కఁగా పాలించువారు లేని కతన శిథిలమైయున్న గుడికంబము లూడఁబెరికించి, తనకు పేరువచ్చుటకై చావళ్లకును, వినోద మంటపములకును వేసెను, వీఁడు విష్ణు స్థలములకుపోక, విష్ణు దర్శనముచేయక, విష్ణువును పూజింపక, విష్ణు కథలు విననొల్లక, విష్ణుభక్తులను పూజింపక, విష్ణువునకు విరోధివలె ప్రవర్తించెను. వీఁడు బ్రాహ్మణ ద్వేషియై బ్రాహ్మణులను గనినఁ దిట్టియుఁ, గొట్టియు, వారి మడిమాన్యంబుల నపహరించి, నానా చిక్కులఁబెట్టి దయారహితుఁడై బ్రాహ్మణులఁ బూజించుటయు, వారికి దానధర్మములు చేయుటయు వ్యర్థమని యందఱికిఁ జెప్పి చెడ్డ నడవడి గలిగి యుండినవాఁడు. వీఁడు గోవులను, భార్యను, బిడ్డలను, దైవ సమానులయిన తల్లిని, తండ్రిని, తోడఁబుట్టినవారిని మరుఁగు జొచ్చినవారిని, పేదవారిని వెతఁబెట్టి తనసుఖమునకై యన్యులనుఁ జెఱచినవాఁడు, వీఁడు మాంసమును దినమరిఁగి నోరులేని జంతువుల నన్యాయముగాఁజంపి తృప్తిగాఁ దిని శరీరమును పెంచుకొనుచుండెను, వీఁడగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన యాలినివిడిచి పరకాంతలను మోహించి వారితోఁగూడి రేయింబగళ్లు కామసుఖంబు ననుభవించుచుండెను, వీఁడు సాధువులను పెక్కువిధముల కష్టపెట్టెను. వీఁడు గురుపత్ని సంగమముఁ గావించెను. వీఁడు నిర్భయముగా చేయరాని హత్య లెన్నియో చేసెను. వీఁడు మిత్రద్రోహము నొనరించెను. వీఁడు నీళ్లు, గడ్డియు లేకుండా బందె దొడ్డిలోనికిఁదోలి పశువుల నలయించెను. మొదట బ్రాహ్మణునకు దానముచేసి, యావస్తువు నతఁడడిగిన కోపగించి కొట్టి నేను నీకు దానమిచ్చినదే లేదు పొమ్మని మెడఁబట్టి

గంటెను, వీడు దేవపూజార్థముగా వేసి పెంచఁబడిన పుష్ప ఫలవృక్షములను నాశనము గావించెను. వీఁడు కోపము మిత్రుఁడుగాను, కోరిక ప్రియమైనభార్యగాను, పిసిన గొట్టుతనము సహోదరుఁడుగాను, నీచపు పనులుచేయుట యాచారముగాను తలంచి ప్రవర్తించుచుండెను, వీఁడు దుర్జనులకు సహాయముగానుండి సజ్జనులకు చెఱుపుఁజేసెను. వీఁడు యెల్లపుడును కల్లమాటలాడి, యోర్పు, దయ, నీతి, లేక చెడుగులతోఁగూడి. జారత్వము, చోరత్వము మొదలగు దుష్కార్యము లొనర్చుచుండెను. వీఁడు కులము, గోత్రము, వావి వరుసలెంచక స్త్రీలోలుఁడై చూచిన యాడుదానితో నెల్ల సంభోగించుచుండెను. వీఁడు పెద్దలను, గురువులను, భక్తులను చూచినపుడు వారికి వందనం బాచరింపక యితరులనుగూడ వారిని సత్కరింపనీయక వారు నీచులనియు, మాయకాండ్రనియు బోధించుచుండెను. మఱియు, చిలుకలు, కుక్కలు, పిల్లులు, మొదలగు జంతువుల నకారణముగాఁ బట్టిచంపినవారును, భస్మము, రుద్రాక్షల దండలుధరించి శివునికిం బ్రియమగు కార్యముల నొనరించి శివునిఁ బూజింపనివారును, ఉదర పోషణకొఱకు మాయవేషము వేసి పరుల వంచించి వారిధనంబు హరించినవారును, పెద్దలు కూడదని చెప్పిన దినములయందును, సాయంకాలములయందును, రాత్రులయందును, తలలకు నూనెనంటుకొని, స్నానముఁజేసినవారును, శివరాత్రి, సోమవారము, కార్తీక పౌర్ణమి మొదలగు శంభునకు ప్రియంబులగు కాలములయందు, శివపూజఁజేసి యుపవసింపక తుష్టిగా భోజనముఁజేసి తాంబూలమును, గంధము, పూవులు, మొదలగు నిష్టవస్తువుల ప్రియంబునంగొని పరాంగనా సంభోగ మొనరించినవారును, విషముఁ బెట్టియుఁ, బెట్టించియు, తప్పు సాక్ష్యముఁజెప్పియు, నన్యాయముగా నితరులకు మరణముఁ గలుగఁ జేసినవారును, పరులయిండ్లు తగులఁ బెట్టియు, నన్నమును విక్రయించియు, సత్రములు, సంతర్పణలు గల చోట సంఘాన్నముఁ దినియు, నమ్మినవారిని చెఱచియు, జూదంబులాడియు, కల్లుఁద్రాగియు, వేశ్యలతో సంగమము నొనరించియు, గురుపత్నిని, తన యన్నభార్యను, సవతి తల్లిని, తనకంటె వయసున

# సానందోపాఖ్యానము.

[illegible] తక్కువకులమునఁ జన్మించిన యాడుదానితోడను, సంబంధమును గలిగియుండియు, తమ కులధర్మములను విడిచియు, మఱియుఁ జెప్పసాధ్యముకాని యకార్యములఁ జేసినవారునగుదురు. కాన వీరీ ప్రకారముగా కష్టముల ననుభవింపుచున్నారని యచటఁ గనుపించిన కొందఱు పాపాత్ములను వేఱువేఱుగాఁజూపి యప్పటి ప్రసంగానుసారముగాఁజెప్పి యచ్చోటనుండి మహానుభావుండగు సానందమునిఁ దోడ్కొని ముందు మఱియుఁ గొంత దూరంబునకుం బోవ, యచట మున్నుగన్న వారికంటె నినుమిక్కిలిగా బాధపడుచుండు పాపాత్ములం గని మునివరుండు విస్మయమొంది పలుకుటకు సయితము నోరాడక నట్టనిలిచి యా దిక్కు మాలిన జీవులఁ గనుఁగొనుచు నిలిచియుండె.

### సానందాదులు వచ్చుటఁజూచి కింకరులు పాపులను మఱియు బాధించుట.

అప్పుడు మునివల్లభుండును, తమ ప్రభువగు శమనుడును వచ్చుటఁ గని తమతమనేర్పును, కార్యమునందుఁగల శ్రద్ధయుఁ దెలియునటుల నటించి మెప్పుఁగొనఁ దలచినవారై యమభటులు, దయ, దాక్షిణ్యము, లేక తమచేఁజిక్కియున్న పాపాత్ములను, దగదగ మండుచున్న యినుప కంబములకుఁ గొందఱి నాలింగనముఁజేసి కొనుండని బాధపెట్టియు, ఆకాశమంటునంతటి పొడవుగా నాలుకలు రేఁగి మండుచున్న నిప్పుల గుండములలోఁ గొందఱఁద్రోసియుఁ, గొందఱినిఁ బట్టి సలసల తెరులుచున్న నూనె గంగాళంబులలోవైఁచి యుడికించియు, కొందఱిని గగనమండలమున కెగరవైఁచి క్రింద వాడిఁగల కత్తులను, బట్టుచు, కొందఱియంగంబులకు నూనెలో తడిపిన గుడ్డలు చుట్టి రగిల్చియుఁ, గొందఱిని, యుక్కుకొఱ్ఱులపై దిగనేసియుఁ, గొందఱిని గానుగలలోఁ బెట్టి త్రిప్పియుఁ, గొందఱిని కాళ్లుపట్టి రాళ్లపై నుతికియుఁ గొందఱిని, సీసంబుఁగఱఁగించి చెవులయందును, ముక్కురంధ్రములయందునుఁ బోసియుఁ, గొందఱిఁ కొండశిఖరముల మీఁదికిఁ గొనిపోయి క్రిందికి దొర్లించియుఁ, గొందఱి శరీరములు ముక్కలు ముక్కలుగాఁగోసి కాకులు, గద్దలు, నక్కలు, కుక్కలు, మొదలగు వానికిం బెట్టియుఁ, గొందఱిని మెడఁనుకఁ బూడ్చి నెత్తిన నినుప రోకళ్లతో మోదియుఁ, గొందఱిని పాదంబులు పట్టి రెండుగాఁ

చీల్చియుఁ, గొందఱినిఁ జెక్కియుఁ, గొందఱినిఁ జిఱుతలఁగట్టి నొక్కియుఁ, గొందఱినిఁ గోసియుఁ, గొందఱిని గాలములుగ్రుచ్చి వ్రేలవేసియుఁ, గొందఱిని మలమూత్ర కూపములలోఁ ద్రోసియుఁ, గొందఱిఁ గ్రిమికీటకాదు లుండు గవులలోఁ బడ నడచియుఁ, గొందఱిని పాములు, తేళ్లు, గేచుకుక్కలు, పులులు, సింగంబులు, తోడేళ్లు, మొదలుగువానిచేఁ గఱపించియుఁ, గొందఱిని తల్ల క్రిందుగా వ్రేలఁగట్టి కనుగ్రుడ్లుపెఱికి చెవులుగోసి తోలును పశువులకు దీసిన ట్లూడఁదీసియు, నింక ననేకవిధంబుల బాధించుచున్న యా వేదనకు తాళలేక తలయెత్తిచూచిన చూడనీక రాళ్లుఱువ్వియు, తన్నియుఁ, దిట్టియు, కొట్టియు, నెట్టియు, నలయింపఁ దట్టుకొనలేక బెట్టులికి నేలఁబడువారును, మూర్ఛల మునుఁగు వారుచు, కుయ్యో! మొఱ్ఱో! యని యేడ్చువారును, హాహాకారంబులఁ జేయువారును, బతిమాలు వారును, మ్రొక్కువారును, దైన్యంబున పదంబులపై వ్రాలు వారును, కింకరులు పెట్టుయిక్కట్టులఁ దప్పించుకొనుట కట్టిటుఁ బరుగెత్తి యితరులమరుగున దాగువారును, దాగిన నెందుఁబోయెదరని లాగిన క్రిందఁబడి తన్నుకొనువారును, క్షుధా దాహంబుల కోర్వలేక మోదుకొనువారును, నొకరి నొకరు కట్టుకొని యంగలార్చువారును,

పాపాత్ములు తాముచేసిన దుష్కార్యములఁ దలంచి చింతించుట.

నయ్యో! మున్ను చెప్పులఁ దొడుగుకొని దేవాలయంబులఁ జొచ్చిన పాపంబును, దేవ గృహంబులలో సురత వినోదంబులఁ దేలిన పాపంబును, పరమేశ్వరునిఁ గలనైనఁదలంపక యిష్టము వచ్చినలాగున చెడు కార్యములను చేయుచుండిన పాపమును, పెద్దల యాచారధర్మములు విడిచిపెట్టి భ్రష్టులమై దుష్టులతోఁ జేరి పరులకు కీడుఁ జేసిన పాపమును, పరకాంతలను, పరుల ధనమును, నపేక్షించి, వానికొఱకై చేయరాని చెడ్డకార్యములు చేసి, హత్య లొనర్చిన పాపమును, దేవతలకును, బ్రాహ్మణులకును, ధర్మముగా యివ్వబడిన, మడిమాన్యములను లాగుకొని ధర్మమెక్కడిది, పొమ్మని నిరాకరించిన పాపమును, యితరుల యిండ్లయందు దోఁపిడీఁ జేయించి, పతివ్రతలఁ జెఱఁబట్టి చెఱిచిన పాపంబును, ఆత్మసంతుష్టికై

నిరపరాధులగు, గొఱ్ఱె, మేక, పొట్టేలు, జింక, గోవు, కుందేలు, మొదలగు మృగములను, కోడి, పావురము, గువ్వ, పూరేడు, కొక్కె-ర, మొదలగు పక్షులను, చంపి తినిన పాపంబును, మన మేలునకై యితరులకు విషముఁబెట్టియు, నమ్మించి గొంతుఁగోసియు, నీళ్లలోఁ ద్రోసియుఁ జంపినపాపంబును, భగవంతుని పూజింపక, భగవంతుని తలంపక తిరస్కారముఁజేసి దైవ భక్తిఁగలవారిని హేళనఁజేసి యోగ్యుల ననాదరించిన పాపంబును, ధర్మసత్రములు, ధర్మచావళ్లు ధర్మమునకు యేర్పఱచబడిన, కోనేళ్లు, బావులు, మొదలగునవి నాశనముచేసిన పాపమును, ఆడువారిని, శిశువులను, బ్రాహ్మణులను, హత్యఁజేయించియుఁ, జేసియు, నానందించిన పాపంబును, శాస్త్ర మెఱిఁగిన యోగ్యులు కూడదనినపనులను కూడ కేలఁబోవు శాస్త్రం బెక్కడిది. పోపొండని నిరాకరించి యకార్యము లొనరించిన పాపంబును,తల్లిదండ్రులను, గురువులను, తోడఁబుట్టువులను,మఱుఁగుఁజొచ్చిన వారిని,యాచకులను, పేదవారిని, నమ్మినవారిని, కష్టముల పాలుఁజేసి యల్లాడించిన పాపంబును, వేళకు పూరియు, నీళ్లును, లేకుండఁజేసి దయారహితులమై యెద్దులు, గుఱ్ఱములు, మొదలగు జంతువులఁగొట్టి బాధించి పనులుచేయించి యవి ముదిమిఁజెంది పనిజేయ శక్తిలేనివై యూడిగిలఁబడి నంతట వానిని కసాయివారి కమ్మిన పాపంబును, నిచ్చెదనని పేదవారల కాసఁ గలుగఁజెప్పి పలుమాఱుఁద్రిప్పి తుదకు లేదుపొమ్మనిన పాపంబును, పరులుచేయు దాన ధర్మంబులు గని మతియొప్పక వారితోతగవులాడి యట్టిధర్మంబువలనఁ బ్రయోజనంబు లేదని వాదించి నివారించి సంతృప్తిఁగొన్న పాపంబును, నారకఁబోవునా? ఏలపోవును? యెంత బుద్ధిహీనులము? కటకటా! మన మెప్పుడెప్పు డేయే చెడుకార్యముం జేసితిమో. యాకార్యములన్నియు నప్పుడప్పుడే వివరముగా లిఖించి యుంచబడినవి. మనము పరులకెవ్వరికినిఁ దెలియరానిలాగున రహస్యముగాఁ జేసిన సర్వకార్యములును చిత్రగుప్తుఁడు వ్రాసియుంచెను మనుష్యు లెఱుఁగరని మన మెంచినను మనకృత్యంబులు దేవత లెఱుంగకుందురా? మనస్సులో తలంచి నదియుఁ గూడ వారెఱుంగుదురు. ఆలాగున నెఱింగి మన



(౯౩-వ పుట.) యమభటులు పాపాత్ములను నిందించి తిరస్కరించుట.

కొంనర్చిన పనులనుఁజెప్పి యీ యమభటులు నానాభాధలుఁ బెట్టుచున్నారు వీరు చెప్పెడివానిలో మన మేకార్యము చేయ లేదనఁగలము? అన్నియు మనము చేసిన కార్యములేకదా ! ఏయే పాపముఁజేసిన వానికితగిన దేయే శిక్షయో, యధి మనకు విధింపబడినది. యీ మహాదుఃఖసాగరము నింక నెంతకాల మనుభవింప గలము? హా! యని యీ క్రందనముఁజేయుచు, మనుష్య శరీరంబుతో నుండినపుడు తాము కావించిన పాపకార్యములఁదలఁచి మిక్కిలి తిన్నదనంబుఁ జెందుచు నా యమభటులు బాధించుట కోర్వజాలక, అయ్యా! భటులారా! మావిన్నప మాలకించి మమ్మొక్కమారుఁగా మీకటుకు కత్తులతో మాకుత్తుకలఁ దెగ వ్రేయుఁడు. నాయనలారా! యొకసారిగా మమ్మా నిప్పుమంటలలో గాల్చి వేయుఁడు. పుణ్యాత్ములారా! యొక్కతరుణమున మమ్ము మీశూలంబులతోఁ గ్రుచ్చి చంపి వేయుఁడు. దయామతులారా ! మమ్మొక్కటే సమయమున కాగిననూనె కొప్పెరలలో వేసి మాడ్చి వేయుఁడు. ఆలాగునఁగావించిన మీకుఁ కీర్తి కలుగును. మాటిమాటికి నిర్విధంబున నలచుటవలన మీ కేమిలాభమువచ్చినది. మా మొరవిని మాయందుఁగనికరించి యీ మాత్ర ముపకారముఁ జేయుఁడనిన

యమభటులు పాపాత్ములను నిందించి తిరస్కరించుట.

యమభటులుగ్రులై, యోకష్టాత్ములారా! మీ రెంతబతిమాలినను, నెంత యేడ్చినను, ప్రయోజనంబులేదు మీరు చేసిన కర్మల ఫలమును మీ రనుభవించియే తీరవలయును. మీ యాతనా శరీరంబులు యెన్నిమారులు నఱికినను నిప్పులలో గాల్చినను, నూనెలో వ్రేల్చినను, యెట్లు చేసినను చెడిన యుత్తరక్షణంబున మరల కలుగుచుండును. దానికి కలుగు బాధమాత్రము తప్పదు. మీరు ప్రలాపించుట నిరుపయోగము. మిమ్ము మేము విడుచు వారము కాము. మమ్మేలబతిమాలెదరు? చీ! చీ! యూరక నోరుమూసుకొని చేసినకర్మఫలమని తలంచి, అనుభవింపుఁడని చెప్పి మఱియు నెక్కుడుగా బాధింపఁదొడంగిరి. అప్పుడు ధర్మదేవతయు, సానందమునియు మఱియును వారికి సమీపంబున కరుదెంచిరి.

అటుల దాపునకు వచ్చిన యమునింగని చేతులుజోడించి యీ పాపకర్ములందఱు నొకమాఁటుగా. ఓ ధర్మస్వరూపా! పుణ్యపరిపాలకా! దీనజనమందారా! తండ్రీ దయామతివై మామొఱాలకింపుము. సకల పాపములను నశింపఁజేయు మీ పుణ్యస్వరూపమును గను భాగ్యము నేఁడు మాకు లభించినది. యిది మా యదృష్టము. ఇంక మాయందు నెనరుఁగలిగి మేము పడుబాధలను నివారింపుము. పావనుఁడవైన నిన్ను జూచిన పిమ్మట గూడ మా పాపములు నశింపకుండునా? యుండనేరవు మా పాపము లిపుడు తొలఁగిపోయినవి. దేవా! మాయం దనుగ్రహింపుము. పుణ్యాత్ములమీఁద మీ దయఁజూపుట యెక్కువగాదు. దీనులమగు మమ్మురక్షించుటగొప్ప మాయారాటము నివారింపుము. ఇంక మాకు రాజ్యములు, భోగములుఁ, ధనధాన్యములు, సొమ్ములు, ఇండ్లు, మిద్దెలు, మేడలు, భార్యలు, బిడ్డలు, విలాసకరములగు నాటలు, పాటలు, మొదలగునవి యక్కఱలేదు పాపము గలిగించుటకు కారణములైన యట్టివి మేము కలనైన నిదిమొదలు కోరము. బుద్ధిగలిగి ధర్మానుగుణపద్ధతుల నెఱిఁగి, సత్యము, నీతి, దయ, శాంతము, శీలము, దమము, తృప్తి, సంతోషము, మొదలగు, మంచి లక్షణములు గలవారమై, దైవభక్తిఁగలిగి, యెప్పుడును పుణ్యకార్యములఁ జేయుచుండెదము. తప్పకఁ జేయుచుండెదము. మీ పాదము

## పాపులు సానందుని తమ్ము రక్షింపుమని ప్రార్థించుట.

లాన. ఓస్వామీ! దర్మమూర్తీ! మమ్మురక్షింపుము రక్షింపుము. అని బహురీతులఁ బ్రార్థించి, యంత సానందముని దిక్కుమొగంబులఁ ద్రిప్పి సాగిలంబడి, మ్రొక్కి, అయ్యా! మహానుభావా! మునిలోకచంద్రా! దయానిధీ! మీపావనంబులగు పాదంబులఁ గాంచినంతనె మాయారాటంబు కొంతయడంగినది. మామంటలు కొంతశాంతించినది. మాదాహంబు కొంత తొలంగినది. తండ్రీ! దీనులమై యల్లాడుచున్న మామొఱనాలకించి యీ మహాభయంకరమగు నరకబాధలనుండి మమ్మునుద్ధరించుటకు దలంచి వచ్చిన కరుణానిధివైన శంకరుఁడవో యని తోఁచుచున్న నీ తేజముగల రూపముచూడఁగా మా కన్నుల కానందముగలిగినది. తండ్రీ! మాపైని దయయుంచి నీవైనను జెప్పి మా

కష్టములు నివారణయగులాగున చేయుము. మా యపరాధములమ
న్నించుమని యమధర్మరాజునకుఁ జెప్పుము. వారాజ్ఞాపించిన పక్షము
న నీ కింకరులు మమ్ము కొంత బాధించుట మానఁగలరు. అని మాటి
మాటికి చేతులుమోడ్చి ఫాలంబులఁ జేర్చి మొరలిడుచున్న దుష్కర్ము
లఁగని యమదూతలు పండ్లుపటపటఁ గొఱుకుచు మఱి మఱి బాధలఁ

—యమభటులు పాపాత్ముల దుష్కార్యములఁ జెప్పి భయపఱచుట.—

బెట్టుచు ఓరీ! నీచులారా! దుష్టులారా! ఖలులారా! పాపజనభయం
కరుండును, న్యాయవంతుఁడును త్రిలోకవందితుఁడు నగు మారాజువ
చ్చియుండగా విచ్చలవిడిఁ జెలరేగి మీనోటికివచ్చిన కాఱుకూతలఁ గూ
యుచు యివ్విధంబున కేకలు బెట్టి యాకాశము చిల్లులుబడునట్లు ధ్వ
నిఁ గలిగించుట కారంభించితిరా? యౌరా ఇంతకువచ్చినను యింకను
మీపొగరడంగకున్నది మాకికరాజ్యభోగాదిసుఖము లక్కర లేదనియు
న్యాయముగా ప్రవర్తించెదమనియు గూసితిరి. మీ కష్టములు తీఱి
మరల భూలోకమున జన్మమెత్తినప్పటి సంగతికదా, యది యిపుడేల,
దాసరయ్యాకు ముక్కులోకురుపుమాని మాటలు బాగా చెప్పఁగలిగి
ననాఁడు పూజ్యతగలుగునని యొకసామెత గలదు. మీమాటలందుకు
దగినట్లున్నవి. మీకర్మఫలమును మీరు పూర్ణముగా ననుభవించితీరు
ట యెన్నినాళ్ళకు ? దినములా? వారములా? పక్షములా? నెలలా ?
ఋతువులా? అయనములా? సంవత్సరములా? యుగములా? యెన్నా
ళ్ళకుతీఱును? యిప్పటికి మీరనుభవించినబాధలు చాలస్వల్పమైనవి.
యింక నాచంద్రార్కస్థాయిగా, యనుభవించవలసిన సూచిముఖము,
నసిపత్రవనము, క్రిమిభోజనము, తప్తలోహస్తంభము, రౌరవము,
మొదలగు మహానరకము లెన్నియో యున్నవి. చేసినపుడు కండ్లు
గానని మందబుద్ధితో చేయరానికృత్యములను గావించి యిపుడేడ్చెద
రేల? యిట్టిపాపిష్ఠులగు మీయందెటువంటి వారికైనను దయగలు
గునా? తలఁగొట్టివేయఁ బోవుచుండఁగా చెప్పులకు మందడిగినట్లు,
గొప్పకష్టముల ననుభవించుటకు సిద్ధముగానుండు మీరు బాధల
నుండి తప్పించుకొనుట కుపాయము వెదకెదరు. యిదిమీకు ప్రయో
జనమని తలంచితిరా? యెప్పటికిని మేము మిమ్ము విడుతుమని తలంప

కుఁడు. నెమలికంటనీరు గారితే వేటకానికి ముద్దగునా? యమధర్మరాజు శాసనమనిన మూడు లోకములును గడగడవడంకును, అట్టివాని భటులమగు మాచేఁజిక్కిన మిమ్ము మీకర్మఫలము ననుభవింపకఁ దప్పింప నెవరికి సాధ్యమగును. కష్టమతులారా! ధర్మదూరులారా! మీరిట్లే ప్రేలుచుంటిరేని యింకమీకుఁ దగిన శాంతిఁ జేయక విడుచువారముగాము యని కండ్లలో నిప్పు లురులునటుల గోపము వహించి యట్టి వారలంబట్టి పెట్టరాని బాధలం బెట్ట దొడంగి, వ్రేసియుఁ, గోసియు, దంచియు, నొంచియుఁ, గాల్చియుఁ, జీల్చియు, నీడ్చియు, మాడ్చియుఁ, గ్రుచ్చియు, వ్రచ్చియు, వివిధరీతుల నలయింప, నయ్యో! యని యార్చువారును, కుయ్యో! యని కూయువారును, హా! హా! యని యఱచువారును, కటకటా! యని యాక్రందించువారును, చేతులుమోడ్చి మ్రొక్కువారును, పాదంబులుబట్టి బతిమాలువారును, క్రిందుమీఁదై తల్లడించు వారును, కండ్లు బెఱికిన నల్లాడువారును, చేతులు తఱిగిన కూతలిడువారును, కాళ్లుఖండించిన పొరలువారును, మంటలఁద్రోసిన తన్నుకొనువారును, రంపములంగోఁగోసిన తలలమోదుకొను వారును, శూలంబులఁ బొడిచిన మూర్ఛిల్లు వారునునై యీ పాపకర్ములు చెప్పఁగూడని, తలంపరాని, చూడసయిపని, యమభటులు సేయు మహోపద్రవంబుల నొందుచుఁ బలవించుటను సానందమునివరుండు చక్కఁగాఁజూచి వెఱఁగును నాశ్చర్యమును, జాలియు, మనంబున నంకురింప, పదంబులు గడగడవడఁక, గుండెలదర, పలుకుటకు మాటరాక, నోటతడియాఱ కొంతవడి రాతిబొమ్మవలె విషణ్ణుఁడై యుండి, మిక్కిలి ప్రయత్నమున మనసుఁగుదురుపఱుచుకొని ధయిర్యంబు వహించి యమధర్మరాజుంజూచి మిగుల దయగలవాఁడగు మునీంద్రుం డిట్లనియె నోయి శమనా! యింతకు మున్ను చూచినవారికంటె వీరలగతి మఱియు దుర్ఘటమయినదిగాఁ గనఁబడుచున్నది. వారికంటె వీరికెక్కుడు శిక్షవిధించి బాధించుటకేమి కారణము? వీరేమిచేసిరి? పాపము, పుణ్యము, నను రెండునుగాక వానిలోన హెచ్చుతక్కువలు గూడఁగలవా? ఉండిన నవియెట్లు? వాని తారతమ్యంబు లెట్టివి? వివరింపుమని యడిగెను. ఆమాటలు

విని దండధరుండు వినయంబుమీఱ సానందుని కిట్లనియె. స్వామీ! ఇంతకుమున్ను మీరుచూచిన పాపులకంటె వీరు మిక్కిలి పాపములు

యముఁడు సానందునకు పాపాధిక్యతను నిరూపించి చెప్పుట.

చేసినవారు గనుక వీరికి వారికంటె యధికమగు శిక్ష విధించియున్నాను. వీరుచేసిన చెడ్డపనులన్నియు వివరించిన తమకు చాలాతొందరఁ గలిగించినట్లగును, అదియునుగాక చాలాకాలము పట్టును. గనుక కొన్నిమందిని గుఱించి మాత్రము విన్నవించెద నేనెవరినిగురించి యిపుడు తమకెఱిఁగించఁ బోవుచున్నానో వారు యిచ్చటనుండెడివారిలో తక్కువ పాపముఁజేసినవారు. తక్కిన వారినిగాని వారి కార్యములనుగాని, నోట నుచ్చరించుట సయితము మహాదోషము, వారిలో కొందఱు చేసినవి చెప్పెదనువినుండు. అని యొకొక్కనిఁజూపి యిట్లనియె. దేవా! వీఁడు యోగ్యుఁడగు విప్రుని నన్యాయముగా చంపెను. వీఁడుకొండెగాఁడు. కొండెము చెప్పుట మహాపాపము. కొండెగాండ్రను దాపునఁ జేర్చుకొనినవారు చెప్పెడివారికంటె పాపులు. యెట్లనిన, కొండెపు మాటలు వినుటచేత కోపముపుట్టును. కోపమువలన నన్యులకు కీడుఁ గలిగింతురు. ఆలాగు కలుగఁబడిన చెరుపువలన నెందఱో నానాదుఃఖములు నొంద పాలగుదురు. అటుల దుఃఖము గలిగించుట మహాపాపము. అట్టిపాపమువలన గొప్పనరకము సంభవించును. వీఁడట్టి పాపహేతువగు కార్యమొనరించెను. వీఁడు ప్రభువైయుండి తనరాజ్యంబునఁగల జనులుసేయు మంచిచెడుగుల విచారింపక యెపుడును కామప్రియుఁడై యుండి, పేదసాధులను భేదములేక యక్రమముగా పన్నులు విధించియు, దండుగలు వసూలు చేసియు ప్రజల నానాబాధలుపెట్టెను. వీఁడు దేవాలయాధికారిగా యుండి దేవుని సొత్తునంతయు తనగృహవెచ్చముల కుపయోగ పరచుకొని దైవకార్యములు చక్కఁగా జరుపక ధూపదీప నైవేద్యములు లేకుండఁజేసి యాలయమును పాడుఁబడఁజేసెను వీఁడు తానగ్ని సాక్షిగాఁ బరిణయమైన యిల్లాలిని విడిచి పరకాంతాలోలుండై యుండి భార్య యట్టికార్యము చేయరాదని యాక్షేపించిన కనలి తన్ని నిర్దయగా గొంతుకోసెను. వీఁడు బ్రాహ్మణస్త్రీలఁ

జెఱఁబట్టి తెచ్చి వారినిఁ గులభ్రష్టులఁ జేసి పిదప వారికన్నపానాదులు విచారింపక యడిగినందునకై వారలందర్ని గొంతుకల కురివేసి చంపెను. వీఁడు యుద్ధములోనోడి పరుగెత్తినవానిని శరణుఁజొచ్చినవానిని పూరిఁగఱచినవానిని నిర్దాక్షిణ్యముగా తన కరవాలమున ఖండించెను. వీఁడు ధన మదాంధుఁడై యాచకుఁడువచ్చి యడిగిన మిక్కిలికోపించి వాని పైబట్టలను, వానియొద్దనుండిన రూకలును బలాత్కారముగాఁ దీసికొని వానినికొట్టి యూరు దాటనంపెను. వీఁడు బ్రాహ్మణులు యజ్ఞముసేయఁగా సమకట్టి ప్రారంభించినపుడు ఆకార్యమును జరుగనీయక యాటంకములు కలిగించి వారలు యాగార్థముగాఁ గొని తెచ్చిన యాగపశువును దొంగతనముగాఁ దోలుకొనిపోయి దానిని వధించి తానును తనకుఁ గావలసినవారును భుజించుటకు యేర్పాటుఁగావించెను. వీఁడు వ్యాపారముఁ జేసి డబ్బు సంపాదించఁదలఁచి చోరులతో సఖ్యముఁ గలిగించుకొని వారివలన గోవులచర్మంబు లొలిచి తెప్పించి యవి యమ్మి ధనముఁ గూర్చెను. వీఁడు తండ్రి చనిపోయినపిమ్మట భార్యకులోబడి తల్లికి అన్నపానములు విచారింపక అన్నమడిగిన కాలితోతన్ని మెడఁబట్టి నూఁకినవాఁడు. వీఁడు దేవాలయములు, ధర్మసత్రములు, పడఁగొట్టించి యారాళ్లను తనయింటికిని కడపలకును వేసుకొనెను. వీఁడు యావనవతియగు మఱియొకని యిల్లాలి నపేక్షించి యాబిడ యొల్లకున్న, సమయము వేచియుండి పురుషుడింటలేనితఱి రాత్రి నిద్రించుచుండగా హటాత్తుగా వారియింటఁ బ్రవేశించి బలాత్కారముగా పైఁబడి కామక్రీడఁ గావించెను. వీఁడు నోరులేని చతుష్పాత్తులనఁగా, గోవు, యెనుము, మెదిలగు జంతువులను రమించెను. వీఁడు దొంగతనమ వృత్తిగాదిరుగుచు, ధనమునకై చేయరాని యకార్యములఁ జేసి లెక్కలేని హత్యలుగావించెను. వీఁడు కర్మచండాలుఁడు. అనఁగా తనకులాచారమును విడిచి యన్య మతములయందుఁ జేరి, ధర్మ, నీతి, శీల ముల విడనాడి తన యిచ్ఛవచ్చినలాగున ప్రవర్తించుచుండెను. వీఁడు ప్రభువైయుండి తన కెదురులేదని యోగ్యురాండ్రగు మగువల బలాత్కారముగావించి

రమించెను. వీఁడు దైవచింతమాని దైవమే లేదని వాదములాడుచు, వేశ్యాలోలుఁడై యెల్లపుడును నాత్మ సంతుష్టికొఱకు పరులకు చెఱుపుఁజేయుచుండెను. వీఁడు విరోధించి యిండ్లను, గోగ్రాసమగు కసవును, తగులఁబెట్టియు, జనోపయోగమగు గుంటలు, బావులు, మొదలగు జలాధారములలో నశుద్ధవస్తువులు కలిపి త్రాగుటకు వీలు లేనట్లు చేసియు నానా యిక్కట్టుల పాలుఁజేసెను వీఁడు దరిద్రుల యిండ్లను మాన్యపుభూములనుహరించి యల్పక్రయమునకుదీసి యా క్రయమును సయితము వారికివ్వక నానాచిక్కులుంబెట్టి గట్టిగాయడిగిన కొట్టి తుదకు యిచ్చుటలేదు పొమ్మనినిరాకరించెను. వీఁడు దుష్టులతో సాంగత్యముఁజేసి జూదము, వేటపానము మొదలగు దుర్వ్యసనములకులోనై నీచమగుపనులఁగావించి పెద్దలను దూఱుచుండినవాడు, వీఁడు యెల్లపుడును నాత్మస్తుతియు, పరనిందయుఁ జేయుచుండినవాఁడు, వీఁడు జలములయందు మూత్రపురీషంబులువిడిచియు, నశుచికార్యముఁ జేసినపుడు కాళ్లు చేతులు కడుగుకొనక యట్లే దేవాలయములకుం బోయినవాఁడు. యిట్టివారు గావున వీరుచేసిన పాపంబధికం బగుటఁ బట్టి యెక్కుడుశిక్షకు పాత్రులై యనుభవించు చున్నవారని చెప్పి, మునివరుండు మరల నేమియడుగునో యని, కాలుం డతనిమాటకు గాచియుండెను. ముందు వివరించినలాగున పాతకులు, మహాపాతకులు పడుబాధలకు తగిన కారణంబులును, వారువారు చేసిన కర్మముల తారతమ్యములును, వివరముగా యమధర్మరాజు చెప్పఁగా వినినవాఁడై సానందముని యొడలుజలదరింప సర్వేశ్వరుని ధ్యానించి యధికంబగు నాశ్చర్యంబుఁజెంది యమునింగని, యోయి ధర్మ స్వరూపుడవైన వైవస్వతా! యీ పాపాత్ములుచేసిన చెడుకార్యములును, వీరనుభవించు కష్టములయొక్క భేదమును వివరముగాఁ జెప్పితివి. నీవుచేసినశిక్ష న్యాయముగానేయున్నది. కాని అయినను వీరుపడుబాధలు వర్ణనాతీతములుగా యున్నవి. యా బాధలను, వివరింప నెవ్వరితరము? పరమశివుండే యెఱుఁగవలెను. కటా! చూడఁజాలకున్నాను. ఇదియిట్లుండ, నా కిపుడొక సంశయము గలిగినది. అదియేమనిన, కోసినను, పొడిచినను, చీల్చినను, కాల్చి

నను, దంచినను, ప్రేల్చినను, నడచినను, వండినను, యెట్లుచేసినను, వీరు యీదేహములు చెడక మరలమరల రూపములు ధరించి బాధ పడుచున్నవారు. వీరిముందటి శరీరములు భూమియందు కాల్చి వేయంబడి నశించిపోయినవి. మరల శరీరమెవ్విధంబునఁ గలిగినది? కలిగిన యెడలు నశించక నిలుచుట కేమికారణము? నీవునాయందు మిగుల దయఁగలవాఁడవై, వీరికిని యీ దేహంబులకునుఁ గల సంబంధంబు నెఱిఁగింపుము. మఱియునీవు యిదివరకు జరిగిన కాలము నను, యిపుడు జరుగుచున్న కాలములోనను, నింకమీఁదట జరుగఁ బోవు కాలముననను, నేయేకార్య మెవ్విధంబున నెట్లెట్లునడుచునో యదిచక్కఁగా నెఱింగినవాఁడవు. సకలప్రాణులమర్మములు, కర్మ ములు, తలంపులు, నీవెఱుంగుదువు గాననీకుఁ దెలియని విషయ మొకటియు లోకంబునఁ గలుగదు ఇది సత్యము. కావున, జీవశరీర సంబంధమును, జీవస్వరూపంబును, దేహంబుల స్వభావంబును, పిండో త్పత్తి క్రమంబును, తచ్ఛరీరబంధ విమోచనమగు రీతియు, నీమొద లగు రహస్యంబులు వివరముగా నాకెఱింగింపుము. ఇట్టివిశేషంబుఁ దెలియకున్న నామనంబునకు దృప్తికలుగదు. అనియడిగెను. ముని యివ్విధంబున తననుంగూర్చి యడుగుటయు, సంతసించి, అరవింద మిత్ర నందనుండు,సానందముని పురందరున కీలాగునఁ జెప్ప నుపక్ర- మించెను. మునివరేణ్యా! మహాప్రభావ సంపన్నులరగు మీరునన్నొక పెద్దఁజేసియిట్టి విషయంబు లడుగుట మిక్కిలి యాశ్చర్యకరమగు విష యము. అయినను, నాయందు మీకుంగల దయావిశేషంబునఁజేసి యడిగితిరి.యిందు మీకుందెలియని దెద్దియులేదు, కాని నావలన వినఁ గోరికగుటచే, నేనెఱిఁగినంత విన్నవించెద నాకర్ణింపుఁడు, లోకముల కన్నిటికిని కర్తయై, భరించువాఁడును, పరంజ్యోతి స్వరూపుఁడును,

యమధర్మరాజు సానందునకు శరీరతత్వము నిరూపణముఁ జేయుట.

పరిశుద్ధమైన వాఁడును, చరాచరములగు వానితో గూడిన భువనము లను, పుట్టించుటకును, రక్షించుటకును, నశింపఁ జేయుటకును కారణమై యుండెడివాఁడును, పేరు, నూరు, కులము, గోత్రము, రూపము, లేనివాఁడై యుండి, యన్నియుం గలవాఁడును తుద

మొదలు, నడుమలులేని వాఁడును, ప్రపంచములకు నెప్పుడును శుభముల నిచ్చుచుండు వాఁడును, వర్ణించుటకు సాధ్యము కాని వాఁడును, పాపములు లేనివాఁడును, దయయే రూపముగాఁ గలవాఁడును, నగు పరమేశ్వరుని పరిపూర్ణమగు దివ్యరూపంబై, స్థావరములు, అనఁగా కదలకయున్నచోటనే యుండు చెట్లు, కొండలు మొదలగునవి, జంగమములు, అనగా నొకచోటనుండి మఱియొక చోటికిం బోవుటకు శక్తిఁగల మనుష్యులు మృగములు, పక్షులు మొదలగునవి, కూడిన లోకంబులుగా నొప్పుచుండును. ఆపరమాత్మ యొక్క శరీరమే సకల ప్రాణికోటులుగా విలసిల్లుఁగాన, యా జీవాత్మకును, పరమాత్మకును, భేద మిసుమంతయైనను లేదు, రెండు నొక్కటియేయని భావము. జీవాత్మ పరమాత్మలు వేఱువేఱుగా నుండునని తలచుట యవివేకము, వివేకు లావిధఁబున నెపుడును తలంపనే తలంపరు. అట్లగుటంజేసి, యాచిత్స్వరూపుఁడగు పరమాత్మునియందు వటబీజ న్యాయమున, (అనగా మఱ్ఱిచెట్టున నల్పములగు ననేకవిత్తనములు కలిగి యవి మరలమొలిచి పెద్దపెద్ద వృక్షములైనవిధము) నిప్పునందలి రవలవలె (అనఁగా పెద్దమంటనుండి రవ లెగసి యవి మఱియొకచోటఁబడి మండి పెద్దమంటయగుట) జీవకోటులు జనించి త్రాడుంగని పామని భ్రమపడిన విధంబున, నెపుడును నశింపని యీశ్వరునియందు తత్సంబంధమగు మాయ చేత భేదంబు దోఁచుచుండు. నట్టి యీశ్వరాంశంబగు జీవుండు. భగత్స్వరూపమున నొప్పు లోకంబున ముందు చెప్పినలాగున మాయచేత మోహితమానసుఁడై నిజస్వరూపమనఁగా తానిట్టి వాఁడని తెలియఁజాలక, యనాదియగు కర్మవలన ప్రారబ్ధ మెటుల కలుగునో యావిధంబున శరీరంబుల నొందుచుండు. నిట్లు జీవుండు శరీరధారియై నంతట, కష్టము, సుఖము, జీవునకు లేకున్నను, తాను స్వతంత్రుఁడనను మోహంబునకు వశుండగుటంబట్టి, కామము, (అనఁగా కోరిక.) క్రోధము, (అనఁగా కోపము.) లోభము, (అనఁగా పిసినితనము.) మోహము, (అనఁగా యజ్ఞాన సంబంధమైన భ్రమ.) మదము, (అనఁగా తనకంటె నెవ్వరును నధికులు లేరనుతలంపు.) మాత్స

ర్యము, (అనఁగా విరోధము.) నను నారుగుణములకు లోఁబడి వర్తించుటచే వ్యర్థమగు కార్యముల నొనరించి యుందువలనఁ గలిగెడి సుఖము, దుఃఖము, ననుభవించుటకు కారణంబగును. కాని యట్టి కర్మల వలనఁ బొడమఫలముగాని, పాపముగాని, యాత్మనంటనేరదు సమస్తశాస్త్రములును దెలిసిన బ్రాహ్మణుండు, కల్లు సారాయి ద్రాగినపుడు తన తెలివిఁగోలుపోయి యొడలెఱుంగక తోఁచిన లాగున మెలంగు విధంబున తొలఁగరానిదై యవివేకమునకు కారణమైన ప్రకృతి (మాయ) వలనఁబుట్టిన భ్రమచే లోకంబున జీవులును, యజ్ఞములు, యాగములు, దానములు, ధర్మములు, మొదలగు మంచి పనులుచేసి, స్వర్గలోక సుఖమును, బ్రహ్మహత్య, గోహత్య, స్త్రీహత్య, శిశుహత్య, భ్రూణహత్య, మొదలగు మహాపాతకముల నొనరించి రౌరవము మొదలుగాఁగల భయంకరములగు నరక దుఃఖములను ననుభవించుట తటస్థించుచున్నది. ఇట్టి సర్వప్రపంచమును, నిజమైనదియు, యెల్లపుడు నుండునదియుఁ గాదని యెఱింగిన. తెలివిఁగలవారు, స్థిరమైన పరమాత్మనుఁ జేరుటకుఁ దగు యత్నంబుఁగావించి కృతార్థులగుదురు. మఱియును జగంబునఁ, జంతువులు, జరాయుజంబులు, (అనఁగా గర్భకోశమునుండి మావి వలన బుట్టినవి) నండజములు, (అనగా గ్రుడ్లవలనఁ బుట్టినవి) స్వేదజములు, (అనగా చెమటవలనఁ బుట్టినవి) నుద్భిజములు, (అనఁగా విత్తనముల వలన భూమినుండి పుట్టినవి) అన్నువానికి స్వతంత్రమగు జ్ఞానముగలిగి యేకార్యమును నొనరింపలేని వగుటచే వానికి పుణ్యముగాని పాపముగాని కలుగదు. కర్మానుసారముగా జన్మించుటయు నశించుటయు మాత్రమే సంభవించుచున్నది. కావున పైరీతిని నాలుగు విధములగు జన్మములలో జరాయుజము (మావివలన బుట్టినవి.) లేముఖ్యములు. వానియందు మనుష్యజన్మము ప్రధానమైనది. దుర్లభంబగునట్టి మనుష్యజన్మప్రకారంబుఁ జెప్పెద నాకర్ణింపుఁడు.

### యముఁడు సానందునకు మనుష్యుల యుత్పత్తిక్రమం బెఱిఁగించుట.

లోకము స్త్రీలు ఋతుమతులైనపుడు నాలుగు నాళ్లుచు గడచింపై స్నానమొనరించి తిలకముఁ బెట్టుకొని పరగడుపుగాకుండులాగున

నేదేని యొకవస్తువు, యేదియు లేనియెడల నుప్పురాయినైనను నోటవేసుకొని యితరులను చూడక మొట్టమొదట తనభర్తముఖ మును చూడవలయును. భర్త యాసమయమునకు యింటలేకున్న యతనిరూపము నయినను పూర్ణముగా మనసున నెంచి యటు పిమ్మట నితరులను జూడవలయును. ఇది విధి. యేలననఁగా స్నానము చేసిన తోడనే యెవరి ముఖముంజూచునో వారివంటి సంతానమే యామెకుఁగలుగునని తత్వమెఱిఁగిన పెద్దలుచెప్పుదురు. కనుకనే యుత్తమస్త్రీలీ యాచారమును తప్పక నడుపుచుందురు. అటుల స్నానముచేసినది మొదలు పదహాఱుదినము లాడువారికి ఋతు కాలముగా శాస్త్రంబులవలన నెఱుంగఁబడు. అట్టి ఋతుదినంబులలో స్త్రీపురుష సంయోగంబున, శుక్ల శోణితంబులు గలిసి యువతులకు గర్భోత్పత్తియగును. అందు, అనగా నా పదునాఱు నాళ్లలో బేసి దినములయందు గర్భమునిలిచిన యాడుశిశువును, సరిదినములలో గర్భమొదవిన మొగశిశువును, గలుగును, సరిదినము, బేసిదినము కలియుకాలమున నయ్యేనేని నపుంసకుఁ డుదయించును. యీ పది యాఱునాళ్లలో కడపటిదివసంబున గర్భిణి యయ్యేనేని యామెకు జనించువాఁడు మండలాధిపతి యగును. ఇది దేవరహస్యమగు విషయము మఱియొక విశేషముఁజెప్పెద. స్త్రీపురుషుల సంగ మంబున పురుషుని వీర్యమెక్కుఁడైన పురుషుఁడును, స్త్రీశోణిత మెక్కుఁడైన స్త్రీయును జనించును. శుక్లశోణితములు సమాన ముగాఁ గలిసెనేని నపుంసకుఁ డుదయించును. గర్భంబున కుడిప్రక్క పురుషుఁడును, యెడమప్రక్క స్త్రీయును నుండును, నపుంసకుఁడగు నేని గర్భమధ్యమున నుండును. కారణములేక జన్మకలుగవే కలుగదు, సతిపతులు కూడినపుడు, విలాసము నానందమును గలుగుటకు నిమిత్తమైన శుక్లము జాఱి యువతిమర్మస్థానము లోపలనుండు కమల మధ్యంబునఁబడి నపు డచ్చటి శోణితముచే నావరింపఁబడి, తత్సమ యంబున సూక్ష్మమైన యొకపొరగప్పికొనుట వలన నది యతివ గర్భకోశములో నల్లై నిలిచి శిశుజననమునకు కారణమగుచున్నది. ఆలాగున కూడి యేర్పడిన శుక్లశోణిత బిందువులు కలిసినదియు,

పొరచేఁ గప్పఁబడినదియునై యా కమల కోశాంతరస్థలమున నది యేర్పడిన మొదటిమాసమున మొదటిపక్షములో నురుగువలెనుండి రెండవ పక్షమున యానురుగు పేరి గట్టిపడును. రెండవమాసము నిండునప్పటి కది యొకముద్దగానగును. తరువాత నొకనెలకు గింజల యందునుండి యంకురములు పుట్టినలాగున నవయవములుపుట్టి యవి నాలుగవ మాసాంతమునకు, కాలు, చేయి, వ్రేళ్లు, గోళ్లు, ముక్కు, చెవులు, తలయేర్పడును, మఱి యైదవ మాసాంతము లోపల యెముకలు, నరములు, మాంసము, రక్తమునుఁ గలుగును. ఆరవ మాసమున వెంట్రుకలు, రోమములు, నుద్భవించును. అపుడే ప్రాణ యుక్తమై యుండుంగావున, నేడవనెలయందు దేహచ్ఛాయయు దేహ పుష్టియుఁ గలుగును. అపుడు మనస్సును వివేకమునుఁ గలదైన యాశరీరము నొందిన ప్రాణము (అనఁగా నాశిశువు) గర్భ నరకవేదన సహింపలేక తపించి యనేకవిధంబుల విలపించుచుండును. యెట్లనఁగా, తల్లియొక్క జఠరాగ్ని వేడికి తాపమును గొని, తల్లియొక్క యిరుప్రక్కల యెముకలును బంపములవలె నొత్తుచుండ చిన్నచిన్నవగు గర్భముననుండు పురుగులు ముండ్లవలెఁ బొడుచుచుండ వీనికన్నిటికినిఁ బాలుపడి, శోణితముఁ ద్రాగుచు, గర్భకోశమందలి మలము మూత్రము మొదలగు వాసిలో మునిగి, దుఃఖమునుఁ జెందుచు, రెండు చేతులతోను రెండు చెవులను మూసికొని మోచేతులు ముడుచుకొని, రెండు కాళ్లకు నడుమనుంచుకొని, తపించుచుండును. ఆ సమయమున పూర్వజ్ఞానము గలిగియుండుటంజేసి జీవుండు తన తత్పూర్వజన్మమునఁ గావించిన పనులును, తానొందిన కష్టసుఖములును, నరకాది ఘోరబాధలును, జ్ఞాపకమునకుం దెచ్చుకొని మరల జన్మించవలసి వచ్చినందుకై మిక్కిలి దుఃఖమును జెందు. అయ్యో! ప్రారబ్ధకర్మ యూరకపోవునా? మరల పాపభూయిష్ఠమైన లోకంబున ఒప్పించవలసి వచ్చెనుకదా! యేమి సేయ వచ్చును? కష్టసుఖములను తరంగములతో కూడినదియు, నాలుబిడ్డలను తిమితిమింగ లాదులతో కూడినదియు, దాటుటకు సాధ్యముగాని వెడల్పుగలదియు, నాశయనెడి లోతుఁగలదియునగు సంసార

మనెడి సముద్రములో మరల మునిఁగిపోవుటకు సమయము తటస్థిం
చెనే ! దైవమా! యని మొఱఁబెట్టుచుండును. మఱియు నిట్టి నరక
హేతువగు జననము గలుగకుండుట కెయ్యదిమార్గము ? యీ మ
హోపద్రవముఁ దప్పించుట కా పరమేశ్వరునికిఁ దక్క యన్యులకు
సాధ్యముకానేరదని చిదాకారుఁడైన పరంధాముని తన వివేకంబుకతన
ధ్యానముఁ జేయు. ఇట్లుండ నెనిమిదవ మాసంబు ప్రాప్తించిన
తన్నావరించిన మాయచేఁ గట్టువడినవాఁడై, కదల మెదలలేక
పరితాపంబునఁ గాళ్లు, చేతులు, నొక్కింతఁ జలింపఁ జేయునపుడు వెలికి
శిశువు గర్భంబునఁ గదలుచున్నట్లు తోఁచుచుండు. నవ్విధంబున
కష్టపడుచుండియు, ప్రాణహీనుని విధంబుననుండి, యధోముఖంబుగా
మాతయొక్క నాభిప్రదేశంబునఁ జేరి, మాత భుజించు నన్నరసంబు
జారి హృదయంబుననుండి నాడులమూలంబున నాభిచెంతకుఁ బ్రస
రించిన, నదియె యాహారంబుగా ప్రాణంబులం బట్టుకొని యుండ, నంత
తొమ్మిదవ నెలయగుడు, ప్రసూతిసమయమున గర్భగోళమునుండి
పవనవశంబున నచ్చోటువిడిచి, యధోద్వారమునుండి తల్లక్రిందుగా
వెలువడి, దుఃఖింపుచు మేదోరక్తములతోఁ గూడిన దేహముఁ గల
వాఁడై, సూత్రము తెగి క్రిందఁబడెడు బొమ్మవలె భూతలంబునఁ బడి,
పూర్వము తనకుంగలిగియున్న తెలివి కోలుపోవును. తద్వాసనా
మూలమున నేడ్చుచు, కుక్కలు, పిల్లులు, యెలుకలు మొదలగు
జంతువులకు నందకయుండులాగున దండహస్తులచేత రక్షితుఁడై, తన్ను
తానెఱుంగక చెంతఁ దోఁచువానిని మనుజునిఁగాఁ దలంచుచు, మోహాని
గ్రహంబు కనుపించిన తల్లియని భ్రమించుచు, చీము, నెత్తురులు
పానము చేసిన కతంబున జ్ఞానము నశించి, శ్లేష్మగుణమున సుషుమ్న
యనెడి నాడియందు పూరితంబగుటవలన నేదియుఁ జేయనేరక యుండును.
ఈ శ్లేష్మప్రభావంబువలననే గర్భమునందుఁ గల కాలంబున గోడునుఁ
జేయఁజాలక యిక్కట్టులపాలగు. నివ్విధంబున మూఢభావమొంది
క్రమముగా, కొంతకాలము బాల్యమును, కొంతకాలము కుమార
త్వమునుఁ జెంది కడపి, పిమ్మట యౌవనదశ సమకూరినపుడు ముందు
వెనుక యోచింపక, విలాసాదికృత్యంబుల నిమగ్నుఁడై, కామంబు హెచ్చి

మచ్చకంటులతోఁ గలిసి మదనతంత్రముల నానందింపఁ బ్రయత్న మొనరించి, యందుకై నానాకష్టములును గొంచుచు తనకోరిక నెరవేరినపుడు సంతోషముఁ జెందుచు, నెరవేరనపుడు చింతిల్లుచు, నిట్లు కొంతకాలంబు గడపి, యనంతరము సంసారమనెడి గట్టిదారములచేఁ గట్టఁబడినవాఁడై, భార్య, బిడ్డలు, ధనమునను, యీమణత్రయము నకుంజిక్కి, కష్టకారణమయిన కుటుంబపోషణ భారంబుఁ దలమోచి యందునకుఁగా నెన్నియోమాయలు తంత్రములుఁ బన్ని చేయరాని పనులన్నియుఁ జేయుచు, నొండొరునో మోసపుచ్చి వెతలనొందు నట్లొనరించుచు దయ, సత్యము, శుచిత్వములుమాని చరించుచు, గొంత కాలంబు గడపి, యటుమీఁదట ముసలితనము ప్రాప్తించుటయు, క్రిమకులోఁబడి, యింద్రియంబులు పటుత్వముడుగుటం జేసి, వాతము పిత్తము, శ్లేష్మమునను, మూడుగుణంబులును నానారోగములను గలిగింపఁగా, వానిచేఁ బీడింపఁబడుచుండును. ఇట్లు కొంతకాలంబు శరీరపటుత్వంబు దప్పి కష్టపడుచున్నతఱి, మెఱుము మెఱసిన లాగున మృత్యువాసన్నంబైన, గరుడునిచేఁ గాలఁదన్నికొనఁ బోఁబడుపాము వలె, జీవంబుఁ గోల్పోయి, కుబుసము విడిచిన నాగుబాము చందంబునను, పక్షులు చెట్టుమీఁదనుండి యెగసి మఱియొక చెట్టుపై వ్రాలిన విధంబునను, మానవశరీరంబు విడిచి. స్వచ్ఛమైన యాతనా శరీరంబుఁ గైకొనిన, యాజీవుని నాదూతలు రయంబున బోయి పట్టికొనివత్తురు. అట్టిపాపకర్ములు విచారింపబడి, వారు చేసిన పాపంబులకుందగిన శిక్షా వాలన బొందినవారై, యనుభవించుచుండుదురు. అట్టివారు పొందిన దేహంబు లేమి చేసినను ప్రాణంబులఁ బాయవు ఒకవేళ నటులతటస్థించినను, నిచట వీఁచుచుండు సంజీవనియనుగాలి సోకినవెంటనే, మరల బ్రతుకుచుండుదురు. యెల్లపుడు నిటియునాఁ, యీపాపులగు జన్తులకీ శరీరంబులు పోవదగిన మరణము కలుగనేరదు యది యనాదికల్పితమైన భగవంతుని సిద్ధసంకల్పమునఁ గల్గినవిశేషము. దాని నెవ్వరుం దెలియఁజాలరు. పుట్టుటకు గిట్టుటయుఁ గిట్టుటకుఁ బుట్టుటయు, నిమిత్తంబులగు, నియమాదియగు రోగంబు మాన్పు నాది మధ్యాంతరహితుఁడైన పరమేశ్వరుండను వైద్యుఁడు దప్ప, యితరులకు సాధ్యము

కానేరదు. జన్మమును, మరణమును, మహాదుఃఖకరములయినవి యని తత్వ మెఱింగినవారైన పెద్దలు వివరించుచుందురు. ఇది మానవజన్మ ప్రకారము. ఇంక దేహనిర్ణయ విశేషంబులఁ జెప్పెద వినుండని యిట్లనియె మునీంద్రా ! వికల్పము లేనివాఁడును,

—యముఁడు సానంగునకు దేహనిర్ణయ ప్రకారమునుఁ జెప్పుట.—

అంతము లేనివాఁడును, అంతటికిని కర్తయు, మొదటివాఁడును, యెల్లపుడును, నానందమే రూపముగాఁ గలవాఁడును, నిర్మలమైన వాఁడును, లోకంబు లన్నియు నుదరంబునఁ గలవాఁడును, పరమునకు పరమైనవాఁడును. నగు యీశ్వరునకు నేను ముందుచెప్పిన యవిద్య (మాయ) సమస్తకార్యములకు నాధారమైయుండును. అది యీశ్వరుని సంకల్పము `లాగునఁ బ్రవర్తిల్లును, సాత్వికము, రాజసము, తామసము, నను మూఁడు పేరులతో మూఁడు విధముల గుణములు గలిగి యుండును. వాని విశేషంబు లెట్లనిన, నందు సత్వమను పేరుఁ గల గుణము జ్ఞాన స్వభావముఁగలదై తెల్లని వర్ణముననుండును. రాజసము చంచలమగు స్వభావమును, నెఱ్ఱని వర్ణమును, గలిగి యుండును. తామసగుణమున కజ్ఞానము స్వభావము. కోపము, ప్రధానమై నలుపు, తెలుపుంగలిసిన బూడిదరంగుం గలిగియుండును. యీగుణంబులతోఁ గలిసిన మాయ దేనితో చేరినపుడు దానిగుణము నిచ్చుచుండును తెలిసిన యోగులు మొదటిదానినే యనుసరింపుదురు సకల జీవకోటులకును, నుత్పత్తికిని, వర్ధిల్లుటకును, నాశనము పొందుటకును, నీమూఁడు గుణములే కారణమగుచున్నవి. జన్మ ప్రకారము ముందు వివరించియున్నానుగదా ! అట్టుల గర్భమునందు త్రిగుణ రూపమయిన ప్రకృతి (మాయ) తోఁగూడిన శరీర మేర్పడుట యెట్లన, తల్లి దండ్రులుతినెడి యాహారసములు (అనఁగా, నుప్పు, పులుసు, కారము, తీపు, వగరు, చేదు) కలిసిన యన్నరసము క్రమముగా నారుకోణముల (మూలలు) యందుఁ బ్రసరించి యవి కూడి శరీరమేర్పడుచున్నది. తండ్రి భుజించురసము వలన నెముకలును, మజ్జ (అనఁగా యెముకలలోనుండు మూలుగు) కలుగుచున్నది. తక్కినవి తల్లిరసమునఁగలుగును. యెముకలిగి దేహమున, త్వక్ (అనఁగా

చర్మము ను, చక్షువు, (అనగా కన్నులు) ను, జిహ్వాయు, (అనఁగా నాలుకయు) ను, శ్రోత్రము, (అనఁగా చెవులు) ను, ఘ్రాణము,(అనఁగా ముక్కు) ను, నను జ్ఞానేంద్రియము లైదును, వానికార్యముల (అనఁగా నవియైయును చేయుపనులు) ను తాకుటను తెలుసుకొనుట, చూచుట, పలుకుట, ధ్వనినివినుట, వాసనను గ్రహించుట, యను నైదు గుణంబులఁగలిగి యవియును, నోరు, చేతులు, కాళ్లు, గుదము, గుహ్యస్థానము నను, నైదుతోఁగలిసి యీపదియును కర్మేంద్రియములని చెప్పఁబడును. వెనుక చెప్పిన యైదగు వానికి మాటలాడుట, యిచ్చుట, పుచ్చుకొనుట. లేక చేయుట, నడుచుట, విసర్జించుట అనఁగా విడుచుట, మర్మక్రియా సంబంధము గలుగుట, విషయంబులు మఱియు, మనస్సు, బుద్ధి, చిత్తము, నహంకారము నను పేరులతో నంతఃకరణ చతుష్టయమనఁబడు మనస్సుయొక్క వికారంబులు తొలుతఁ జెప్పిన గుణములు మూడింటి యొక్క భేదములై యొప్పుచుండు. ఇట్టి యింద్రియములతో గూడిన శరీరమున ప్రధానమగు సత్వమను పేరుగల గుణంబువలన జీవునకు మంచిగుణములును, తృప్తియు, సంతోషమును, నారోగ్యమునుఁ బుట్టెను, రాజసంబను పేరుగల దానివలన, గర్వము, ధైర్యము, మత్తత మొదలగునవి జనించెను. తామసంబను దానిచే, కోపము, కోరికలు, మచ్చరము, పిసినిగొట్టుతనము, మదమును, నాలస్యమును, నిద్రయుఁ, బ్రమాదము (అనఁగాఁ బొరపాటు)ను, మోసమును, జనియించెను. శరీరము పంచభూతములకు, భూమి, నీళ్లు, నిప్పు, గాలి, ఆకాశము వీనిసమ్మేళన . కావున వానియందుఁ బుట్టెడి గుణములు, మనస్సు మొదలగు నంతఃకరణములని చెప్పఁబడు వానిచే వరింపఁబడు చున్నది. ఈపంచభూతములును, నెట్లువచ్చెననిన, శూన్యమగు నాకాశంబు నుండి చెవులకు వినఁనైన శబ్దంబు జనించె. నాశబ్దబలమును గూడుకొని యాకాశమున గాలిపుట్టెను. గాలి గుణము దేహమునకుఁ దగులుట కావునఁ, నది తెలియుటకై త్వగింద్రియ (మనఁగా తగులుటను తెలుసుకొను శక్తి) ము సంభవించెను. యీవాయువు పెక్కువిధములుగా భేదములు గలిగియుండు. నెట్లన్న మొగయుట, పడుట,

వచ్చుట, పోవుట, మునుగుట, మొదలగు గుణములకు నిమిత్తమైన యీగాలి, ప్రాణవాయువు, నపానవాయువు, సమానవాయువు, వ్యానవాయువు, నుదానవాయువని యైదును, పంచప్రాణములుగాను, నాగము, కృకరము, కూర్మము, దేవదత్తము, ధనంజయము, నను నుపవాయువు లైదునుం జేరి పదివిధంబులయ్యె. నన్నిటియందునుం బ్రాణవాయువు ముఖ్యమైనది. యదికుత్తుకకు క్రిందుగను, బొడ్డునకు మీందుగను నుండుప్రదేశంబున సంచరించును ఇది నాశికారంధ్రముల నుండివొచ్చి బొడ్డువరకుంబోయి, హృదయంబున వ్యాపించి, కుత్తుక వరకుం దిరుగును. రెండవదియును, మాటలాడుటకును, దేహమునకు పటుత్వముం గలిగించుటకును, కారణమగు నపానవాయువు. గుద స్థానమునుండి మేఢ్రము, నడుము, రెండుతొడలు, పిక్కలు, నాభి కడుగుభాగము, వృషణములు మొదలగు ప్రదేశముల సంచరించును. మలము, మూత్రము, వీర్యము మొదలగువానిని విడుచుటకు కారణమైనది వ్యానమను పేరుంగల గాలి. యది కనుంగొలంకులయందును చెవులయందును సంచరించుచు, సమయము వచ్చినపుడు ముందుచెప్పిన ప్రాణవాయువు, నపానవాయువును, గలిసి వర్తించుచుండును. పైని పేర్కొనిన మూడువిధములగాలికిని, సమానముగా వానివానిం జేరి సమానమనుపేరుగల నాలవగాలి, తినినవస్తువులను జీర్ణముం జేయు జఠరమనెడి గర్భకోశమునందుండు నగ్నికి సహాయకారిగా నుండి పదార్థంబులు జీర్ణముంగావించి యన్నపానాదులరసమును, యొప్పుడెప్పు డేయేయంగమునకును, నాడికిని యెంతెంతగావలయునో యంతంత వానివానికిం బంచిబెట్టి వానిని వృద్ధింజేయుచుండును, అయిదవదగు నుదానవాయు వెల్లనాడులయందును సంచరించును. అది కాళ్లు, చేతులు, మొదలగు నవయవములయందుం దిరిగి, యాకలి, దాహము, కష్టము, మొదలగునవి పుట్టించుచుండును. నీ వైదుంగాక మఱియుంగల యుపవాయువు లైదును, చర్మము, రోమములు, రక్తము, మాంసము, మెదడు, నెముకలు, యెముకల లోని మూలుగు ననియెడి సప్తధాతువులనం జెప్పంబడువానియందు సంచరించుచుండును. అయిదు భూతములయందు నొకటియగు అగ్ని

యందు గల గుణమువలన రూపము, తెలివి, తినిన పదార్థములు జీర్ణించుట, ప్రకాశముగలుగుట, శౌర్యము, విలాసము, సంతోషము, మనస్సునకు బలము, కోపము, యిట్టి లక్షణములు కలుగును. మఱి యొక భూతమగు జలగుణము వలనను, రుచి తెలియుట, చల్లదనము, శరీరమున నీరూరుట, అనఁగా చెమరించుట, యీ మొదలగు లక్షణంబులును, మఱియొక భూతమగు భూమి గుణమువలన, వాసన తెలియుట, గౌరవము, ధైర్యము, సాహసము, మొదలగు లక్షణములును గలుగును. యీ భూతము లయిదింటియందును పృథ్వీభూతము ముఖ్యమైనదని వివేకులు సెప్పుదురు. ఏలనన, సమస్తయోషధులును, పైరులును, ఫలవృక్షములు మొదలగునవి యన్నిటికి పృథివి యాధారము. దానియందుఁ బుట్టిన వస్తువలే జీవకోటుల కన్నిటికి జీవనోపాయము కాఁబట్టియు, చర్మము మొదలగు నింద్రియములు పృథివి వలనఁ బుట్టిన వగుటఁబట్టియు, నది ముఖ్యముగా చెప్పఁబడినది. జీవులు భక్షించు వస్తువులు జఠరాగ్నివలన జీర్ణమైనపుడు పురీషము, (అనఁగా, మలము)గా మారిపోవును, పదార్థసారములో కొంత భాగము మాంసమునకుఁ జేరును. కొంతభాగము మనస్సునకు దార్ఢ్యము నిచ్చుట కుపయోగమగును. ఇట్లు అన్నరస సంయోగముఁ గలిగిన దగుటచేతనే మనస్సునకు అన్నమయంబైనది మనస్సని పెద్దలవలన చెప్పఁబడినది. అన్నసారమున కొంతభాగము రక్తముగా మారిపోవును. అదియే ప్రాణమని చెప్పఁబడినది. యింక జంతువులు త్రాగెడి నీరు జీర్ణకోశమున జీర్ణించుటకు నోడ్పడి శేషించిన జలము మూత్రముగా వెలువడును. యిట్లుండుటఁబట్టి ప్రాణము పృథివీ భూతాత్మకమని చెప్పబడును. అగ్ని భూతకారణంబున శల్యంబులకు బలమునిచ్చు మజ్జయొదవెను. తత్సంబంధమున మాటలాడుశక్తి సంభవిల్లెను యది యట్టిది కాఁబట్టి తేజస్సు అభిన్నమై అనఁగా అన్నిభూతముల యందుఁ గలిసినదై యుండును, రక్త సంయోగమువలన మాంసమును, నందు వలన వీర్యమును జనించెను ఆ వీర్యముచే వాతము, పిత్తము, శ్లేష్మము అనెడి భేదములుగలిగి ధాతువులు పుట్టెను. మఱియొక్క విశేషం బేమనిన, శరీరమున అంజలి, (అనఁగా దోసిలి) కొలఁది వదుపరించి

పది దోసిళ్ల నీరును, తొమ్మిది దోసిళ్ల రసమును, యెనిమిది దోసిళ్ల రక్తమును, యేడుదోసిళ్ల పురీషమును. నాఱుదోసిళ్ల పురీషమును, నైదుదోసిళ్ల పైత్యమును, నాలుగుదోసిళ్ల మూత్రమును, మూడు దోసిళ్ల మజ్జయు, రెండుదోసిళ్ల మెదడును, అరదోసెడు శుక్లమును, గలదియై యుండును. యిట్టి శుక్లమను పేరుఁగల వీర్యమే శరీరమునకంతటికిని బలకరంబై తేజస్సు నిచ్చుచుండును. ఇదిగాక ఆపోభూతాత్మకముగా, అనఁగా జలంబులచే రుచికరములు, తరుణంబులు, నవకంబులు, నను పేరులతో ఆఱునూఱుల నరములు దేహంబున నుండునని తత్వజ్ఞు నెఱిఁగిన యోగులు చెప్పుదురు. మఱియు రౌరవములు ప్రసవంబులు, సేచనంబులు, నలూఖఖండంబులు, సముద్గమంబులు, మండలంబులు, శంఖఘాతంబులు, వాయసతుండంబులు, నను పేర్లుగల యెముకలతోఁ గూడి కీళ్లు అనఁగా యెముకలసంధులు యెనిమిది విధములై యొప్పుచుండును. శరీరమంతటను మూడుకోట్ల యేబది లక్షల రోమకూపము లుండును. యిట్టి లక్షణములతో గూడిన శరీరమునకంటె మేలగు పదార్థం బెద్దియును లేదు. యిట్టి శరీరము మోక్షభావము గలిగి సత్ప్రవర్తకులై నిరహంకారమున నొప్పువారికిఁ దప్ప తక్కిన వారికి సార్థకంబు గానేరదు. మహాత్మా! శరీరలక్షణంబుఁ జెప్పితి నింక జీవస్వరూప మెఱింగించెద నాలకింపుము.

### యముఁడు సానందునకు జీవస్వరూపంబుఁ దెలుపుట

అహంకారాదులు లేనివాఁడును, చిన్మయాకారుఁడును, ఊరు పేరు రూపము పని యిట్టిదని చెప్పుటకు సాధ్యము కానివాఁడును, మహాతేజోవంతుఁడును భోగములకు కర్తయైనవాఁడును, నైన యీశ్వరుఁడు బ్రహ్మమొదలు పిపీలకాదుల పర్యంతమును సర్వమును తానయై కర్త (అనఁగా చేయువాఁడు) ప్రేరకుఁడు (అనఁగా చేయించువాఁడు) క్రియ (అనగా చేయఁబడిన దానివలనఁ గలుగు సుఖదుఃఖములు) తానై విశ్వమంతయు తన స్వరూపముగా విలాసక్రీడ సలుపుచుండును అన్ని జంతుజాలముల పుట్టించుచు, యోసి ప్రధానమైనది జగత్తనియు, నందు బీజప్రధానుఁ డచ్యుతుఁడైన పరమేశ్వరుఁడనియు, చెప్పుదురు. యెవ్వనియందు సమ్మతమైన సమదృష్టి యనఁగా శాంత

మగు చూపు గలుగునో యట్టివానిచే పుణ్యకార్యములును, యెవ్వని యందు విషమదృష్టి యనఁగా తీక్ష్ణమగు చూపుగలుగునో యట్టి వానిచే పాపకార్యములును జేయించుటయే యతని విలాసమునకు ప్రధానలక్షణము. కావున మానవులు యెల్లపుడును సంతోష మనస్కులై భగవంతునియందు నమ్మకముఁ గలిగి యతని నారాధించిరేని, సద్గతి జెందుదురు. సంశయముఁ గలవాఁడు మోక్షము నొందఁ జాలఁడు. కావున నభిమానము సందేహమువిడిచి, స్థిరచిత్తుఁడై వేదాంతవిమలగు పెద్దలవలన తత్త్వమునుఁ దెలిసికొని సన్మార్గమునఁ బ్రవర్తించువానికి మోక్ష మరచేతిదై యుండుననుట నెఱుంగవలయును. యెవ్వఁడు సత్యము, దయ, యోగ్య, శాంతము, ధర్మము లీ మొదలగు గుణములఁ గలిగి తత్త్వవిదుఁడై సదా పరోపకార చింతఁ గలిగి జీవహింసఁ జేయక సర్వసముఁడుగా ప్రవర్తించుచు, భగవంతుని మాయను గడచుటకుం దగిన యత్నముఁజేసి సర్వేశ్వరు నారాధించునో, యట్టివాఁడు నా వాహనమగు దున్నయొక్క మెడయందుఁ గట్టఁబడిన గంటయొక్క గణగణశబ్దము వినఁజాలఁడు. అనఁగా అట్టి సత్పురుషుని చెంతకుఁగూడ నేను పోవుటకు శక్తుఁడను కాననుట. ద్రుమాదులయొక్క రాపిడిచేత నిప్పుపడి యది కొండలయందలి యడవుల నన్నిటిని భస్మముచేసిన లాగున వేదాంతశాస్త్రము నెఱిగిన పెద్దల యుపదేశమనెడి యగ్నిచే యోగ్యుఁడగువాఁడు మహా పాతకములను నడవులను దహించివేయును. యేపని చేసినను తీరని పాపమును వేదాంత విచారమువలనఁ బాపుకొనవచ్చును. దానివలనఁ బోలంగని పాపమేలేదు. ఇది సత్యము. ఇది జ్ఞానియగువాఁ డెఱుంగునుగాని సామాన్యు లెఱుంగరు. అద్దమును చూచునపు డందు రూపము స్పష్టముగాఁ గనుపడి యా యద్దమును మూసియుంచినపు డంతకు మున్ను కనుపడిన రూపాదులు తోచనిలాగున భగవంతుని మాయయను నద్దమున జగంబులు ప్రతిఫలించి లీనమగుచుండును. గాని స్థిరమనియు, సత్యమనియు, నమ్మరాదు. మంచిమార్గము నవలంబించిన యోగులయందు దయఁగలవాఁడై యీశ్వరుఁ డట్టివారికి కీడుఁ గలుగనీయక వారిని రక్షించుచుండును. ఈ విశేషంబును విచా



(౧౧౭-వ పుట.) యముఁడు సానందునకు జీవస్వరూపంబుఁ జెప్పుట.

రించి చక్కఁగా తెలిసికొని దయాకరుఁడైన భగవంతుని మరువక యతని యనుగ్రహము కు పాత్రులగుటకై ప్రయత్నముఁ జేయుట మంచిది. సంసారసంబంధమగు సమస్తకష్టములును, తాపత్రయమును, దేహాభిమానమును, నానా సంశయాదులును, భగవంతుని కరుణకు పాత్రులగువారు సులభముగా తరించి శాశ్వతమగు సౌఖ్యమును పొందుదురు. లేనివారు పాపపంకమునఁబడి యల్లాడుదురు. తత్వవేత్తలగువారు దానధర్మముల వలనను, తపంబువలనను, జపంబువలననుఁబడయరాని నిర్వాణపదవిని సులభముగాఁ బొందఁగలరు. గనుక మనుష్యుఁ డవశ్య మాత్మవిచారముఁ జేయుటమంచిది. నాస్తికుఁడుఁ (అనఁగా భగవంతుఁడు లేఁడని వాదించువాఁడు) ఏక సమ్మతముతో సచ్చిదానంద మయుండగు నీశ్వరునికిని జీవునకునుఁగల సంబంధమును చక్కఁగా నెఱిఁగిన పెద్దలవలనఁ దెలిసికొని మహాకష్టంబులకు కారణంబును జనన దుఃఖములకు మూలంబునునైన సంసారబంధంబునఁ గట్టువడక నిర్మలచిత్తుఁడై రాగము ద్వేషము మొదలగువానిని విడిచి యేమానవుఁడు అహంబ్రహ్మాస్మి, (అనఁగా నేనే బ్రహ్మము.) అని నిశ్చలుఁడైయుండి శాశ్వతంబగు ముక్తిమార్గమునరసి సంతసించునో, యతఁడే యానందమయుఁడని యోగుల యభిప్రాయము. అట్టివానికే జీవేశ్వరులు భేదములేక యొకటిగానే తోఁచుచుండును. శరీరమునకు నాశము కలదుగాని జీవునకు చెరుపులేదు అనఁగాజీవుఁడు నాశముఁ జెందువాఁడుగాఁడు. అట్టిపరమాత్మస్వరూపుఁడగు జీవుఁడు మాయామయంబగు ప్రపంచమున పలువిధములగు శరీరములను ధరించియాపంబునకుండదగిన కర్మల నాచరించుచుండును యెల్ల జీవములయందును మొదటిదని చెప్పఁబడిన మానవ శరీరము, తెలివికి మూలమై జ్ఞానేంద్రియములను పేరుతో నొప్ప నట్టి యైదింద్రియంబులును, నంతఃకరణ చతుష్టయము (అనఁగా మనస్సు, బుద్ధి, చిత్తము, నహంకారము)తోఁ గూడి పదొమ్మిది తత్వములతో లింగశరీరము (అనఁగా మానవ దేహము) గలిగెను. అట్టిశరీరమున ప్రకృతి (మాయా) కలితమై ప్రతిఫలించుట వలన నందు వసించుట నిమిత్తంబుగా నా భగవంతునికి జీవుఁడని మారుపేరు సంభవించెను ఆజీవునకు క్షేత్రజ్ఞుఁడు. పురు

షుఁడు, మొదలగు నామంబులు పొసఁగెను. అట్టిపేరులను వహించి యిహ సుఖము, కష్టము, పరసుఖము, కష్టము, జాగ్రత (యనఁగా మెలఁకువ) నిద్ర (అనఁగా తెలియకుండుట) స్వప్నము (అనఁగా కలలు గాంచుట.) యీమొదలైన యవస్థలకులోనై యుండు. నెట్లన్న, నద్దము మాసి యున్నపుడు చూచుకొన్న పక్షమున తనముఖముఁ గూడ మాసినలాగున దోచునుగదా! యట్లే జీవుఁ డంతఃకరణ చతుష్టయ మనెడి మాలిన్యముతోఁ గూడినవాఁడై చూచునపుడు తాను మలిన వంతుఁడైయున్నట్లు భ్రమపడి యభిమానంబు కతంబున సుఖము దుఃఖము ననుభవించుచుండును. తెలివిలేనివానికి యెండ మావులు నీరుగాఁ దోఁచులాగునను, గ్రస్తుఁడు (అనఁగా మ్రింగఁబడిన వాఁడు) కాని సూర్యుండు గ్రస్తుఁడయిన విధంబుగఁ గనుపట్టు చందంబునను, నట్టికళంకమును లేనిజీవుఁడు కళంకముఁగలవానివలె సుఖదుఃఖములకు లోనగుట మాయయొక్క ప్రభావమని తెలియవలెను. పిండాండము న (అనఁగా దేహమున) పాదము మొదలు శిగవరకును వ్యాపించి కనుబొమలనడుమ తేజోరూపంబున జీవుఁడు ప్రకాశించును. పుమని పేరుఁ జెందిన శరీరమునందు బొడ్డునకు మీఁదను మెడకు క్రిందనుగల ప్రదేశమున మధ్యభాగము హృదయంబగును. తత్త్వవేత్తలు హృదయము కమలమువలె నుండునని యుగ్గడించిరి. అట్టి హృదయకమలమునకు మీఁదిభాగము నాళము. (అనఁగా కాడ) యాకమల మధోముఖంబు (అనఁగా తల్క్రిందు) గానుండును. మీఁదికి సాగియుండు దాని కాడ లోని సన్నని రంధ్రమునందు సూక్ష్మమునకంటె సూక్ష్మమగు జ్యోతి రూపమున జీవుఁడు సంచరించుచుండును. యిట్టి సుందర పర్యాప్తమైన నాళము దేహమునఁగల యన్నివిధములయిన నాళముల (నాడుల)కును నాధారముగానుండును. యీ జీవ నాళాధారమున శరీరమునందు డెబ్బదిరెండు వేలు నాడులుగలవని మహాయోగులెఱింగి చెప్పుదురు [illegible] దేహమునకు [illegible]ంబులు. వానియందు మూ[illegible]యొక్క నాడులు [illegible] మిక్కిలియై [illegible] పది మఱియు సత్తెంబులు. అవి దశేంద్రియము[illegible] సంబంధముఁ గలిగి వాయువాని [illegible]లకు తో[illegible]డి పూర్వ

కర్మవశంబులై స్వప్నము మొదలగు నవస్థలను, నీచములగు సుఖములనుఁ, గలిగించుటకు హేతువులై యుండును. ఆపది నాడులలోను పెద్దదియు నుత్తమోత్తమమును, నగు నాడి యొకటి సుషుమ్న యను పేరువహించి మీఁదికి వ్యాపించియుండును. అది యనంతము (అనఁగా కొలతఁబెట్ట రానిది) గా భావించి వేదాంతశాస్త్రము నెఱిఁగినవారు దానియందు సంచరించు జీవుని నిజమైనరూపముఁ దెలిసికొనఁ బ్రయత్నింపుదురు. లోకంబున నెవ్వఁడా జీవుని స్వరూపముఁ గనుఁగొని యదియే తానగుటఁ దెలిసి, యాసుషుమ్న యను పేరుఁగల నాడీసంచారమును పాయుటకు యత్నించునో, యత్నించి నెరవేర్చునో, నెరవేర్చి ధన్యుండగునో, యతఁడు (అనఁగా అట్టి జీవుఁడు) ముక్తిస్థానముం జేరును. (అనఁగా మోక్షరూపమగు తేజమునఁ గలియును.) అదియే జీవేశ్వరుల యైక్యమనఁబడును. ఆలాగునఁ జేయు మహాత్ములనే యోగులు వర్ణించుచుందురు. యోగులు (అనఁగా తత్త్వమార్గమున బుద్ధిఁ జొనిపి యితర చింతలుమాని జీవుని స్వచ్ఛమైన రూపము ననేక విధములగు కృత్యములచేఁ దెలిసికొనఁ బ్రయత్నించువారు) సదా నిర్మలచిత్తులై వేదాంత విచారముఁ జేసి సాంఖ్యాది యోగముల నభ్యసించి కష్టపడుట యట్టి యనాదియు చలనము లేనిదియు, నానందమును గలిగించునదియు, నగు జీవస్వరూపమును దెలిసికొనుటకే యని యె

యకుండు పానంబునకు జీవేశ్వరుల యైక్యంబు వివరించుట.

ఱుఁగవలయును. సర్వవ్యాపకుఁడు (అనఁగా నంతటను నుండువాఁడు) గానుండు జీవుఁడు కొయ్యయందుండు నిప్పువలె దృగ్గోచరుఁడు (అనఁగా కంటికి కనఁబడువాఁడు) గాకయుండఁగ శరీరంబున లీనమై స్వేచ్ఛగా వర్తించుచుండును. నీటితో నింపఁబడిన కుండయందాకాశము కనఁబడుచుండి యాకుండ నెచ్చటికిఁ గొనిపోయిన నచ్చటి కాకాశమును గూడవచ్చు చున్నట్లు దోఁచుచుండి, యాకుండ పగిలిపోయి నపుడాకాశము నిరాకారము (అనఁగా లేనిది)గాఁ గనుపించిన విధంబున, శరీరసంబంధముఁగల వరకును నుండిన ట్లగపడుచుండు జీవుఁడు దేహంబు పోయినపుడు మాయంబగును. కాని నాశముఁ గలుగదు మరల శరీరము ధరించిన తొల్లిటి చందముననే కనుపట్టును. యిదియే

భగవన్మాయయని చెప్పునట్టి విచిత్రమహిమ. లింగదేహము (అనఁగా శరీరము)న జీవుఁడు పూర్ణుఁడై యుండుటయు, గొంత కాలమున కాదేహమును విడుచుటయు, నారోపణ మాత్రమే కాని యదిజీవునికి నిజమగు ధర్మము కాదు. శరీరసంబంధముఁ గలిగినపుడు జీవుఁడు, సూర్యుఁడుదయించి లోకంబంతయు వెలిఁగించు చందంబున జ్ఞానమను కాంతి గలవాఁడై యింద్రియసాధనంబులచే సర్వకార్యములను నొనరించుచు, కర్మపరిపాకమైనపుడాకర్మదేహమునువిడిచి నిర్వాణముఁ జెందును దీనికే దేహబంధవిమోచన మనిపేరు మున్ను వివరించిన తెఱంగున నీళ్లకుండలలో నాకాశము కనుపడునట్లు జీవుఁడొక్కఁడేరూపముఁగ నుండియు ననేక దేహంబులయందుఁ బ్రకాశించును. ఆకాశము యెన్ని నీటికుండలుంచి చూచినను నొకటిగానుండియు వేఱువేఱుగా వాని వానియందు సంబంధములేకఁ గనుపించునుగదా! వాసనాస్థితులంబట్టి యా లింగదేహము నశించినపుడు తాను వేఱై చిదానందమగు భగవత్స్వరూపమునఁ గలిసిపోవును. అట్లైన యశాశ్వతమగు దేహసంబంధము జీవునికిఁ గలుగుటకు నిమిత్తమేమి? యనిన, నదియే భగవల్లీల. సృష్టిక్రమంబున నేర్పడిన శరీరంబున నీశ్వరతేజంబు జీవరూపంబునఁ బ్రవేశించి మాయాచ్ఛాదితమైన కారణంబున సుఖదుఃఖములఁ గలిగించు హేతువులైన యింద్రియాదులచేఁ గట్టువడి, కర్మంబులాచరించి వానివలనఁ బొడమిన పుణ్యపాపములను శరీరముతోడ ననుభవించు నట్టి జీవుఁడు విజ్ఞానమువలన స్థూల శరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరము, నిర్మూలమైనపుడు స్వయంజ్యోతిర్మయుండైన సూర్యుండు తన కాంతిచే సర్వభూతముల యందునుఁ బ్రకాశించి ప్రేరకుఁడై యుండి కడపట తన తేజముఁ దనయందడఁచికొనిన భంగి, దేహమునకును, నింద్రియములకునుఁ, దనకును, సంబంధములేక వీడిపోయి, తేజోరూపంబువహించును. లోకంబునఁ బురుషుఁ డట్టిమాయాసంబంధంబునఁజేసి, జనన, మరణ, కష్ట, సుఖంబుల ననుభవించిన లాగునఁ బరిభ్రమించుఁగాని, నిజముకాదు. కలఁగన్న చందంబని యెఱుంగవలయును. దేహమునకును, దేహసంబంధములగు నింద్రియంబులకును. నాత్మవేఱైనదియు, బయలుపడనిదియు నయ్యుఁ ప్రకృతి మోహాబ

ద్ధంబై, కలిసియున్నట్లు తోఁచుచుండును. జ్ఞానంబువలన నిజ స్వరూ పంబుఁ దెలిసికొనినపుడు తనకును శరీరంబునకు నెట్టి సంబంధమును లేమి నెఱింగి పరిశుద్ధుండై, వెలుంగును. తేజోవంతుఁడవగు నో ముని శ్రేష్ఠా! ఇపుడు నాచేతఁ జెప్పఁబడిన వేదాంత సారంబగు నీ పరమ తత్త్వరహస్యంబును మున్ను దండకారణ్యంబున సీతాలక్ష్మణ సమేతుఁడై వసించుచున్నపుడు దశరథ పుత్త్రాగ్రేసరుఁడును, పరంధాముఁడును, విశ్వరూపకుండును నైన శ్రీరామచంద్రునకు, పరిపూర్ణ సచ్చిదానంద మయుండును, జగదీశ్వరుండును, గౌరీ మనోవల్లభుఁడును, నగు శంకరుండు ప్రియంబుమీఱ నానతిచ్చెను ఈ వ్యాఖ్యానముఁ జదివినను, వినినను, వ్రాసినను, నట్టివాఁడు పరిశుద్ధుఁడై మిక్కిలి తెలివి నొంది యిహసుఖంబులును, పరసుఖంబులునుఁ, (అనఁగా మోక్షము) జెందును. ఇది సత్యము. దీని నెవ్వఁడు నమ్మకుండునో యట్టివాఁ డెన్నిరీతులఁ బ్రయత్నించినను, జ్ఞానియై పవిత్రమగు నిర్వాణ పదవి నొందఁజాలఁడు. ఇట్లు వేదంబులు ఘోషించుచున్నవి. మహాత్మా! మీ రెఱుంగని బ్రహ్మవిద్యా రహస్య మేదియున్నది? ఇది యంతయు మీకుఁ గరతలామలకంబై యుండు. నైనను, తెలివిఁగల పెద్దవాఁడు బాలుని తెలివిమాలిన మాటల నాలకించి సంతోషించి మఱియుం బలికించు చందంబున నావలన వినుటకుం గోరికఁ జెందితిరిగాని యన్యము కాదు సంతోషంబయ్యె. నే నెఱింగిన నట్టుకుఁ దెలిపితి. నింక నన్నేమి యొనర్పుమని యెదరో శెలవు నొసంగుఁడనిన, యమునిమాట లాలించి సంతృప్తినొంది సానందముని యతని కిట్లనియె. దండధరా! నీవచనంబు లమోఘంబులు. వివేకకరంబగు తత్త్వరహస్యమును ప్రియంబున నీవు నాకెఱిఁగించితివి. అయినను, నింకఁ గొన్ని సందియంబులు నాకుం గలవు. నా సంశయంబులు నివారణ యగులాగున నాకుఁ దృప్తిగలిగించుటకుఁ దలంపుము. యోగంబులును, నాసనంబులును, జపంబులును, దపంబులును, నిమొదలగున వనేకము లనేకవిధంబులఁ బెద్దలు చెప్పుచుందురు. వాని తారతమ్యములును, విశేషములును, ధర్మంబులును, విధులును, నవి మోక్షసాధకములగు తెఱంగును, నిత్యాది విశేషంబులు వివరముగా వివరింపుము. వాని నెఱుంగుట

నాకు మిక్కిలి యావశ్యకమై యుండుననిన, ప్రీతుండై సానందునకు వైవస్వతుం డిట్లని చెప్ప నారంభించెను. దేవా! జ్ఞానేంద్రియములైదును, కర్మేంద్రియములైదును జేరి పదియింద్రియము లయ్యెనని యు దేహి కీయింద్రియములవలనఁ గలుగు ప్రయోజనములను మున్ను వివరించి యున్నాఁడఁగదా! అట్టి పదియింద్రియములకును, నంతఃకరణ చతుష్టయమనఁబడు, మనస్సు, బుద్ధి, చిత్తము, నహంకారము నను నాలుగింటిలో మొదటిదగు మనస్సునకును మిక్కిలి సంబంధముగలదు.

యముఁడు సానందునకు జీవతను చతుష్టయ మెఱిఁగించుట.

ఇంద్రియములకు మనస్సధిపతి యగునుగాని యింద్రియముల సంబంధము లేనపుడది వ్యాపించఁజాలదు. (అనఁగా మనసునకు స్వతంత్రశక్తి లేదు) సత్త్వము, రజస్సు, తమస్సు, నను మూఁడును మనస్సుయొక్క గుణములని పెద్దలుచెప్పుదురు. ఆమూఁడు గుణములకును తారతమ్య మెట్లనిన, జాగ్రత్త, స్వప్నము, సుషుప్తులను గురుతుగా నెఱింగిన సులభముగాఁ దెలియఁగలదు మనస్సాదియగు నంతఃకరణములలో మొదటిదియగు మనస్సు సంశయరూపము (అనఁగా వికల్పరూపము గలది) బుద్ధి ప్రయత్న వ్యాపకమైన నిశ్చయరూపముఁగలది. చిత్తము విచార రూపమున నొప్పును. అహంకారమనునది యభిమాన కారణంబై నేను తానననెడి భావమునకు మూలమైయుండును. మొదటినుండి లెక్కించిన నీతత్త్వము లన్నియు నిరువదియైదగును. వీని నన్నిటినిఁ గూడినదే స్థూలదేహం బనఁబడును జ్ఞాత వీనిం దెలిసికొని సాక్షియై యుండును. సూక్ష్మశరీర మెట్టిదనఁగా,—జ్ఞానేంద్రియము లైదును, కర్మేంద్రియము లైదును, వాయువు లైదును, నంతఃకరణములలో మనస్సు, బుద్ధియును రెండునుఁజేరి వానివాని వృత్తులు క్రమంబుగా నొంది పరివర్తనంబున నొప్పుచుండును. దీనికే లింగశరీరమనియుఁ బేరు కారణశరీరమనునది పైఁజెప్పిన రెంటికిని కారణమైనది. దాని స్వరూపమెట్లనిన, సుషుప్త్యాత్మకమై (అనఁగా పరమాత్మ ప్రాణ వాయువుతోఁజేరి) స్తంభించి శాంతముతో నుండును. దీనికి లయము నిద్రయందే కలుగును. వాయువు ఆధారమున నాకాశము గానఁబడును. భూమి మొదలగు పంచభూతములును నొకదానివలన నొకటి

పుట్టినలాగుననే లయమగునపుడు నొకదాని కొకటి కారణమైయుండును యెట్లన్న, పృథివి (అనఁగా మట్టి) నీళ్లయందును, నీళ్లు నిప్పునందును, నిప్పు గాలియందున, వాయువు ఆకాశమునందును లీనమై (అనఁగా కనుపడక) పోవును. మిక్కిలి గొప్పదగు మఱ్ఱిచెట్టుయొక్క రూపము దానిదగు చిన్నవిత్తనమునందు లీనమైయుండునట్లు స్థూలశరీరమును, సూక్ష్మశరీరమును, కారణదేహంబునం దడఁగియుండును, శాంతమగు నిద్రావస్థయు, నానందమును, నిత్యాదిలక్షణములుగల యీ కారణశరీరముగాక, మహాకారణశరీరమనునది మఱియొకటికలదు. అది యెట్లనిన. సద్యోజాతమనియు, వామదేవమనియు, నఘోరమనియు, తత్పురుషమనియు, నీశానమనియు, పేరులుగల పరబ్రహ్మముయొక్క పంచకళలు పంచభూతములుగా నేర్పడి, తుర్యావస్థయు, మూర్ధస్థానమును, నింద్రభోగమును, జ్ఞానశక్తియు, సత్త్వగుణమును, ప్రత్యగాత్మాభిమానమును, నోంకారమాత్రకయుఁగలిగి మూలప్రకృతియైన నిర్మలాత్మయే జీవుఁడుగా నేర్పడియుండును. ఇది యెఱుఁగుట మిగులకష్టమైనను, మహాత్ములగు యోగులీవివరణముఁదెలిసికొని యానందింప బ్రయత్నించి పెద్దకాలంబు వెతఁబడుచుందురు. మునీంద్రా! ఇవి నాలుగును, జీవునియొక్క నాలుగు శరీరములని తెలిసికొనవలసినది. యీశరీరభేదంబులు నాలుగును, దృశ్యము (అనఁగాఁ జూడఁదగినది) వాచ్యార్థము (అనఁగాఁ చెప్పఁగావిని తెలుసుకొనఁదగినది) నను రెండువిధంబులు గలదై యుండును. యీరెంటియందును పరమాత్మయుండు చోటును నిర్మలాత్ములగు తత్త్వవేత్తలు తెలిసికొని సంతసింపుచుందురు. జీవుని శరీరభేదంబులు నాలుగును జెప్పితి. ఇంక పరమాత్మయగు నీశ్వరునికిని నాలుగువిధంబుల శరీరంబులుగలవు వానిం జెప్పెద నాకర్ణింపుము మన్ను, నీళ్లు, నిప్పు, గాలి, మిన్ను, సూర్యుఁడు, చంద్రుఁడు, పరమాత్మ, యను నెనిమిదిటితో గూడిన యీశ్వరుఁడు విరాట్స్వరూపుఁడనియు, నష్టమూర్తి (అనఁగా నెనిమిది రూపములు గలిగినవాఁడు) యనియుఁ జెప్పఁబడెను. జాగ్రత యవస్థగా సూర్యమండలవర్తియై కర్తృత్వము గలిగి క్రియాశక్తింగూడి, రజోగుణము నెలయు

యముఁడు సానందునకీశ్వర తత్వ చతుష్టయ మెఱిఁగించుట.

పరబ్రహ్మమై యకారమే యాకారముగా సర్వభూతము లందును, సమానముగాఁ బ్రవర్తించు నీవిరాట్స్వరూపునిఁ దెలిసికొనుట మిగుల కష్టము. హిరణ్యగర్భ శరీరమను మఱియొకదాని లక్షణం బెట్టిదనిన, వినుము, జ్ఞానేంద్రియము లైదును, కర్మేంద్రియము లైదును, నంతఃకరణములు నాలుగునుఁ జేరి త్రిపుటియనఁబడును. (అనఁగా చూచుట, చూచువాఁడు, చూడఁబడినది యను మూఁడులక్షణములు కలసిన దానికి త్రిపుటియని పేరు) పైనిఁ జేర్కొనిన దానికి కర్మేంద్రియ త్రిపుటియని యోగులు నామకరణముఁ గావించిరి. చంద్రుఁడు, బ్రహ్మ, క్షేత్రజ్ఞుఁడు, రుద్రుఁడు, ననువా రధిదైవతములుగాఁ గలిగి, మనస్సు, బుద్ధి, చిత్తము, నహంకారము, ననునాలుగును చేరినదానికి యంతఃకరణ త్రిపుటియని పేరు పైఁ జెప్పఁబడిన పదునాలుగునుఁ జేరినదానికి హిరణ్యగర్భ శరీరమని నామము. నిద్రయందుకల యెట్లో యాలాగుననే పరమాత్మ హిరణ్యగర్భుఁ డయ్యెను. ఆ హిరణ్యగర్భ నామముఁగల పరమేశ్వరుఁడు వస్త్రంబుననుండు నూలువిధంబునఁ గలిసి యుండుటచే సూత్రధారి యనియు, నల్పంబుగాఁ గనుపట్టుట వలన సూక్ష్మదేహుఁడనియు, నిచ్ఛాప్రవర్తనా శక్తిఁ గలవాఁడగుట వలన సర్వశక్తుఁడగు సమిష్టిరూపుఁడనియుఁ జెప్పఁబడెను వివేకనిధి వగు మునిచంద్రా! ఇది హిరణ్యగర్భ శరీరలక్షణము. మఱియొక యవ్యాకృత శరీరలక్షణము నాలకింపుము. ముందుచెప్పిన విరాట్స్వరూపంబును, హిరణ్యగర్భ శరీరంబునుఁ గలిసినదాని కవ్యాకృత శరీరమని పేరు. ప్రళయావస్థయు, తేజోస్థానమును, సర్వసంహారకత్వ భోగమును, ద్రవ్యశక్తియు, తామసగుణంబును, విశుద్ధాత్మములును గల యవ్యాకృత శరీరము మిక్కిలి యుత్తమంబై ప్రకాశించును. దీనికి సాక్షియగు మూలప్రకృతియను మఱియొక శరీరముఁ గలదు. జ్ఞానవంతులు వివేకించి దేనిని విరాట్టనియు, నాదమనియు బ్రహ్మమనియుఁ జెప్పెదరో, దానినే పంచభూతములకును కారణమైన మూలప్రకృతి రూపమని చెప్పెదురు. తుర్యావస్థయు, బ్రహ్మస్థానమును, సర్వ శూన్యభోగమును, జ్ఞానశక్తియు, తుర్యావస్థాదులును

గలదానిని మూలప్రకృతి శరీరముగా వేదాంతులు విభజనఁగావించిరి. ఈప్రకారంబునఁగల జీవునియొక్కయు, నీశ్వరుని యొక్కయు, నెనిమిది విధములగు శరీరంబులు విలసిల్లు. నింకసాంఖ్యభావప్రకారంబును వివరించెదను, వినుండని యిట్లనియె సకలకారణ కర్తయు మొదటి

—యముండు సానందునకు సాంఖ్యభావ ప్రకారంబుఁ జెప్పుట—

వాఁడును, లెక్కించి చెప్పుటకు సాధ్యముకాని లక్షణములు కల వాఁడును, పరులకు తెలియరాని బలముఁగలవాఁడును, భేదించుటకు సాధ్యము కానివాఁడును, గుణములులేకయుఁ గలిగిన వానిగా దోఁచువాడును, వేదములవలనఁ దెలిసికొనఁ దగినవాఁడును, సత్త్వము రజస్తమములను మూఁడు గుణములచే తెలుసుకొన సాధ్యము కానివాఁడును, తర్కముచే గోచరించనివాఁడును, వేదాంత తత్త్వమునకు సమీపముగా నుండువాఁడును, నైన యీశ్వరుఁడు పరబ్రహ్మస్వరూపుఁడై సచ్చిదానంద మయుండై యొప్పుచుండును. అట్టిపరమాత్మ తన సగుణ స్వరూపమునుమాని ద్వంద్వరహితుఁడై యుండును అతఁడు సర్వభూతముల యందును రహస్యముగా నంతర్భూతుఁడై సమానముగా నొప్పుచుండును. అతఁడు సమస్తకార్యములకును నధిపతియైనవాఁడు. అతనికే సర్వసాక్షియనిపేరు. పరమాత్ముఁడు తా నాదియంతము లేనివాఁడై, క్షయమునకును, వృద్ధికిని బాధ్యుఁడుగాక సర్వము నెఱిఁగి, మాయకును, మాయలేమికిని, సాక్షియై నాశముఁజెందినలాగునఁ దోఁచుచు నాశములేనివాఁడై ప్రకాశించుచుండును. ఆపరమాత్మ యంగుష్ఠమాత్ర ప్రమాణముఁగలిగి హృదయ కమల కర్ణికయందుండునని వేదంబులు చెప్పుచున్నవి. నాశము లేనియతఁడు తేజోరూపమున నేత్రములయందుండి ప్రకాశించునని వేదాంతము నెఱింగినవారు వచింపుదురు. నేత్రమునం దేది గోచరముగునో యదియే పరబ్రహ్మము ఈ రూపముగల పురుషుఁడు కంటియందు నీళ్లు, జేర్చియుంచిన నెట్లంటకుండునో యా విధముగా నెందును నంటకుండును. ఈ ప్రపంచము సృష్టికి పూర్వము సన్మాత్రగానే యుండెననియు, నాపరమాత్మ విలాసార్థము మాయను వరించి తత్కారణమున నేను, అని భావముఁగొని, సృజించెనని

చెప్పుదురు. అట్టిపరమాత్మనుండియే యవ్యక్తరూపమైన ప్రకృతిసంభవించెను. దానినుండి యిచ్ఛయుద్భవించెను. ఇచ్ఛామిళితమైన ప్రకృతి సగుణమనెడి గర్భముధరించెను. ఆమూలప్రకృతిచే జీవులకు మలినవాసన పొడమి జన్మనాశనాదులు సంభవించెను. సత్ అనియు, నవిద్యయనియు దేనినిఁజెప్పుదురో, దానితోఁగూడినవాఁడు పరమేశ్వరుఁడు అతనినుండి మూలప్రకృతి సంభవించెను. అందుండి మహత్తనునది పుట్టెను ఆమహత్తువలన నహంకారమును, దానినుండి పంచతన్మాత్రలును, వానివలన పంచభూతములును, వానివలన ప్రపంచము సర్వమును నుద్భవించెను. ఈప్రకారము పృథివి మొదలుగాఁగల యైదు భూతములును, త్వక్కాదిగాఁగల యైదు జ్ఞానేంద్రియములును, వాక్కు మొదలగు నైదుకర్మేంద్రియములును, శబ్దమాదిగాఁగల యైదు తన్మాత్రలును మొత్తముఁజేసిన యిరువదింటికిఁ మనస్సు, బుద్ధి, అహంకారము, అను మూఁడింటిని జేర్చి వానితో మాయ, జీవుఁడు, అను రెండునుంగలిపి తత్త్వవేత్తలు యిరువదియైదు తత్త్వములయ్యెననియు, వీనితో సర్వసాక్షియైన పరమేశ్వరునిఁ గలిపిన యిరువదియాఱు తత్త్వములయ్యెననియు, నిట్టితత్త్వమును గలిగినదియే శరీరమనియుఁ జెప్పఁబడె. ఈ యిరువదియాఱవదాని స్వరూపమిట్టిదని యెవరెఱుఁగఁగలరో యట్టివారు మహాత్ములు. వారేయాశ్రమమున (అనగా బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము) నుండినను సంసారాది బంధములవలన విడఁబడినవారై పరుసిద్ధులగుదురు. శరీరంబున వేదాంతపద్ధతి ననుసరించి, మూలాధారమనియు, స్వాధిష్ఠానమనియుఁ, మణిపూరకమనియు, ననాహతమనియు, విశుద్ధమనియు, నాజ్ఞేయమనియుం బేరులుగల యాఱు కమలములు గలవని యెఱుంగవలెను. వీనికి షడాధారములనియుం బేరుకలదు. ఈ యాఱింటి నాధారముఁ జేసికొని పరమాత్మ వర్తించును. గనుక యాఱువిధములగు భ్రమలువిడిచి, యరిషడ్వర్గ మనఁబడిన కామ, క్రోధాదులకు లోఁబడక జయించి స్థిరముగు పరమాత్మస్వరూపము నెఱుంగవలయును పరిశుద్ధుఁడవైన యోగీంద్రా! యట్టి యాత్మస్వరూపుఁడగు పరమేశ్వరుఁడే తానని తెలియలేక

నశించి పోవునదియు, నసహ్యాకరమునైన దేహంబును నుండు జీవుఁడు ప్రకృతి బలంబునకు లోవడి శరీరమునందలి యభిమానము వలన తన్నుదాను మఱచి జననమరణములు, కష్టసుఖములు, మొదలగు సమస్తవిధములగు నవస్థలకును నాస్పదుఁడగును. ఇట్లు మూఢత్వము నొందిన యాజీవుఁడు, విషయేచ్ఛాపరుఁడైనపుడు, తాను, తనది, యను తలంపుఁగొని, యాలు, బిడ్డలు, బంధువులు, వస్తువులు, వాహనములు, గృహములు, ధనము, ధాన్యము, భోగములు, శాశ్వతములని నమ్మి యెల్లపుడును సుఖముఁ గోరుచు, నందు నిమిత్తమై యనేక సంకటంబుల నొందుచు నలయుచుండును. యట్టివాని నెఱింగినవాఁడే జ్ఞానియనఁబడును దేహము, భార్య, బిడ్డలు, ధనము, మొదలగునవి నావియను తలంపు మానుటచేత నిర్మలత్వము ప్రాప్తించును. ఎవ్వఁడు నేనే సర్వమునకు కర్తనని యు, నేనే సర్వము ననుభవించువాఁడనని యు, నంతయు, నాయదియని యుఁ దలంచుచుండునో యెవ్వఁడు, జాతి, యాచారము, మొదలగు వానిపై ప్రేమను వహించి కర్మలనొనరించునో, యట్టివాఁడు. సంసారబాధమునుండి విముక్తుఁడు కానేరఁడు. ముందు చెప్పఁబడిన యభిమానవశుండగు జీవుఁడు, కర్మబద్ధుఁడైనపుడు, పాపము, పుణ్యము, తాపము, కోపము, మొదలగు లక్షణములు నొంది పరాధీనమనస్కుఁడై, శాశ్వతమగువాఁడును, పరిశుద్ధుఁడును, నైన సర్వేశ్వరునిఁ దెలిసికొనఁజాలక, యహంభావయుక్తుఁడై, వెతలొందుచుండును. పట్టుపురుగు గూడుఁగట్టుకొని తన కింక చలనములేదని యెంచుచు కడపట నందుండి వెడలఁజాలక నశించిన విధంబున సంసారసుఖంబునమ్మి, శరీరధారి యహంకార మమకారములువహించి దుఃఖముల పాలగును, జపములు చేసినను, తపములు చేసినను, వ్రతములు చేసినను, స్నానసంధ్యాదులైన యనుష్ఠానము లొనరించినను, వానివలన ముక్తి లభింపదు. ధనధాన్యములు, పౌత్ర పుత్త్రులు, బంధువులు స్నేహితులు, దేహమును శోషింపఁజేయు వ్రతములు, తీర్థస్నానములు, దేవాలయముల యర్చనాదివిధులు, యివి మొదలుగాఁగల వెవ్వియు శాశ్వతమగు మోక్షము నొసంగ జాలవు. ఇట్లనుటచే యవి చేయరాదని కాదు. మోక్షాసక్తుఁడైన వాని కిట్టివి

యక్కఱలేదు. మనస్సు నెవ్వఁడుజయించునో, వానికి మాత్రమే యది లభించును. పరిశుద్ధములగు కర్మలును, భగవన్నామ స్మరణానురూపం బులగు జపంబులును, తపంబులును, యజ్ఞములును, యాగములును, తీర్థయాత్రలును, దానధర్మాది సుకృతి కృత్యంబులును నాదిగాఁగల కార్యంబులన్నియు, పరమాత్మతత్త్వమునుఁ దెలిసికొను నంతవరకుం జేయఁదగినవి ఆత్మానాత్మమర్మము విచారించువారి కివి యనావశ్యక ములు. ఈశ్వరుని మనస్సువలననే యెఱుంగవలయును ఆలాగునఁ దెలిసి కొనుటకుఁ బ్రయత్నింపక సత్త్వరజస్తమోగుణంబులకుఁ జిక్కి కర్మలాచరించువారికి, పరేశ్వరునిఁ దెలిసికొనుటకు మార్గము కనుపింపదు. మోక్షాపేక్షఁగలవారు యోగ్యులగు గురువులవలన తత్త్వోపదేశము నొంది యందనుసారమున నుత్తమంబగు సాయుజ్యమును పడయుటకుం దగిన సాధనము లెఱింగి, కృతార్థులు కావలయును శరీర సంబంధమున నొప్పు నింద్రియములు నేను నాదియనెడి భ్రాంతినివీడి సకలకార్యములయందును నిర్మలమైయుండు తురీయమై విషయమును తానని యెవఁడెఱుఁగునో వాఁడు ధన్యుఁడు. మెలఁకువయందును, నిద్రయందును, కలలయందును, వికారమునొందక పరమాత్మవలె నొక్కటిగా నిలుచు తలంపునకు తుర్యమనిపేరు అది కలవారు యోగులనఁబడుదురు. ఆత్మజ్ఞానముఁ గలవారందఱును, పాపపుణ్యరూపమున నొప్పు సకల సుఖదుఃఖ హేతువులగు కార్యములయందును, నంటినట్లు కినపడుచు లేశమైన నంటకుండు పరమాత్మ నెఱింగి, స్వస్వచిత్తులై యానందింపుదురు. నీళ్లలోఁబుట్టిన చేప దేహమునకు నీళ్లంటక సంచరించినలాగున ప్రకృతి స్వరూపుఁడుగాఁ గాన్పించు సర్వేశ్వరుఁడందునకు భిన్నముగాఁ (అనఁగా ప్రకృతికి వేఱై) యుండును జలములఁబుట్టిన తామరాకునకు జలము లంటనిలాగునను, నీటి కుండలో కనఁబడు గగనము కుండ నంటని విధంబునను, శరీరమునఁ గనపడు పరమాత్మయింద్రియములనంటక వేఱైయుండును. ఆత్మకును, ప్రకృతికిని, సంబంధము లేదు అయినను సంబంధము కలిగియున్నట్లు తోఁచుచుండును. సగుణ నిర్గుణ రూపుఁడైన పరమాత్మ యొక్కఁడయ్యు, బ్రహ్మయనియు, విష్ణువనియు, రుద్రుఁడనియుఁ జెప్పఁబడుచుండును

రియీ పేరులన్నియు, నొక్కనికే యని యెఱుంగవలయును. స్థిరమగు మనస్సుఁగలవాఁడు మాత్ర మిందలి సత్యముఁ దెలిసికొనును. అట్టి పరమాత్మ యంతయుఁదానయైయుండి, చరములు, నచరములును నగు నీప్రపంచము నంతయు సంరక్షించుచుండును. (అనఁగాఁ దన్నుఁ దానరక్షించుకొనుట) లోకమంతయు, నొకసూర్యునివలన వెలుఁగు తెలుఁగున, నాత్మస్వరూపుఁడగు నీశ్వరునివలన (అనగా నీశ్వరుఁడు శరీరమునందుండుట వలన) నింద్రియములన్నియు, తేజరిల్లుచుండును. ఆత్మప్రకాశ మడఁగెనేని యింద్రియముల వ్యాపారమును నడఁగి పోవును. సూర్యుఁడొక్కఁడయ్యు ననేక జలాశయములలో గనఁబడు లాగునఁ బంచభూత స్వరూపుఁడగు పరమాత్మ స్వర్గమునందును, భూమియందును, దేవ, మనుష్య, తిర్యగాది రూపములతోఁ గనుపించు చున్నాఁడు. మనకు కనఁబడునవియు, వినఁబడునవియు, నన్నియు, నీశ్వరస్వరూపమేగాని వేఱుకాదు. ఎవఁడు నాశముఁజెందని పర బ్రహ్మముతానేయని తెలిసికొనునో, యతఁడు యిరువది యారవది యగు తత్త్వము (అనఁగా పరమాత్మ) నెఱిఁగినవాఁడని చెప్పుదురు. ఇట్లు పరమాత్మనుఁ దెలిసికొనఁగానే ప్రకృతి (మాయ) నశించి పోవును. జీవాత్మ పరమాత్మలు, క్షరాక్షర స్వరూపులు. క్షరమనఁగా నశించునదియనియు, నక్షరమనఁగా నాశములేనిదనియు, భావము, క్షరుఁడైన జీవుఁడక్షరుఁడైన యీశ్వరునితో నైక్యమొందినపుడా నంద పరిపూర్ణమును, సాటిలేనిదియు, నైన, (అహం బ్రహ్మాస్మి) నేనేబ్రహ్మము, అనుభావమునుఁ బొంది ప్రకృతిని విడిచి యానందముఁ జెందును. జీవుఁడు కార్యమైన యవిద్య నుపాధిగాఁగలవాఁడు. ఈశ్వ రుఁడన్ననో, యతీతమైన మాయ యను కారణమును పాధిగాఁగల వాఁడు. ఈరెండును (అనఁగా కార్యకారణములు రెంటిని) జయిం చినపుడు శేషించునది జ్ఞానస్వరూపమగు నట్టి యాత్మ. నేను బ్రహ్మమునని పలుకు వాక్యమువలనఁ గలిగిన జ్ఞానమునకే మోక్ష మనిపేరు. శరీరమున పరమాత్మ వసించుచుండుటవలన దాని నధ్యాత్మ యందురు. దానికే ప్రత్యగాత్మ యనియుఁ బేరు. దీనిభేదము నా సక్తితో తెలుసుకొనినవాఁడు ముక్తుఁడగును విశేషమనియు, పరా

పరమనియు, పరమాత్మ తత్త్వమును విభజించి, యందువిక్షేపమును విడిచి, పరావరమును గ్రహించిరి. విక్షేపమనఁగా మాయాశక్తి. పరావరమనఁగా పరబ్రహ్మము. ఆపరబ్రహ్మమే పరమపదము. దేహతత్త్వ మెఱిఁగిన పెద్దలు శరీరమునకు క్షేత్రమని పేరుఁబెట్టిరి. యందుండు వాఁడగుటఁబట్టి యీశ్వరుఁడు క్షేత్రజ్ఞుఁడని చెప్పుదురు. క్షేత్రజ్ఞుఁడనిన పరమాత్మయని తెలియవలెను. పరమాత్మస్వరూపుఁడైన జీవుఁడు దేహసంబంధంబునఁ గష్టముల పాలయ్యెను. ఆజీవుఁ డెపుడు తానేపరమాత్మయని తెలుసుకొనునో, యపుడు భేదముతొలఁగి పరబ్రహ్మత్వమునొందును. యిందుకు ముఖ్యముగా సమస్త సంకల్పములు (అనగా తలంపులు) నశింపవలయును అటుల సంకల్పముపోయి నంతట జీవభ్రాంతితొలఁగి యక్షరుఁడగు పరమాత్మయగును. యిట్లు క్షరాక్షరభేదముల వర్తించు జీవబ్రహ్మల తారతమ్యమునుఁ దెలిసికొని యోగసాధనచే, కనుబొమల నడిమిప్రదేశమున నుండు పరమాత్మను చూడవలయును. దీనికి మొదట ప్రపంచసంబంధమైన భ్రమను విడువవలయును. యివ్విధముగా తత్త్వరహస్యముఁ జక్కఁగాఁదెలిసికొని యెవఁడు బ్రహ్మైక్యసంధానము జేయఁబ్రయత్నించి కృతార్థుఁడగునో, యతని జీవన్ముక్తుఁడనియు, సానందమయుండనియు మహాయోగీశ్వరులు వర్ణించి స్తుతించుచుందురు. యిది సాంఖ్యయోగమని

## యముఁడు సానందునకు తారకప్రభావముఁ జెప్పుట

పెద్దలు చెప్పుదురు. జ్ఞానస్వరూపుఁడవైన యోగీంద్రా! యింకతారక లక్షణంబు వివరించెదను వినుము. అకారము, ఉకారము, మకారము, ననునివి మూఁడువర్ణములును, నాదము, బిందువు, కళ, యనుమూఁడు విధంబులుగా నేర్పడి, కలిసి, ఓం. అనుప్రణవముగా నేర్పడెను. ఆప్రణవమే పరమాత్మ యనఁబడును యట్టిప్రణవమునకు నాహోజ్యోతి యనుపేరుకలిగెను. ఆయాహోజ్యోతిని తెలిసికొను జ్ఞానమునకు (అనఁగా శక్తికి) తారకమను నామము. ప్రతిదినమును నర్ధనిమీలిత లోచనుఁడు (అనఁగా యరగన్నుమూసినవాఁడు) గానుండి, చలనములేని మనోదృష్టితోఁ జూచి యెవఁడు పరబ్రహ్మమునుఁ దెలిసికొనునో, యతఁడు రాజయోగి యనఁబడును. చంద్రసూర్యులనడుము (అనఁగా

రెండుకండ్లకు నడిమిభాగమున) నుండు స్థిరమైన తేజస్సు (అనఁగా వెలుగు) ను తారంముచే (అనఁగా కంటిలోని పాపచే) లెస్సగా నెవఁడు చూచునో, యతఁడా వెలుగుయొక్క స్వభావమును గుర్తెఱుంగును. ఇది యభ్యాస క్రమంబునఁగాని యలవడదు. బాహ్యలక్ష్యము, అంతర్లక్ష్యము, మధ్యలక్ష్యము నను మూఁడులక్ష్యముల యొక్క భేదములనుఁ దెలిసికొని, ప్రణవనాదము నాలకించుచుండు వాని కెవ్వఁడును సమానుఁ లేఁడు. (లక్ష్యమనఁగా గుఱుతు) ప్రణవమనునది మూఁడు రూపములకు (అనఁగా మూర్తిత్రయమునకు)ను మూలమైనది. యది, నాద, బిందు, కళాత్మకము. ఉత్పత్తి, స్థితి, లయములకదియే కారణము దానిని శక్తిత్రయాత్మకమనియుం జెప్పుదురు. ఓమ్. అను వర్ణాకృతియందు మొదటి యంగమునకు తారకమనియు, రెండవ యంగమునకు, దండకమనియు, మూఁడవయంగమునకు, కుండలమనియు, నాల్గవయంగమునకు, అర్థచంద్రమనియు, నామములు గలిగియున్నది ఐదవయంగము బిందువుతోఁ గూడి యోంకారమయ్యెను. దానిలో, అకారముతో ఉకారముచేరినప్పుడు, ఓ అను నక్షరమగును. దానితో నచునాశికమైన మకారముచేరఁగానే ఓం. అనియయ్యెను దీనికే ప్రణవమనిపేరు. శరీరమున మూలకందము మొదలు శిరఃపర్యంతము వీణెయొక్క కాడవంటి చంద్రప్రభయనెడి బ్రహ్మనాడికలదు. దానిమధ్యయందు క్రొక్కాఱుమెఱుమునుఁ బోలి తామరతూఁడులోని నూలువంటి తీగెలుగల తేజమొకటి ప్రకాశించుచుండును బాహ్యము, నంతరము, మధ్యము, ననుమూఁడు లక్ష్యములచేతను క్రమముగా కనుపడునదియు, కనుపడనిదియు, కనుపడీ పడకయుండునదియు, నగు బ్రహ్మస్వరూపమగు వెలుగును ప్రయత్నముతో చూచి తెలుసుకొనవలయును. యదియే యోంకారరూపము. యోగియగువాఁడు లలాటమునకు పైభాగమున గొల్లాటమంటపమను చోట సుస్థిరముగా ప్రకాశించు వెలుఁగును నిర్మలమగు మనోదృష్టితో చూచి చి[illegible]స్వరూప మెఱుఁగవలెను. అరగన్నులుగలవాఁడై భ్రూమధ్యమున మనస్సుతోఁగూడిన దృష్టినినిలిపి చూచుచు, జుత్తె వ్రేళ్లతో రెండుచెవుల రంధ్రములను గట్టిగామూసి యాలకించిన ప్రణవనాదము

సముద్రఘోషమువలె వినఁబడును. దానిని విని యందు లీనమైయున్న గంటాధ్వనినిఁదెలిసికొని యానందమునుఁ జెందవలయును. ఆ గంటానాదమే పరమేశ్వర స్వరూపము; ప్రణవనాదమనియు, భ్రూమధ్యగతమైన వెలుంగే పరబ్రహ్మమనియు తత్త్వవేత్తలు వచింపుదురు. ఇదిగాక బాహ్యలక్ష్య మెట్టిదనిన, ముక్కుయొక్క కొనమొదలుగా మీఁదికి, నాలుగు, ఆఱు, ఎనిమిది, పది యంగుళముల దూరమువరకును, మున్ను చెప్పిన లాగున దృష్టినిగుడించి యచ్చటచ్చటందోచు, నీలవర్ణము, ధూమ్రవర్ణము,రక్తవర్ణము, శ్వేతవర్ణము, హరితవర్ణము, (అనఁగా నైదువిధముల రంగులు) గల విచిత్రముగా ప్రకాశించు వెలుగును పరిశీలించి చూడవలయును. కంటికిముందుగాఁగాని కడకంటియందుగాని కరఁగిన బంగారు వర్ణముఁగల భూమినిచూచి తెలిసికొనవలెను. యీపద్ధతులన్నియు గురువువలనగాని తెలిసికొనుటకు వేరుమార్గము లేదు. ఇది సనుభవజ్ఞులు గానివారికి గోచరింపవు. శిరస్సునకు మీఁదుగా పండ్రెండు అంగుళములవరకునుఁ ప్రకాశించునా వెలుతురును చక్కగాచూచి కనుఁగొనినఁగాని కృతార్థుఁడు కాఁజాలఁడు. యోగియగువాఁడెట్టి ప్రయత్నముఁ గలవాఁడగుచున్నాడో యట్టి పురుషార్థమునే చెందును. ప్రయత్నపరుఁడగువాఁడు తనకడంకను విడువక నెరవేర్చి యానందించును. మఱియొక మధ్యలక్ష్యమును వినుటమంచిది. వినుండు తెలుపు మొదలగు పంచవర్ణములు గలదియు, బాలచంద్రుఁడు, సూర్యుఁడు, మెఱుపు, అగ్ని, వీని బింబములయందు ప్రకాశించునట్టిదియునగు నాకాశమును ముందు చెప్పిన విధులచేఁజక్కఁగాఁ జూడవలయును. అట్లుచూచి బాహ్యదృష్టి కుదిరినపిమ్మట నంతర్దృష్టినిఁజూడవలయును. పంచాకాశములు (అనఁగా నిరాకార నిర్గుణాకాశము, గాఢాంధకారాకాశము, అగ్నిజ్వాలాకాశము, తత్త్వాకాశము, సూర్యాకాశము) ఎవ్వఁడు బాహ్యమందును నంతరమందునుఁ జూచునో, యతఁడు నిర్మలుండగును. గురువును, శిష్యుని యిరువురను తరింపఁజేయు నట్టిదియు, శ్రేష్ఠమగు నట్టిదియుఁగాన భవసాగరమును దాటింపఁగల తారకము మిక్కిలి యుత్తమమని చెప్పుదురు. సాంఖ్య, తారక, యోగముల రెంటి

యందును, నుపాధులు లేనిది సాంఖ్యము, తారక ముపాధితోఁ గూడినది. యిట్టి భేదము నెఱింగి జ్ఞానియగువాఁడు యోగాభ్యాస మొనరించిన కృతార్థుఁడగును. తారకమునకు ప్రణవమే యాధారము. పరబ్రహ్మ మును, మోక్షమును, వేదములును దేవతలును, లోకంబులును, మంత్రంబులును, ప్రణవము వలననే కలిగినవి. యన్నిటికిని మూలము ప్రణవము. కావుననే వేదాంత శాస్త్రమునందున నోంకారము విల్లు గాను, నాత్మ బాణముగాను, పరబ్రహ్మము గుఱుతుగానుఁ జెప్పఁబడి యున్నది. మునివరేణ్యా ! కళలన్నియు సత్తామాత్రముగాఁ దోఁచెడి భావమెద్దికలదో, యాభావమునకే భావ్యాలక్ష్యమని పేరు వేదము లన్నిటియందునుఁ జెప్పఁబడిన లక్షణములన్నియు జ్ఞానియగువానికి బాహ్యమునఁ గనఁబడును. అనుభవజ్ఞులైన ఋషులును, యోగులును, నెచ్చట దృష్టినిలిపి చూడవలయునని నిర్ధారణఁజేసి చెప్పుదురో, యెచ్చట నిశ్చలమగు చూపుఁగలవానికి యాపోజ్యోతి యనుపేరుఁ గల వెలుఁగు కాన్పించునో, యాస్థలము, (అనగా కనుబొమలనడిమి చోటు) నకు త్రికూటము. (అనఁగా మూఁడు లక్షణముల కలయికఁ గలది) అనియు, నగ్నిస్థానము (అనఁగా వెలుతురుఁగల ప్రదేశము) అనియు పేరు. ఆ వెలుతురుండు చోటునకు సంబంధముఁగల కన్నుల యందును, నైదురంగులతో పంచభూతముల కళలు ప్రకాశించుచుం డును. వెలుగురూపమున, కనుబొమల నడిమిచోటఁ దేజరిల్లు ప్రణవ మనునదియే, యట్లు పంచవర్ణములుగలదై, మిక్కిలి రహస్యమైనదై, సిందుకొని చలనముఁగల దానివలెతోఁచుచు చలనములేనిదై కన్నుల యందు బాహ్యాంతరములకు లక్ష్యము (గుఱుతు) గా ప్రకాశించును. ఇది దాని స్వభావగుణమని యెఱుంగవలెను. కన్నులు లేకనే సమస్త మునుఁ జూచువాఁడును, చెవులు లేకనే సమస్తమును వినువాఁడును, చేతులు లేకనే యన్నియుం జేయువాఁడును, యెల్లచోటులయందు నుండువాఁడును, తానేయంతయునైన వాఁడును, నగు పరమాత్మయే యిట్టి తేజోరూపమున ప్రకాశించును. గాని యన్యమగువస్తువేదియును కాదు. ఆపరమాత్మయే సకలజీవుల హృదయ కుహరమునందును, నేత్రములయందును, కనుబొమల నడుమను, వెలుఁగువలెదోఁచుచు,

వేదములకుమూలకారణమై, యతుర్థమను పేరువహించి బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు, ననురూపములకు నిమిత్తముగా నొప్పుచుండును. నీటియందలి సూర్యకాంతివలెను, వజ్రముయొక్క కాంతివలెను, నీలమణులకాంతివలెను, నానావిధములఁ బ్రకాశించు వెలుఁగేదిగలదో, యదియే మహాజ్యోతి. యదియే స్వయంభువు, స్వరాట్టు, పరమాత్మ, యని పలువిధములగు నామములుఁగలిగి సకలశ్రుతులకు నాధారమగుచుండును. ఆతేజస్సు (వెలుఁగు)నుఁ గనుఁగొని కొందఱు దానిని చిత్తనిపలుకుదురు. కొందఱుచిత్తనియు, కొందఱు బ్రహ్మయనియు, కొందఱు విష్ణువనియు, కొందఱు శివుండనియు, కొందఱు శూన్యమైన యొకవిధమైన వికారమనియు, కొందఱు పురుష, కాల, ద్రవ్య, రూపమనియు, కొందఱు వికల్పమనియు, మఱియు ననేకుల నేకవిధంబుల భావింపుదురు గాని నిక్కముగా నది ప్రణవస్వరూపమైన పరమాత్మయని యెవఁడు తెలుసుకొనునో వాఁడు నిత్యముక్తుఁడగును. ఆతేజస్సు నచంచలదృష్టితో నెడమకన్నుమూసి కుడికంటితోడను, కుడికన్ను మూసి యెడమకంటి తోడను, రెండుకన్నుల తోడను, రెండుకన్నులు మూసి యంతర్దృష్టితోడనుఁ, గనుఁగొని విజ్ఞానవంతులు దాని స్వభావమును, స్వరూపమును చక్కఁగా గుర్తెఱిఁగి సంతసింతురు. ఆజ్యోతిని చూచులక్ష్యములను మూఁడింటిని ముందే వివరించియున్నాను. అమూఁడు పద్ధతులును మాటలచే సాధ్యమగునవికావు. మహాకష్టము. తారకమను నది సులభమని తలంపరాదు. నిర్మలచిత్తుఁడై యనుభవజ్ఞుఁడైన గురువునాశ్రయించి, యతని వలన పద్ధతులను క్రమముగాఁ దెలిసికొని ప్రయత్నమున, కష్టమున కోర్చి పట్టువిడువక, నియతితో యెవఁడు ధృఢముగా నభ్యసించునో, యట్టిమనుష్యున కందలి తత్త్వము గోచరమై పరిపూర్ణానందముఁ గలిగించును. అట్టివాఁడు తప్పక ముక్తుండగును. లోకంబున నెవఁడు సాంఖ్య, తారకముల పద్ధతిఁ దెలిసికొని యభ్యసించునో, యట్టి వానికి శాంభవీ ముద్ర సులభముగా సిద్ధించును. ఉత్తమంబగు శాంభవీ

-- శమకుఁడు సానందునకు, శాంభవీ ముద్రాలక్షణంబు నెఱిఁగించుట

ముద్రాప్రభావం బెఱిఁగించెద నాలకింపుఁడు. మహానుభావా! తేజో

నిధీ ! భ్రమమువిడిచి అంతరముగను, బాహ్యముగను (అనఁగా లోప లను, వెలుపటను) లక్ష్యమునుంచి (గుఱుతు) చలనములేక (అనఁగా కనులుమూయుట తెఱచుట) వెలుఁగును చూచుటకు శాంభవిలేక శాంభవీముద్రయని పేరు. తానెచటగుఱుతు నిడిచూచునో,యచ్చట నాచూపుతో మనస్సును లయింపవలెను. (అనఁగా కలుపవలెను) అట్లు లయమైన మనోదృష్టులు గలిగియుండుటకు ఖేచరియనిపేరు. నిర్మలచిత్తులకుఁగాని యదిలభింపదు. ఇట్లు చూచుదృష్టిని, వ్యక్తము, వ్యక్తావ్యక్తము, నవ్యక్తము, ననుమూఁడు విధములుగా పెద్దలు విభ జనఁగావించిరి. వివేకవంతులు వెనుకటిరెంటిని విడనాడి మొదటిదాని నే యనుసరించిరి. యేలననఁ రెండవదియు, మూఁడవదియు, ములిన యుక్తములని వారిభావము. యెట్లనఁగా— రెండుముక్కు పుటము లను, రెండుచెవులను, రెండుకన్నులను వ్రేళ్లతోమూసి చలింపని మనస్సుఁగలవాఁడై, యంతర్దృష్టి (అనఁగా లోచూపు)చే చూచుట యవ్యక్తదృష్టి యనఁబడును. దీనిని యోగులిచ్ఛయింపరు. ముక్కు పుటములను, చెవులను, వ్రేళ్లతోమూసికొని కన్నులు సగము విచ్చి క్రిందిచూపుగాఁ జూచుట వ్యక్తావ్యక్త మనఁబడును. వివేకవంతు లిదియునుఁగోరరు. ఇంక వ్యక్తమనుదానినే యందఱు ననుసరింతు రని చెప్పవలసినది లేదుకదా ! యచంచలమగు దృష్టితో భ్రూమధ్య మునఁ జూచుటకే, వ్యక్తమనిపేరు. దీనినే యందఱును నుత్తమమగు నదియనిశైకొనిచేయుదురు ఈవ్యక్త దృష్టి సులభమైనదని చెప్ప రాదు. యిది దేవతలకుఁ గూడ కష్టమైనదియే ! యట్టి దృష్టియే కాగ్రముఁజేసి శాంతముగా చలింపక చూడఁగాచూఁడగా కంటికెదు ట మహాప్రకాశమొకటి కాన్పించును. దానింగని భ్రమయక చ లింపక, మఱియు నేకాగ్రదృష్టిఁ జూచుచున్న యాగొప్పవెలుఁగు నడుమ చిత్రవిచిత్రంబులగు వర్ణంబులు కనుపించును. అపుడును చూపు చలనములేక యుండెనేని నిర్మలమైన స్వచ్ఛమైన పరబ్రహ్మ స్వరూపమగు చంద్రమండల సదృశంబైన కాంతిగనుపించి యాగు నను నడుమ మెరుపువలె ప్రణవ స్వరూపమని దేనినిఁ జెప్పుదురో యాజ్యోతి (అనఁగా పరమాత్మ)గోచరించును. దీనిఁగనుఁగొనుటకు

మఱియొక పద్ధతికలదు. దానికి ఖేచరీ ముద్రయనిపేరు. మనసును ప్రాణవాయువుచే బంధించి యొకటిఁజేసి చంచలములేక వికార రహితుఁడై, బాహ్యదృష్టిచే చూడవలయును. దీనిపద్ధతిఁ జక్కఁగాఁ దెలిసినవాఁడు జగద్గురుఁడనఁబడును. యిందలి రహస్యంబెఱుఁగని కొందఱు, బాహ్యఖేచరియనుపేరుతో పెక్కు తెఱంగుల నవలంబించి, యెందునుఁ గృతార్థులుకాఁజాలక, తుదకు విఫలమనోరథులగుచుండు దురు. కొందఱు బాహ్య ఖేచరినంతర ఖేచరిగాను, నంతరఖేచరిని, బాహ్యఖేచరిగాను నెంచి యవలంబించి వ్యర్థప్రయత్ను లయ్యెదరు. ఖేచరీముద్ర నవలంబించువారికి మనస్సును, వాయువును, నొక్కమారే నిశ్చలము కాఁజాలదు. వానిలో యెదియో యొకటిమాత్రమే నిలుచును. అవిరెండును నిశ్చలముగా నుండునట్లుచేయుట కష్టసాధ్యము. అయినను దృఢమనస్కులగుచు బుద్ధిమంతులు యత్నంబున మొదట మనస్సును చలనము లేని దానినిఁగాఁజేసికొని, యటుపై సంచరించువాయువును నిల్పి, యారెంటిని నేకముఁజేసి యానందింతురు. మునిశ్రేష్ఠా! ఖేచరీ ముద్రనభ్యసించు కొందఱు యోగులు తాము మనస్సుతోకూడా వాయువు నిల్పితిమని చెప్పెదురు. కాని యదినమ్మఁదగిన మాటకాదు. యేలనన, నిరంకుశముగా (అనఁగా నడ్డములేక) సంచరించు వాయు వంత సులభముగా నిలుచునదికాదు. ప్రయత్నముఁజేసిన పక్షమున మనస్సయినను నిలుపవచ్చును. కాని వాయువును నిలుపుట మిగులకష్టము. మనస్సును, వాయువును చలనములేక నిలుపుటయనునది, యేనుఁగును తామరకాడలోని నూలుతోక దలనీక కట్టినలాగని యెఱుంగవలెను. ఇది యెంతకష్టమో యదియు నంతకష్టము. మొదటమనస్సును నిల్పినఁగాని వాయువునిలువదు. వాయువుచేత మనస్సునిలువదు. ఓడగాలిచే కొట్టుకొని పోవులాగున శరీరమునగాలియుండు పర్యంతము, నది చలనము నుడుగునది కాదు. మనస్సెచట నిలుచునో యచటవాయువు నిలుచును. కావుననే యీరహస్యమెఱిఁగి, యోగులుముందుగా మనస్సు చలనము లేనిదై యుండులాగునఁ జేసికొనఁ బ్రయత్నింతురు. ప్రాణవాయువు నడఁగించునట్టి యోగము బ్రహ్మజ్ఞానులవలనఁ దెలిసికొని, యెల్లపుడును,

నభ్యాసముఁజేయుచు మనస్సునునిలిపి, పిదప యాయలవాటును వాయువునందుఁ బ్రసరింపఁజేయుచు, తుదకు నిశ్చలత్వమున నేదియుం జేయక యుండి నట్లేయుండు వానియందు వాయువు స్థిరముగా నిలుచును. శరీరంబున పదితెఱఁగుల వాయువులు సంచరించుచుండు నని మున్ను చెప్పితిని వానిలో ముఖ్యమైనదగు ప్రాణవాయువు మాత్రము వ్యాయమున విడువక నిలిచియుండును. దీని తత్త్వమును గురువు వలనఁ దెలిసికొన వలసియుండును. అట్లు తెలుసుకొని యాగురువు చెప్పినలాగున చిత్తమున గుఱియుంచి స్థిరపరుచుకొని యభ్యాసముఁ జేసిన పక్షమున మనస్సచంచలంబగును. ఆటుపిదప దాని ననుసరించినదగు ప్రాణవాయువు స్వాధీనమై చలింపకనిలుచును. కొందఱు మేము రాజయోగులమనియు, పరబ్రహ్మమునుఁ గంటిమనియుం జెప్పుదురు. కాని యదికల్ల. వారీరహస్యంబు నెఱుఁగకుండినను నెఱింగినట్లునటింతురు. అట్టివారు సద్గురుకటాక్షము నొందనివారని తెలియవలెను. పురాకృత పుణ్యంబువలనంగాని యాతత్త్వమునుఁ బోధింపఁగల జ్ఞానియగు గురుఁడులభింపఁడు. లోకంబున కొందఱు వేదములును శాస్త్రములును తమకుబోధపడకున్నను సర్వమునుఁదెలిసిన వారివలె జనుల భ్రమింపఁజేసి తమకుఁదోఁచిన లాగున నేమేమియో బలుకుచుండుదురు. అట్టి యనుభవములేనివారు చెప్పెడియేమాటయు నమ్మకూడదు. అందువలన ప్రయోజనంబు కలుగనేరదు. ఇట్లుగాక గురుచోదితముగా నలవాటుఁజేసిన వానికి నిర్మలమైన జ్యోతికనఁబడును. ప్రణవనాదము వినఁబడును. ఆజ్యోతి ఇంద్రధనుస్సువలెను, చంద్రబింబమువలెను, వజ్రమువలెను, అద్దమువలెను, బంగారువలెను, మెఱుపువలెను, తామర పూవువలెను, పొగవలెను, బిందువువలెను, సూర్యునివలెను, మిణుగురువలెను, దీపమువలెను, యిట్లు నానావిధములుగాకనఁబడును. పరధ్యానములేక యాలించిన ప్రణవధ్వని వినఁబడును. ఆప్రణవనాదము వరుసగా గజ్జల లాగునను, తాళము వాయించినట్లును, వేణువు (అనఁగా పిల్లనగ్రోవి) యూదినవిధమునను, ఉరుమువలెను వినఁబడును. క్రమముగా మనస్సునిలిపి వినఁగా వినఁగా గంటాశబ్దము స్పష్టముగా వినఁబడును. యింతేగాక యాధ్వని, వీణె,

భేరీ, శంఖము, మద్దెల, సముద్రము, వీనిశబ్దములవలె ననేకవిధము
లుగా నుండును. ఆశబ్దమెచ్చట పుట్టుచున్నదో యచ్చట బుద్ధినిలిపి
యాలించుచుండు వారికిది యనఁగా యానాదము తనకాధారస్థాన
మైన హృదయంబునందలి యనాహతమనెడి చక్రముననుండు ప్రాణ
వాయువు, వెనుకటిదిశయందుండు వీణాదండము మార్గమున నాశికా
ద్వారమునుండి త్రికోణమార్గమును జేరుచుండుటఁ దెలిసికొనవచ్చును.
అట్టిసమయమున నాప్రణవనాదము మిక్కిలి భయంకరముగా విన
వచ్చుచుండును. యోగాభ్యాసముఁ జేయువాఁడాధ్వని విని నపుడు
భయపడిచలింపక స్థిరచిత్తుఁడై యుండవలయును. యిట్టి తత్త్వ
మెఱుంగువారికి సమాధిలక్షణ మావశ్యకము. సమాధియే ముక్తికిసాధ
నము. సవికల్పము, నిర్వికల్పమని సమాధి రెండు తెఱంగులు. ఈ
రెంటిలో మొదటిదగు సవికల్పసమాధి, దృశ్యానువిద్ధసవికల్పము,
శబ్దానువిద్ధ సవికల్పమని రెండు విధములయ్యెను. ఇవి బాహ్యాము
నంతరము ననుభేదములవలన నాలువిధములుగా విభాగింపఁ బడినవి.
ఈసమాధులవలన భేదముపోయి సర్వసమత్వ మేర్పడును. వీనిలో
పూర్ణముగా మనస్సైక్యము గానపుడు సంప్రజ్ఞాతమనియు, మనసు
పరమాత్మయందు లయించియేకమైనపు, డసంప్రజ్ఞాతమనియుఁ జెప్పఁ
బడును. దీనినే నిర్వికల్పసమాధియందురు. సమాధినిష్ఠకు వాయు
సంచారముఁగల యిడా, పింగళా, సుషుమ్నా యనిపేరుగల నాడుల
నెఱుంగవలయును. వీనిమూలముననే ప్రాణవాయువు సంచారముఁ
జేయును. దానిసంచార క్రమముఁగనిపట్టి చూపుసరిగానిలిపి మనసు
నావాయువుతో కలిపినయెడల, పైఁజెప్పిన యిడా, పింగళా నాడుల
మధ్యసుషుమ్నా నాడి నెఱుంగవచ్చును. బుద్ధిమంతులు మిక్కిలి
ప్రయత్నముఁజేసి యీరహస్యమును దెలిసికొని యానందింతురు.
చంద్రమండల గోచరమైనది యిడానాడి. యది యెడమ తట్టుముక్కున
చరించును కుడితట్టు ముక్కున సంచరించునది పింగళానాడి, యది
యగ్నిమండల గోచరమైనది. వీనిరెంటికిని సంబంధించి నడుమ
సూక్ష్మమైన సుషుమ్నానాడి యుండును. యందే సర్వము నున్నది.
ఈనాడిశరీరమునకు వెనుక ప్రక్క వీణా కాడవలె తల. వరకును నుం

డు దండియందు సూక్ష్మమగు మార్గమున సూక్ష్మరూపమున. ప్రవేశించియుండును. సర్వమునకును నాధారమైన బ్రహ్మనాడియనునది యిదియే. దీనియందే పరమాత్మయుండును. ఇది మహారహస్యము. ఇది మూలాధారమనెడి చక్రముమొదలు బ్రహ్మరంధ్రము వరకుం గల చక్రములాఱింటికిని సంబంధము కలిగియున్నది. ఈ సుషుమ్నా నాడిలోనుండి కుండలియనునది కపాలమునకుం జేరి యచటనుండి నాలుకకొనకు వచ్చుచున్నది. అపుడా కుండలీశక్తికి సరస్వతియను పేరు కలుగుచున్నది. ఈసుషుమ్నానాడి యిడా పింగళలతోఁ గలియు చోటు కనుబొమలకు నడుమనుండు స్థలము. ఇడా, పింగళా, సుషుమ్నలు మూడునుఁ జేరుటవలన నాస్థానమునకు త్రికూటమనియు, త్రివేణీసంగమ మనియు, నాజ్ఞాచక్రమనియు పేరులుకలిగెను. ముందుచెప్పిన ప్రణవనాద మనాహత చక్రమున నున్నది. దానిలో సూక్ష్మమగు మఱియొక ధ్వనియున్నది. యాధ్వనియందు జ్యోతి వెలుఁగుచుండును. మనసాజ్యోతియందే లీనమైయుండును యెచ్చట మనసులీనమగునో యాచోటునకే పరమపదమనిపేరు. ఈ చెప్పిన విషయమంతయుఁ దారక ముద్రాలక్షణమని యెఱింగి తప్పక దీనినిఁ జేయుచుండినయెడల పరబ్రహ్మమును దెలిసికొని చిదానంద పదవిఁ గాంచును. అని చెప్పిన యమధర్మరాజు మాటలు విని మునిచంద్రుఁడగు సానందుఁడతనిఁ జూచి, ఓయియమరాట్టా ! నీవుచెప్పిన సందర్భములవలన నామనస్సు కళవళమొందుచున్నది. ఏలననిన, తారకమున, కళలును, నందువలన నాదమునుఁ నేర్పడునని చెప్పితివి. యాత్మస్వరూపమెఱిఁగి, తానే యాత్మయని తెలిసికొనుట కాధారమెద్దియో, తెలుపలేదు కావున నాకావిషయ మెఱిఁగింపుమని యడిగెను. అందునకు శమనుండు సంతుష్టిఁగలవాఁడై యిట్లనియె. నయ్యా! ఇపుడు మీరడిగిన ప్రశ్నము చాలాగోప్యమైనది సులభసాధ్యము కానిది. ఆత్మానాత్మ విచారసంబంధమగు మీసందేహము నివర్తి

— శమనుఁడు సానందున కాత్మానాత్మ వివరణముం జెప్పుట —

యగునట్లు చెప్పెదను. దృక్కు (అనఁగా చూపు) దృశ్యము (అనఁగా జూడఁబడినది) ఈరెంటియందును. యోగాదులగు సాధనములచేత

దృశ్యము నశించిపోఁగా దృక్కు మిగులును. అపుడా దృక్కే బ్రహ్మ మని తోఁచును. ఎపుడు దృశ్యములగు భ్రమలన్నియుఁ దీఱి, యేవ్యాకుల మును లేక యెఱుకయైన దృక్కు శేషించునో, యపుడు పరమాత్మ యిట్టిదని సులభముగాఁ దెలియవచ్చును. యీరెంటిలో కనఁబడునవి యన్నియు నస్థిరములనియు, నసత్యమనియునూహించి, స్థిరమైనదియు, నిజమైనదియు నగు యెఱుక (దృక్కు) ను నమ్మి, మలినచిత్తుఁడుగాక, చూచుచుండిన, దృక్కు బ్రహ్మమనియు, దృశ్యము మాయ యనియుఁ, దెలియవచ్చును. ఈలోకము, నేను, వాఁడు, నాది, వానిది యనెడి కనఁబడు సర్వమును, తోఁచునదంతయు, నిజముకాదు. యివి యన్నియు ముందుచెప్పిన దృశ్యమునకు సంబంధించిన భ్రమాత్మక ములు. సమస్తమును పరమాత్మయని నమ్మెడివానికి కన్నులయందు, పూర్వముచెప్పిన సద్యోజాత, వామదేవ, యఘోర, తత్పురుష, ఈశానాది రూపములుగల పంచవిధములగు కళలుకలిగి, దానికి తరువాత స్వచ్ఛమగు పరమాత్మ గోచరించును. నేత్రములద్వారా పంచకళల నెఱుఁగ లేనివాఁడు, పరమాత్మను తెలుసుకొనఁజాలఁడు. నేత్రమునందు చుట్టు నెఱ్ఱఁగా మొదటిభాగమునఁ గనఁబడు వర్ణము (రంగు) స్థూలదేహము. దానికావల తెల్లఁగాఁగనఁబడునది సూక్ష్మ దేహము. దానితర్వాతఁ గనఁబడెడి నీలవర్ణము కారణశరీరము. దాని పిమ్మటఁ దోఁచు మలినపురంగును పచ్చరంగునుఁ గలిసినభాగము మహాకారణశరీరము. అన్నిటికిమీఁద కొనయందున నతిసూక్ష్మ మగు రంధ్రముగల కైవల్యమనెడి శరీరము కలదు. ఆ రంధ్రమునం దంతయుం బ్రకాశించుచుండును. ఇట్లు పంచదేహములు (అనఁగా కళలు)కన్నులయందే ప్రకాశించుచుండును. యీ యైదువిధములగు శరీరములయొక్కయు కొలతయెట్లన్న, మూఁడున్నర యంగుళములు స్థూలదేహము, నొకయంగుళము సూక్ష్మదేహము, నరయంగుళము కారణశరీరము, నాలుగంగుళములు మహాకారణ శరీరముఁగలిగి, యుండును. పరమాత్మశరీరమగు నైదవదానికి పరిమాణములేదు. ఈ యైదువిధముల శరీరములతో ప్రకాశించు పరమాత్మ పద్మము వలె గుండ్రముగను, రాయివలె చలనములేకను, ఉన్నదియు లేని

దియుఁ దెలియరాని సూక్ష్మాకారముఁ గలదిగాను నుండును. మింటఁ జుట్టును నాలుకలు వ్యాపించినలాగున పరమాత్మ తేజమువలన ప్రపంచము వ్యాపించియుండును. ఆపరమాత్మ యంతటను నిండి యుండును. సుషుమ్నా నాడియందలి సూక్ష్మరంధ్రమున పరమాత్మ యుండుటఁ దెలిసికొని, యాబ్రహ్మమే, త్రిమూర్తి స్వరూపమని నిశ్చయించి, నేత్రమలకు వెలపటను, లోపలనుఁ దేజరిల్లునది యాపరమాత్మ గాక యన్యమేదియు లేదని యూహించి, యితరచింతలును, భ్రమలును వీడి యప్పటికి, స్పష్టముగా తనస్వరూప మిట్టిదనియుఁ దానిట్టివాఁడనియుఁ, గనుఁగొని తత్త్వజ్ఞుఁడు పరమాత్మ తానేయనియుఁ దనకంటె వేఱగునది యేదియు లేదనియు, నిర్ధారణఁజేసికొని సంతుష్టుఁడై, తనలోఁ దా నానందముఁ జెందుచుండును. ఇపుడు చెప్పినరీతి యందొక విశేషముకలదు ఎద్దియన్న, దృక్కు లేక దృశ్యము సంభవింపదు. దృక్కు కలిగినపుడే దృశ్యమునుఁ గలుగును. అయినను వివేకి దృశ్యమును విడుచుటకే ప్రయత్నించవలయును. మనుష్యుఁడు నిజమైన దృక్కును గనుఁగొన సమర్థుఁడుగాక భ్రమింపఁజేయు దృశ్యమునకు లోఁబడి వివేకము చెడి మాయాబద్ధుఁడు గావున నింద్రియంబుల బలంబును జయింపనేరక, బాహ్యప్రపంచంబున మనసు వ్యాపించుటంజేసి కర్మంబులఁ జేయుచు, జనన మరణాద్యవస్థలు చెందుచుండును. పరమాత్మ సర్వజీవులందును, కిరణములతోఁగూడిన సూర్యునివలె వెలయుచుండును. ఆకిరణములే మాయ. యవిచారి భ్రమింపక వానికి నిమిత్తమైన మొదటివస్తువునుఁ జూచి, యదియే తానని బుద్ధిమంతుఁ డెఱుఁగును. ఐదువిధములగు శరీరముల రూపములుగలకన్నునందు పరమాత్మ వెలుఁగురూపమున నొప్పుచుండును. అది (పరమాత్మ) ఒకయంగుళ ప్రమాణము స్థూలమును (లావు) నరయంగుళ ప్రమాణము సూక్ష్మము (సన్నము)నై యయిదు రకముల రంగులతో పాదములు మొదలు శిరస్సువరకును శరీరము వోలెకనఁ బడును. ఇది ప్రత్యక్షమైనది. యిందలి తత్త్వమును గురువువలనఁ దెలిసికొనవలయును. ఎంతనేర్పరి యైనను, నెంత బుద్ధిమంతుఁడైనను దనంతఁ దాను తెలిసికొనఁజాలఁడు. ఇందుకు మఱియొక యుపాయము

కలదు. రాత్రికాలమున చలనములేని దీపముముందు కూర్చుండి నాశికాగ్రమున దృష్టినిలిపి యచలుఁడై (యనఁగా కదలక) చూచుచుండిన నచట నొకప్రకాశము గోచరించును. అదియే పరబ్రహ్మము. అట్లుచూచి మెఱింగి కన్నులు మూసికొనిన స్వస్వరూపమేర్పడును. ఈలాగు పరమాత్మరూపమునుఁ దెలుసుకొన్నప్పుడు సకలమైన భ్రమలునుఁదీఱి తనకును పరమాత్మకును నెందును భేదములేదనుటఁ దెలిసి ముక్తుండు గావలయును. ఇట్టి పరిశుద్ధమైన యాత్మతో మాయచేరి సమస్త జీవులను భ్రమింపఁజేయుచున్నది యావిధంబు నెఱింగించెద వినుము.

శివుండు సానందునకు మాయాస్థాన విశేషంబులఁ జెప్పుట.

మహాత్మా! మాయకుస్థిరమైన స్థానము నేత్రము. అదియే ప్రత్యక్షబింబమగు పరమాత్మ యుండుచోటు. ఆపరమాత్మకు ఉనికిపట్టైన శరీరమందు బుద్ధితో పరమాత్మ కలిసిన కాలమున, నెల్ల దేహములయందును. మాయయే భేదభావముతో కనఁబడుచుండును కన్నులయందలి ప్రతిబింబముతోఁ గూడిన పరమాత్మ రూపు మెచ్చటఁదోఁచునో, యచట మాయ సిద్ధముగాయుండును. ఈశ్వరుఁడా మాయచేతనే సకలజీవులను, మోహింపఁ జేయుచున్నాఁడు ఈశ్వరుఁడున్న స్థానము నెఱిఁగినవారికి యచటనే మాయయు నున్నదని తెలియును. సమస్తమునకును మాయయే కారణము. దానివలననే యుత్పత్తి స్థితిలయములు సంభవించు చున్నవి. మాయలేనియెడల పరిశుద్ధుఁడగు పరమేశ్వరుఁ డేదియుఁ జేయనేరఁడు. నేత్రము కొనలయందుండురంగు (అనఁగా మెఱ్ఱనికాంతియే) మాయయనియు, యది యన్నిటికిని మూలమనియు, దృశ్యాదృశ్యములని చెప్పఁబడిన వాటికది నిమిత్తమనియు, దానిఁగడచిన పిమ్మట నంతయు పరమాత్మయై యుండుట తోఁచుననియు, వివేకులు చెప్పుదురు. యిట్టి మాయను స్థిరమైన ముందుచెప్పిన దృశ్యాదులఁ గడచి, పిమ్మటనుండు వెలుఁగుఁ గని, నిర్మలుఁడైన యోగి యావెలుఁగునందు తాను లీనమై పోవును. (అనఁగా పరమాత్మతో నైక్యముఁ బొందును.) ఇది ప్రకృతియును

పేరుఁగల మాయయొక్క వివరణము. ఇఁక మూఁడవదియగు యమ

శమనుఁడు సానందున కమనస్కయోగం బెఱిఁగించుట

నస్కముం జెప్పెదను. అయ్యా! మునిశ్రేష్ఠా! అమనస్కమనెడి యోగము సులభసాధ్యమైనది కాదు. దానికిమనస్సు ముఖ్యాధారము. మనస్సును నిలుపుటయే యమనస్క తత్త్వము. ఇంద్రియముల యొక్కపనులన్నియు, మిధ్య (నిజము కానిది)యని తెలిసికొని, భ్రమ నొందక మెలఁకువఁ గలవాఁడై మనస్సునుఁ జలింపనీయక, యంతర దృష్టి (అనఁగా లోచూపు) చే యాత్మస్వరూప మిట్టిదని యెఱుంగుట కమనస్కయోగమని పేరు. ఇది మిక్కిలి ప్రయత్నముతో చాల కాలము కష్టపడి యభ్యాసముఁ జేసినఁగాని లభింపదు. యేలనన, నమనస్కయోగ విధిప్రకారము మనస్సును కట్టుపరుచుట సాధ్యము కాదు. సప్తసముద్రములు నీఁది యావలిదరిఁ జేరవచ్చును. కొండలనైనను, బంతులవలె నెగరవేయవచ్చును. మహాభయంకరమైన కార్చిచ్చును మ్రింగవచ్చును. కాని మనస్సును చిక్కఁబట్టుటకు శక్యముకాదని, యోగులు చెప్పుదురు. ఇంద్రియ సంబంధములగు భ్రమలతోఁగూడిన యా మనస్సు నిలుచుట కష్టము మనస్సును చలింపనీక, హృదయంబున ప్రాణవాయువును కుంభించి (అనఁగా బిగఁబట్టి) ఇంద్రియ వ్యాపారములనడఁచి, యోగాసనమునఁగూర్చుండి చూపును స్థిరముగా ముక్కుయొక్క కొనయందు నిలిపి చూడవలయును. లోకంబున కొయ్యలతోడను, రాగితోడను, మట్టితోడను, రాళ్లతోడను, బొమ్మలుచేసి, వానిని ప్రతిష్ఠఁగావించి యవియే దైవముగానెంచి భక్తితో ధూపము, దీపము, పూజానమస్కార నైవేద్యములఁ గావింతురుకదా! యీలాగునఁజేసి పొందనెంచిన యుత్తమ పదమునకన్నను, చిత్తము నిర్మలముగాఁజేసి దృష్టిని పరమాత్మయందు లయింపఁజేసెడి యమనస్కయోగమువలనఁగలిగెడి మహావిశేషమగు పదవియుత్తమమైనది. తత్త్వము నెఱింగిన పెద్దలు, (అనఁగా మునులు మొదలగువారు) గంగయాదిగాఁగల పుణ్యతీర్థములని చెప్పఁబడునవి నీళ్లనియు, గుళ్లయందు దేవతల పేరులతోనిలిపి యుంచెడి విగ్రహములు, రాళ్లు, కొయ్యలు, మట్టి, లోహము, మొదలైన వానిచే-

గల్పితములనియుఁ, తలంచి యట్టివాని సేవించుట కిచ్ఛయింపరు అవి
యన్నియు మూఢులు (అనఁగా తెలివిలేనివారు) సేవింతురు. యోగి
తన మనస్సును రాయివలె గట్టిపఱచి పరమాత్మ రూపము నెఱుం
గుటకే ప్రయత్నించును. ఇట్టి తత్త్వమునే యమనస్కమందురు.
యోగ్యుఁడగు గురువు నాశ్రయించి యతనివలన యోగవిధుల
నెఱింగి కష్టపడి సాధించి సద్గతిఁ జెందువారితో, యజ్ఞయాగములును,
మహాదానములును, దేవప్రతిష్ఠలాదియగు ధర్మములును, తపస్సు
లును, జపంబులును, బ్రహ్మచర్య మాదియగునట్టి వ్రతంబులును,
నొనరించి కృతార్థులైనవారు సమానులు కాఁజాలరు. సర్వేంద్రియ
ములకును మనసే యధిపతియని ముందే చెప్పియున్నాను. సకల
భ్రమలును మనసే కలిగించుచున్నది. కాఁబట్టి యట్టి మనసును, చలన
ములేని దానిఁగాఁ జేయవలయును. దానినెల్లపుడును పరమాత్మయం
దైక్యముఁ జెందునదిగా నొనరించుటకుఁ దగిన ప్రయత్నముఁ గావింప
వలెను. అటులఁ జేయు యత్న మమనస్కయోగము. దేనిచేత భ్రమలు
పుట్టుచున్నవో, దానివలననే యాభ్రమలు నివర్తిఁ జేయఁబడవల
యును. దానికి సదా పరమాత్మను తలంచుచు, నితరచింతలుమాని
శాంతముతో మెలంగవలయును. ఇట్లమనస్కయోగ మెఱింగి మన
సును పరమాత్మతో లయింపఁ జేయువానికి మూఁడు విధములగు
కర్మలు నంటవు ఎల్లపుడును నీశ్వరునియందే లగ్నమైయుండును.
దానిని యాత్మానుసంధానము (అనఁగా యాత్మతోఁజేర్చుట) చేయు
నపుడు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను ముగ్గురు మూర్తులయినను,
భ్రమకులోఁబడి పోవుదురు ఇది సత్యము. మునివరా ! ఇంద్రియ
సంబంధములేక స్వాతంత్రముఁ జెందనేరని దగుటచే మనస్సంత
రింద్రియమైనది. దీనినే యంతఃకరణమందురు. పురుషుఁడు మొట్టమొ
దటఁ దన్నుఁదా నెఱుఁగుటకుఁ బ్రయత్నింపవలెను. అటులఁ దెలియ
నేరనివాని యాత్మతో వానిమనస్సు చేరక, చంచలమై నానాభ్రమ
లను గలిగించును ఉప్పును నీటిలో కలిపిన యెడల దానిరూపము
కనుపడక నీళ్లలోఁగలిసి పోవునట్లు, మనసు నాత్మతో సంధింపఁజేసిన
పక్షమున నది పరమాత్మయందుఁ గలిసి నిర్మలమై, సమస్త భ్రమ

లును తొలఁగి శాశ్వతమగు పరమపద ప్రాప్తిఁగలిగించును. పర మాత్మయం దెవఁడు చిత్తమును నిలుపునో, యట్టివాని కితరసంకల్ప ము (తలంపు, లన్నియు తమంతటనే నశించును. నీటియందుఁ బుట్టిన నిప్పు, నీటివలననే నశించునుకదా ! సూర్యుఁడుండు వరకును, ప్రకా శము కలిగియుండి యస్తమించఁగానే యావెలుఁగు నశించినలాగున, నింద్రియముల వ్యాపారముకలిగి యున్నంతవరకును, నన్ని భ్రమలును కలుగుచుండును. అవి తొలంగిన (అనఁగా యింద్రియ వ్యాపారము) నన్నియు నడంగును. పిమ్మట మనస్సొకటి మాత్రమే మిగిలియుండును. ఆమనస్సును తేజోరూపమైన యంతరదృష్టి (లోచూపు) తోఁ గలిపి నపుడు స్వచ్ఛమైన పరమాత్మ గోచరించును. ఆదృష్టిచలనమైన నన్నియుఁ జలనమగును. యది కర్మఫలముగాని యితరముకాదు. వెలుపటిదగు దృష్టినివిడిచి యంతరముననే చూపుఁగలిగి నిర్గు ణ పరబ్రహ్మమునుఁ గనినవానికి జన్మజరాది బాధలుకలుగవు. వానికి పుణ్య పాపములులేవు. సదా యానందసముద్రమున నోలలాడు చుండును. ఏపురుషుఁడు నిర్మలచిత్తుఁడై యమనస్క విధిప్రకారము మనస్సును జయించి శుద్ధమగు బ్రహ్మముతోఁగలిపి సుస్థిరుఁడై చల నములేక వర్తించునో, యట్టివాఁ డేకష్టములుననొందఁడు వానికేది గాని కొఱతయుండదు. శరీరముఁ గలిగియున్నపుడు పుణ్యపాపములు కలుగకపోవునా ? యనిన, వస్త్రమునుకాల్చిన నది కాలినపిమ్మటఁ గూడ వస్త్రముగానే కనుపడును. ఆలాగున దోషములు కలిగినట్లు తోఁచును. కాని యట్టిదోషములా పురుషుని (అనఁగా నాత్మ) నంట నేరవు. ఈప్రకారము యోగులు, సాంఖ్య, తారక, అమనస్క, యోగ ముల నభ్యసించి ప్రపంచ సంబంధమైన కోరికలువిడిచి, చెడనిదియు శాశ్వతమైనదియునగు, మోక్షపదవినొంది యానందింపుచుందురు. కావున వారు పరిశుద్ధులనియు, దోష రహితులనియుఁ, గొనియాడఁ బడుదురు ఇట్టి యుత్తమమగు వానిలో యుత్తమమగు వేదాంతవిచా రము ప్రతిమానవునకును మిక్కిలి యావశ్యకము యెందుకనిన, జనన, మరణ, పుణ్య, పాప హేతువగునదియు, నీచము, నసహ్యము నగునదియునైన, ఈశరీర సంబంధమును, లేకుండునట్లు చేసికొనుట

కంతకన్నను మఱియొక మంచిమార్గము లోకంబున లేనేలేదు. ఈతత్త్వమును గురువులేక తెలిసికొనుటకష్టము. కనుక, శాంతుఁడును, తత్త్వ మెఱిఁగినవాఁడును, కపటము లేనివాఁడును, దయఁగలవాఁడును, పరిపూర్ణమైన చంచలములేని మనసుఁగలవాఁడును, నింద్రియముల జయించినవాఁడును, పరిశుద్ధాచరణఁ గలవాఁడునునగు, సద్గురుని నాశ్రయించి, యతనిసేవించి యతని కరుణవడసి, వేదాంత రహస్యం బును వివరముగాఁ దెలిసికొని, యావిధుల ప్రకారము పట్టుదలవీడక యెవ్వఁడు ప్రవర్తించునో, యతఁడు తప్పక సచ్చిదానంద పదవికి మూలమగునట్టి యాత్మస్వరూపుఁడైన సర్వేశ్వరుని దెలిసికొని, తానే యతఁడౌట గుర్తించి, యనంతమగు బ్రహ్మానందమునుఁ జెందును. చిత్తు (అనఁగా జడాజడముల నెఱుఁగు జ్ఞానము) నకును

—⁂ యమధర్మరాజు సానందునకు జీవబ్రహ్మైక్య విధానంబు నెఱిఁగించుట ⁂—

నచిత్తు(అనఁగా నట్టిజ్ఞానము లేకుండుట)కును నిమిత్తమైనది పరబ్రహ్మ స్వరూపము. అవిద్య (మాయ) సంబంధమునఁజేసి నిర్మలమగు నాపర బ్రహ్మము, చలనముఁబొందును. ఈవిషయ మింతకుపూర్వమే నాచేఁ జెప్పఁబడి యున్నది. అటుల బ్రహ్మము నావరించిన మాయ, శుద్ధ సత్త్వము, మలిన సత్త్వమునను రెండు తెఱఁగుల నొప్పుచుండును. ప్రపంచనిర్మాణాదులగు పనులకు కారణమైన యామాయయే యీశ్వ రునియందు మోహాశక్తిగాఁ బరిణమించును. ఆశక్తియే జీవుని మోహింపజేయును. నిర్మలుఁడగు యీశ్వరుండు ప్రకృతివశుఁడై లింగదేహమున ప్రతిఫలించి ప్రపంచమునొఁ జేరిన కార్యములన్నియుఁ జేయుచున్నాఁడు. మానవులరహస్యము నెరుంగక జనన,మరణాదులగు నుపాధులకు లోనగుచున్నారు. ఈశ్వరుని, కారణమువలన పరమాత్మ యనియు, కార్యమువలన జీవాత్మ (జీవుఁడు) యనియుం జెప్పుదురు. కారణకార్యములు రెండును నొక్కటినివేయని యెఱుంగవలెను, తృణ జలూకన్యాయము (అనఁగా జలగ యొక గడ్డిపోచఁ బట్టుకొనిన పిమ్మట మొదటఁ బట్టియున్న గడ్డిపోచను విడిచినట్లు)గా దేహి (జీవుఁడు) వేఱొక దేహము నాశ్రయించి యీదేహము (అనఁగా తన మొదటి శరీరమును) విడుచును. ఆదేహికి కర్మానుగుణముగా జన్మము కలుగు

చుండును సుఖము, దుఃఖము, మొదలగువానికి కారణమైన యట్టి శరీరమునుఁ బొందినంతట సకల కర్మలునుఁ జేయుచు, మొట నంటి యుండు మృత్యువు (అనఁగా చావును) దప్పించు కొనఁజాలక, క్రమముగా ననేక జన్మములెత్తి యాకర్మంబులు తీరిన తరువాతఁ గూడ, తెలివిమాలి మరల మఱియొక శరీరమునే చెందుచుండును. జీవునకు మూడవస్థలు గలవని చెప్పియుంటినిగదా ! వానియందు, మూడువిధములుగా జీవాత్మ పరిణమించి, శరీర, కారణశరీర, మహా కారణ శరీరములయందు సంచారముఁ జేయుచుండును. ఈ రహస్యమును యోగులుదప్ప యన్యు లెఱుఁగఁజాలరు. అందు మొదట స్థూలదేహమును, పిమ్మట సూక్ష్మమును, పిమ్మట తుర్యమునుఁ జెందుచుండును. జీవుఁ డెపుడును సంచారముఁ జేయుచుండునుగాని, నిలకడయుండదు. ఆసంచారమే జనన మరణములకు హేతువగును. ఇట్లు జీవుఁడు ప్రళయము వరకును చచ్చుచుఁ బుట్టుచుండును. ఈరీతిగా జన్మకారణమైన సూక్ష్మ దేహసంబంధముచే పూర్వజన్మముయొక్క కర్మఫలమున బద్ధుఁడై, స్థూలదేహము ధరించి కొంతకాలము వసించి, యంతట పాము కుబుసము విడిచినలాగున స్థూలకాయము విడిచి మరల సూక్ష్మ శరీరమునుఁ దాల్చును. మరణమనునది శరీరమునకుగాని జీవునకుఁ గాదు. జీవునకు మరణమే లేదని ముందు చెప్పియున్నాఁడను. చినిగిన గుడ్డను పారవైచి మంచివగు క్రొత్త గుడ్డనుఁ గట్టుకొన్నలాగున జరా (ముసలితనము) భూతమై శిథిలమగుచున్న దేహమును విడిచి నూతనము (క్రొత్తది)గానొప్పు మరియొక దేహమునఁ బ్రవేశించును. జీవుఁడు పుట్టుటకు గిట్టుటకు నిమిత్తమునుఁ దెలిసి యీరీతి నితరు లెఱుఁగునట్లు చేయు జ్ఞానమే శబ్దైక్య మనఁబడును. ఈశబ్దైక్య విధానము నెఱింగినను కూడ, మోక్షము గలుగునందురు. కాని యది శాశ్వతమగునది యని చెప్పుటకు వలనుపడదు. యెందువల్ల ననఁగా, యది యెఱింగినను జననము మరణముఁ గలుగుచునే యుండును. అట్టిది లేనిదానినే ముక్తియని చెప్పుట సమ్మతము. శబ్దైక్యమునుఁ దెలిసినపిమ్మట గురు ముఖంబుగా తత్త్వము నెఱిఁగినపుడది విశేష లాభకరముగా నుండును. అపుడేగాని జనన మరణ దుఃఖములు

నశించుటకు మార్గమేర్పడదు. ఈశబలమను మాటను చక్కఁగా విమర్శఁ జేసినయెడల, శబలమనఁగా, మాయాసహితుండైన పరమేశ్వరుఁడనియు, మాయాప్రాప్తుండైన జీవుఁడనియు, నేర్పడును. ఈభేదమును చక్కఁగా గురువువలనఁ దెలిసికొనవలయును. ఇట్లుచెప్పుటలో మీకొక సందేహము కలుగవచ్చును. యెట్లన్న గురుముఖమున నీవిధాన మెఱింగినవారికి జన్మములేదని చెప్పితిని. అటుల గురువు నాశ్రయించి తత్త్వ విచారముఁజేసి యోగంబు లొనరించిన పిమ్మటఁ గూడ జన్మము గలుగుటకలదు. అందుకు నిమిత్తము మీకుఁజెప్పుట యావశ్యకము కానఁ జెప్పెదవినుఁడు. యోగ్యులగు గురువుల నాశ్ర

శమనుఁడు సానందునకు శరీర భంగ ప్రకారమును చెప్పుట.

యించి, యోగాభ్యాసముఁజేసి, తత్త్వరహస్యముం దెలిసికొన్నప్పటికిని, యహంకార మమకారములకు గురియగు భ్రమను బోగొట్టుకొనలేనపుడు, జననముమరణముఁ గలుగక తప్పదు. అయినను నవి జ్ఞానముతోఁ గూడియుండును. జీవుఁ డజ్ఞానవశుఁడై సూక్ష్మశరీరమున నుండునపుడా యజ్ఞానవాసనచే నాచ్ఛాదితుఁడు (కప్పబడినవాఁడు)గా నుండు పరమాత్మతోఁ దన్నుఁ జేర్చుకొనుటవలన, మఱియుం దెలివిఁ దప్పి యింద్రియముల నిగ్రహింపఁ (గెలువ)జాలక వశుఁడై తాపత్రయములఁ జెందును. అపుడే జనన మరణములఁ బొందుటకు కారణమేర్పడును. కనుక, యట్టిప్రకృతి (మాయ) తొలఁగుటకుం దగిన యుపాయమును మొదటఁ జింతించి, మనస్సును పదిల పరుచుకొనవలెను. ఆలాగునఁ జేసిన జీవుఁడు నిర్మలత్వము వహించును అపుడు పరమాత్మయు నిర్మలుఁడగును. అట్టి కళంకములేని పరమాత్మతో కళంకములేని జీవాత్మ చేరినపుడు పునర్జన్మములేక శాశ్వత మోక్షము సంభవిల్లును. కర్మబద్ధుఁడైన యెడల జీవుఁడు వాని ననుభవించుటకు మరల జన్మ మెత్తవలసియుండును. కావున కర్మ రహితుఁడగుటకే ప్రయత్నించవలెను. కర్మ, సంచితమనియుఁ, బ్రారబ్ధమనియు, నాగామియనియు, మూడువిధములు పూర్వము తానుచేసినదానిలో యనుభవించినదిపోగా మిగిలియున్నదానికి సంచితమనిపేరు. పూర్వ మనుభవించి శేషించినదానిని మరల ననుభవించుటను ప్రారబ్ధమనఁబడును.

ఆగామియనునది వర్తమానకాలమునఁ జేసిన కర్మలో ననుభవించినది పోఁగా మిగిలినది. ఇది రాఁగల జన్మమున ననుభవించుట కొఱకు నిలిచియున్నది. ఈకర్మల తారతమ్యమెఱిఁగి నేనే పరబ్రహ్మమననియు, జననము, ముసలితనము, మరణము లేనివాఁడననియు, ప్రపంచమంతయుఁ దనస్వరూపమనియు, సకలజీవులునుఁ దానేయనియు, నెవ్వఁడు స్పష్టముగాఁ దెలిసికొనునో, యతఁడే యోగి. యతఁడే ముక్తుఁడు. ఇట్టి పరతత్త్వముఁ జక్కఁగాఁ దెలిసికొన్నవానికి మోక్షము కరతలామలకము. అట్టివానికిమాయాసంబంధములగు గుణములన్నియు నశించును. ముక్తిసాధింపనెంచిన వారలందఱును, వీనినిఁ గనుఁగొని, యెవ్వి విడువవలయునో, యెవ్వి విడువఁగూడదో, వివేచనఁ జేసి తత్త్వమును దృఢముగా నభ్యసింపదగును. జడుఁడై, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరము, నను నాఱుగుణంబులును విడిచి, సుఖము, దుఃఖము, ననెడి వానియందు బుద్ధిఁ జలనమొందనీయక, భ్రమలకు లోఁబడక, శాంతి, దాంతిఁ గలిగి, మానసమునుఁ జిక్కఁబట్టిన వాఁడు తప్పక ముక్తుఁడగును. మనస్సెపుడును సుఖదుఃఖములు నొందుట కలవాటుపడియుండును. గనుక అద్దమును బాగుగాఁ దోమిన యెడల నది బాగుగాఁ బ్రకాశించు విధంబున మనసును మలినయుక్తముగానీయక, దానిని శుభ్రముఁ జేసికొనుటకుఁ బ్రయత్నింపవలెను. ఆలాగైన యెడల నది నిర్మలమగును. ఎపుడు మనస్సు నిర్మలమగునో, యపుడన్నియు ననుకూలము లగును. అపుడు బురదనీళ్లలోఁ జిల్లగింజఁ జాది కలిపిన యా బురదయంతయు నడుగుననిలిచి తేటయగు నీరుపైఁ దేలువిధంబున, మనసనెడి చిల్లగింజవలన సకల పాపపంకములును, నశించి పరిశుద్ధుఁడగు నాత్మారాముని గనుఁగొను భాగ్యము చేకూఱును. నిర్మలమైన పరమాత్మనుచూచి తెలుసుకొని, సుఖదుఃఖముల సంబంధమునుమాని నిశ్చలుఁడై, నిత్యమగు యోగసమాధినుండు పద్ధతికే లింగశరీర భంగమనిపేరు. యిట్లు లింగశరీర భంగముఁ జేసికొన్నవారికిఁ జెందరాని దెద్దియునులేదు. స్థిరచిత్తునకు సంతోషమును, దుఃఖమును, కష్టమును, సుఖమును, కోపమును భీతియు, నాశయు, భ్రమయుఁ గలుగనేరదు. అట్టివాని కన్యులతో,

నేసంబంధమును లేదు. అతఁడెవ్వరితోను భాషింపఁడు. దేనికి నితలంకఁడు. యేవిషయము నాలోచింపఁడు. అతనికి లాభనష్టములు లేవు. భ్రమ యతని నంటదు. సర్వమును పరమాత్మయనియు, నాపరమాత్మయే తానని యు నెఱింగి నెమ్మదిగా యుండును. ఇట్లు జీవుఁడు సకల విచారములను వర్జించినఁగాని పరమాత్మను గలియఁడు. ఇంక నవస్థాత్రయ లక్షణ మెఱింగించెద వినుండు. జాగ్రత, నిద్ర, స్వప్నము, నని జీవునకు

యముఁడు సానందున కవస్థాత్రయ లక్షణముఁ జెప్పుట.

మూఁడవస్థలు కలవు. అందు మొదటియవస్థయందు సర్వేంద్రియంబులును తమతమ వ్యాపారమును జరుపుచుండును రెండవదానియందు వ్యాపారరహితములై యింద్రియములు స్తంభించి శాంతముగానుండును. ఆసమయమున జాగ్రత్తయందలి కార్యజ్ఞానము మనస్సునందు సంక్రమించి తద్రూపమున జనించిన భ్రమ యంతర్వర్తియైన జీవుని కాపాదిల్లును. అదియే స్వప్నము (కల) లేక స్వప్నావస్థ యనఁబడును. కలఁగను కాలమున జాగ్రతయను నవస్థయందలి వికారము, నిద్రయందు లేకుండుటకు కారణమేమనిన, నిద్రాకాలంబున జీవాత్మ ప్రాణములకు బుద్ధిని సహకారిం జేసి వెడలిపోవును. అపుడు (అనఁగా జీవాత్మ) బహిస్సంచారమున నుండునపుడు, ప్రకృతి సంబంధముతో నుండుబుద్ధి ప్రాణవాయువుతోఁ గలిసి తెలివిలేక యుండునుగాన నపుడే వృత్తియు లేకయుండును. జీవాత్మ వెడలిపోయిన, పిమ్మట ప్రాణమెట్లుండును? ప్రాణమనునది యేకదా! జీవాత్మ. యనినచో, జీవాత్మ ప్రాణమైయుండియు, పంచభూతసమ్మేళనమునఁ గలిగిన వాయురూపమైన యా జీవాంశ మొకటి యెల్లపుడును శరీరముననే యుండును. దానితోడనే మాయావశమైన బుద్ధిచేరి స్వప్నములు కలిగించును. ఈవివరము పంచీకరణము నెఱిఁగిన వారికి సులభముగాఁ దెలియవచ్చును. నిద్రా సమయమున మత్తుఁగొని యున్న యాప్రాణముపరిపూర్ణ జీవత్వము నొందినపుడా మత్తయుడంగును. అపుడే మేలుకువ కలుగును. అదియే జాగ్రత్త. అట్టికాలమున శరీరి నేనుచక్కఁగా నిద్రించితి నని తలంచును. సుషుప్తికాలమున స్తంభించి యుండుటవలన జీవాత్మ సంబంధము లేక, యంతరముననుండు తేజోరూపమైన పర

మాత్మ సాక్షియై వెలుఁగుచుండును గాని, యితరవిషయముల నేమి యుఁ జేయఁజాలఁడు. ఇట్టియవస్థలకు పరమాత్మయే మూలకారణము. అతఁడు సమస్త కార్యములయందును జీవాత్మతోఁ జేరి యాయా కార్యములను చేయించును. యిట్టి యవస్థలు మూఁడింటి నంటనీయక, యఖండమగు తేజము (అనఁగా వెలుఁగు)ను తెలుసుకొనవలయును. ఈ మూఁడవస్థలే ఉత్పత్తి, స్థితి, లయములకుఁ గారణములుగా నుండును అనఁగా యట్టివాని కివి సాక్షియను మూలము నెఱుంగ వలెను. మెఱుక యనునది యన్నివిషయముల నిజముఁ దెలిసి కొనుటకుఁ దగినసాధనము. మన్నువలనఁ జేయఁబడిన యనేక విధములగు పాత్రలు మొదట నొక మట్టినుండియే వేఱు వేఱు రూపములఁ గల్పింపఁ బడినవనియు, ప్రత్తివలనఁ గలిగిన నూలు పలు విధముల రంగు లద్దఁబడియు, మొదట నంతటికి నొకవస్తువయే యాధారమనియుం దెలిసి కొన్నటుల, ననేక యవస్థలం జెందుచు మారుచుండినను ప్రపంచముగాని, జీవకోటి గాని సర్వమును నొక పరమేశ్వరుని వలననే గలిగిన వనియు, కారణవశంబగు నుపాధులచేఁ బెక్కురూపంబు లొంది లయమగుచుండుననియుం దెలుసుకొన వలయును. ఆలాగు తెలుసుకొను తెలివియే మెఱుక యనఁబడును. నీళ్లయం దలలుపుట్టి మరల నీళ్లయందే యడంగువిధంబున, జీవులు పరమేశ్వరునియందు జనించి యతనియందే లయమగుచున్నవి. అఖండమైన యాపరమాత్మను, బాణములు, కత్తులు, శూలములు మొదలగు సాధనములచే భేదించుటకు సాధ్యముకాదు. నిప్పు కాల్పఁజాలదు. నీళ్లుముంచఁజాలదు. గాలి యెగరఁగొట్టఁజాలదు. అతఁడు దేనికిని నందఁ జాలఁడు. యివ్విధంబున సర్వవ్యాపియైన యీశ్వరుఁడు కపట నాటక సూత్రధారియై బొమ్మలను నాట్యమాడించులాగున నాడించుచున్నాఁడు. అతని తత్త్వము యోగాధి సాధనములచే గాని తెలియరాదు. ఈ చెప్పఁబడిన తత్త్వమును నమ్మి యభ్యాసముఁ జేసినవారే యతని గనుఁగొందురు. అట్టివారు పాపరహితులై నిర్వాణ సుఖము ననుభవింతురు. ప్రాణులకు పుణ్యపాపములు కర్మలచేఁ గలుగుచు జీవుఁడు కర్మముచేఁ బుట్టి కర్మముచే నశించును. జీవునకు కర్మమే, సంతోషము

ను దుఃఖమును గలిగించును. ముందు చెప్పఁబడిన మూఁడువిధములగు కర్మలు (అనఁగా, సంచితాగామి ప్రారబ్ధములు) నశింపఁజేయునది తత్త్వవిచార మొక్కటి మాత్రమేయని చెప్పుదురు. సాంఖ్యాదియోగములు జన్మ రాహిత్య మొనరించును. కాబట్టి ప్రపంచ వాసనలయం దభిమానము లేనివారు, (అనఁగా వేదాంత విచారా సక్తులు) తత్త్వవిచారమున బుద్ధిఁజొనిపి పెద్దల యనుగ్రహమున యెఱుకఁ గలిగి ముక్తులగుదురని వేదములును శాస్త్రములును. బోధించుచున్నవి. ఇంతవరకును జెప్పినవిగాక సమాధిలక్షణము వివరించెద. దేహసం

## యముఁడు సానందునకు సమాధిలక్షణముం జెప్పుట.

బంధముంగల యింద్రియముల యొక్కయు, బుద్ధియొక్కయు, పుణ్యపాపముల యొక్కయు, నాకలిదప్పుల యొక్కయు, కష్టసుఖముల యొక్కయు, సంతోష దుఃఖముల యొక్కయు, వికారము లెప్పుడు తనకు లేకయుండునో, యెప్పుడు జీవాత్మ పరమాత్మల యైక్యరూపము నెఱింగి యారెంటినిఁ గలిపి యభేదముగా నిశ్చలమనస్కుఁడై యుండునో, యాలక్షణము యోగులకు సమాధియని చెప్పఁబడినది. ఇట్టి సమాధియందుండు యోగి యీజన్మమునందే ప్రపంచ సంబంధములగు లాభాలాభములును సకల సుఖదుఃఖములను విడుచుచున్నాఁడు. యెప్పుడు కర్మములు మూఁటిచే విడువఁబడి సమాధి నిష్ఠఁగలవాఁడగునో, యపుడు జనన మరణములులేని మోక్షపదవినిఁజెందుట కర్హుఁడగును. ఈ సమాధికి పరిపూర్ణమగు జ్ఞానము కావలయును. దానికి గురువుయొక్క కటాక్షము మిగుల నావశ్యకము. గురువు. కరుణచే సంపన్నమైన తెలివి నుపయోగించి సమాధినిష్ఠ నుండువానితో నెవ్వరును సమానులు కాఁజాలరు. పరిపూర్ణ సమాధియందు మనస్సు నిలిపినవానికి బాహ్యమున (అనగా బయట) వృత్తు లెవ్వియుఁ దోఁచవు వాఁ డచల బ్రహ్మానంద సుఖమున లగ్నమైన మనస్సుఁగలవాఁడగుటచే నేమిచేసినను చలింపఁడు. రాతిబొమ్మవలె నుండును. రేచకము, పూరకము, కుంభకము, నను పేరులుగల వాయుధారణ లెఱింగి ప్రాణవాయువును కుంభించి (బిగఁబట్టి)యున్న కతంబున నంతర్ముఖుఁడు (లోచూపుఁ గలవాఁడు)గా నుండును. చెవులుండియు బయటి

శబ్దంబులు వినఁజాలఁడు, కన్నులు తెఱచి చూచుచుండినను బయట వస్తువేదియు నతనికిఁ గనుపింపదు. నోరుగలిగియు మాటలాడనేరఁడు ఏల? యతఁడు తనస్వరూపమును పూర్ణముగా నంతరదృష్టిచే పరమాత్మ స్వరూపమున నైక్యముఁజేసి నిశ్చించలుఁడై స్తంభించిన యింద్రియ వ్యాపారముఁ గలవాఁడై పోవుచు. యిట్టి యుత్తమంబగు సమాధిలక్షణము నెఱుంగనివాఁడు యోగి కానేరఁడు. పరమాత్మ సత్తు, చిత్తు, ఆనందము, నను మూఁడులక్షణములుకలవాఁడు. సమాధినిష్ఠుఁడగు యోగి క్రమముగా మొదటిదానిని, రెండవదానిని, తరించి (అనఁగా దాటి) కడపటిదగు యానందమునుఁ జెందును. సమాధి నిష్ఠుఁ డన్నిబంధములను విడిచిన వాఁడగును. లేకబాధకములఁ దగిలిన యోగికి నిష్ఠకుదురదు. ఎంతటి నేర్పరియైనను, బుద్ధిమంతుఁడైనను, నౌకొ్కకపుడు పెనుగాలివలెను, సముద్ర తరంగముల (అలలు) వలెను పైవచ్చు మాయా వికారములకు తటాలున లోఁబడి తనసంపూర్ణమైన సుజ్ఞానమునుఁ గోలుపోయి తనస్థిరత్వమునకు తానేమోసముఁ దెచ్చుకొనును. అపుడు తత్పూర్వ మతఁడు పడిన కష్టమంతయు నిష్ఫలమై మరల బంధబద్ధుఁడగును. కావున తెలివిఁగల వాఁడీవిషయంబున జాగరూకతఁ గలిగి ప్రవర్తింపవలసి యుండును. అటులఁగాక పూర్వకర్మ వశంబున బద్ధుఁడయ్యె నేని, యట్టి పురుషునకు యెల్లపుడును, బంధమే (సంసారమే) కలుగును. సాధారణముగా లోకంబున మానవులకు మనస్సున నేకోరికకలిగియుండునో, యదియే లభించునని శాస్త్రములు చెప్పుచున్నవి. మరణకాలముననే విషయమునుఁగాని దేనినిఁగాని యే వేలుపునుఁగాని మనస్సునఁ దలంచుచు, ప్రాణములు విడుచునో యట్టిభావన ప్రకారముగా యాజీవుఁడు తానాభావమునే పొందును. కావుననే దేహము విడుచునపుడు పరమేశ్వరుని ధ్యానించుమని పెద్దలు చెప్పుదురు. కావున నెల్లపుడును పరబ్రహ్మావలోకనమునందు బుద్ధినిలిపి యీశ్వరుని ధ్యానించుచుండు యోగికి సమాధి నిష్ఠయందు బంధములంటక ముక్తుఁడగును. సమాధి విశేషముం దెలిసియుండువాఁడు. మూఁడుజాముల రాత్రికాలమున, విజన ప్రదేశమునందు శుచిఁగలవాఁడై సుఖాసనంబునఁ గూర్చుండి గురువు

చెప్పిన ప్రకారమున దీపమును తూర్పుముఖముగా వెలిగించి పెట్టి తాను ఉత్తరముఖుండుగా కూర్చుండవలెను. ఆదీపము వెలిగించుటకు నేయి యుత్తమము. విప్పనూనె మధ్యమము. నువ్వులనూనె యధమమైనదియని చెప్పుదురు. ఆలాగు దీపముదగ్గఱఁ గూర్చుండి, మౌనమునఁ దాను తెలుసుకొనఁదలంచిన గురుతు నాజ్యోతియందు, చలనములేని మనస్సుతో దృఢముగాఁ జూడవలయును. అట్టివాఁడు ముఖ్యముగా నాసనముల వివరమెఱింగి, యెపుడెపు డేయే యాసనమున నుండవలసినదిగా యాచార్యుఁడు (గురువు) చెప్పియుండునో, యాయాప్రకార మాయా యాసనములయందు తానుపవిష్టుఁడు (కూర్చున్నవాఁడు) కావలయును. ఆసనములు యోగశాస్త్రమున ననేకుల చేత ననేకవిధములుగా ననేకములు చెప్పఁబడియున్నవి. కాని, వానియందు బుద్ధిమంతులగు వారు యేర్పఱచి, సిద్ధము, పద్మము, స్వస్తికము, ముక్తము, వీరము, భద్రము, మయూరము, సింహము, గోముఖము, సుఖాసనమను పదింటిని మాత్రము మిగుల నుత్తమములైనవని పేర్కొనియున్నారు. వీనిలో పద్మాసనమనునది గృహస్థు (సంసారముతోనుండు వాఁడు) నకును, సిద్ధాసనము సన్యాసికిని, తక్కినవారికి సుఖాసనమును, నుత్తమములైనవని ముందు చెప్పిన యాసనములు పదింటినుండి కొందఱు పెద్దలు యేర్పఱచి చెప్పియున్నారు. అయినను, యోగాభ్యాసముఁ జేయువాఁడు తనకే యాసనమునం దిష్టమో, దాని నవలంబించవచ్చును. అట్లు యోగాసనమునఁ గూర్చుండువానికి యెల్లపుడును నేకాంత ప్రదేశ మావశ్యకము. యేలనన, నితరచింతల కింద్రియములు ప్రసరింపక యొకటే ధ్యానముఁ గలిగియుండుటయగత్యమగుటఁబట్టి యట్లుండక బాహ్య ప్రదేశమునఁ గూర్చుండిన లక్ష్యము చెడిపోవును. మునులు మొదలగువారు, కొండలయందును, నడవులయందును, గుహలయందును నుండి తపస్సుఁ జేయుటకివియే కారణములు. ఆరూఢుండు (అనఁగా రాగద్వేషములు విడిచి స్థిరచిత్తుఁడగు యోగి) కూడ సంగముచే భంగమునొందును. ఇంకన భ్యాసముఁ జేయువారికా సంగము లక్ష్యభంగ మొనరింపకుండునా? తప్పక భంగము వాటిల్లును. కనుకనే యేకాంతప్రదేశము గావలయు

నని చెప్పఁబడినది. అట్లు యేకాంతముగాఁ గూర్చుండి తననేత్రముల యందుండు, పరమాత్మకును, మాయకును వుండు, సమ్మంధములను గుర్తెరిగి చూడవలయును. అభ్యాసము చేయఁగా యావిధమంతయు బోధయగును. కన్నులకును పరమాత్మయుండు చోటునకును నొక యంగుష్ఠ ప్రమాణ మెడముండును. క్రమముగా యా యంగుష్ఠ ప్రమాణమును భాగించుచు వచ్చిన తుద కణు ప్రమాణ మేర్ప డును. ఆ సూక్ష్మస్థానము రహస్యములో రహస్యమైనది. దానికి అనఁగా యాచోటికి చలనమును, మలినమును లేదు. అది శాంత మును, శాశ్వతమును నైనది. దానినే యభ్యాసకుఁడు చూడ వలయును. యోగముచేత జ్ఞానము కలుగుచున్నది. జ్ఞానముచే లక్ష్యము కుదురుచున్నది, లక్ష్యమువలన నాత్మస్వరూపము తెలి యును. అటుల తెలిసినవాఁ డానందమయమగు మోక్షరాజ్యమున కధిపతియగును. కనుబొమలకు దిగువనుండు రెండు దళములు (రెండుకన్నులు) హం సః. అనుసంజ్ఞలు గలవై యుండును. ఈరెండు బీజములును, హృదయము మొదలు కనుబొమలవరకు నుండు వాయు స్థానమున వర్తించును. ఈ హంసమును. భ్రూమధ్య (కనుబొమల నడుమ) నుండి సహస్రారము (శిరస్సు)వరకుఁ గల యాకాశస్థానమున కుం జేర్చి, బిందుస్వరూపుఁడును, తేజోమయుఁడును, నగు పరబ్రహ్మ మును తెలుసుకొనవలయును. ధ్యానమే యిందుకుప్రధానము. దానికే యాత్మమంత్రమని పేరు. ఆత్మమంత్రమను నదియే హంస యనఁబ డును. హంసయే ప్రాణము. ప్రాణమే పరమాత్మ. హంసయెపుడును వెలుపటికిని లోనికిని సంచరించు చుండును. అది దాని స్వభావము. ఊపిరివిడుచుట, కొనుటయను లక్షణము లా హంసయొక్క సంచార ము. (అనఁగా రాకపోకలు) సూర్యోదయము మొదలు, మరునాటి సూర్యోదయ కాలపర్యంతము గడచుకాలమున యాహంస వాయు రూపమున నిరువది యొకవేలా యారునూరు మారులు నడుచును. ఈపరమ రహస్యమైన హంసయందు మొదటిది శివబీజము. రెండ వది శక్తి బీజము. ఈ రెండును, శుక్లశోణితములై బిందువగును. ఈబిందువునే సోహంభావమందురు. ఈ శబ్దమున మొదటి యక్ష

రము మీఁది స్వరము ఓంకారమును, రెండవ యక్షరము బిందువు నగును. ఈరెంటును నెపుడుకలియునో యపుడు, శుద్ధపరబ్రహ్మ స్వరూపమగు ఓంకార మగుచున్నది. సమస్త తత్త్వములకును, సమస్త మంత్రములకును, వేదములకును, శాస్త్రములకును, వేయేల! ప్రపంచమున వంతటికిని యీ ఓంకారమే యాధారమైనది. దాని నిజ స్వరూపమును దెలుసుకొనుటకే యోగములు నిర్ణయింపఁబడినవి. యట్టి నిర్ణయములు తెలిసికొని ప్రవర్తించు మహాత్ములు యోగులనియు, మునులనియుఁ బేరొందిరి. గురువువలన తత్త్వ రహస్యమునుఁ దెలిసికొని క్రమముగా నొక్కనెల దినముల కాలము యోగాభ్యాస మొనరించి నంతమాత్రముననే, యట్టివాఁడు బ్రహ్మహత్య మొదలగు పాపములవలన విడువఁబడినవాఁడగును. మఱియు నొక్క సంవత్సరము చేసిన వాఁడు సిద్ధుఁడగును. ఎల్లపుడునుఁ జేయువాఁడు జీవన్ముక్తుఁడగును. సంశయము లేదు. పరమార్థ జ్ఞానముఁగలవానికి యెపుడును, రోగముగాని, కష్టముగాని, సంగముగాని కలుగనేరదు. అట్టి వానికి, ధనము, ధాన్యము, భార్య, బిడ్డలు, యిండ్లు, యేనుఁగులు, గుఱ్ఱములు, పశువులు, రథములు, వస్త్రములు, సొమ్ములు, మొదలగు వానియందు కోరికయుండదు. అట్టివానియం దపేక్ష నొందువారు తెలివిలేని వారని తెలియవలెను. వివేకులు తా మారోగ్య వంతులుగా నుండి సుఖము ననుభవింప వలయునని యెపుడును గోరరు. యెట్టి గొప్పకార్యముఁ జేసినను, పడయరానిదగు మహోన్నతమగు పరమపదప్రాప్తి, యొక తత్త్వవేత్తతప్ప, యన్యు లొందఁజాలరు, ఇది సత్యము. కాఁబట్టి కర్మ పరిపాకమగుటకును, తన్మూలమున జన్మము లేకుండులాగునఁ జేసికొనుటకును, పురుషుఁడు వేదాంత విచారంబున నాసక్తిఁగలవాఁడై యోగ్యులగు గురువుల వలన దాని వివరమును, లక్షణములునుఁ, దెలిసికొని యన్యములగు వాంఛలు విడిచి, యోగము లభ్యసించి, యందకమై తోఁచు జీవేశ్వరుల స్వరూపమును పరికించి, తానే పరమాత్మ యగుట గుర్తించి, ప్రపంచ వాసనల వలన విడువఁబడినవాఁడై, పరమానంద పరిపూర్ణమగు మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుఁడు కావలయును. ఈ ప్రభావము గురువులేక కలుగ

నేరదు. ఇదివరకునుం జెప్పినలాగున మంచివాఁడుగా నుండు గురుఁడు లభించు టెట్లనిన, నదిచెప్పుటకు సాధ్యముకాదు. సన్మార్గవంతుఁడై యోగ్యమైన వేదాంత విచారమున నాసక్తుఁడై పెద్దలను సేవించు చుండెనేని కర్మవిపాకమై మహాత్ముఁడైన గురువు హఠాత్తుగా తనకుఁ దానే యాసజ్జనునకు లభించి తత్త్వబోధఁ గావించవలెను. యది పూర్వకృత పుణ్యవాసనాబలంబున సిద్ధింపవలసినయంశము. కొందఱు తనుంతట తామె విరక్తులై గురువులేకనే వేదాంత విచారముఁజేసి యాత్తత్త్వము నంతయుం దెలిసికొంటిమని చెప్పుదురు కాని యది నమ్మరాదు. వారుసత్పురుషులుగా నుండిన నుండవచ్చును. వారికి వేదాంతాభిమానమును నమ్మకమును గలిగియున్న నుండవచ్చును. ఐనను గురువువలనఁ దెలిసికొనవలసిన మిక్కిలి రహస్యంబయిన తత్త్వము వారికి గోచరింపదు. వీరుగాక కపటయోగులు కొందఱు కలగు వారు బకధ్యానముచేయుచు, పలువిధములగు వేషములు వేసి తమకు తత్త్వశాస్త్రము కరతలామలకమని చెప్పి మోసపుచ్చి గురువులమని తెలియనివారిం గొందఱిని శిష్యులను జేసికొని వారి మూలమున గురుపూజాది క్రియలుచేయించి ధనము నార్జించి యా త్మోపయోగమునకు వినియోగించుకొనుచుండుదురు ఆవేషములును, వారిమాటలును, శుద్ధముగా నబద్ధములు, అవియున్నియు వారు పొట్ట కూటికి సంపాదించుకొనఁబన్నిన మాయలు. అట్టివారివేఁగాని వారి మాటలనుగాని లేశమాత్రమును నమ్మరాదు. వారు తత్త్వ రహస్య మునుబోధించి యాశ్రయించిన వారిని కృతార్థులఁ జేయుదురను మాట కల్ల కావున బుద్ధిమంతుఁడగు వాఁడు, సంసారాది బంధములులేని వాఁడును, యెల్ల కోరికలు విడిచినవాఁడును, శాంతమును దయయుఁ గలవాఁడును, యోగరహస్యము లన్నియుం జక్కఁగాఁ దెలిసినవాఁడు నయిన ఈశ్వర స్వరూపుఁడగు సద్గురువు నాశ్రయించుటకే ప్రయ త్నించు చుండవలయును. మహానుభావులగు, నట్టిపెద్దలు లేకపోలేదు గాని వారిట్టి వారని తెలిసి కొనుట కష్టము అట్టిమహాత్ములు తాము తమశక్తియన్యులకు గోచరింపని లాగున వర్తింతురు. పెద్దలసాం గత్యము చేయుచుండినచో యట్టివారు తలఁపని తలంపుగా లభించి

కృతార్థునిం జేయుదురు. అని యివ్విధమున యమధర్మరాజు వేదాంత రహస్యము నాలకించి విని సానందముని చంద్రుండు సంతసించిన వాఁడై మరల యమునింగని యిట్లని ప్రశించెను. ధర్మ స్వరూపుఁడవగు నో యంతకా నీవు చెప్పిన విషయంబులు మిగుల నుత్తమంబులు. కాని యిందువలన నాకొక సందేహము కలుగుచున్నది. యెట్లన్న.— ఆత్మ యెట్టి యుపాధియుఁ జెందనిదని నుడివితివి, శరీరముతో సంబంధముఁగల యంతవరకును. దేహసంబంధములగు నుపాధులన్ని జెందవలసి యుండునుగదా! అలాగు చెందక యుండుట కేమినిమిత్తము? యెఱింగింపు మనిన నతనికి దండధరుండిట్లని చెప్పఁదొడఁగెను.

అని సూతుఁడు శౌనకాదులకుం జెప్పిన వారుమిగుల సంతోషంబున నాలకించి, అయ్యా! యటుమీఁద సానందుని ప్రశ్నమునకు ధర్మదేవత చెప్పిన సమాధాన మెట్టిదియో యెఱిఁగించి మమ్ముఁగృతార్థులఁ జేయుమని యామహర్షులు సూతుని పెక్కువిధంబులఁ బ్రార్థనఁ గావించిరి.—

గద్యము.

ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ చతుర్విధ కవితా విశారదుండగు, పురాణం - పిచ్చయ్యకవిచే రచియింపఁబడిన సానందోపాఖ్యాన వచనకావ్యమునందు చతుర్థ ప్రకరణము.

సంపూర్ణము.





శ్రీ ర స్తు.

# సా నం దో పా ఖ్యా న ము.

## వచనకావ్యము.



## పం చ మ ప్ర క ర ణ ము.



క॥ శ్రీలోల ! నీల వర్ణ ! ద,
యాలక్షణ పూర్ణ ! నిర్మ ♦ లానందమయా
లీలావతార ! సద్గుణ,
జాలాశ్రయ ! ధీర ! శేష ♦ శైలవిహారా !

వ॥ దేవా ! అవధరింపుము.—

శౌనకాది మహామునులకు సూతుఁడు సానందుని చరిత్రము నిట్లని చెప్ప నారంభించెను. పూర్వోక్త ప్రకారంబున నడిగిన మునికుల చంద్రుండగు సానందునిఁ జూచి ధర్మ స్వరూపుఁడైన వైవస్వతుం డిట్లనియె:— అయ్యా మునిశ్రేష్ఠా ! నీటితో నింపఁబడిన ఘటము (కుండ) లో నాకాశము కనుపడుచున్నదికదా! పేరును, రూపమును లేని యా యాకాశము కుండయందున్నదని చెప్పవచ్చునా ? ఆలాగుననె యాత్మ శరీరమున నుండియు, దానినంటని వాఁడగును, కుండ పగిలిపోయినపుడా యుపాధి యాకాశమున కెట్టు లేకుండునో, యాత్మకును శరీర సంబంధమగు హానివృద్ధులట్లే కలుగనేరవు, కార్య రూపముగా యుండు ప్రపంచమున కుత్పత్తి నాశములు గలవు గదా! కారణమగు పరమాత్మ స్వరూపమునకును నవి కలవాయని మీా రడుగ వచ్చును. అందుకు రజ్జు సర్పభ్రాంతి (అనఁగా త్రాడుఁ జూచి పామని జడియుట) దృష్టాంతము, కార్యమగు పామనెడి వికా

రము కారణమైన త్రాటికి లేనివిధమున, కార్యరూప ప్రపంచ వికారములు కారణ రూపముఁగల యాత్మకుఁ గలుగవని తెలియ వలయును. జీవన్ముక్తుఁడైనయోగి తానే పరబ్రహ్మమైయుండియు మూఁడు కాలములయందు (అనఁగా జరిగినది, జరుగుచున్నది, జరుగఁ బోవునది) ను గలుగువిషయంబులు గ్రహింపలేమికి కారణమేమనఁగా.— త్రిగుణ రూపములైన యామూఁడు కాలముల నెఱుఁగు జ్ఞానము మాయా పూరిత మగుటచే, మాయావర్తియగు యీశ్వరునికే యాగుణంబులు గలుగును గాని యాత్మకుఁ గలుగవు. అయినను నీశ్వరోపాసనా సిద్ధివలనఁ గొందఱికిం గలుగునని చెప్పుదురు. జ్ఞానాజ్ఞానములే యెఱుకయు మఱపును నగుచున్నవి, కల్పితము లగుటచే నివిరెండును నశించుటకలదు. కాని సహజమగు తెలివి యేది కలదో యది మూఁడవస్థలకును గుఱియై నాశముఁ జెందకుండును. ఆజ్ఞానమేయాత్మ యనఁబడును తనకంటె వేఱేదియు లేదని యెఱుఁగుట వలన నాత్మను నాశముఁ జేయునది యేదియును లేదు. ఆత్మ జ్ఞానము వేదాంతుల సహవాసము వలనను, వేదాంతులు చెప్పఁగా వినుట వలననుఁ గలుగునని చెప్పియున్నాను, శరీరమునశించినపుడా జ్ఞానము నశించునా? యనినచో, ప్రచండ తేజముతో ప్రకాశించు సూర్యునికి మబ్బు మరుగైనపుడు మందరశ్మిఁ గలవాఁడుఁగాఁ గనఁబడును. కాని సూర్య కాంతికిలోటు కలుగుటలేదు. అట్లే జ్ఞానస్వరూపమగు నాత్మకు జనన నాశనములు లేవు, మేఘాచ్ఛాదన వంటి శరీర సంబంధము తొలఁగినను, (అనఁగా నవిద్యా సంబంధమున తెలివిలేనట్లు కనఁబడినను,) నాజ్ఞానము నశింపక ప్రకాశించు చుండును. త్రికాలములయందును బ్రహ్మమగు నాత్మనాశముఁ జెందనిదగుట చేతనే పెద్దలు సత్తని చెప్పిరి. జడములు నజడములు నిట్టివని తెలుసికొనుజ్ఞానముఁ జిత్తనిరి. స్వానుభూతియందుఁ గలుగు సుఖమున కానందమనిపేరు పూవునకు రంగు, వాసన, మెత్తఁదనమునను మూఁడుగుణములు నెట్లు వేఱుపఱచుటకు సాధ్యముకాదో, యట్లె సత్తు చిత్తు నానందమను లక్షణములు మూఁడును నాత్మయందేకీభవించియున్నవి. అయినను, సత్త్వరజస్తమములను గుణములు మూఁడును, నంతఃకరణమునుఁ బొందియుండు

టచే, నది (అంతఃకరణము) క్రమముగా, శాంతము, ఘోరము, మూఢత్వమను వృత్తిభేదములు గలిగి సచ్చిదానంద లక్షణమొకటియే యైనను వేఱువేఱుగాఁ దోఁచుచుండును. అది యెట్లన్న గులాబి పుష్పము యెఱ్ఱనిరంగు గలది. దానిని కనులు తెలిసికొనును, మెత్తదనమును, స్పర్శము (తాకుఁడు) తెలుసు కొనును. వాసన ముక్కు తెలుసు కొనును. ఇవి యన్నియు నొక్కయాత్మకు సంబంధించియు వేఱువేఱుఁగా నెఱిఁగిన లాగున, నానంద లక్షణ మొకటియే యైనను పలువిధములుగాఁదోఁచును. తమోగుణము ప్రధానముగాఁ గలవియు, జడములు నగు మన్ను, చెట్లు, తీగెలు, మొదలగు వానియందు సత్తనెడి గుణము మాత్రమే కనఁబడును. యింక రజోగుణమన్ననో, యది విషయరూప మగుటచే కామ, క్రోధాదులగు దుర్గుణములకు కారణమై సత్తు చిత్తులను రెండుమాత్రమే తోఁచును. శాంతము ప్రధానమగు నప్పుడా గుణమునందు ప్రసిద్ధమగు నానందము కనఁబడును. ఆలాగైన మాయవలనఁ బుట్టిన భూతములైదును నొకటిగా నుండవలయును కదా! యాలాగున లేక వేఱువేఱు గుణములు కలిగి యుండుటకు నిమిత్తమేమి? యనఁగా. మాయ త్రిగుణములకును నాధారమైనది. బ్రహ్మము, ప్రకృతి, ఈశ్వరుఁడు, విక్షేపము మాయైదును నైదు భూతములుగా నేర్పడినందున నవి వేఱు పడవలసి వచ్చినది. ఇందువలన జీవేశ్వరు లొక్కటియై యుండినపుడు జీవుఁడు బాధదశనుండు నపుడు మోక్షాపేక్ష యేలఁ గలుగవలయుననెడి కారణమేమియని యొకప్రశ్న రావచ్చును. యిందుకు సమాధాన మేమనఁగా, సూర్యుని వెలుగులో దీపము వెలుతురు లయించి (మిళితమై) నలాగున శరీరముక్తుఁడగు జీవుఁడు పరమాత్మయం దైక్యమగును. ఆలాగు కానపుడు, (అనఁగా శరీరముఁ గలిగి యున్నపుడా జీవుఁడు,) తాను వేరుగా నున్నాఁడనను భావమును పొంది మోక్షము గోరుచున్నాఁడు. కర్మ, ప్రాణాయామ యోగము, తపస్సు, వీనిచే పరమేశ్వరుని యనుగ్రహముఁబొంది త్రికాలజ్ఞాని కావలయును. వీనిలో యోగము, తపస్సు, యీరెండును, కల్లయగు మాయాసంబంధమైన కామ్యరూప (కోరికలు) ముల కాస్పదములు, కాబట్టి సమస్త

కోరికలును విడిచిన బ్రహ్మజ్ఞాని వీనినికోరఁడు స్వభావజ్ఞానరూపమై బ్రహ్మమొకటి మాత్రమే సత్యమని యెఱిఁగి తెలివిఁగలవాఁడు (జ్ఞాని) తానే యాబ్రహ్మమని నిశ్చయించు కొన్నపుడు స్వరూపహాని కలుగదు:— అనిచెప్పిన యముసింజూచి సానందుఁడు, ధర్మరాజా! జీవేశ్వరులకు భేదము లేనపుడు జీవులుచేయు కార్యములన్నియు నీశ్వర నియమితములు కదా! కారకుఁడు యీశ్వరుఁడు కానపుడు ప్రాణు లేమి చేయఁగలవు? అట్టిదయ్యు జీవులు చేయుకార్యములు పుణ్యములనియు, పాపములనియు, నేర్పఱచి జీవులయందు గుణదోషములారోపించుట కేమి కారణము? వివరింపుమని యడిగిన శమనుండిట్లనియె. అయ్యా! చెప్పెదవినుండు. సృష్టి క్రమమున, నీశ్వర సృష్టియనియు జీవసృష్టియనియు రెండు విధములు గలవు. స్థావర జంగమాది చరాచరములతోఁ గూడినది యీశ్వర సృష్టి నేను నాదియనెడి యహంకార నిమిత్తములైన, కామ, క్రోధ, లోభ, మోహా, మద, మాత్సర్యములును, నాశయుంజేరి జీవసృష్టి యనఁబడును. ఈ సృష్టి సర్వేశ్వరునకు సంబంధించినది కాదు. నిర్మలుడును, సర్వ సముఁడును నగు భగవంతుఁడొకని యోగ్యునిగాను, నొకని నయోగ్యునిఁగాను, నొకని జ్ఞానిగాను, నొకని నజ్ఞానిగాను సృజించునా? సృజిపఁడు. ఇంకజీవుఁడు వాసనా మూలమున నహంకార మమకారములకులోనై యవి తనకు తానే సృష్టించుకొనుటచే కామక్రోధాదులు సంభవించి వానివలన జననమరణములనుఁ జెందుచున్నాఁడు. ఎట్లనఁగా. ఈశ్వరసృష్టితములు మోక్షకారకములు, జీవసృష్టి జన్మకారణములు నగును పంచములు, వానివలన బుట్టిన యితర లక్షణములు, చిత్ర విచిత్రములగు సంచరించునవియు, సంచరింపలేనివియునైన ప్రాణికోటులును, సూర్యుడు, చంద్రుఁడు, నక్షత్రములు, నివి మొదలగు నవి యన్నియుఁజూచి భగవంతుని కల్పితములనియు వీనిని సృజించిన సర్వేశ్వరుఁ డొకఁడున్నాఁడనియుఁదోఁచి యతనియందు భక్తిఁగలిగి యతని కల్పితములైన వేదములు శాస్త్రములును చదివి వేదాంతవిచార మొనరించి, జ్ఞానియై తత్త్వమునెఱింగి ఈశ్వర సృష్టి నిమిత్తమున ముక్తినొందును, జీవసృష్టి ఫలమువంటిదికాదు,

జీవుఁడు తనచే కల్పితములైన, కామ, క్రోధాలకు లోఁబడి యనేక కర్మలనొనరించి, వానివలనఁ గలిగిన సుఖ దుఃఖముల ననుభవించి చావుపుట్టుకలు కలుగించు కొనుచున్నాఁడు, ఈశ్వర సృష్టియందుఁ జేరిన పంచభూత మయమైన ప్రపంచమున్నపుడె, తనకల్పితములగు నహంకార మమకారాదులు నశింపఁ జేసికొనిన పక్షమున జీవుఁడు పునర్జన్మములేని ముక్తినింబొందును. యీశ్వరకల్పితమగు ప్రపంచము నశించినను, పైఁజెప్పిన కామాదులు విడవకుండినను, జీవునకు ముక్తి లేదు. అట్టి జీవుఁడు తానీశ్వర సృష్టి కలిగినపుడెల్ల మరల మరల జన్మించుచుండును తప్పదు. కాఁబట్టి జీవుడు తనతలంపు వలనఁ గలిగెడి కామ, క్రోధాదులు నాశముం జేసుకొనఁ బ్రయత్నించ వలెను. ఈశ్వరుఁడు సర్వసముఁడు. అతని కొకనియందు దయయు, నొకనియందు కోపమును లేదు. తనచేత కల్పింపఁ బడియుండు యెల్ల జీవులకునుఁ కర్మానుసారముగా సుఖదుఃఖములు కలిగించును. అనఁగా పుణ్యకర్మలుచేసిన వారిని రక్షించుటయు, పాపకర్మలు చేసిన వారిని శిక్షించుటయు, నతనికాచారము, తండ్రి తన కుమారుఁడు చెడునడతఁ గలవాఁడైనపుడు వానిని శిక్షించును గదా ! ఏల ? వానియందు క్రోధమువలననా ? కాదు కాదు. వాఁడు బుద్ధిమంతుడు కావలయు నను కరుణచేతనే యటులఁ జేయును. ఆవిధముననే భగవంతుఁడు. పాపాత్ములను శిక్షించును. అది యాపాపాత్ముఁడగు జీవునియందుఁగల దయావిశేషముకాని పక్షపాతమెంత మాత్రమును కాదు. అలాగు తలంచుట యవివేకమును, నరక హేతువు నగును, కల్పవృక్షము దారి ద్ర్యమును, నిప్పు చలిని, గంటపుప్రమాను తాపమును. తమ్మా శ్రయించిన వానికే పోగొట్టును అలాగే పరమేశ్వరుఁడు తన్నా శ్రయించువారికే మంచి తెలివి నొసంగి మోక్షార్హులఁ గావించును మోక్షమొసంగునది కర్మయా? జ్ఞానమా? యనిన, కొందఱు మంచి కార్యములు చేసి యనుష్ఠానపరులగుట వలన మోక్షముం జెందవచ్చు నని పలుకుదురు. గాని యది నమ్మఁదగిన మాటకాదు అట్లు వచి యించువారు మూఢులు, యెట్లన్న మనము క్రొత్తగా యొకనిఁ గనుఁగొనవలయునని ప్రయత్నించినచో వాని యాకారలక్షణాదులగు

గుఱుతులు మనకుఁదెలిసి యుండవలయును. అటుల తెలియక యెంత కష్టపడినను వాఁడిట్టి వాఁడని కనుఁగొనఁ జాలముకదా ! అట్లే జప తపములు మొదలగునవి తన్ను తాను తెలుసుకొనుటకు సాధనములు కాఁజాలవు వేదాంత విచారము చేయుటవలన తత్త్వజ్ఞానముకలిగి నపుడే తన్నుతాను తెలుసుకొని తానే పరబ్రహ్మమని చలింపక యానందమొందును జపములు, తపములు మొదలగు సత్కర్మ కూడ దని చెప్పుట తప్పు అవిచేసినచో నిష్కామ్యముగాఁ జేయవలయును (అనఁగా ప్రతిఫలాపేక్ష లేకననుట) అటులఁజేసిన యెడల వానిచే చిత్తశుద్ధియు నీశ్వరభక్తియుం గలుగును. యెపుడు చిత్తశుద్ధికలుగునో, యపుడు తత్త్వవిచారణఁ జేయుతలంపు పుట్టును తత్త్వ విచారమువలన నజ్ఞానము నశించి తానే పరమాత్మయనెడి యైక్య జ్ఞానముకలిగి ముక్తుఁడగును మహాత్మా ! గర్భముననుండి శిశువు జనించిన లాగున, ఈశ్వరుని వలన ప్రపంచము జననమయ్యెను. ఇట్లు చెప్పుట కారంభవాదమనపేరు. ఇది సరియైన వాదముకాదు. ఏలనన తల్లి వేరుగాను, శిశువు వేరుగాను నుంటున్నవి. అలాగున నీశ్వరుఁడును ప్రపంచమును వేరువేరుగా నుండుటలేదు. కావున నీవాదము యుక్తమైనది కాదని చెప్పవలసి వచ్చినది పాలవలన పెరుగు పుట్టినలాగున (అనఁగా పాలు పెరుగుగా మారినట్లు) భగవంతుఁడు జగద్రూపమయ్యెనని చెప్పుదురు. దీనికి పరిణామ వాదమని పేరు. ఇదియును ముందటిదానివలె యుక్తమైనదికాదు. పాల రూపము చెడి, పెరుగు రూపమునుఁ బొందినట్లు, చిదానంద స్వరూపుఁడగు పరబ్రహ్మము చెడి, యనృత, జడ, దుఃఖ, భాజనమైన ప్రపంచముగా నయ్యెననిన నది యసంగతముగా తోఁచును. కార్యకారణ వాదమని మఱియొక వాదముచేయువారు కొందఱు కలరు. వారి వాదముకూడ నిరాకరింప వలసినదియే యగును. మన్ను దాని నిజమగు రూపము చెడకనే కుండగా మారిన లాగున, బ్రహ్మము తన స్వరూపము మారకనే ప్రపంచమయ్యెనని ఈకార్యకారణ వాదుల దృఢాభిప్రాయము. కాని, యీవాదము కొంతవరకు యుక్తియుక్తముగా తోఁచినను, స్థిరమైనదికాదు. ఇదియును ఖండింపఁ బడుచున్నది. యెట్లనగా:—

మన్ను స్వభావరూపముఁ గలదైనను, కుండగాఁ జేయఁబడునపుడా మన్ను వికారమొంది (అనఁగా గుణభేదమును వహించి) కుండయగు చున్నది. కాని యట్లేకుండగా నగుటలేదు పరబ్రహ్మము నిర్వికార స్వరూపము. అట్టి రూపమును మట్టికిని కుండకును పోల్చినయెడల వికారమునొంది జగత్తయ్యెనని చెప్పవలసి వచ్చును. అట్లు చెప్పుట యుక్తమగునా ? కానేరదు. ఇదిగాక బింబప్రతిబింబ వాదమొకటి కలదు. సూర్యుఁడు వికారము నొందకయే నీటిలోఁ కనుపడునట్లు యేవికారమును జెందని యీశ్వరునిరూపమే జగత్తుగా ప్రతిబింబించు చున్నదని యీవాదముఁ జేయువారి సిద్ధాంతము. మఱియొక వస్తువున, దోఁచునది పరి పూర్ణవస్తువు కానేరదు. ఈశ్వరుఁడు పరిపూర్ణుఁడు, సూర్యునివలె ప్రతిబింబించుట కతనికి మఱియొక యాధారమెద్దియును లేదు. సూర్యుఁడొకచోటను, జలము లొకచోటను, నుండుటవలన సూర్యుఁడు, నీళ్లు పరిపూర్ణవస్తువని చెప్పుటకు వీలుపడదు. మఱియు, నీళ్లులేకుండిన సూర్యప్రతి బింబము తోఁచదుగదా! గనుక సూర్యుని రూపము కనుపడుటకు నీళ్లాధారమని యందఱు నెఱుంగుదురు. నిరాధారుఁడగు పరమాత్మ కాపోలికసరిపడదు. కావున నిది యును త్రోసి వేయఁబడినది పరిపూర్ణత్వము చెడక, దోషరహితమైన ముత్తెపు చిప్పయందు వెండిరూపము (అనఁగ వెండివంటి కాంతి) తోఁచిన లాగున, పరమేశ్వరునియందు భ్రమవలన ప్రపంచముతోఁచుచున్నదని వివర్తవాదులు చెప్పెదరు. వెండియున్నదా లేదా యని పరీక్షచేసి చూచినపు డాముత్తెపుచిప్పయందు వేఱుగా వెండి కనుపడుటలేదు. దీనినిఁబట్టి ప్రపంచము పరబ్రహ్మ వికారముకాని వేరుగా లేదనినచో, ప్రపంచమున్నదని చూచి యెఱిఁగి చెప్పవలసినట్లు తటస్థించుచున్నది. కాఁబట్టి యీవాదముకూడ సరికాదు దృష్టాంతవాదులను వారు కొందఱు ఎండమావులకును, నీశ్వరునికినిఁ బోలికఁజేసి, మరీచికలు (యెండమావులు) నీళ్లుగా కనుపడినభంగి, నీశ్వరుని నిర్మల రూపము జగత్తుగా దోఁచుచున్నదని వాదింతురు. కాని, అస్థిరమగు యెండ మావులు నీళ్లుగా కనుపడినను, నవి నీళ్లుగావని యందఱికిం దెలియును. యెండమావులయం దెవ్వఱును నీళ్లుత్రాగియుండలేరు ప్రపంచమున

నన్ననో యన్నిజంతువులును, నీళ్లుత్రాగియు, స్నానముఁజేసియు, మునిఁగియు, ననుభవమును గలిగియుండుట విదితమేకదా! ఇట్లను భవించుచున్న ప్రపంచమందలి నీళ్లను, కనుపడని, లేని, యెండమావుల నీటిని యొకటిగాఁ జెప్పుటయు, దానికి పరబ్రహ్మమును బోల్చుటయు సరిపడదు. కావున నీవాదమును చెడినది. ఇంక నిశ్చయింపవలసిన దెట్లన్న, దానికి వివేకులగువారు చక్కఁగా తత్త్వవిచారముఁ జేసి స్వప్నమునందు తోఁచు జగత్తువలె పరబ్రహ్మమునందు ప్రపంచము తోఁచుచున్నదని సిద్ధాంతము (అనఁగా నిశ్చయము)గావించిరి. యెట్లన్న.—కలయందుఁ దోఁచు (అనఁగాఁ గనబడు) ప్రపంచమెట్లసత్యమో, యట్లే యీ ప్రపంచమును కల్లయని వారి భావము. కలలో తోఁచునది యనుభవమునకు రాని లాగున బ్రహ్మప్రపంచమయ్యెననుట మాయవలనఁ గలిగి భ్రమమాత్రమే కాని యీశ్వరుఁడు తాను ప్రపంచముకాలేదు మనోవైకల్యము వలనఁ గలిగినను కలలో నిక్కమురీతిగా మాయా భ్రాంతిజనితమైన యీ ప్రపంచము నసత్యమైనదని భావము. యోచింపఁగా యీ యుపమానము సరిగాయున్నది. మహాత్మా! ఋషిశ్రేష్ఠా! మనస్సేమాయ. మాయయే మనస్సు. ఈ రెంటికిని భేదములేదు. ఈ మనోరూపమైన మాయా భ్రాంతిచేతనే ప్రపంచము కనఁబడుచున్నది కాని, నిజముగా లోకమను పదార్థము లేనే లేదు. మాయయు, దాని కార్యమగు ప్రపంచమును, రెండును కల్లయని యెఱుఁగవలెను. పరబ్రహ్మ మొక్కటిమాత్రమే, నిలకడయైనదియు, సత్యమైనదియు, నగుచున్నది. నీవు, నేను, నితరములగు ప్రాణులు, జగత్తు మొదలగునవన్నియు, భ్రాంతిమాత్రములుకాని, నిజము కాదు. అని యిట్టివిధముగా సానందుల వారి ప్రశ్నలకు దండధరుండు సమాధానముఁ జెప్పి, యోగీంద్రా! యిఁకనేమి యనుజ్ఞయానతిండని యెను. అంత సానందుఁడతనిఁజూచి, ధర్మరాజా! నీబోధవలన నేను పెక్కు గొప్పవిషయములఁ దెలిసికొంటిని. నీవు సకల ధర్మములును. తత్త్వమును జక్కఁగా నెఱింగిన మహాత్ముఁడవు. నీకుఁ దెలియని న్యాయ మొందునుఁ గలుగ నేరదు. నీవలన మఱి యొక విషయముం దెలిసికొన వలయునని నాకు కోరిక గలుగుచు

న్నది. యది యెద్దియంటివేని, భూలోకంబున జన్మించిన మనుష్యునకు ముఖ్యముగ నేదికావలయునో దానిని బాగుగాఁ దెలిసికొనవలయు ననుటయే! కావున ప్రీతి మానసుఁడవై యావిషయము నాకెఱింగింపు మనియడిగెను. యముఁ డతని మాటలకు సంతసించి యిట్లని చెప్ప నారంభించెను. మునీంద్రా! వినుము. సత్యమనునది యేదికలదో, యది

యమ ధర్మరాజు సానందునకు మనుష్యుని సత్ప్రవర్త నాది విశేషంబులఁ జెప్పుట

దియే తపస్సనఁబడును. నేత్రమును సదియే జ్ఞానము (అనఁగా సర్వమునెఱుంగునది యనుట) నిరాశాపరుండుగా నుండుట, పరమ సుఖమనఁబడును. (అనఁగా దొఱికిన దానితో తృప్తినొంది, దొఱకని దానికి చింత పడకుండుట) ఇట్లుండువాఁడు పరమ సుఖవంతుఁడు. మోహము దుఃఖకరము. యోగము ముక్తిసాధనము. ఈజన్మమునందు ముక్తిఁ జెందుటకు యత్నముఁజేయని వానికి మఱుజన్మమున మోక్షమొందు భావము కలుగదు. కాఁబట్టి. వేదాంత విచార మొనరించి ముక్తికి సాధనము లెఱింగి యభ్యాసముం జేయవలయును. ఆలాగునఁ జేయనివాఁడు, చావుపుట్టుకలకులోనై తుదమొదలు లేని కష్టములును, దుఃఖమునుఁ జెందుచుండును. కామము (కోరిక) క్రోధము (కోపము) నను రెండును, మోక్షాపేక్షఁ గలవానికి పగయ శత్రువులు. కావున సజ్జనుఁడు ముఖ్యముగా యారెంటిని జయింపవలయును. ఎవఁడు వివేకవంతుఁడై కామ, క్రోధములను విడిచి యుత్తమమగు మోక్షము నొందుటకుం బ్రయత్నించునో, యట్టిమనుష్యుఁడు, జనన, మరణ, దుఃఖముల వలన విడువఁబడిన వాఁడై, తప్పక పావనమైన మోక్షసుఖము ననుభవించును. ఇతరులవలన నేదియును కోరకుండుటయు, సర్వయత్నములను విడుచుట యను రెండును, నెవని యందుఁ గలుగునో, వాఁడు కృతార్థుఁడగును ఇతరములగు భూతముల (జంతువుల) చూడక (అనఁగా బుద్ధి ప్రసరింపఁ జేయక) ముట్టక, పరులతో మాటలాడక, జీవముల హింసింపక (అనఁగా చంపక) యింద్రియ నిగ్రహముఁ గలిగి, వైరాగ్యముతోఁ గూడిన మనస్సు గలవాఁడై, చంచల మొందక, యుం వాఁడు యోగ్యుఁడని చెప్పఁ

బడును. ఎంతటి వివేకవంతుఁడైనను, భార్య, బిడ్డలు, ధనము మొదలగు వానియం దపేక్ష యుంచెనేని లోతగు బురదగుంటలోఁ దిగఁబడిన యేనుఁగు విధముగను, వేటకాని వలలోఁ దగులుకొన్న మృగ వలెను, దుఃఖముల పాలగును. అధర్మములను విడిచి, ధర్మములనే చేయుచుండ వలెను, జీవహింస యధర్మమైనది. కావున దాని విడుచుట యధర్మమును విడుచుట యగును. సంకల్పము నశించిన యెడల నది ధర్మము విడిచినట్లగును.. ఇందు సత్యాసత్యములు బుద్ధిబలముచేఁ దెలిసికొన వలయును. ఎట్లన్న. సత్యముఁ జెప్పుట వలన, ప్రాణహానియు మానహానియుఁ గలుగున ట్లుండిన పక్షమున నపుడు సత్యమును మానవచ్చును అది యధర్మము కానేరదు. కాని యసత్యమెప్పుడును కూడదు. సత్యమనఁగా ఉన్నదనుట. యసత్య మనఁగా లేదనుట ఈరెండును బుద్ధియొక్క గుణములు. అట్టివి తనకు సంబంధము లేనివిగా భావించి నిర్వికల్పుఁడగుట శ్రేయము. యట్లుండుటకు సత్యాసత్య పరిత్యాజ్యము. అనిపేరు. ఇట్టిసద్గుణములు కలిగి అత్మాను సంధానము (అనఁగా జీవేశ్వరులను కలుపుట) చేయువానికి మనస్సు తనకుతానే లయించును. అట్టివాఁడు ప్రాణవాయువును బిగబట్టి చలింపక కూర్చుండి యుండు కర్మయోగము నభ్యసింప వలసిన యవసరము లేదు. లోకమున జన్మించినవారి కందఱికిని, సుఖము, దుఃఖము, భయము, మొదలగునవి కలవు. కాని జ్ఞానియగువాని కవి కలుగవు ఎట్లన్న ఈ భయదుఃఖాదులు శరీరమునకే కాని సాక్షిగా నుండెడి యాత్మ స్వరూపుఁడగు తనకు లేవని జ్ఞానియగువాఁడెఱింగి నెమ్మదిగా యుండును ఇతర భూతముల జూచియు, నింద్రియాదులను గురించియు, దుఃఖించుట యవివేకుల లక్షణము. స్త్రీలు పురుషులకాళ్లకు సంకెలలవంటి వారు. స్త్రీల మూలముననే పురుషులకు భోగేచ్ఛ కలుగును. ఎవఁడు స్త్రీలతోటి సంబంధమును విడుచుకొనునో, వాఁడు బ్రహ్మానంద మనుభవించును. కామము, క్రోధము, లోభమునను మూఁడును నరకముల యొక్క మూఁడు వాకిళ్లవంటివి. వీని నెవఁడు విడుచునో, వాఁడే యుత్తముఁడు. సకలేంద్రియములతోఁ గూడిన శరీరమును భగవదర్పణముఁ జేయవలయును. సర్వే

శ్వరుని మూఁడు కాలముల యందును మూఁడవస్థల యందును భావించుచు, మనస్సు నాపరంధాముని యందు లగ్నము సేయవలయును. తల్లి గర్భమున నుండి పుట్టినది మొదలు ప్రతివానికిని మృత్యువు వెంటనంటి కాలము నిరీక్షించుచుండును. ఇంతకాలము బ్రతికియుండఁగలమని యెవ్వరుం జెప్పఁజాలరు. అది పరమరహస్యము. కాఁబట్టి పుట్టిననాఁడే చచ్చితిమని భావింపవలెను. స్థిరమైనది చావుగాని, బ్రతుకుగాదు తాను చావులేనివాఁడ ననుభ్రాంతిచే నెవఁడు భార్యాబిడ్డలనెడి మోహభ్రాంతినిఁ జెంది లోలుఁడగునో, వాఁడు నీళ్లు వట్టిపోయిన గుంటయందలి చేపవలె నశించును. అట్టివానిని, యడవిలో నిద్రించు మనుష్యుని హఠాత్తుగా వచ్చి పులియెత్తుకొని పోయినట్లు తెలివిలేని సంసార మోహనిద్రలో నుండు సమయమున తటాలున మృత్యువు కొనిపోవును, భయపడినవాఁడనియు, ధైర్యముఁ గలవాఁడనియు, తెలివిలేని వాఁడనియు, పండితుండనియు బలహీనుఁ డనియు, బలవంతుఁడనియు, పేదయనియు, ధనికుఁడనియు, బాలుఁడనియు, ముసలి వాఁడనియు, స్త్రీయనియు, పురుషుఁడనియు, నేభేదము నెంచక యందఱిని విసువక మృత్యుదేవత మ్రింగి వేయుచున్నది. ఆమృత్యు వెచ్చటనుండును? ఎట్లుండును? అని సంశయించ నక్కర లేదు. సంసారమే మృత్యువుయొక్క నివాస స్థానము. జీవుఁడుచేయు కామక్రోధాదులవలన నేర్పడు కార్యములే మృత్యువుయొక్క రూపము. కాబట్టి ప్రతిమానవుఁడును, సంసారబంధము నుండి విముక్తుఁడగుటకుఁ బ్రయత్నింప వలయును. విరక్తి మోక్షకారణమైనది. సత్యశీలముల వలన మోక్షమును, మోహ లోభాదుల వలన మృత్యువునుఁ గలుగును. లోకంబున తాఁ జేయునట్టి పుణ్య, పాప, కర్మలవలననే తనకు, స్వర్గము, నరకము, సంప్రాప్తించును. కాని, మఱియొకరివలనఁ గలుగదు. కాఁబట్టి తనకుతానే సకలబాధములను ద్రెంచుకొని సద్గతిఁ జెందవలయును. ఇతరుల సహాయము వలనఁ గలుగఁ జాలదు ఆత్మ స్వరూపుఁడగు పరమాత్మ తానేయని తెలిసి కొనెనేని, వానికి మోక్షము సిద్ధించుట సత్యము. యజ్ఞయాగాదిక క్రియలు సత్కర్మలు కావా? వానివలన మోక్షము కలుగదా? యనిన,

జీవహింసా కార్యముగాను, నహంకార యుక్తమైనదిగాను నుండు యజ్ఞమువలన స్వర్గాది భోగములు కొంతకాల మనుభవించి మరల భూమిలో జన్మించవలసియుండును. గాన నది మోక్షముం గలిగించు నది కాదు. కాలికిఁదగిలిన బురదఁ బురదనీటితోఁగడిగిన పోవనట్లును, కల్లుకుండ కంపుఁ గల్లు నీళ్ళతోఁ గడిగిన పోవనట్లును, పాపకరమయిన జీవహింసను, యజ్ఞమను పేరుతో చేయు జీవహింసా పాపము, పాప నేరదు. కాఁబట్టి జీవహింసతోఁ గూడిన యజ్ఞయాగాదులు చేయుట యవివేకము. అట్టివారు మరల జన్మించక తప్పదు. మనస్సుచేతను, వాక్కుచేతను, పరిశుద్ధుఁడగు పరమాత్మను ధ్యానముఁ జేయుటయే యోగ్యమగు యజ్ఞమును, తపస్సునని యెఱుంగవలెను. కామక్రోధాది దుర్గుణములు పోనడచి యేకాంతముగా విజన ప్రదేశముల (కొండ గుహలు కాననములు) యందు నివసించి యచంచలచిత్తులై యాత్మానుసంధానముఁ జేసి యాత్మ నెఱుంగు వారు ధన్యతములు. అజ్ఞానదశలో యుండువారికి ప్రపంచమంతయు, స్త్రీమయముగాఁ దోఁచును. అపుడు కామాదులగు నరిషడ్వర్గమునకు లోఁబడిపోవుదురు. జ్ఞానియగువాఁడు తత్త్వమనెడి కాటుకను కండ్లకు రాచుకొని యా కామాంధకారమును దాటి ఈచరాచర ప్రపంచమంతయు, పరబ్రహ్మస్వరూపమని కనుఁగొనును. కోరికలనునీళ్లును, నతృప్తియనెడి యలలును, ననురాగమనెడి మొసళ్లును, ధైర్యమనెడు చెట్లును, వృద్ధినొందనీక ముక్కులతో పొడిచి పాడుసేయు విపరీతములగునింద్రియ వ్యాపారమనెడి పక్షులును, మోహమనెడి సుళ్లును, దుఃఖమనెడి లోతును, గలిగి మిక్కిలి వెడల్పుగల యాశతోఁగూడిన భయంకరమైన నదిని, విజ్ఞానవంతులగు యోగులు నిమిషకాలములో సులభముగాదాటి, నిరతిశయ బ్రహ్మానందము ననుభవింపుదురు. యెంతవరకు కామక్రోధాదులను జయించి పరిశుద్ధమగు మనస్సుఁగలవారై యుందురో, యంతవరకును, విజ్ఞానమును, పాండిత్యమును, బ్రాహ్మణత్వమును, తత్త్వవివేకమును వారియందు ప్రజ్వరిల్లు చుండును. ఆలాగు కామాదులను జయింపని వారికి మేలుగలుగదు. గంగాది పుణ్యతీర్థములకుం బోయి గ్రుంకుటవలన నొకవిధమైన భక్త్యుత్సా

హాములుకలుగును. కాని యాతీర్థములు దేహామలినమునుదక్క మానసికములగు రాగద్వేషాదిమలినమును బోగొట్టనేరవు. అట్టిమనోమలినమును తత్త్వజ్ఞానమువలన నేకడిగివేయవలెను. మనస్సనంపుబ్రహ్మజ్ఞానమనెడి తీర్థములో స్నానముచేసి, యాత్మమాలిన్యమును బాపుకొనుటకు నేరక, గంగా, గోదావరీ, కృష్ణాది నదీతీర్థములలో స్నానముజేయఁ బోవువాఁడు, తనయొద్దనుండెడి రత్నమును పారవైచి సూర్యకిరణములచే దూరము తళతళ మెఱయుచున్న గాజురాతికై పరుగెత్తిన వానిలాగున నుండును. శమదమాదులును, నహింసయు, సత్యమగు తపస్సు నను మూఁడును మూఁడు మహాతీర్థములనఁబడును. ఈతీర్థములలో నెవరు స్నానముఁజేయుదురో (అనఁగా శమదమాదులుగలిగి జీవహింసమాని ప్రతిఫలముఁగోరక తపముఁ జేయుటయే స్నానముఁ జేయుట) వారు పరిశుద్ధులగుదురు. మఱియు దైవాధీనముగాఁ దనకు లభించినదాని ననుభవింపుచు, లభింపనిదానికై చింతనొందక, నుండవలయును. అట్టివారు నిరాశా పరులనఁబడుదురు. వారుమిక్కిలి పరిశుద్ధులు. వారికి గంగాది తీర్థములకుంబోయి స్నానముఁ జేయ నక్కరలేదు. వివేకముగలవాఁడు భోగములను కోరఁడు. అతని కెచ్చటనుండియును సమస్తభోగములును మనస్సువలననే కలుగుచుండును. అట్టివానికి భూమియే రమ్యమైన మంచము చేతులు పట్టుదిండ్లు, మంచముయొక్క మేలుకట్టాకాశము. చెట్లకొమ్మలనుండి విసరుగాలి వట్టివేళ్ల విసనకఱ్ఱలు. సూర్యచంద్రులు రత్నదీపములు. ఇట్టి శృంగారమగు శయ్యపై విరక్తియనెడి నిరుపమాన శృంగారవతియైన భార్యతోఁగూడి శయనించి మహాచక్రవర్తివలె నానందవార్ధిలో నోలలాడుటకంటె యధికమగునా ? బాహ్యభోగములు యెప్పటికిని గావు. కావున, నెముకలు నరములు, మాంసము మొదలగువానితో మిశ్రమమైన పచ్చితోలు బొమ్మలనుఁ బోలి మల మూత్రములచే ననహ్యమగు దుర్గంధమయమైన స్త్రీలనుఁ జూచినపుడు పామరుఁడు భ్రమించి కామాంధకారమునఁ జిక్కియుల్లాడును కాని యట్టివాంఛవలన లాభములేదని తెలిసి జ్ఞానియగువాఁడు వికారము నొందఁడు. ఓమహాత్మా ! లోకంబున జన్మించినవారు యిట్టి కామక్రోధాదులకు

లోనుగాక భగవద్భక్తిఁగలిగి ధర్మజ్ఞాన పరిపూర్ణులై సత్కార్యముల యందు ప్రియము మానక, పెద్దలగువారి నాశ్రయించి వేదాంత విచారముఁజేసి నిర్వికార మనస్కులై యోగాభ్యాసము నొనరించి జీవేశ్వరుల యభేదతత్త్వమెఱింగి యాత్మానుసంధానమొనర్చి పునరావృత్తిలేని యానంద మోక్షసామ్రాజ్యమును చెందవలయును. ఇంద్రియములను పాశములచే కట్టువడి, కామక్రోధలోభాదులకు స్వాధీనులై యీషణత్రయ మనఁబడు, భార్యా, బిడ్డలు ధనము మొదలగు వానిపై నాశ విడువఁజాలక తమ మీఁదటిగతి యోచించక సంసార మను మహాసముద్రములో మునిఁగి చేయరాని యకార్యములెల్లనుఁ జేయుచు తమ యాయుష్కాలము వృథాపుచ్చి వార్ధక్యమాదియగు కష్టము లనుభవించి దేహము విడుచువారు తమదుష్కార్యములకుఁ దగిన నరకబాధలకులోనై నానా యాతిబాధలును పెద్దకాల మనుభవించి తత్కర్మశేషంబున భూలోకములో మరల జన్మించుచుండుదురు. కనుక మనుష్యుఁ డెల్లపుడును మంచిమనస్సుఁ గలవాఁడై మంచికార్యములఁ జేయుచు తత్త్వజ్ఞానము నార్జించి శాశ్వత సుఖము ననుభవించుట కర్తవ్యము. అని యమధర్మరాజు సానందులవారికి ప్రత్యుత్తరమిచ్చెను. అతని మాటలు విని, మునిశ్రేష్ఠుఁడగు సానందుఁ డానందముం జెంది శమనునింజూచి, అయ్యా! శమనా! భక్తి తొమ్మిది విధములని చెప్పుదురు భగవదారాధన నెనిమిది విధములగు పూవులచే పూజింపవలె నందురు. భక్తులగు వారెనిమిది విధములవచియింతురు. ఈ వివరమును నాకుఁ జక్కఁగాఁ దెలుపవసినది. యనియడిగెను. అందున కా మహాజ్ఞానవంతునింజూచి ధర్మరాజిట్లని చెప్పనారంభించెను మహానుభావా! వినుఁడు శ్రవణము, కీర్తనము,

—— దండధరుఁడు సానందునకు నవవిధభక్తి భేదంబు లెఱిఁగించుట. ——

సేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, చింతనము, నాత్మసమర్పణము, నను నీతొమ్మిదియు, బాహ్యభక్తిభేదము లనఁబడును. శ్రవణమనఁగా పరమేశ్వరుని గుణములును, నవతారములును, లీలలును, చరిత్రములును పెద్దలు వర్ణింపఁగా విని సంతోషచిత్తుఁడగుట. కీర్తనమనఁగా లీలామానుష స్వరూపుఁడైన భగ

వంతుని రామకృష్ణ నారాయణ గోవిందాది నామములను పాటలుగాఁ బాడియు, పద్య గద్యములుగా చదివియు, వర్ణించి యానందించుటయు, నాభగవంతుని దివ్యరూపముఁ బ్రత్యక్షముగాఁ జూచిన లాగున మనస్సున నెంచి దేహము పులకరింపగా కన్నులయందున నానంద బాష్పము లురులఁగా తన్మయుఁడై స్తుతించుటయును స్మరణ యనఁగా, యెల్లపుడును పరంధాముఁడగు భగవంతుని పేరులను మనస్సునం దలంచుచు జపించుట. పాదసేవన మనఁగా, నీశ్వరుని శ్రీపాద పద్మములను మనస్సున నిలిపి సేవఁగావించుట. యర్చన మనఁగా భగవంతుని రామకృష్ణాది యవతార మూర్తులు (అనఁగా రూపములు లేక విగ్రహములు, పుష్పములు,పత్రి, మాలికాదులతో నలంకారముం జేసి తులసి, బిల్వము మొదలైన వానితో పూజించుట. వందనమనఁగా, సర్వేశ్వరుని దివ్యమంగళ స్వరూపమునకు సాగిలఁబడి మ్రొక్కుట. దాస్యమనఁగా, దేవునికి నమస్కరించి జంతట చేతులు మోడ్చి నిలుచుకొని భయము, భక్తి, వినయముఁ గలవాఁడై, యోదేవా! నాకు నీవురక్షకుఁడవు. ప్రభువవు. నేను నీసేవకుఁడను. నాతప్పులన్నియు మన్నించి నన్ను రక్షణఁ జేయుభారము నీయందున్నది. యని యనేక విధంబులఁ బొగడుచు, సన్నిధి యందుండుట. సఖ్యమనఁగా, తనకు ప్రియులగు వారి యందరి యందునకంటె భగవంతునియందు మిక్కుటమగు ప్రియమునుఁ గలిగి తండ్రి, యన్న, మిత్రుఁడను వరుసలు గల్పించుకొని సేవించుట. చింతనమనఁగా, తాను చూచునవి యగు సమస్త రూపములును, వినునట్టి సమస్త ధ్వనులును భగవంతుఁడుగాఁ దలంచి యతని కరుణ వడయుట కొఱకెప్పుడును ధ్యానముఁ జేయుట. ఆత్మ సమర్పణ మనఁగా తనమనస్సును, వాక్కును, కార్యమును సర్వమును భగవంతున కర్పణఁజేసి యితర చింతలేక సదా నిస్సంకల్పుఁడై తదేక ధ్యానముతో నానంద పరవశుఁడైయుండుట. ఇవి బాహ్యభక్తి విధములు. ఇవిగాక యనన్యభక్తి యనునది యొకటికలదు అది యెట్టిదనిన బ్రాహ్మణుఁడు, శూద్రుఁడు, చండాలుఁడు, గోవు, గుఱ్ఱము, గాడిద, కుక్క, నక్క, పంది, గొఱ్ఱె, చెట్టు, తీగ, రాయి, మొదలగు సమస్త మను

వానియందును, భగవంతుఁడు సమానముగా నున్నాఁడని యెఱింగి, సిగ్గు, గర్వము, నవమానము, భేదము ననువానిని విడిచి, తానుకాంచి నవియెల్ల నీశ్వర స్వరూపముగా నెంచి వానియందు ప్రియమును, భక్తియు పాటించి వానికి సాష్టాంగముగా మ్రొక్కుచు సదా భగవంతుని ధ్యానించుట యనన్యభక్తి. సముద్రమునందు అలలుండు విధమున భగవంతునియందు ప్రపంచ మున్నదనియు, ఈదేహమున నతఁడాత్మరూపముతో ప్రకాశించు చున్నాఁడనియు, తెలిసికొని, యోగసిద్ధాంతము ననుసరించి కనుబొమల నడిమిచోట దృష్టినిలిపిచూచుచు తన్మయుఁడై యుండుట కేకాంతభక్తియని పేరు. ముందు చెప్పిన తొమ్మిదియుఁగాక వెనుకఁ జెప్పిన రెండు విధములును విజ్ఞానాధిక్యతవలనఁ గాని లభింపవు. అష్టవిధ పుష్పంబులచేఁ బూజించుటయనుపద్ధతి నీ యేకాంత భక్తిఁగలవారి కొఱకు మాత్రమే చెప్పఁబడినది. ఇతరుల కాలాగు పూజించుటకు సాధ్యముకాదు. ఆ పుష్పములెవ్వియనఁగా. అహింస (జీవములఁ జంపకుండుట) మొదటిపూవు. ఇంద్రియ నిగ్రహము (అనఁగా తాబేలు నిద్రించునప్పుడు దానియంగములు బయటికి తెలియనీక లోపలికీడ్చుకొని నిదురించిన లాగున తన యింద్రియములను బయట వ్యాపింపకుండా చేసి, లోపలిముఖములై యుండునట్లు చేయుట) ఇది రెండవ పువ్వు భూతదయా పశ్చాత్తాపము. (అనఁగా నాకలి దప్పులచే బాధనొందు పేదవారిని రోగులను, చూచినపుడు, వారిబాధ తనకుఁ గలిగినట్లెంచి తనశక్తి కొలఁదిని వారి కన్నపానాములొసంగి యుపచరించుట) ఇదిమూఁడవ పుష్పము. క్షమ, (అనఁగా తనకొకఁ డపకారముఁ జేసినను, తిట్టినను, కొట్టినను, పైనుమ్మివేసినను, వానియందు కోపముఁ జెందక యది తన కర్మాధీనముగా జరిగినదిగాఁ దలఁచి, వానిని మనఃపూర్వకముగా దీవించ మైత్రిఁగలిగియుండుట) ఇదినాల్గవపూవు. శాంతి (అనఁగా తాను చేసిన పాపకార్యములకు భయమొంది యట్టి పాపములు క్షమించుమని స్థిరమైనమనస్సుతో భగవంతుని వేడుకొనుట) ఇదియైదవపూవు. తపస్సు (అనఁగా సదాపరబ్రహ్మమైన సర్వేశ్వరుని మనస్సున ధ్యానముఁ జేయుట) ఇదియాఱవపుష్పము, ధ్యానము (అనఁగా యెప్పుడును నీశ్వరచిం

తనము ప్పు వేరులేక (బ్రహ్మవిచారముఁ జేయుచుండుట) ఇది యేడవ పుష్పము. సత్యము లేక ధర్మము. (అనఁగా నిజముఁజెప్పుట వలన జీవహింసయు, మానభంగమును, పరుల ద్రవ్య నాశనమును గలుగు నట్లుండి నపుడు సత్యముఁజెప్పుట మాని యసత్యమునఁ జెప్పియైన, జీవహింస, మానభంగము, పరద్రవ్యనాశనముఁ గలుగనీయక రక్షించుట. ఇట్టి సమయంబులయందు తప్ప యసత్యమును తక్కిన సమయమందు పలుకకూడదు.) ఇది యెనిమిదవపుష్పము. అష్టవిధ పుష్పములనఁగా నీచెప్పబడినవే కాని, సాధారణముగా నెనిమిదిరకముల పూవులని భావింపకూడదు ఇట్టి యెనిమిది విధములగు పూవులతో భగవంతునిఁ బూజించుటయే మానసిక పూజయనఁబడును. ఈ పూజ వలన నీశ్వరుఁడు పరమానంద మొందునని చెప్పుదురు. ఇది యేకాంత భక్తియుక్తులకు మిక్కిలి యావశ్యకము ఇట్టి యేకాంతభక్తి కలుగవలెననిన మాత్రమున లభింపదు క్రమముగాఁ గుదురవలెను. యెట్లన్న మొదట బాహ్యభక్తిగలిగి, యటువెనుక ననన్యభక్తి గలుగవలయును. అనన్యభక్తి పొడమిన పిమ్మట నేకాంతభక్తి కుదురవలయును. బాహ్యభక్తిఁ గలవాఁడు. తనకులాచారముల ననుసరించి గాయత్ర్యాది జపములును, సత్కర్మలు నొనరించి యవి భగవదర్పణముఁ జేయుచుండును. అనన్యభక్తిఁ గలవాఁడు సత్కర్మలు మొదలగు వానిని విడిచి కేవలము నీశ్వర భక్తిని మాత్రము కలిగి యుండును. ఏకాంత భక్తిఁగలవాఁడు, సత్కర్మలగు, జపతప యజ్ఞయాగాదులు లోకుల పాతకములు నశింపఁజేయుట కీశ్వరునిచే నిర్ణయింపఁబడినవిగాఁ దలంచి భగవన్ముఖోల్లాసార్థముగా నిష్కాముఁడై (అనఁగానందు వలనఁగలుగు ఫలితము నపేక్షింపక) యాసత్కర్మలనఁ జేయుచుండును, ఈమూఁడు రకములగు భక్తి తంత్రముల వలనను. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను నాలుగు చేరి మూఁడువిధములగు ఫలముల నిచ్చునని చెప్పుదురు. భగవదర్పణముఁ జేయఁబడిన కర్మములతోఁ గూడనదగు బాహ్యభక్తి వలన, సాలోక్యము, సామీప్యము, నను పదవులఁ జెందుదురు. కర్మములను విడిచిన స్థిరమైన యనన్యభక్తి వలన, సారూప్యమను పదవిగలు

గును. లోకులు కడతేరుటకు నిష్కామ్యముగాఁ జేయఁబడు కర్మములతోఁ జేరినదగు యేకాంత భక్తి సాయుజ్యము నొసంగును. వీని భేదము లెట్టివనఁగా. సాలోక్యము, భగవంతుడు, బ్రహ్మ, విష్ణు, శివ రూపములతో నివసించు, లోకంబులఁజేరి యచ్చట చరించుట. సామీప్య మనఁగా దేవుని సమీపమునఁ జేరుట. ఈరెండును బాహ్య భక్తికి ఫలితములు సారూప్య మనఁగా, భగవంతునిలాగుననే రూపమునొంది యెల్లపుడును నతని నెడబాయకుండుట. ఇదియనన్య భక్తి ఫలితము. సాయుజ్యమనఁగా. నీశ్వనియందు లయించుట అనఁగా నైక్యమగుట ఇది యేకాంత భక్తిఫలితము. భక్తులగు వారు వీనిభేదముల నెఱింగి క్రమముగా నుత్తమ మార్గంబు నవలబించి భగవంతుని సేవించి మోక్ష మొందవలయును. నాభక్తుల యందు ప్రియము గలిగి యుండుటయు, భక్తులగు వారు నన్ను పూజించుటను చూచి సంతోషించుటయు, తానును భక్తియుక్తుఁడై పూజించుటయు నన్ను పూజించుటలో గర్వము, డంబము లేకుండుటయు, నాయవతార, లీలావిలాస కథల నాలకించుట కుత్సాహముం గలిగి యుండుటయు, నాయందుఁగల భక్తివిశేషముచే పులకితాంగుఁడై యానంద భాష్ప కలితములగు కన్నులు గలవాఁ డగుటయు, యెల్లపుడును నాపేరులను స్మరణచేయు (తలఁచు) టయును. నాసన్నిధి (సమీపము) విడిచి పోవుటకు తలంపు లేకుండుటయు, నను నీయెనిమిది విధములగు భక్తి లక్షణములు కలవాఁడు, తురకవాఁడైనను, చండాలుఁడైనను, వాఁడునాకు మిక్కిలి ప్రియుఁడగును వాఁడెట్టివాఁడైనను, వాఁడే యుత్తమ బ్రాహ్మణుఁడు. వాఁడే మునిశ్రేష్ఠుడు. వాఁడే బ్రహ్మజ్ఞాని. వాఁడేసన్యాసి వాఁడేయోగి. వాఁడే శ్రీమంతుఁడు. అట్టివానిని నేనెల్లపుడును నెట్టిచెట్టయుఁ గలుగ నీయక రక్షించుచుండుదునని భగవంతుఁ డానతిచ్చి యున్నాఁడు. మఱియు, పత్ర, పుష్ప, ఫల, జల, భోజనాదులు యెవఁడు ముందుగా నాకు సమర్పించక తా ననుభవించునో యట్టివాఁడు చండాల సమానుఁడు. మహాపాపి, వానియందు నాకనుగ్రహము కలుగదనియు జెప్పియున్నాఁడు. కావున మన మేవస్తువు ననుభవించు చున్నామో

దానిని భక్తితో ముందుగా భగవదర్పణఁ జేసి, పిమ్మట భుజింప వలయును. అట్లు చేయని వాఁడు పందియు, వాఁడు భుజించునది మలమునుగా భావించ వలసినది. ఇట్లు సర్వవిధముల భక్తిఁ గలిగి సర్వేశ్వరుని నారాధించువారు పుణ్యాత్ములు. అని చెప్పిన సానందముని భగవంతుని భక్తుల యొక్క ప్రభావ మెట్టిది? తెలుపుమని యడిగిన శమనుండతని కిట్లనియె. భవగద్భక్తిఁ గలవాఁడు శూద్రుఁడైనను, బ్రాహ్మ

శమనుఁడు సానందునకు భగవద్భక్తుల ప్రభావంబుఁ జెప్పుట

ణునికంటె శ్రేష్ఠుఁడగును. బ్రాహ్మణ యోగియైనను, నీశ్వరభక్తి లేని వాఁడు చండాలునకంటె నధముఁడు. శూద్రుఁడైనను, భగవద్భక్తియు సత్కర్మముల యందును ననుష్ఠానక్రియల యందును ప్రియమునుఁ గలిగి, యాచరించు వాఁడైనచో, యతఁడును దానపాత్రుఁడగును. అట్టి శూద్రుఁడు వంటఁజేసి పెట్టిన బ్రాహ్మణుఁడు భోజనముఁ జేయవచ్చును యోగ్యుఁడైన యట్టి శూద్రునికి పితృ కార్యములయందు భోజనముఁ బెట్టవచ్చును తప్పుగాదు. ఈశ్వరుని ధ్యానింపక, పరమేశ్వరుని స్తుతించుటయం దాసక్తి లేని వాఁడు తానెంత యుత్తమ బ్రాహ్మణుఁడైనను, కుక్క, గాడిద, యొంటె, పంది మొదలగు నీచజంతువులతో సమానుఁడని భావింప వలసినది. భగవద్భక్తి లేని జన్మ మూపిరి గలిగిన కొలిమి తిత్తి వంటిది. శూద్రుఁడైనను, శాంతము, సత్యము, దయ, యోర్పు, న్యాయము, శీలము, గుణము, భక్తి, యీ మొదలగు లక్షణములు గలవాఁడయ్యె నేని, వానిని బ్రాహ్మణుఁడని చెప్పవచ్చును, లోకమున నెవ్వఁడును కులము వలన బ్రాహ్మణుఁడు కాఁజాలఁడు. భక్తిఁగల వారందఱును, భాగవతులనియు, బ్రాహ్మణులనియుఁ జెప్పఁదగును. అట్టివారే జాతివారైనను, బ్రాహ్మణుఁడుకూడ వారినిఁ బూజింపఁదగును. పురుషులైనను, స్త్రీలయినను నీశ్వర భక్తిఁగల వారు పూజార్హులగుదురు జాతి విచారించ వలసినది లేదు. ప్రపంచము పుట్టినపుడు జాతిభేదములు లేవు అందఱును భగవంతుని వలన సృజియింపఁ బడినవారేయగుట వలన నందఱును, బ్రాహ్మణులే యగుదురు. జాతియనునది వారు వారు తమ తమ గుణములను కర్మానుష్ఠానములనుఁ బట్టి క్రమముగా వారు

లోకంబున)నాచేత శిక్షితుఁడై, యిపుడుమీరుచూచుచున్న వారివలె నానాకష్టములు ననుభవించి జన్మకుఁగావలసి నంతటి పాపము శేషింపఁగా, మరల భూలోకంబునఁ బుట్టుచుందురు. అట్లుగాక, సత్ప్రవర్తకుఁడై భగవంతునియందు భక్తియు, భగవదారాధనయందు ప్రీతియు, యోగ్యులగు పెద్దలసాంగత్యమునుగల సజ్జనుఁడు సమస్తకష్టములవలనను విడువఁబడి, మనస్సంతుష్టిఁ గలిగి క్రమముగా విజ్ఞానసంపద గడించి వేదాంతవిచారమునం దాసక్తిపొడమి తత్త్వజ్ఞుఁడై, యాత్మయు పరమాత్మయు నొక్కటియే యని తెలిసికొని, తానే పరబ్రహ్మమని నిశ్చయించి నిరుపమానమగు బ్రహ్మానందము ననుభవించును. మీరింతకుముందు చూచిన పుణ్యాత్ములగువారు యిట్టి సుకృతములెన్నియో చేసినవారు. అయినను పూర్ణత్వము నొందక మున్నే దేహములు విడిచినపుడు, వారికిని మరల జన్మముకలదు. కాని కొంతకాలమిచట సర్వసౌఖ్యములు ననుభవించి భూలోకంబున జన్మించి, తాము ముందటి కొరవయగు కార్యమును పూర్తిఁ జేసి, యాకారణమున నిత్యముక్తులగుదురు మీరడిగిన ప్రశ్నంబులకన్నిటికిని నేనెఱింగిన వరకునుఁ జెప్పితి. మునిచంద్రా ! ఇంకఁదామేమియడుగం దలంచితిరో, శెలవిండని, యమధర్మరాజు సానందుని గురించి యడిగెను. యమధర్మరాజు చెప్పిన విషయంబులు విని సానందముని మిక్కిలియుం దృప్తిఁజెందినవాఁడై యమునింజూచి, అయ్యా ! శమనా! నీవుచెప్పిన విషయములు నాకు చాలాసంతుష్టిఁ గలిగించినవి. ఇంతవరకునుభక్తిమార్గమునుఁజక్కఁగా నెఱింగించితివి. ఇంక యోగాభ్యాసముం జేయవలసిన పద్ధతిఁ దెలిసికొనవలయు నను కుతూహలముంగలవాఁడనై యున్నాను. కావున నాకు తత్ప్రకారంబు వివరింపుమని యడిగెను. కాలుఁడతని మాటలకు (అడుగుటకు) సంతసించినవాఁడై యతఁడడిగిన లాగున, యోగముల నలవాటుఁ జేయవలసిన రీతులనుం దెలుపఁదలంచి యిట్లని చెప్పనారంభించెను.

### యమధర్మరాజు చెప్పిన యోగాభ్యాస క్రమము.

మునీంద్రా ! వేదాంతవిచారమునం దాసక్తిఁ గలిగిన వారందఱును, నీయోగాభ్యాసక్రమమునుఁ జక్కఁగాఁ దెలిసికొనుట, మిక్కిలి

యావశ్యకము. ఈక్రమమును గురుమూలముగాఁ దెలిసికొననివాఁడు యోగముల నలవాటుఁ జేయుటకు సమర్థుఁడు కాఁజాలఁడు. యోగము లభ్యసించుట యనఁగా మిగుల కష్టసాధ్యమగు కార్యము. కాని, సులభమైనదికాదు. అందువలననే యందఱికిని యాశక్తి లభింపదు. పట్టుదలఁ గలిగి శ్రద్ధతో యలవాటుఁ జేయువారికి మాత్రమే దాని తత్త్వము బోధపడును. మొదట కష్టమైనను, నలవాటుఁజేసిన పిమ్మట సులభముగా నుండును. దాని క్రమమెఱిఁగించెద. వినుండు. ఇంతకు పూర్వమీ యోగాభ్యాసముం జేయవలసిన పద్ధతిని వివరించియున్నాను. కాని యంత విపులముగాఁ జెప్పినవాఁడను కాను ఇపుడు వివరముఁగా జెప్పెదను యోగముల నలవాటుఁజేయని వానికి జ్ఞానము కలుగదు. మోక్షముఁ జెందవలయునను కోరికఁగలవాఁడు, యోగములు చేయవలసిన రీతియును, సాంఖ్యముయొక్క వివరమును తెలిసికొని యలవాటుఁ జేయవలసినది. ఇంతవరకును భక్తిమార్గము చక్కఁగా వింటిరికదా! ఇంక యోగములను తెలుపుచున్నాను. యోగము నలవాటుఁ జేయఁబూనినవాఁడు, పరిశుద్ధమైన చోటున, మిక్కిలి యెత్తుగను, మిక్కిలి పొట్టిగను, లేక నడితరముగా నేర్పాటు చేసికొనిన యరుగు మీఁద పరిశుద్ధముగానుండు (అనఁగా బాగుగా నుతికి యార వేసిన) గుడ్డనుగాని, లేక లేడిచోలునుగాని, పఱచి, దానిమీఁదఁ గూర్చుండి, మనస్సు చంచలములేక (యేకాగ్రముగ) నిలిపి, యభ్యసింపవలయును ఎట్లన్న, శరీరమును, మెడను, తలను, కదలకుండునట్లు నిలిపి, స్థిరచిత్తుఁడై, చూపును తనయొక్క ముక్కు కొనయందు ప్రసరింపఁజేసి చూచుచు, తక్కిన దిక్కులను చూడక, శాంతము వహించి, మనస్సున నెట్టికోరికయును గలుగనీయక, యా మనస్సును బయటి వస్తువులయందుఁ బోనీయక లోపలికిఁ ద్రిప్పికొని, మొదట నిష్టదైవమును, పిదప గురువును, ధ్యానముఁ జేయవలసినది. అటు తరువాత తన శరీరమనునది యొక యిల్లుగా నిశ్చయించి, దానికి, దేహమునఁగల తొమ్మిది దారులును, తొమ్మిది వాకిళ్లగాఁ దలంచుకొని యింటిలోపలఁ గూర్చుండిన వాఁడు వాకిళ్లు మూసికొనిన లాగున, నవద్వారములు (తొమ్మిది దారులు) ను మూసి మనస్సును

చిక్కఁబట్టవలసినది. అటులఁజేసి మనస్సు కుదురు బాటైన వెంటనే, ప్రాణవాయువును, కుంభించి (అనఁగాఁ గదలనీక నిలిపి) భ్రూమధ్యమున (కనుబొమల నడిమిచోటున) చేర్చి పరబ్రహ్మ రూపమగు ప్రణవము (ఓంకారము) ను ధ్యానముఁ జేయుచు, పదిరకములైన యా ప్రణవముయొక్క చప్పుడును బాగుగా నాలకించి వాని తారతమ్యములనుఁ దెలిసికొనవలసినది. అంత కనుబొమల సందునగాని ముఖంబుననుండు సహస్రార పద్మమను పేరుఁగలచోటఁగాని, మనస్సును, ప్రాణవాయువునుఁ గలుపవలయును. ఆరీతిగా వానింగలిపి చూచుచున్నయెడల నచ్చోట మిక్కుటమైన వెలుగు కలిగి దాని మధ్యమున పరమాత్మ స్వరూపము కనుపడును. అట్టి పరమాత్మయందు లోచూపు స్థిరముగా కదియించి తనలో నానంద మనుభవించుట యోగం బనఁబడును. యోగము నలవాటు సేయువారికి మిక్కిలి యావశ్యకమైనది ప్రాణాయామము. కాఁబట్టి మొట్టమొదట ప్రాణాయామము చేయుటఁ దెలుసుకొనవలెను. అది తెలియకుండిన పక్షమునఁ నెట్టియోగమునుం జేయఁజాలఁడు. అది యేలాగుచేయ

### ప్రాణాయామ విధానము.

వలెననిన, ప్రణవము (ఓంకారము) గాని, పంచాక్షరి, యష్టాక్షరి, ద్వాదశాక్షరి మొదలగు మహామంత్రములయందు దేనినో యొకదానిని గురువువలన నుపదేశించుకొని, యామంత్రమును, తానొక మాత్ర (లఘువు) గాఁ జేసికొని, యెన్నిమాత్రలు (అనఁగా యెన్ని లఘువులు,) పూరించుచున్నామో (అనఁగా ప్రాణవాయువును లోనికిం గొనుచున్నామో) దానికి రెండంతలు కుంభించి (అనఁగా ప్రాణవాయువును) బిగియఁబట్టి, యనంతరము ముందుపూరించిన మాత్రలలో సగము బయటికి రేచించి (అనఁగా విడిచి) యిదేవిధముగా క్రమముగా, పూరించుచు, కుంభించుచు, రేచించుచు, సుషుమ్న నాడి (అనఁగా - కనుబొమలసందు) యందు చూపునునిలుపవలయును మాటిమాటికిని ప్రాణవాయువు నెడమ ముక్కురంధ్రమున నుండి పూరించి (లోపలికిఁగొని) యావాయువును కనుబొమల నడిమికిఁ జేర్చి యచ్చటనుండి కుడిముక్కు రంధ్రమునుండి రేచించి (బయటికి

విడిచి) అట్లే కుడిముక్కు నుండి పూరించి యెడమ ముక్కునుండి రేచించుచుండవలయును. ఇవ్విధముగా విసువక తన కెంతశక్తికలదో యంతవరకును జేయుచుండవలయును ఊర్ధ్వకుంభక మనియు, నధోకుంభకమనియు, నిందు కుంభకములు రెండు విధములుగా నుండును. లోపలికీడ్చిన ప్రాణవాయువును రెండు ముక్కు రంధ్రములును గట్టిగామూసి కనుబొమల నడుమ నిలుపుట కూర్ధ్వకుంభక మనిపేరు. ప్రాణవాయు నంతటిని బయటికి విడిచి రెండు ముక్కులును మూసికొని కొంతసేపు గాలిలోపలికిఁ దీసికొనక నిలుపుట, యధో కుంభకము. ఈలక్షణములు తెలుసుకొని ప్రాణాయామముఁ జేయవలయును. ఇదిగాక మఱియొకవిధమైన ప్రాణాయామముకలదు. అది యెట్లన్న, ఇదియును, రేచక, పూరక, కుంభకములు మూఁడును గలిగియుండును. మూలాధారము (హృదయము) నుండి ప్రాణవాయువును, షడాధారముల (ఆరు కమలముల) ద్వారా బ్రహ్మరంధ్రము (నడినెత్తి) నకుఁ దీసికొని పోవుట రేచకము. అచ్చట నిలిపిన వాయువును క్రమముగా నందుండి మరల నదేమార్గమున మూలాధారమున, జేర్చుట పూరకము. ప్రాణవాయువును బ్రహ్మరంధ్రమునకుఁ జేర్చినపుడు కొంతసేపచట నిలుపుట కుంభకము. యీ రెండవ మారుచెప్పిన ప్రాణాయామమున కాంతర్య ప్రాణాయాము (అనఁగా లోపలనే చేయునది.) అనిపేరు. పై రెండు విధములలో నేదైనను, తాను చేయఁగల నను ధృఢనిశ్చయము గలుగు దానిని గురుముఖముగాఁ దెలిసికొని యలవాటుఁజేసి వాయువును వశపరుచుకొనవలయును. ప్రాణాయామము భుజించినపుడు చేయకూడదు. పరకడుపుగానుండి. జలమల బాధలుతీర్చుకొని శుచియై కూర్చుండి యలవాటుఁ జేయవలయును. ముఖ్యముగా నుదయకాలమునను, సాయంకాలమునను జేయుటమం చిది. యోగాభ్యాసమునకు ప్రాణాయామ మెట్లావశ్యకమో, యట్లేము ద్రాలక్షణముం దెలిసికొనుటయగత్యము. ముద్రలైదువిధములు, వానిం

### ముద్రా లక్షణము.

జెప్పెదను. కన్నులు రెండును నొక్కటిగాఁ జేసి (అనఁగా రెండుకన్నుల చూపు నొకటిగాఁ గలిపి) చలింపనీయక ముక్కు యొక్క కొస

యందు దృష్టి (చూపు) నిలిపి చూచు చుండుట భూచరియను ముద్ర యనఁబడును. కన్నులు రెండును మూసికొని గాని, తెఱచుకొనిగాని ముఖమును మీఁదికెత్తి, నల్లగ్రుడ్డంతయుఁ గనుపడకుండు లాగునను, దెల్లగ్రుడ్డు కనుపడు లాగుననుఁ, గన్నులం ద్రిప్పికొని, లోఁజూపునఁ గనుబొమల మధ్యమునుఁ జూచుట యంతర ఖేచరియనఁ బడును. కన్నులు సగము మూసి చూపును ముక్కు యొక్క నడిమి భాగమునఁ జేర్చి మీఁదనుండు కనుబొమల నడిమి స్థానముఁ జూచుట మధ్యలక్ష్య మనఁబడును. రెండు చెవులును, రెండుకన్నులును, రెండు ముక్కు రంధ్రములును, వ్రేళ్లతో గట్టిగా మూసికొని కనుబొమలకు నడుమమనస్సును నిలిపి, పది విధములుగా వినఁబడు ప్రణవధ్వనిని వినుచు, భ్రూమధ్యంబున వెలుఁగుఁ గనుఁగొనుటకు షణ్ముఖిముద్రయని పేరు. రెండు కన్నులును తెఱచికొని తలపైకెత్తి మీఁది చూపును కనుబొమలకు నడుమ నిలిపి యచ్చటనుండు కాంతిని చూచుట శాంభవీ ముద్ర యనఁబడును. ఇట్లు ముద్రలైదు విధములుగా యోగీంద్రులు నిర్ధారణం గావించిరి. ఈముద్రా లక్షణంబునకు సాధకంబులు దృష్టులు. (అనఁగా చూపులు) అవిమూఁడు విధములు. వీని విషయమును మున్ను సంక్షేపఁము గాఁజెప్పి యున్నాను. ఇపుడు వాని తారతమ్యమును వివరముగాఁ దెలిపెదను. ఎట్లనఁగా,— వానికి యమా

## దృష్టి భేదములు.

వాస్యా. పాడ్యమి. పౌర్ణమిదృష్టులని పేరులు పెట్టియున్నారు. అమావాస్య దృష్టియనఁగా— రెండు కనుల రెప్పలను చక్కఁగా మూసి, లోచూపున కనుబొమల నడుమఁజూచుట. పాడ్యమి దృష్టియనఁగా. ముక్కాలు వంతు కనురెప్పలు మూసి, పాతికపాలు తెఱచుకొని, కనుబొమల నడుమ చూపు నిలిపిచూచుట. బాహ్యాఖేచరి యనుపేరుతో యీపద్ధతి శాంభవీ ముద్రకు సాధనమై యుండును పౌర్ణమి దృష్టియనఁగా— నల్లగ్రుడ్డంతయు లోపలికిం ద్రిప్పి తెల్లగ్రుడ్డు మాత్రముకనఁబడు లాగునఁ జేసికొని, దవడలకు క్రిందయుండు యెముకలు మొదలు కొని, కనుబొమలకు పైన నాలు గంగుళముల దూరము వరకును, లోదృష్టితోఁ జూచుట. ఇదియంతర ఖేచరీ ముద్రకు సాధ

నన్నే యుండును. ఈపద్ధతుల నెఱింగి యోగాభ్యాసముం జేయువానికి వైరాగ్యము జనించి పరమాత్మయందు మనస్సు లయించును. అపుడట్టివాఁడు, అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము, ననునెనిమిది విధముల సిద్ధులు గలవాఁడగును — వానివివరం బెట్లనిన. కంటికి కనుపడ నంతటి నలుసు వంటి శరీరముఁగల ప్రాణులలో ఆప్రాణుల కంటికి కనుపడనంతటి

### అణిమాదిసిద్ధుల వివరము.

(పరమాణువు ప్రమాణము) రూపమున వానియందు వెలుఁగు చుండుట యణిమ యనఁ బడును. బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, విరాట్పురుషుఁడు, వీరికంటె పెద్దవాఁడుగా నుండుట మహిమ యనఁబడును. కోటియేనుఁగులు కట్టిలాగించినను గదలక కొండవలె స్థిరముగానుండుట గరిమయనం బడును. పెనుగొండ యంతటి పెద్దవాఁడై కనఁబడుచు, దూదికంటెఁ దేలికగా యుండుట లఘిమ యనఁబడును. తానేది కోరునో యావస్తువు తనయొద్దకు వచ్చిచేరుట ప్రాప్తియనఁబడును. తా నెచ్చటికిం బోవలయునని తలంచునో యాచోటున కాక్షణమున నాకాశ మార్గమునఁ బోయిచేరుట ప్రాకామ్య మనఁబడును. ముప్పదిమూఁడుకోట్ల దేవతలకును తానునాయకుఁడుగా నుండు లాగునఁజేసి కొనుట యీశత్వ మనఁబడును. లోకములోఁగల మనుష్యులు మొదలుకొని సమస్త జంతువులును తానుచెప్పిన రీతిని విను నట్లు లోఁబడఁజేసి కొనుట వశిత్వమనఁబడును, ఈ యెనిమిదియు నే యష్టసిద్ధులని చెప్పుదురు. వీనిం గలవారు సిద్ధులు. ఈసిద్ధత్వము యోగము వెఱింగి యభ్యాసముఁ జేసి మనోజయముఁ గలిగిన వారికి సిద్ధించును. యోగాభ్యాసముం జేయుట సంపూర్ణముగాక తప్పినయెడల నట్టివాఁడు, స్వర్గము మొదలగు పుణ్యలోకములకుఁ జేరి పెద్దకాలమచ్చట సుఖము ననుభవించు చుండి పిమ్మట భూలోకమున జ్ఞానవంతులకుగాని, ధనవంతులకుఁగాని బిడ్డగాఁ బుట్టును జ్ఞానులకును, ధనికులకునుఁ బుట్టి యోగాభ్యాసమునందు పూర్ణులగు వారికి మాత్రమే ముక్తికలుగును కాని, యితరులకుఁ గలుగదు. ఇట్లు జన్మించిన వాఁడు మరల జ్ఞానవంతుఁడై పూర్వ మెక్కడనుండి భ్రష్టుఁడు (విడిచిన

వాఁడు) కాఁబడెనో యచ్చనుండి మరల నారంభించి పూర్ణముఁగా వించుకొనును. యోగము వలన పూర్ణసిద్ధి నొందిన యోగి, ప్రాణ వాయువును బంధించి బ్రహ్మరంధ్రము (అనఁగా కపాలమార్గము)నుండి విడిచి పరబ్రహ్మ పదముఁబొంది పరమాత్మయం దైక్యమగును. నిప్పు కట్టెలను కాల్చివేసిన లాగున, జ్ఞానము సకల కర్మములను నసింపఁ జేసి ముక్తిఁ జెందునట్లు చేయును. పరిపూర్ణమగు నట్టి జ్ఞానముతో యేదియు సమానము కాఁజాలదు. పూర్వ జన్మమందైనను, లేక యీజన్మము నందైనను, పుణ్యకార్యములు చేసి యోగాభ్యాసముఁ గావించిన యోగులకు మాత్రమే పరిశుద్ధమగు తత్త్వజ్ఞానము కలుగును. తదితరులకు కలుగదు. జ్ఞానములేని వాఁడు చావుపుట్టు కల నెడి గొప్పవెల్లువలోఁ జిక్కుకొని నానాకష్టము లనుభవించును. జ్ఞాని యగువాఁడు ముఖ్యముగా నెనిమిది విధములగు మదములు వి

## మదాష్టక వివరణము.

డువవలయును. అవియేవనిన, కులమదము, బలమదము ధనమదము, యౌవన మదము, తపోమదము, రాజ్యమదము, పాండిత్య మదము, విద్యా మదమునను నెనిమిదియునుండ కూడనివి. నేనుమంచి గొప్ప వంశమునఁ బుట్టినవాఁడనని విఱ్ఱవీఁగుట కులమదము, నాకంటె నిం కెవ్వఁడును బలశాలిలేఁడు. యెంత వానినైనను నేను పడఁగొట్టఁగల నని తలంచుట బలమదము. నేను మిక్కిలి ధనవంతుఁడను. నన్ను మించిన వారెవ్వరును లేరు. నేనుతలంచిన నెట్టిపని నైనను నిమిష ములో చేయఁగలను. నాకందఱును వశ్యులై యుండక తప్పదని గర్వించుట ధనమదము. నేనుమంచి రూపవంతుఁడను. యౌవన వంతుఁ డను.నన్నుచూచిన స్త్రీలు నాసంగమ సుఖము నపేక్షింపక తప్పదు. అనుకొనుట రూపమదము. యెట్టికాంతగాని, కోరితినేని నాకువశ్య మగునని యెంచుట యౌవనమదము. నేనుగొప్ప తపశ్శక్తిఁ గలవాఁ డను సమస్తతత్త్వములు నెఱింగినవాఁడను.మిక్కిలి జ్ఞానవంతుఁడను లోకమున తక్కిన వారందఱును, నాకంటెఁ దక్కువైనవారు. అని యెన్నుకొనుట తపోమదము. నేను రాజును. యేమిచేసినను జేయఁ గలను. నన్నుమించిన వారు లేరని నిశ్చయించుట రాజ్యమదము. నేను

గొప్ప కవిని. పండితుఁడను. మిగులగౌరవవంతుఁడను. నన్నుజూచిన యెడలను చేతులు మోడ్చినమస్కరింప వలయునని యనుకొనుట పాండిత్య మదము. ఇట్టి మదములు గలవాఁడు వీనికి సంబంధించి యెనిమిది విధములగు పాశలకులోనై తన్ను నిరుప మానమైన పరమాత్మ స్వరూప మని తెలుసుకొన నేరక పెక్కువిధములగు కర్మలు కావించు చుండును. ఆయెనిమిది విధములగు పాశలు నేవనఁగా.— దయ, విరోధము. మోహము, భయము, సంశయము, కులము, బలము, నాచా

పాశాష్టకము.

రమునను నవి పాశలనఁబడును. ఇవి లేకుండవలయును. ఇవిగాక జ్ఞానియగువానికి యుండకూడని యూర్ములను నవియాఱుగలవు. వీని నేషడ్వికారములందురు. అవియేవేవి ? యనిన.— ఆకలి గలుగుట. దాహము గలుగుట. ప్రాణవాయువు యొక్క వికారగుణములు. మోహము

షడూర్ములు.

గలుగుట, దుఃఖము కలుగుట, యీరెండును. మనస్సు యొక్క వికారగుణములు. చచ్చుట, పుట్టుట యీరెండును, శరీర వికారగుణములు. ఇవియాఱును తనకు లేనివనియు, తాను వీనినిఁ జెందని పరమాత్మయనియుం దెలిసి కొననేరక, యీయూర్ములు తనకుంగలవని భ్రమించి, యీకరణమున, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు గలవాఁడై, పెండ్లాము, బిడ్డలు, ధనము, వస్తువులు మొదలగు యీలోక సంబంధములగు వానినిఁ జూచుచుండుట చేతను, తాకుచుండుట చేతను, వానియందు కోరిక నొందుచుండుటచేతను, తెలివిని కోలుపడి నానావిధములగు పనులునుఁ జేయుచుండి, మరణించిన పిమ్మట, తానుచేసిన పనులయొక్క ఫలితమునను సరించి, నానా దేశములయందును, నానా విధములగు జన్మము లెత్తుచుండును. జీవుఁడొనరించు పనులు, దేహ సంబంధములు, వాక్సంబంధములు, మనస్సంబంధములునని మూఁడువిధములగుచు. వాని ఫలంబెట్లనిన.— దేహముచేఁ జేయఁబడిన పనుల వలనఁగలిగిన

క్రియా త్రయము

ఫలముచేఁ చెట్లుగాను, తీఁగలుగాను, కొండలుగానుఁ బుట్టును.

వాక్కుచేఁ జేయఁబడిన పనులవలన, పశువులుగాను, పక్షులుగాను, నానా విధములగు పురుగులుగాను జనించును. మనస్సుచేఁ జేయఁబడినపనుల (అనఁగాఁ దలంచినవి) వలన మనుష్యులలో, నధముఁడుగాను, పాపకార్యముల యందు ప్రియముం గలవాఁడు గాను నుదయించును. మనోవాక్కాయ కర్మముల వలన ననేక జన్మములెత్తి మనుష్యుఁడుగాఁ బుట్టినపుడు మోక్షమును పొందుటకు (అనఁగా మరల జన్మములేకుండు నట్లుచేసి కొనుటకు) ప్రయత్నించి యోగ్యుఁడగుగురువును వెదకికనిపట్టి యాగురువునకు నమస్కరించి యాశ్రయించి, సేవఁజేయుచు, మోక్షమార్గము నుపదేశింపుఁడని ప్రార్థించియత నికరుణకుఁ బాత్రుఁడై నపుడా గురువు ప్రియముతో శిష్యునకు సందేహము లన్నియుందీర్చి తత్త్వమార్గమును బోధించును అప్పుడతఁడు అనఁగా శిష్యుఁడు గురుని యనుగ్రహముం బొందినవాఁడై యోగాభ్యాసముఁజేసి దానిమూలకముగా ముక్తినిఁ జెందవలయును. అట్టివాఁడు. తాను తల్లిగర్భమున పిండరూపముగా నుండుట, శిశువుగాఁ బుట్టుట, పిమ్మట యౌవనవంతుఁ డగుట, వృద్ధత్వము (ముసలితనము) నొందుట, నానాటికి కృశించుట, కడపట చచ్చుట, యనెడి భావవికారములు చెందఁడు. ఆవికారములు స్థూలదేహమునకు సహజములుగా తెలిసికొనును. ఇట్లు తెలిసికొని నిత్యమైన పరబ్రహ్మ స్వరూపమును గనుఁగొనుటకుం బ్రయత్నించవలయుచు. పరమాత్మను తెలిసికొనుటకు యోగులగు వారెనిమిది విధములగు ప్రమాణములు నిర్ణయించిరి. అవి, ప్రత్యక్షము, ననుమానము, నుపమానము, శబ్దము, నర్థాపత్తి, యభావము, నైతిహ్యము,

—— అష్టవిధ ప్రమాణములు ——

సంభవము, ననుపేరులుగలవై యుండును. ప్రత్యక్షమనఁగా కంటితోఁ జూడఁబడు తెలుపు, నలుపు, పసపు, ఎరుపు, పచ్చ, బూడిద వర్ణము, ననురంగులును, పొడుగు, పొట్టి, లావు, సన్నము, ననునాకారభేదములునుఁ గలిసి, దశవిధరూపములుగా నొప్పును. ఈ రూపములన్నియు, నగ్ని సంబంధమైన తన్మాత్రలు. నశించునట్టివి. కాన కండ్లకు కనుపడనట్టియు, నాశనము లేనట్టియు పరబ్రహ్మము కాఁజా

లవు. ఇందుచే బ్రహ్మప్రత్యక్షము (కనుపడనిది) గాఁ జెప్పఁబడినది. అనుమానమనఁగా, కార్యమునకు కారణమున్నూ, కారణమునకు కార్యమున్నూ కలదని తలంచుట. యెట్లన్న, మాయచే నావరింపఁబడియుండు జీవుఁడు, కార్యోపాధిని పొందినవాఁడు. మాయ యందు ప్రతిబింబించు పరమేశ్వరుఁడు, కారణోపాధినిం బొందినవాఁడు. ఈ జీవేశ్వరు లిరువురే, కార్య. కారణోపాధులను బొందుచున్నారు. కాని శుద్ధ సత్త్వమగు పరబ్రహ్మము యీ కార్య కారణములు లేని వాఁగు. దానివలన ననుమానము గలుగని వాఁడగు చున్నాఁడు. ఉపమాన మనఁగా,— తనజాతి, వేఱుజాతి యను భేదములు లేనివాఁడుకనుక పరబ్రహ్మ మనుమానింపఁ బడుచున్నాఁడు. శబ్దము.అనఁగా— చెవులకు వినఁబడు చప్పుడు. ఇదియాకాశ గుణము. పరబ్రహ్మము, నిశ్శబ్దుఁడు. కనుకనిశ్శబ్దుఁడగు చున్నాఁడు. అర్థాపత్తి యనఁగా. ఇక్కడ నున్నది. యక్కడ నున్నది యని యెక్కడనో యొకస్థలమును నిశ్చయించి చెప్పుట. ఇట్లనుట వలన పరబ్రహ్మము సర్వ పరిపూర్ణుఁడుగాని యొక్కచోటున నుండువాడు కానందున, నర్థాపత్తి లేని వాఁడగును. అభావ మనఁగా — లేదనుట. (అసత్యము) పరబ్రహ్మము సత్య స్వరూపుఁడు (అనఁగా నెప్పుడునుండు వాఁడు) కాన నభావ రహితుఁడయ్యెను ఐతిహ్యము. అనఁగా.— క్రొత్తక్రొత్తగా వచ్చుచుం బోవుచుండుట. జీవేశ్వరులు ప్రళయము కలిగినపుడెల్ల నశించి కలుగు చుండుదురు. కాని పరబ్రహ్మమునకు రాకపోకలు లేవు. అందువలన నైతిహ్యమునకు లోఁబడని వాఁడగును. సంభవ మనఁగా — ఒకటిగాఁగూడి మరల ననేకములుగా నగుట. ఇవిమాయచేఁ జేయఁబడు కార్యములు. ఇట్టివి లేని వాఁడగుటచే పరబ్రహ్మము సంభవుఁ డనఁబడును. ఇట్లు యెనిమిది విధములుగా నుండు ప్రమాణములకును, సంబంధిపక నేదికలదో, యదియే సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మము శరీరమున తనకుఁదానే వెలుఁగుచుండు నట్టి యాత్మ, పుట్టుకతోనే నిర్మలమైనదిగా యుండును. అట్టి నిర్మలాత్మ వేద ప్రమాణముల వల్లనేగాని తెలియఁబడదు. కాశీ, రామేశ్వరము, గయ, ప్రయాగ, మొదలగు పుణ్య స్థలములకుఁ బోవుట వల్లను,

నుత్తరాయణ, దక్షిణాయనాది పుణ్యకాలముల వలనను, తాను పరిశుద్ధముగా నుండుట (అనఁగా చక్కఁగా స్నానముఁజేసి మడుగు వస్త్రములు కట్టుకొనుట) వలననుఁ దెలియరాదు. జీవుఁడు తానజ్ఞాన వశుఁడై మాయచేఁ గప్పఁబడి యున్నాఁడు. కాన తత్త్వజ్ఞానము కలిగినపుడేఁ గాని తాను జీవుఁడనను భ్రమనణంచి, తానుసాక్షి మాత్రముగాఁ గనఁబడుచుండు పరబ్రహ్మమని యెఱుంగ నేరఁడు. మహాత్మా! మీరడిగిన విషయంబుల కన్నిటికిని సమాధానముం జెప్పితిని. ఇంక నేమి యనుజ్ఞ యొఱుఁగఁ బలుకుఁడనిన పరమానంద మనస్కుఁడై సానందుఁడు దండధరునిఁ జూచి, పరిశుద్ధముగా నొప్పు స్వరూపముఁగల పాపజన భయంకరుఁడవైన, వికర్తన కుమారా! ధర్మరాజా! నామదినిఁ బొడమిన సందియములు చక్కఁగా నివారించితివి. నేనడిగిన వాని కెల్లను వివరముగా సమాధానముం జెప్పి నన్నుఁ దృప్తి నొందించితివి. ఇంక నొకవిషయంబు మాత్రము నిన్ను నడుగఁ దలంచితిని విసుకుం జెందక దానిని మాత్రముఁ జెప్పుము. పిమ్మట జరుగ వలసిన విధానమును యోచింతమనియెను. ఆమాటలు వినియముఁడు ముఖంబున చిఱునవ్వంకురింపగా, స్వామీ! మీరిట్లు చెప్పుట తగునా? మీరడిగిన విషయంబులకు సదుత్తరంబుగా వివరించుటలో నాకేల విసుకుగలుగును? ఎప్పుడును మీరాలాగునఁ దలంప వలదు. నాకుఁ దెలిసియుండు విషయములను మీరే దానినడిగినను భక్తితో తమతో చెప్పుటకు నేను సిద్ధముగా యున్నాను. తాము సంకోచింపక యడుగవచ్చును. ఇపుడు మీరే విషయమువినఁ గోరెదరో శలవొసంగుడు. అని చెప్పిన మునీంద్రుఁడు సంతసించి బ్రహ్మజ్ఞాని యెట్టివాఁడో, గుణలక్షణము లెట్టివో తెలుపుమని కోరెను. అతని యిష్టానుసారముగాఁ దెలుపఁ దలంచి శమనుండతని కిట్లనియె. బ్రహ్మజ్ఞానియగువాఁడు చిన్నపిల్లవాండ్రు, అకలి

## బ్రహ్మజ్ఞాని లక్షణము.

దప్పి తెలియక, యుత్సా[illegible] యెల్లు ఆట్లాడుచుందురో ఆవిధముగా నహంకారమును, మమకారమును విడిపెట్టి సదా యుత్సాహముతో పరబ్రహ్మమునందు మనస్సును నిలిపి, ధ్యానించుచు, నా పరబ్రహ్మ

మును కనుఁగొని యానందించుచుండును. అట్టిజ్ఞాని తానుధనము లేనివాఁడయ్యును నిత్యసంతోషియై యుండును. లోకములో నంతటి సంతోషము ధనవంతునకుఁ గలుగనే కలుగదు. అనేకుల సహాయముఁ గలవాఁడై యున్న చక్రవర్తియుం గూడ నొక్కొకప్పు డధైర్య పడుచుండును కాని, జ్ఞానియగువాఁ డసహాయుఁ డయినను మహా బలవంతుఁడును ధైర్యవంతుఁడును నై యుండును పంచభక్ష్యపాయ సాన్నములు భుజించిన వానికైనను నొక సమయంబున నతృప్తి కలుగును కాని, బ్రహ్మజ్ఞాని కాలాగు కలుగదు. యెల్లప్పుడును తృప్తిఁజెంది యుండును. అతఁడు, ఆకలియు, దాహమును ప్రాణవాయువు యొక్క ధర్మములు గాని, దేహమునకును, నింద్రియ ములకును, ప్రాణ ములకును, సాక్షి భూతముగా నుండు నాకు లేవని నిశ్చయించి, ఎండమావులు నీళ్లుగాఁ దోఁచినట్లు యాకలి దప్పియుఁ దనకుం గలిగినట్లు తోఁచునుగాని నిజముకాదనియు, నెంచి నిశ్చలుండుగా నుండును అతఁడెవరికిని సమానుఁడుగాఁ దోఁచుచున్నను తానట్టి పక్షపాత బుద్ధియు లేక, యంతయును దనవలెనే చూచుకొనుచుండును. నిత్యనైమిత్తికాదులగు పనులు చేయుచుండియు, నహంకారము, మమకారము లేని వాఁడగుటచే నాకార్యములఁ జేయనివాఁడేయగును కష్టములు, సుఖములు నను భవించుచున్నను, పరబ్రహ్మమగు నాత్మయే తానని నిశ్చయముఁ గలిగియున్న వాఁడు కావున నట్టి సుఖదుఃఖములను చెందనివాఁడే యగుచున్నాఁడు. శరీరముగలవాఁడుగాఁ గనుపించుచుండినను, శరీరముతో సంబంధము లేనివాఁడై యుండును. ఒక స్థలమున నొకదేహమున నుండు వాఁడైనను, తానే సర్వసాక్షియగు నాత్మస్వరూపుఁడు గాన సర్వవ్యాపకత్వమును పొందుచున్నాఁడు. ఇట్టివానికి పుణ్యపాపములు కలుగవు. సూర్యుని రాహువు మ్రింగక పోయినను, పామర జనులు గ్రహణ కాలముల యందు సూర్యుని రాహువు మ్రింగుచున్నాఁడని తలంచిన విధమున, నచలుఁడును, నభిమానము లేని వాఁడును, తానే పరబ్రహ్మమని తెలిసిన వాఁడును, నిర్వికారుఁడు నైన బ్రహ్మజ్ఞానిని చూచినప్పుడు జనసామాన్య మతనిమహత్త్వ మెఱుఁగనేరక యతఁడును తమ

వంటి సామాన్యమనుష్యునిఁగాఁ దలంతురు. అట్టితలఁపునకు కారణము వివేకము. అటువంటి యోగ్యతఁగల జ్ఞానవంతుఁడు పాము తనకు సంబంధము లేకుండా కుబుసమును విడిచిన భంగి శరీరాభి మానమును వదలి, ప్రాణవాయువుతోఁ గూడి, దేహమున నిమిత్త మాత్రము గాఁ గదలుచుండును. నదీప్రవాహము (వెల్లువ) లోఁ గొట్టుకొనిపోయెడి కొయ్య యాప్రవాహము పోయినలాగున మిట్టపల్లములను చిక్కుచు దప్పుచు నెట్లు పోవునో, యాలాగున బ్రహ్మజ్ఞాని యొక్క శరీరము సుఖ దుఃఖములను పొందుచుండును. అతఁడు, జీవించి యున్నపుడే దేహము మీఁది యభిమానమును విడిచియుండుట వలన, నెట్టిసత్కర్మలను చేయకుండినను, చేసినవాఁడుగానే నిత్యముక్తుఁడగును. ప్రారబ్ధ కర్మ నశించఁగనే, మూఁడువిధములని పూర్వము చెప్పియున్న శరీరములును, జీవో పాధులును నశించి, ఘటము పగిలిన తోడనే ఘటమునఁ గనుపించు చుండిన యాకాశము మహాకాశముతో చేరినరీతిగా ప్రపంచ సంబంధమును మాని బ్రహ్మమగును. వేషగాఁడు ఆడవేషము వేసుకొని యాడినప్పుడును. ఆవేషమును, తీసివేసినపుడును, తాను పురుషుఁడుగానే యున్నాఁడు. కాని వేషము వేసినకాలమున స్త్రీ కాలేదు. అట్లే బ్రహ్మజ్ఞాని తనకు తెలివిలేక జీవత్వమునుఁ జెందినపుడును, జ్ఞానియై యాజీవత్వమును తొలఁగించుకొన్నపుడును తాను పరమాత్మగానే యగునుగాని వేరుకాదు. వేషగాఁడనేక వేషములు వేసికొని యాడుచున్న తీరుగా మాయావశమున నానావిధ జీవులుగా తోచుచున్నాఁడు. కడపట వేషములన్నియుఁ బోయి వేషము వేసినవాఁడు మాత్రము నిజమైన చొప్పున యెన్ని జీవులుగాఁ దోఁచినను తుదకు పరబ్రహ్మ మొక్కఁడే నిజమగు చున్నాఁడు. తక్కిన జీవస్వరూపము లన్నియు భ్రాంతి మాత్రములు. బ్రహ్మజ్ఞాని యట్టి యచల పరబ్రహ్మ స్వరూపుఁడగును. అతని కటు పిమ్మట జన్మ కలుగనేరదు. ఇవి బ్రహ్మజ్ఞాని యొక్క లక్షణములు ఇట్టి మహానుభావులను మాత్రమే తత్త్వవేత్తలని చెప్పవలయును. కాని యితరులను చెప్పకూడదు. అయిదువిధములగు మలము (దోషము)లు లేనివాఁడగు బ్రహ్మజ్ఞాని కెవ్వఁడును సాటిరాఁడు. మలములైదును

### మలపంచక వివేచనము.

నెవ్వి? యనిన, ఆణవ, కార్మిక, మాయిక, మాయేయ, తిరోధాన ములను పేరులు వానికిఁ జెల్లుచుండును. మొదటిదగు నాణవకము, బ్రహ్మజ్ఞానము కలుగునపుడు కలుగనీయక యడ్డుగానై మఱుగుచేయు ను. రెండవదగు కార్మికము, పెద్దలగువారు వేదాంతవిచారము చేయు చుండఁగా వినుటయందు బుద్ధిని నిలకడగా నుండనీయక నేమరించు నది. మూఁడవదగు మాయిక, మెప్పుడును పరబ్రహ్మమును నొకటి యున్నదనెడి తలంపుఁ గలుగనీయక యుంచునది. నాలవదియగు మా యేయ, సదా చిదానందరూపమైన పరబ్రహ్మమునం దసత్యబుద్ధిఁ గలిగించుచు తదితర దేవతలయందును, మతముల యందును, మం త్రముల యందును నమ్మకముఁ గలుగఁజేయునది యైదవదైన తి రోధానము. నిరంతరమునుఁ బాపపుపనులుచేయుటయందు కోరికలు పుట్టించుచుండునది. ఈపంచమలములును నెవరులేక యుందురో, వారు బ్రహ్మజ్ఞానులని చెప్పఁబడుదురు. మఱియు, జ్ఞానాజ్ఞాన భూము లను బాగుగాఁ దెలిసికొని, యం దజ్ఞానకరములను విడిచి జ్ఞానభూము లయందు సంచరించు చుండవలయును. వాని భేదము లెట్టివనిన. చెప్పెదను వినుండు. శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్వాపత్తి,

### జ్ఞానాజ్ఞాన భూమివివరణము.

యసంసక్తి, పదార్థభావనము, తుర్యము, ననెడి యేడును, జ్ఞానభూము లనియు, బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్న జాగ్రము, సుషుప్తి,యనెడి యేడును నజ్ఞానభూము లనియుఁ, దెలియవలసినది. మొదటిదగు యేడింటియందును, దరు సగా, దుర్జనుల సహవాసము విడిచిపెట్టి మోక్షముఁ బొందవలయు ననే యపేక్ష కలుగుట శుభేచ్ఛయనియు, సజ్జనులగు సాధువులతో సహవాసముఁజేసి వారివలన తత్త్వశాస్త్రముం దెలిసికొని, వేదాంత విచారముం జేయుచుండుట విచారణ యనియు, నట్లువేదాంత వి చారణఁజేసి జ్ఞానియై, పరబ్రహ్మ మొకటియే నిజమైనదనియు, తక్కిన దేహము, పనులు, లోకము, లోకసంబంధమైన భోగములు మొద లగునవి యన్నియు నస్థిరములు, నసత్యములు ననియుఁ, దెలిసి వాని

యందు కోరికను విడిచి యరిషడ్వర్గము (కామక్రోధాదులు) వదలి, పరబ్రహ్మమును సదాధ్యానముం జేయుచుండుట తనుమానసియనియు, తత్త్వమసియను మహావాక్య విచారముం గావించి దేహమునకును నింద్రియములకును, సాక్షిమాత్రుఁడుగా నుండుతానే యాత్మస్వరూపముగాఁ గనఁబడు పరబ్రహ్మమని నిశ్చయించి యెల్లపుడును, 'అహం బ్రహ్మాస్మి' యని యాత్మానుసంధానముం జేయుట సత్త్వాపత్తి యనియు, ఆత్మానుసంధానముం జేసినపిమ్మట నసత్యములగు దేహము నింద్రియములు ప్రపంచమును, మఱచి, సంకల్పము (తలంపు) లేక యుండుట యసంసక్తియనియు, సముద్రమునకు వేఱుగా నలలు లేనట్లు తనకు వేఱుగా ప్రపంచము లేదనియు, ప్రపంచమున్నట్లు తనయందుఁ దోఁచుటచే నది యసత్యమనియెంచి మున్ను చెప్పిన లాగునఁ ద్రిపుటీ రహితుఁడును, దృశ్యములు మఱచిన వాఁడునై, సాక్షి మాత్రుఁడుగాఁగనఁబడును. సదా, యానంద మనుభవించుట పదార్థ భావనమనియు, అన్నపానాదులు విడిచి వాని సంబంధములగు వికారము లెవ్వియునుఁ జెందక ప్రపంచ వాసనలు లేక ప్రాణవాయువును సహస్రారము (కపాలస్థానము) నఁజేర్చి కదలనీయక కుంభించి, తనకు తానై నిర్వికల్పసమాధి యందుండుట తురీయ మనియు, నిట్లు జ్ఞాన భూములను వివేకించి తెలిసికొని, వానియందు ప్రవర్తించుచు, రెండవవి యైన యజ్ఞానభూములు యేడును వరుసఁగా నిర్వికార శుద్ధ బ్రహ్మమునందుఁ గలిగిన మూలప్రకృతి (మాయ) తోఁగూడిన యవ్యక్తము (అజ్ఞానము)గా నొప్పెడి తెలివి బీజజాగ్రమనియు, ఆ తెలివి ప్రపంచమున కభిముఖమై నేను తానను యభిమానయుక్తమైన భేదములకులోనై సకల సంకల్పములు (తలంపులు) గలిగియుండుట జాగ్రమనియు, ఆ తెలివియే పలువిధములుగా పలురూపములతో జీవేశ్వరలోకములుగాఁ దోఁచుచు నహంకార మమకారములు చెంది యుండుట మహాజాగ్రమనియు, తానెఱుగనివియు చూడనివియు నగు వానిని తనలో తలంచుకొని, మనస్సులోనే వాని ననుభవించుట జాగ్రత్స్వప్నమనియు, నిద్రించునపుడు, తాను మేల్కొనియున్న కాలమునఁ జేసినట్టివియుఁ జూచినట్టివియు మనస్సునఁ దగులఁగా వా

నిని తాను పొందినలాగునఁ దలంచుకొనుట స్వప్నమనియు, తాను జాగ్రతయందుండి నపుడు చూచియెఱింగి యున్నవానిని మఱచి, స్వప్నావస్థయందు మరలవానిని జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనుట స్వప్న జాగ్రమనియు, ప్రపంచమును, నందలి సర్వమును మఱచి యెవ్వియుఁ దలంపునకురాక యంధకార మయమగు నిద్రనుఁ జెందుట సుషుప్తి యనియుం దెలిసికొని యీయేడును జననమరణ హేతువులని వివేకించి బ్రహ్మజ్ఞాని వీనియందు మనస్సుం జొరనీయక జాగ్రతగాఁ బ్రవర్తింపవలయును. జ్ఞానభూమి లేడింటిలో, శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, యను మూఁడింటి యందును సంచరించు వారభ్యాసు లనఁబడుదురు వారికి జగత్తు విషయరూపముగాఁ దోఁచును. కావున నది వారికి జాగ్రదవస్థ యనఁబడును, మిగిలిన నాలుగింటియందును సంచరించు వారారూఢులనియు, ననుభవ జ్ఞానులనియుం జెప్పఁబడుదురు. ఆనాలుగింటి యందును, సత్వాపత్తి సంచారులకు జగత్తంతయు, సంకల్పరూపముగాఁ దోఁచుచుండును అది వారికి స్వప్నావస్థ యనఁబడును. సంసక్తి సంచారులకు జగత్తుతోఁచదు. కావున వారికది నిద్రావస్థయగును. పదార్థ భావనా సంచారులకు ప్రపంచము చిన్మాత్రముగాఁ గనఁబడుటచే వారికది తుర్యావస్థ యనఁబడును. తుర్యసంచారులకు, ద్రష్ట, దృక్కు, దృశ్యములు (చూచువాఁడు చూపుచూడబడినది) లేకపోవుటయు, నిమిత్త మాత్రముగాఁ గనఁబడుట వలనను, నదివారికి తుర్యాతీతమని చెప్పఁబడును ఈచెప్పిన జ్ఞానభూమి లేడింటిలో ముందు తెలిపిన వగునట్టి మొదటి మూఁడింటి యందును సంచరించుచుండి మరణించిన వారున్నతమైన పదవికిఁ జేరి యచట కొంతకాలము సకల సుఖములు ననుభవించుచుండి యటుపిమ్మట మరల భూలోకమున పుట్టి, జ్ఞానవంతులై క్రమముగాతక్కినవియగు జ్ఞానభూములునాల్గింటియందును, నేదియో యొకదానినిఁ జేరి జీవన్ముక్తినొందుదురు అటుపై వారికి జననమరణములు కలుగవు, జ్ఞాన భూములగు యేడింటిలో మొదటిదగు శుభేచ్ఛయందుఁ జేరుట యెమిక్కిలి కష్టము. చక్కఁగా ప్రయత్నించి యందుఁ జేరెనేని క్రమముగా తక్కినవానియందుఁ జేరవచ్చును మిగిలినవి యటుపిమ్మట నంత

కష్టముగా యుండవు, ఈచెప్పఁబడిన జ్ఞానభూముల నెఱిఁగి సంచరించు బ్రహ్మజ్ఞానులను యోగులగువారు నాలుగు రకములుగా విభాగముఁగా

### నాలుగువిధముల బ్రహ్మజ్ఞానుల తారతమ్యము.

వించిరి. యెట్లన్న. బ్రహ్మవిత్తులు, బ్రహ్మవిద్వరులు, బ్రహ్మవిద్వర్యులు, బ్రహ్మవిద్వరిష్ఠులని వారిలో భేదములు గలవు. బ్రహ్మవిత్తులు సత్త్వాపత్తియను జ్ఞానభూమియందు సంచరించుచు, లోకోపకారార్థముగా సకలకార్యములనుఁ జేయుచు, గృహస్థాశ్రమమున నుండి శిష్యులకు వేదాంతరహస్యముల బోధించుచునో, లేక సన్యాసాశ్రమును పొందియో యుందురు. వీరు దొరకని వస్తువులనుకోరి యవి లభింపక పోవుటకు చింతనొందకయు, యింకపై దొరకునని యెదురు చూడకయు, దైవాధీనము (అనఁగా ప్రారబ్ధకర్మానుసారము) గా దొరకిన వానితో తృప్తినొంది యనుభవింపు చుండుదురు ఎండవెన్నెలవలె చల్లగా నుండినను, చచ్చినవాఁడు మరల బ్రతికినను అమృతవర్షము కురియుచున్నను, వారు వానిని నధికముగా నెంచరు. సంసక్తియను జ్ఞానభూమియందు సంచరించుచు బ్రహ్మవిద్వరులను వారు, దేహము కదలుటకు (అనఁగా తిరుగుటకు) గాను భిక్షమెత్తికొనితిని యేకాంత స్థలమునఁ గూర్చుండి బ్రహ్మనిష్ఠఁ జేయుచుండుదురు. పదార్థభావనమను జ్ఞానభూమియందు సంచరించు బ్రహ్మవిద్వరీయులను వారు, యేకాంత స్థలములఁజేరి బ్రహ్మనిష్ఠఁబూని తన్మయులై యుండి శిష్యులు మొదలగువారు లేపి ప్రేరేపించగా నన్నపానములఁ గొనుచుండుదురు. ప్రేరేపణ లేనపుడు యెంతకాలమైనను వారికి కాయపేక్షయే కలుగదు. తురీయమను జ్ఞానభూమియందు సంచారముఁగల బ్రహ్మవిద్వరిష్ఠులు యెల్లపుడును, వికల్పములేని సమాధి నిష్ఠవహించి. యన్నపానాదులయందు తామువాంఛఁజెందక శిష్యులు మొదలగు వారు ప్రేరేచినను లేవక కదలక మెదలక ప్రపంచస్మరణయే లేక పరమానందమునుఁ జెందియుందురు. వారికాకలిదప్పులు యెప్పుడును కలుగనే కలుగవు. ఇట్లు వీరు నాలుగువిధములుగా భాగింపఁ బడినను, నావిభాగము బ్రహ్మ పరోక్షము నందేగాని, తక్కిన విషయంబులలో నందఱు నొక్కటియే. ముక్తిఁజెందుటలో

నేమాత్రమును భేదముకలుగదు. ఈనాలుగు రకముల బ్రహ్మజ్ఞాను లును, పదిహేను విధములైన జ్ఞానాంగములతో జ్ఞానయోగమును సాధింపుదురు. అజ్ఞానయోగాంగము లెట్టివన్న. ఆకాశము మొదలు

## పంచదశ జ్ఞానయోగాంగ నిరూపణము.

గాంగల భూములైదును, శరీరములు మూఁడును, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు పదియును, నివియుం బరబ్రహ్మమనియు, నాపర బ్రహ్మము తానేయనియుం దలంచుట యమమనియు, దేహేంద్రి యము లన్నింటికినిఁ దాను వేత్తై, సాక్షిమాత్రముగా నుండువాఁడ నియు, ఇంద్రియ వ్యాపారములును, సకల సుఖదుఃఖములును, తనకు లేవనియు, జాతులు, మతమును, నామము, రూపము పనులు, గుణములు, మొదలగునవి తనకు లేవనియునుఁ దెలిసికొని, యెల్లపు డును బ్రహ్మానందమునుఁ జెందియుంగుట నియమ మనియు, దేహేం ద్రియంబులు తాను గానని వానియందు నమ్మకమును నభిమాన మును పూర్ణముగావిడిచియుండుట త్యాగమనియు, మనస్సుచేతను మాటలచేతను, పనులచేతను, నిట్టిదియని నిర్ధారణఁజేయ తరము కాని పరబ్రహ్మమే తానని తెలిసి, యూరక మాటలాడుట విడిచి మితభాషి యై, తానొకవేళ మాట్లాడినను మాటలాడ నట్లేతలంచుచు, యేకో రికయు, నేతలంపును లేక, బ్రహ్మానందమునుఁ జెందియుండుట మౌన మనియు, నెచట మనస్సును నిలుపుటచేత నింద్రియ వికారములు తొలఁగి, చావుపుట్టుకలు, తాపములుమూఁడును, సుఖము, దుఃఖము నీమొదలగున వన్నియు నశించి తానెప్పుడును బ్రహ్మానందము నను భవించునో, యాచోటు దేశమనియు, ప్రపంచము యొక్క పుట్టుక వృద్ధి, నాశము వీనిసంబంధములగు, జరిగినట్టియు, జరుగుచున్నట్టి యు, జరుగఁబోవు నట్టియు, నీమూఁడు విధములగు కాలములను నతిక్రమించి, ప్రపంచమునకంటె వేఱైయుండు పరబ్రహ్మము తాను గా వాటింగికొని, పదివిధములగు ప్రళయములకు లోఁబడక స్వయం ప్రకాశముతో స్థిరముగా వెలుంగుట కాలమనియు, ముందుచెప్పిన మూఁడు విధములగు కాలముల యందును, నేదినాశముం జెందకస్థిర ముగా యుండునో, యాపర మాత్మయే యాత్మ స్వరూపముగానుం

డు తానని, యపరోక్ష జ్ఞానముఁ గగిలియుండుట యాసనమనియు, యెనిమిది విధములగు ముందు చెప్పియున్న పాశబంధములకు నిమిత్తమైయుండు మూలప్రకృతి (మాయ)యే ప్రబలమగు పరబ్రహ్మమును దర్శించినవెంటనే విడిపోవునో, యాపరబ్రహ్మము మూలబంధమనియు, సముద్రములోఁ గలియు నదులవలె పదునాలు గింద్రియముల వ్యాపారములుం జేరి లయించిన బ్రహ్మానంద సాగరమునం దేలుచు సమరసత్వముం గలిగియుండుట దేహ సామ్యమనియు, నైదు విధములగు ముద్రలును, మూఁడు విధములగు ద్రష్టలునుం దెలిసికొని తారకయోగమురీతిని భ్రూమధ్యమునఁ జూపునిలిపి చూచుచుండుట దృక్కనియు, ఇరువది నాలుగు తత్త్వములును, సకల చరాచరములతోఁ గూడిన ప్రపంచమంతయును, పరబ్రహ్మముగాను, నదితాను గాను, భావించి, తనకంటె నన్యమేదియుం గలుగదని భావించి, యానందించుట ప్రాణాయామమనియు, శాంతము, నోర్పును, మొదలగు సద్గుణములును, కామము, క్రోధము మొదలగు దుర్గుణములును, సర్వమును పరబ్రహ్మముఁ గాఁదలంచుట ప్రత్యాహారమనియు, చూచునవియుఁ, దాకునవియు, వినునవియు, మనస్సు వలన నెఱుంగఁబడునవియు నగు సకలమునుం బరబ్రహ్మముగా దలంచుట ధారణమనియు, ఇరువది నాలుగుతత్త్వములును తానుగాను, తోచుచుండువానిని సాక్షిగానుండి కనుచున్న నేనే పరబ్రహ్మమని తలంచుట ధ్యానమనియు, జాగ్రత, సుషుప్తి, స్వప్నము, తురీయము, ననునాలు గవస్థలును, యాయవస్థలయందుఁ దోఁచెడి ప్రపంచ సంబంధములగు భోగ్యములు, భోగసాధనములు, శూన్యమును, సాక్షాత్కారమున నెడి స్థూల సూక్ష్మ కారణ శరీరములు, నాత్మ, ఇవి యన్నియు పరబ్రహ్మమని భావించి, యదితానను నమ్మకముంజెంది యెఱింగియానందముం జెందుట సమాధియనియు, నిట్లు పదునైదు విధములుగా నీజ్ఞాన యోగాంగములు చెప్పఁబడి యున్నవి. బ్రహ్మజ్ఞాని యింతవరకునుఁ జెప్పిన యన్నివిషయముల యందును పరిపూర్ణ జ్ఞానమును గలిగి యుండవలయును. అట్టి పూర్ణ జ్ఞానము నెవరు కలిగి సదా బ్రహ్మానందమగ్నులై యుందురో, వారు బ్రహ్మజ్ఞాను లనఁబడుదురు. ముని

వర్యా! మీరడిగిన బ్రహ్మజ్ఞాని లక్షణముం జెప్పితిని. ఇట్టి విషయములన్నియుం దెలిసి యుండియు నావలనఁ దెలిసి కొనఁదలంచుట నాపుణ్య విశేషముగాని వేరు కాదు. స్వామీ! యింక నేమి యాజ్ఞ. అయ్యా! ఈయాతన లనుభవించు పాపాత్ములు వేదాంత విచారదూరులై ఇంద్రియ వ్యాపారముల మాన్పుకొనలేక ప్రపంచ సంబంధమగు మాయయందు, దగుల్కొని, సంసార బద్ధులై తమ్ముతాము తెలుసుకొనఁ జాలక, నరషడ్వర్గ మనెడి, కామ, క్రోధాదులు తమ్ముంగవిసి యలయింపఁ దప్పించుకొను దారినెఱుంగకఁ జిక్కుపడి, యాకారణంబున ననేకములగు పాపము లాచరించిన వారు. కావున వీరీలాగు పాపఫలమగు నరక బాధలను పెద్దకాలం బనుభవించి యంతంబున జన్మకు వలయునంతగా శేషించియున్న కర్మమువలన,మరల భూలోకంబున తమ దుష్కృతములకుఁ దగినట్లు నానా విధంబులగు రూపంబులతోఁ బుట్టుచుండుదురు. ఇదియే వీరికి దుర్గతిం జెందుటకు నిమిత్తము, ఎవఁడెవఁడెట్టెట్టి కర్మము నాచరించి యుండునో, వాఁడు వాఁడట్టి యట్టివానికిం దగిన సుఖ దుఃఖము లనుభవింపక తప్పదు. మీరు సర్వముం దెలిసినవారు. శివుని వరమునం గలిగినపావన స్వరూపులరు. కావున మీవంటి నిర్మలాత్ములగు వారీ నీచులగు పాప కర్మలఁ జూచుట యుక్తము కాదు.స్వామీ! యింకనిచ్చోటనుండి తరలి పోవుద మనియెను. సానందముని యముని మాటలను చక్కఁగావినినవాఁడై తనలో, నీశమనుండు చెప్పినదంతయు సత్యము. కన్నులతో చూడఁబడు నవియుఁ, జెవులతో వినఁబడునవియు, మనస్సుతోఁ దెలుసుకొనఁ బడునవియు, నన్నియు చిదచిద్విలాసుఁడగు పరమేశ్వరుని తత్త్వముతప్ప వేఱుకాదు. సుఖముకాని, దుఃఖముకాని, సుఖదుఃఖ కారణములగు మంచి పనులునుఁ, జెడుపనులునుఁ జేయించు వాఁడునుఁజేయువాఁడును చేయఁబడు కార్యములును సర్వమునుఁ బరమేశ్వరుని తత్త్వమే యగును. కష్టసుఖములు కలిగించు వాఁడెవ్వఁడో, యతఁడే వానిఫలంబు ననుభవించు చున్నాఁడు గాని యన్యుఁడెవ్వఁడును లేఁడు. దీని నెఱుంగని మూఢులు దేవుఁడు బాధలు సమకూర్చెననియుఁ దామనుభవించు చున్నార మనియుం దలంపుదురు. ఇంత

కన్న నవివేకము వేఱేమి యున్నది? సర్వమును నీశ్వర స్వరూపమే! సృష్టి, స్థితి లయములకు కారణ మైనదియు, దార, పుత్త్ర, ధనము లనెడి యీషణత్రయ ములనుఁ గలిగించు నదియుఁ, గామాదులకు నిమిత్త మైనదియునగు జన్మమును రాహిత్యముఁ జేసికొనుటకుఁ బ్రయత్నించి వేదాంత విచారమును గావించి సద్గురువుల నాశ్రయించి యుపదేశము నొంది యోగాభ్యాస మొనరించి జీవేశ్వరుల భేదమును, సంబంధంబునుఁ దెలిసికొని యాజీవాత్మ పరమాత్మలు రెండును నొక్క రూపమగు తానేయని గుర్తెఱింగి యెవ్వఁడు జన్మరాహిత్యముం జేసికొనఁడో, యెవ్వఁడు తానింద్రియ ములను నిగ్రహించలేక, మాయా వశుఁడై మోహముం జెంది తనకును నీశ్వరునకును భేదముకలదను తలఁపుఁగొని, సంసారంబను సముద్రమున మునింగి యనిత్యమగు ప్రపంచంబు నిత్యమైనదిగా నెంచుచుం బలువిధంబులగు నక్రమంబులగు పనులు చేయుచు, కష్టసుఖంబుల మగ్నుఁడై తుదకు వ్యర్థంబుగా జీవితంబుఁగడపి శరీరంబును విడుచునో, యట్టివాఁడు పునర్జన్మమునకు సిద్ధముగానుండి యాతనాదేహ మున్నంతవరకును నానా విధములగు నరక బాధలు ననుభవించుట సత్యము. ఈ కష్టముల ననుభవించు వారిట్టి వారేకదా! ఈ బాధ లనుభవించుటకు వీరర్హులుగానే యున్నారు. ఇందు దండధరుండుచేసిన నేర మేమియున్నది? వాఁడువాఁడు చేసుకొనిన కర్మఫలమును వాఁడువాఁడనుభవించు చున్నాఁడు. అని పెక్కువిధంబులం దలపోసి, దండధరునిం జూచి యోపుణ్య స్వరూపా! నీవుచెప్పిన దంతయు సత్యము. ఇందతి శయోక్తి యావంతయును లేదు. నీనడవడిమిగులఁ బొగడఁదగినది. నాయందుఁ బ్రియంబుతో, నిర్వాణానందకారణంబగుపరతత్త్వమును నాకుఁ జక్కఁగా బోధించితివి. ఇందువలన నాకుంగల యన్ని సంశయములునుఁ దొలంగి పోయెను. నాకుమిక్కిలి సంతోషము కలిగినది. నీవునాకుం దెలిపిన యీసద్విషయంబుఁగల చరిత్రం బాచంద్ర తారార్కముగా, సకలజన సుజ్ఞాన ప్రదమై, సకలపాప, జనన, మరణాది సంకటములనుఁ బారఁదోలి నిత్యసుఖంబు నొసంగునదియై ప్రపంచంబున నొప్పునుగాత. ఇట్టియుత్తమ తత్త్వరహస్యంబుం బా

గుగా నెఱింగిన వాఁడవు కావున నీవు ధన్యుండవు. ధర్మరాజా! నిన్నొకటియడిగెదను. చెప్పుము. ఏమందువేని, నీవు చెప్పినట్లు నానా దుష్కర్మలుం జేసియున్న కతంబున నానా కష్టములుం బొందుచుండెడి యీ పాపజీవులకింక నీనరక బాధలనుండి విముక్తికలుగు టెప్పటికి? అయ్యో! యంతములేని యీకష్టముచు వీరెట్లనుభవించఁగలరో కదా! యని యడిగెను. దండ ధరుఁడాముని మండనుని మాటకు మందస్మిత వదనారవిందుండై యిట్లనియె. దేవరా! బ్రహ్మాయు, విష్ణుఁడును, నింద్రుఁడును, మొదలుగాఁగల వేలుపు పెద్దలు మొరఁబెట్టఁగా వారి మొరనాలకించి లోకంబులు భస్మమును జేయుచువచ్చు కాలకూటమునుం జూచి లోకంబులు సంరక్షించుట కొఱకుఁ బూని యా కాలకూటము నమృతప్రాయముగా నెవ్వాఁడు పానముం జేసెనో, యాగౌరీ వల్లభుఁడును భక్తజన మందారుఁడును దయా సముద్రుఁడును, పరబ్రహ్మ స్వరూపుఁడును పుట్టుటకును వర్ధిల్లుటకునుఁ జచ్చుటకును కారణమైన మాయా మయమగు ప్రపంచమును నిర్మించిన వాఁడునగు శంకరుఁడు, తాను మ్రింగిన విషముయొక్క దుష్టమగు వేఁడిమినిసహింపంజాలక నెపుడుమియునో యానాఁడును, సురలును, సిద్ధులును, సాధ్యులును, విద్యాధరులును, గరుడులును, గంధర్వులును, కిన్నరులునుఁ, గింపురుషులును, యక్షులునునాదిగాఁగలుగు దేవయోనులుచేరి కన్యకను విచారించి వినాయకున కేనాఁడు వివాహముంజేయుదురో యానాఁడును, సూర్యుఁడు పడమటి కొండపై నుదయుమై తూర్పుకొండపై నేనాఁడస్తమించునో, యానాఁడును, నిప్పు వేఁడిలేక చేతఁబట్టుకొనిన యేనాఁడు మంచువలె చల్లఁగానుండునో యానాఁడును, నుప్పునీటి సముద్రములోనీరుఁ ద్రాగిన నేనాఁడు తియ్యగాఁ ద్రాగుటకు యోగ్యముగా నేనాఁడుండునో యానాఁడును, ఏనాఁడు చంద్రుని కాంతి (అనఁగా వెన్నెల) యెండవలె చురుకుఁగలిగి సహింపరాని వేఁడి నేనాఁడుచెందునో యానాఁడును, నిపాపాత్ములకీ నరకబాధల నుండి విముక్తి కలుగును. అనఁగా నిట్టి విపరీత కాలము తటస్థించు దనుక వీరు సకలబాధలు ననుభవించు చుండుదురు, ఎన్నియో ప్రళయములు గలిగినఁ గాని

యింతటి విపరీతములు కలుగ నేరవు. అంతవరకును నిది తప్పునది కాదు. అని యముఁడు చెప్పిన విని ముఖమునఁ జిఱునగవు మొలక లెత్తఁగా కొంతదడ వేమియుం బలుకక సానందుఁడు తనలోఁ దాని ట్లని తలంపఁ దొడంగెను. ఆహా! ఈయమ ధర్మరాజు మాటలు నాకాశ్చర్యముం గొలుపు చున్నవి. ఏమి విచిత్రము? ఇతనికి గొప్ప బుద్ధియున్నట్లు తోఁచదయ్యె. శైవాగమాంత వాసన (అనఁగా శివ సంబంధమైన వేదాంత వివేకము) సుంతయైన నితనికిం గలిగియున్నట్లు గనుపింపదు. కలిగియున్న నీలాగునఁ జెప్పునా? ఇంతకు మున్ని తఁడు వివరించిచెప్పిన తత్త్వవిషయంబు లన్యులకుం జెప్పుటకు మాత్రమే యితఁడు తెలిసికొని యున్నట్లున్నది. దానియందితనికి పరిజ్ఞానమున్న యెడల కర్మకాండకు సంబాధించిన మాటలితఁడేల పలుకుచున్నాఁడు. పరులకు బుద్ధిచెప్పు వారికిఁ గొంచమైన నవివేక ము కలిగియుండక పోదని కొందఱు చెప్పుదురు. అది యితనియందు తథ్యముగాఁ గనుపడుచున్నది. ఎల్లపుడునుఁ, బాప జీవులందెచ్చి వా రిని వివిధ కష్టములుఁబెట్టి యలయించుటయం దలవాటుఁబడినవాఁడు గావున నితనికి మంచి గుణము కలుగదుఁ గాఁబోలు. ప్రేతరూపులకు ప్రభువగు వానికి కర్మలయందుండు వాంఛ, తత్త్వ జ్ఞానమునందు నిలుచునా? పాపములనెడి లెక్కకుమించిన మిక్కిలి గొప్పవగు కొం డలను వజ్రాయుధమువలె ధ్వంసముం జేయునదియు,నజ్ఞానమనెడి కటిక చీకటిని సూర్యుని కాంతివలె పటాపంచలు చేయునదియు, కష్టము లనెడి మహాదట్టమైన మబ్బులను పెనుగాలివలె నెగరఁ జిమ్మునదియు, చావు పుట్టుక లనెడి సంసారసంబంధమగు తాపత్రయమును ఖండించి నిత్యానంద మొసఁగునదియు, సమస్త కోరికలును నిచ్చునదియు నగు మహామంత్రములలో మహామంత్రమై యొప్పు పంచాక్షరీ మం త్రమున్నది గదా! దానిచేఁ దొలంగని పాపమేది గలదు? అట్టి పంచాక్షరినిఁ బఠించినను, విన్ననుఁ నరులకు మరల జన్మము కలదా? పాపములుండునా? ఆమహా మంత్రబలంబుచే వీరి పాపములను పరిహరింపఁ దలంచక, తానివ్విధంబున వీరిని బాధించుచేల? నాకిది మిక్కిలి యాశ్చర్యముగాఁ దోఁచుచున్నది. మహాప్రసిద్ధమును, ను త

మములగు వానిలో నుత్తమోత్తమమైనదియు నగు పంచాక్షరీ మంత్రముం గలిగిన దగుటచే రుద్రాధ్యాయమును, నట్టి రుద్రాధ్యాయముం గలిగిన దగుటవలన నర్ధకాండమును, నర్ధకాండ ప్రధానమైన దగుటం బట్టి యజుర్వేదంబును లోకంబున నెన్నిక కెక్కెను. నాలుగు వేదములయందునుం బంచాక్షరీ మహామంత్రముం గలిగిన దగుటం జేసి యజుర్వేద ముత్తమమైనదని చెప్పంబడియున్నది. తక్కిన వేదములకు యజుర్వేదమే ప్రాణము. ఆపంచాక్షరి, యగస్త్యుండు, మార్కండేయుండు, జాబాలి, కశ్యపుండు, కపిలుండు, విశ్వామిత్రుండు, కణ్వుండు, వసిష్ఠుండు, గర్గుండు, మొదలగు మహా మునీశ్వరులు కొనియాడి జపించునట్టిదియు, దశరథ పుత్త్రుండగు శ్రీరామభద్రునిచే సదా ధ్యానింపంబడినదియు, సమస్తపాపములను, దుఃఖములను, కష్టములనుం బోగొట్టునదియు నైయుండంగా, కటకటా ! ఈదండధరుండు తానామంత్ర ప్రభావ మెఱుంగకుండుట వింతగదా ! ప్రపంచంబున నుత్తమత్త్వమును జెందిన యాపంచాక్షరి యొక్క ప్రభావ మెఱుంగని వానికీ దిక్పాలకపదవి యెట్లు లభించినది? ఆమహా మంత్రముం బఠించియో, లేక వీరిచేం జెప్పించియో, వీరిని నరకముక్తులం జేయరాదా ? ఇతనికాయోచన గలుగకుండుట కేమినిత్తము? ఏమియుందోచకున్నది. యని పెక్కు విధముల నాలోచించి, యమునింజూచి, యోయికృ

## సానందుఁడు యమునితో శివప్రభావము వర్ణించి పలుకుట.

తాంతా ! లోకములో నెట్టి మహాపాపియైనను నొక్కమారు జగద్గురుండైన పరమేశ్వరు రూపచిహ్నమైన శివలింగముపైం బుడిసెడు నీరుంబోసి రెండు మారేడు దళములు వేసిన పక్షమున నట్టివాండు తానుచేసిన సకల పాపముల వలనను విడువంబడి శాశ్వత మగు శివసాయుజ్యము నొంది యానందించు ననియు, నతని వంశమున జన్మించిన వారందఱును పావనులై ముక్తిం జెందుదు రనియుం జెప్పుచుండుట నీపాపాత్ము లెఱుంగరా ! ఏమి ? వీరెప్పుడైన నొకనాండు భక్తిపూర్వకముగాం గాకుండినను విరోధమునైన నీశ్వరలింగముపై వేయుటకొక యుమ్మెత్త పూవుగూడ దొరకక పోయెనా ? యొక గరికపోచ యైనం జిక్కకుండెనా ? యొక జిల్లేడు పూవు కను పడ

దయ్యోనా ? శ్రద్ధయుండికాని, లేకఁగాని, యెట్టైనను పరమేశ్వరునిఁ బూజించియుండిరేని వీరు నీపురమునకు వచ్చి యీబాధల ననుభవింపరుకదా ! వీరికాలాగున బుద్ధికలుగక పోవుట యాశ్చర్యముగా నున్నది. అయ్యో ! యొకింత భస్మమైనను, ముఖంబున నలందరైరి కాఁబోలు. అట్లు విభూతిఁ బూసికొని యొకమారు శివునిఁ దలంచి యున్నను, నిట్టి కష్టములు సంభవింప కుండుదురు. భస్మమాహాత్మ్యము కడుం గొప్పదని రుద్రోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది. యాభస్మము సర్వేశ్వరుని వీర్యమని చెప్పుదురు. * అట్లు శివునివలన సంభవించిన భస్మము నెవఁడు తననుదుట ధరించునో, వాఁడుకల్లు ద్రాగినట్టియు, గురుపత్నితోఁ గలిసినట్టియు, మహాపాపములైననుం దొలంగి నిర్మలుఁడగుచున్నాఁడు. ఇట్టితలంపుగూడ వీరికి లేకపోయెనుఁకదా! శివునిఁ బూజింపకున్నను, భస్మము నలందుకొనకున్నను, నొకరుద్రాక్షమైనను గంఠంబున ధరింపఁగూడదా ? ఆలాగునఁ జేసియుండిన నిట్టి ఘోరనరకబాధ లేలఁ గలుగును ? తాముజీవించియున్న కాలమున నెన్నఁడుగాని, యేకారణమువలననైనను, శివనామోచ్చారణంజేయరైరి కాఁబోలు. చేసియుండిన నీదుఃఖములు వాటిల్లునా ? శివశివ యన్న మాత్రముననే, కోటిమంది బ్రాహ్మణులఁ జంపిన దోషమును, కోటిమంది పరస్త్రీలతోఁ బొందిన కలుషంబును, కోటిగోహత్యలొనరించిన పాపంబును తత్క్షణంబునఁ దొలంగి పోవునని పెద్దలు చెప్పుదురు. వీరికాతలంపు గలుగ కుండుటకేమి కారణమో కదా ! యోచింపఁగా నెద్దియుం దోఁచకున్నది. లోకంబున నెవ్వఁడుగాని యొక శివరాత్రినాఁ డుపవాసముండి సర్వేశ్వరునిఁ ధ్యానించుచుఁ బూజించి యారాత్రి జాగరణ మొనరించిన పక్షమున నట్టివాఁడు తప్పక శివస్వరూపుఁడై శివుని యందైక్య మగునని మహామునులు ప్రశంసించి చెప్పుదురు. వీరియం దొకనికైనను నట్టి మంచిబుద్ధి యేల కలుగ దయ్యెనో, ఒకనాఁడైనను ప్రదోషకాలమున (సంధెవేళ)

* ఈ విషయమును గురించి శివరహస్య ఖండమునందు విశేషముగా వివరింపఁబడియున్నది. యీ గ్రంథము వెల రు. 2-8-0 లు. దానిం దెప్పించి చూచిన వారికి భక్తితత్త్వము బాగుగా బోధ కాఁగలదు.







(౨౨౨-వ పుట.) నారదుఁడు యమునితో శివుని ప్రభావము
వర్ణించి పలుకుట.

సోమవారమునాఁ డొక్కప్రొద్దుండి సర్వేశ్వరునిఁ బూజింప రాదా! ఆలాగునఁజేసి యుండిరేని యొకదినం బటులఁజేసిన పుణ్యంబు చేతనే సకలదుఃఖములును పాపములునుఁదొలంగి, శివసాయుజ్యముఁ బొంది యుండుదురుకదా! ఇవి యన్నియుఁ జేయకున్న నుండిరి. కాని యరుణాచలనాథుని మానసముననైనఁ దలఁపరాదా? ఎవఁ డరుణాచల మరుణాచలమనితనలో నా యరుణాచలమును ధ్యానించునో వాఁడు నిత్యమైన శివసాయుజ్యమ్ముం జెందునని పురాణము లుద్ఘోషించుచుండగా వీరి కాబుద్ధికలుగక పోవనేల? శ్రీమచ్చిదంబరేశ్వరుని సందర్శించిన వారును, గోకర్ణ యాత్రం గావించిన వారును మిక్కిలి యుత్తమంబైన కాశికిం బోయి విశ్వేశ్వరునిం బూజించి శ్రీశైలమునకుఁ జని మల్లికార్జునుని సేవించిన వారు శివస్వరూపులగుదురని తెలిసినవారు చెప్పుట వీరు విని యుండగలేదా? వీరాలాగున నేలఁ జేయరైరి? నూరుకోట్ల గోవులును, నూరుకోట్ల గుఱ్ఱములును, నూరుకోట్ల గజంబులును, మేరుపర్వత మంతటి బంగారమును, యోగ్యులగు బ్రాహ్మణులకు దానముంజేసిన నెంతిపుణ్యము గలుగునో యంతకు రెండంతల పుణ్యమొకమారు శివ లింగమును దర్శించి శివుని ధ్యానించినవారు పొందుదురు. ఇట్లు వేదములును, శాస్త్రములును, పురాణములునుఁ జెప్పుచున్నవికదా! వీరెన్నఁడును నట్లుచేయక పోవుటయేల? యోశమనా! వీరిని పంచాక్షరీ మంత్ర ప్రభావము వలనను, శివధ్యాన మహత్త్వము వలననుం బవిత్రులై నరక బాధలనుండి విముక్తులగులాగునఁ జేయకూడదా? నీవటుల నొనరింపక యోగ్యమైన యాతలంపును మాని జీవుల నివ్విధంబున నరక బాధలచే నలయించుట కేలఁ బూనితివి? ఇది ధర్మమా? యొకవేళ నీవు న్యాయమని తలంపుదువేమో కాని, నాబుద్ధికి యుక్తముగాఁ దోఁచకున్నది. అయ్యో! వెన్నఁబెట్టుకొని నేతికల్లాడిన లాగున, సర్వపాపములను దొలఁగించి పావనులం జేయఁజాలిన పరమేశ్వరునిఁ దలంచి బాధలవలన ముక్తులు గాఁజాలక వీరు నీచేఁజిక్కి యాతనలనుభవించుట, మిక్కిలి ఘోరముగానున్నది అన్యాయ మన్యాయము. ఇప్పటికైనను, పరమేశ్వరుని స్మరించునట్లు చేసియు, పంచాక్షరిని జపించునట్లు నియ

మఱియు, దీనులగు నీజీవులను నరక ముక్తులం జేయుట యుక్తము. అదియే నీధర్మపాలనకుం గుఱుతు. నీవు సకల ధర్మములనుం దెలిసినవాఁడవు తత్త్వవేత్తవు. పుణ్యస్వరూపుఁడవు. నీవే యీలాగు పేక్షించిన నింక వీరినిం గడతేర్చువా రెవ్వరున్నారు ? దండధరా ! బాగుగా యోచింపుము. అని చెప్పెను. సానందుని మాటలన్నియుం జక్కఁగా విని యతనికి యమధర్మరా జిట్లనియె. అయ్యా ! మీరు

యముఁడు సానందమునికి సమాధానముఁ జెప్పుట.

చెప్పెడి మాటలన్నియు, సత్యములును, శాస్త్రసమ్మతములు నైయున్నవి. మీరడిగెడి ప్రశ్నలు కడుంగడు యోగ్యములైనవి. కాని వానికి సమాధానము చెప్పుట కష్టము. ఏలననిన, నేనధర్మముగాఁ బ్రవర్తించియున్న పక్షమున మీప్రశ్నలకు తగిన యుత్తరముం జెప్ప వలసియుండును. నేను ధర్మమువిడిచి యేకార్యముం జేయ లేదు. సర్వము నెఱింగియుండిన మీ రివ్విధమున నన్నడిగి నపుడు నేను మీకేమి బదులు చెప్పఁగలను ? యోచింపుఁడు ? ఈ పాపాత్ములయందొక లేశముగాని పుణ్యము కలుగదు వీరి పురాకృత దోషంబు వలన వీరికి మంచిబుద్ధి యేమిచేసినను జెప్పినను గలుగఁబోదు. ఇట్లే బాధలొంది మరల భూమియందు జన్మించవలయును ఇది వీరికి విధి. నేనేమి సేయుదును ? వారువారు చేసిన కర్మముల ఫలమును వారువా రనుభవించు చున్నారు. అనుభవించకఁ దప్పునా ? ధర్మవిరుద్ధముగా నేను వీరినివిడిచిపెట్టిన పక్షమున మీరే నన్నునిందింతురు కదా! సుంత యేనియు వీరియందు పుణ్యము కనుపట్టిన, నది యాధారముగాఁ గొని మన్నించుట యుక్తము. వీరియం దట్టి దేదియుం గలుగదు మునివరా! నేనంత తెలియని వాఁడనుఁగాను మున్ను శ్వేతుఁడనువాఁడు తన యుంపుడుఁ గత్తెకుం బువ్వులు తెచ్చుచుండఁగా, గాలికొక పూవెగిరి పోయినఁ గని శివార్పణమనఁగాఁ దత్ఫలంబున మరణించి నపుడు శివసాయుజ్యంబుం జెందుట నేనెఱుంగుదును. అంత మాత్రమైనను, వీరుచేసి యుండ లేదు నేను వీరు పడుకష్టములకెట్లు బాధ్యుఁడను కాఁగలను ? మీరే పలుకుండనియెను. యముని మాటలు విన్నపుడు సానందుఁ డవి యుక్తముగానేయున్నవని తలంచి,

మారాడుటకుం దోఁచక కొంత దడవు యోచించుచుండి యో పుణ్యమూర్తివైన దండపాణీ ! నీవిపుడు చెప్పిన శ్వేతుని చరిత్రం బెట్టిది ? దానిని వినిపింపుమని యడిగెను. శమనుఁ డతని కాకథనుం జెప్పఁ దొడంగి యిట్లనియెను. ఋషిశ్రేష్ఠా ! యాకథ వినుము.

యముఁడు సానందునకు శ్వేతుఁడను బ్రాహ్మణకుమారునికథ నెఱింగించుట

భూలోకంబున మిక్కిలి ప్రసిద్ధి వహించినదియు, సకలైశ్వర్యములునుఁ గలిగి యొప్పునదియు, నగు 'కాంపిల్య' మను పట్టణం బొకటి కలదు. ఆపురంబున, వేదవేదాంత శాస్త్రము లెఱింగినవాఁడును. సద్గుణములు గలవాఁడును, సమస్త ధర్మములునుం దెలిసినవాఁడును, నిత్య నైమిత్తిక నిష్ఠాగరిష్ఠుఁడును, యజ్ఞయాగము లనేకములుచేసి ప్రసిద్ధినొందిన వాఁడును, రాజసన్మానముఁ గలవాఁడును, సిరియు, సంపదయుం గలవాఁడును, మిక్కిలి తేజస్సు గలవాఁడును నగు యజ్ఞదత్తుఁడను పేరుఁగల బ్రాహ్మణుం డొకండు గలఁడు. శ్రీమహాలక్ష్మి సమానురాలును, రూపము, మంచి గుణములు, సంతోషము, భర్తయందను రాగము, నతిథుల యందును, సభ్యాగతుల యందునుఁ బ్రియమునుం గలిగినదియు గొప్పవంశమునం బుట్టినదియునగు నతని భార్యపేరు విమల. ఆపే రామె కెల్లవిధములం దగియుండెను అట్టి యుత్తమ దంపతులగు విమలా యజ్ఞదత్తులు తా మొండొరులు మిక్కిలి యనురాగముఁ గలవారై కొఱంతలేని భోగముల ననుభవించుచు సుఖముగా కాలముఁ గడపుచుండిరి. ఇట్లు కొన్నినాళ్లు గడచిన పిమ్మట విమల గర్భవతియై, నవమాసములు నిండినంతట నొక్క కుమారునింగనెను. తనకు పుత్త్రుండు కలిగినందుచే యజ్ఞదత్తుఁడు మిగుల సంతోషమునుఁ దృప్తియుం జెందినవాఁడై జాతకర్మ పుణ్యాహవాచనాది క్రియలు నిర్వర్తించి యాశిశువునకు శ్వేతుఁడని నామకరణమొనరించెను. అదిమొదలు భార్యాభర్త లిరువురును, యాశిశువును మిక్కిలి గారాబముతో పెంచుచు శిశుచేష్టలంగని యానందము ననుభవించుచుండిరి. ఆబాలకుండు దినదిన ప్రవర్ధమానుఁడై నంతట యజ్ఞదత్తుఁడు కుమారున కుపనయనముం గావించి యోగ్యుఁడగు నుపాధ్యాయునియొద్ద విద్యాభ్యాసమునకుం బనిచెను. కాని యాబా

లుఁడు క్రమముగా బడికిఁ బోక యాకతాయలతోఁ గూడి యాటలాడుచు దుష్టులతో సహవాసముం జేయుచు, తానును ననేక దుష్టకార్యములం జేయుట కారంభించెను. ఉదయమున లేచి స్నానముం జేయుటయు, వేదముం జెప్పుకొనుట, యనుష్ఠాన మొనరించుట శాస్త్రములు పఠించుట మొదలగు కార్యము లతనికి మిక్కిలి కంటగింపుగానుండును. ఇట్లు కొంతకాలము జరిగిన నతఁడు యవ్వనవంతుఁడై దుర్మార్గులంగూడి, జారత్వంబున నభిరుచిమించి వారకాంతల సహవాసంబుమఱిగి యెల్లపుడును వారియిండ్లం దిరుగుచు, జూదములాడువారితోఁ జేరి పందెంబులొడ్డి జూదములాడుచు, వేళకింటికివచ్చి తల్లితో నిచ్చకపు ముచ్చటలంజెప్పి భోజనముంజేసి, పోవునపు డింటగలసొమ్ములు, బంగారు, విత్తము, రత్నములు, వస్తువులు, వేయేల నేదిదొరికిన నది కొనిపోయి వారకాంతల కిచ్చియు. జూదమాడియుఁ, బోఁగొట్టుచుండఁ దొడఁగెను. వాని చెడునడవడియు నింటంగల సొమ్ముఁ గొల్లఁబెట్టుచుండుటయుం జక్కఁగా నెఱింగియుఁ దల్లియగు విమల, వానియందుఁ దనకుంగల ప్రేమాధిక్యతచే నేమియు ననఁజాలక మంచిమాటలతో ననేక విధములుగా దుర్మార్గుల సహవాసమును దుష్టకార్యములు సేయుటయు మానుకొమ్మనియుఁ, దండ్రి యెఱింగినఁ గోపించి దండించు ననియుఁ, బెక్కుమారులు బోధించు చుండును. కాని యామె మాటలనుఁ బెడచెవింబెట్టి విచ్చలవిడిగా ప్రవర్తించుచుండెను. ఈవర్తమానమును భర్తతోఁ జెప్పినఁ గుమారు నేమనునో, యెట్లుదండించునోయని భయపడి విమల యజ్ఞదత్తునకుం జెప్పినది కాదు. అతఁడు కుమారుఁ డెచ్చటికిం బోయెనని భార్య నడిగినపుడెల్ల నామె, వాఁడు బడికిఁబోయెననియు. పాఠములు వల్లించుటకు సహపాఠకుల యిండ్లకుంబోయి యున్నాఁడనియుం జెప్పి భర్తను మరపించు చుండెను. ఇట్లు కొంతకాలంబు జరిగినంతట విమల యొకనాఁడు కుమారుఁడు భోజనమునకై వచ్చినప్పుడు రహస్యముగా వానింజేరి, నాయనా! మీతండ్రి ప్రతిదినంబును నన్నడుగు చున్నాఁడు. నేనులేని పోని కల్లమాటలు చెప్పి యతని మరిపించు చున్నాను, ఇంక నెన్నాళ్ళిట్లు చెప్పఁగలను? మీతండ్రి మిక్కిలి కోపస్వభావము

గలవాడనుట నీవెఱుఁగని వాఁడవు కావు నీప్రవర్తన మతఁడు తెలిసికొనియెనేని మన కిరువురకును బ్రాణము మీఁదికి వచ్చుట నిక్కము. రాజ సన్మానముఁగల మీయయ్య తలంచిన నెంతకార్యము నైనను జేయఁగలఁడు. నీవు బుద్ధి తెలియని పసికూనవు కావు. కావున నామాటలను చక్కఁగా విని యోచించి, కులము, శీలము, ధనము, నారోగ్యము, నశింపఁజేయు వేశ్యా సంబంధము నింక విడువుము, దుష్టులలో సహవాసముం జేయుటను మానుకొనుము. జూదంబాడుటను వదలు కొనుము. మీజనకున కగౌరవముం గలిగించు పనులను తలంపకుము. కడచినంతవఱకుఁ గడచినదిగాని, నేఁడు మొదలు, మంచి నడవడిం గలవాఁడవై ప్రవర్తింపుము. జనకునివలె గొప్పతనము వహించుటకుం బ్రయత్నింపుము. నీవును నపుడపుడుఁ దండ్రితోఁగూడి రాజసభకుం బోయి యచ్చటివారి పరిచయమును గలిగించుకొని ప్రసిద్ధినొందుము. నేను నీమేలుఁగోరి చెప్పెడి దానను గాని, నిన్నుఁ జెడఁజూచు దానను కాను కుమారా! నామాటల యందును, నాయందును, బాగుగా ప్రియమునుంచి నేను చెప్పిన లాగున వర్తించితివేని, యేహానియుం గలుగదు గొప్ప తనమును, సత్కీర్తియు సంపాదింపుము. మీతండ్రివలె నీవును ప్రసిద్ధుఁడవై యుంటివేని నేను మిక్కిలి యానందింతును. అట్టి సంతోషమును నాకుం గలిగింపుము. అని యనేకరీతుల ప్రబోధించెను. కాని, యామూర్ఖుఁడగు దుష్టుఁడామె సదుపదేశముల నాదరించిన వాఁడుకాఁడు. ఆమె మాటలన్నియు వానికిఁ గర్ణకఠోరములుగా తోఁచెను. వాఁడు శీఘ్రముగా భోజనముంజేసి తడవుండిన నింకనుం దల్లి చెప్పెడి మాటలను వినవలసివచ్చునని యెంచి యటునిటుం జూచి దొరికిన వస్తువులు దాచికొని వాఁడుక ప్రకారముగా బయలు వెడలి బిరబిర సంగడీకాండ్రనుఁ జేరఁ బోయెను. ఇంక తల్లి యేమి చేయఁగలదు? కుమారుని దుశ్శీలమునకుం జింతించుచు మిన్నకుండెను. ఆమరునాఁ డుదయంబున వాఁడుక ప్రకారము యజ్ఞదత్తుఁడు సమీపంబున నుండు నదికిం బోయి స్నానముం జేసి, ధౌత వస్త్రములు ధరించి ప్రాత రుచితానుష్ఠాన క్రియలు నిర్వర్తించి, హోమంబునకు సమిధలును, దర్భలును, పూజకుంబు

పువ్వులును, విస్తళ్లకుం దగిన యాకులును నాయేటి గట్టునం దిరిగి సంపాదించుకొని, మరలి యింటికి వచ్చుచుండెను. ఆసమయంబున నేటివంకకుం బోవుచున్న యొక మనుష్యుండు యజ్ఞదత్తున కెదురయ్యెను. అమనుష్యుని వ్రేలియందు వజ్రముం దాపిన యొకయుంగరము ధగధగ మెఱయుచుండెను. దాని ప్రకాశమున కబ్బురపడి యా మనుష్యునింబిలిచి, నాయనా! నీవీ యుంగరము నెచటఁ జేయించితివి? దీనివెలయెంత? ఇది కడుసొబగుగా యున్నది సుమీ! యని యడిగెను. దానికి వాఁడు యజ్ఞదత్తునింగని, యోస్వామీ! దీనిని నేను చేయించలేదు ఇదినాకు పందెమున గెలువఁబడి లభించినది. మీ కుమారుఁడగు శ్వేతుఁడు నిన్న దీనిని పన్నిదముఁజేసి నాతో జూదంబాడి యోడిపోయెను. నాతో సమానముగా జూదమాడుచుండువా రాతనివలన నెన్నెన్నియో గొప్పగొప్ప భూషణము లన్నియుం బ్రతిదినంబును గెలుచుకొని పుచ్చుకొనుచున్నారు నాప్రాప్తమింతమాత్రమే! కావున నాకిది యొకటి మాత్రము లభించినది. మీయింట నెన్నిసొమ్ము లున్నవోగాని, యతఁడు తెచ్చి వేశ్యలకిచ్చినవి పోగా మిగిలినవి ప్రతిదినమును నొకటియో రెండో జూదమునఁబెట్టి కోలుపోవుచున్నాఁడు. ఈవృత్తాంతము మీ రెఱుఁగరా? తెలిసియే మిన్నకున్నారు కాఁబోలునని మేమందఱమును నెంచుచున్నాము. ఏవేశ్యను చూచినను మీయింటి సొమ్ము ధరింపనిది యొకటియైనను నీపురంబున లేదే! సోమయాజిగారూ! ఇది యుంగరము దొరికిన వృత్తాంతమని చెప్పి వాఁడు బిరబిరఁ దనత్రోవంబట్టి పోయెను. ఈమాటలు విన్నతోడనే యజ్ఞదత్తునకుం గలిగిన యాశ్చర్యమునకును, దుఃఖమునకునుఁ, గోపమునకును మేర లేదయ్యెను. యతనికి పట్టరాని యాగ్రహము జనించి యొడలు పదరఁదొడంగెను ముఖంబునుఁ గన్నులును నెఱ్ఱబాఱెను, దేహము చెమటఁబట్టెను, నడుచుటలో పదంబులు తడఁబడఁ దొడఁగెను. ఇట్టిలక్షణములు గలవాఁడై కనుబొమలు ముడివడఁ దలయూఁచుచుఁ, బెదవిం గొరుకుకొనుచు, చాల వేగంబున నిజమందిరంబుఁ బ్రవేశించి, కాళ్లుకడుగుకొని యుతికి జేతంగొని వచ్చిన తడిధోవతులు దండెముపైఁ దగిలించి, తనగోఁగల

రోషంబును దుఃఖమును బయలు పడనీయక భార్యయగు విమలనుఁ బిలిచి యిట్లనియె ఏమే; యోసీ! ఇటురమ్ము. ఆలస్యముఁ సేయకుము. వేగముగ రమ్ము. నేను రాజుగారిచే బహుమతిఁగాఁ గొని, తెచ్చియిం

యజ్ఞదత్తుఁడు భార్యపైఁ గోపించి యిలు వెళ్ల పడఁచుట.

ట నుంచియుండిన వజ్రపు టుంగర మెచ్చట నున్నది? దానిని గొని రమ్ము, నా కుంగరముతో నిపుడొక పనికలిగినది, శీఘ్రముగాఁ దెమ్ము. నేనా యుంగరమునుఁ గైకొని కాని, దేవపూజఁగూడఁ జేయఁ బూనను. అది యగత్యమైనది. యనియడిగెను. భర్తమాటలు వినఁగానే విమలకు దిగులు పుట్టెను. ఎందువల్లనన, నాయుంగరముం గొని పోయి కుమారుఁడు కోలు పుచ్చిన విషయమామె యెఱుంగును. ఇపుడాయుంగరముం దెమ్మని యజ్ఞదత్తుఁడు కోరుచున్నాఁడు. తానెచట నుండి తేఁగలదు? తెచ్చియివ్వకున్న నెట్లు? అతఁడు కడుఁ గోపదారి. ముందు వెనుక నాలోచించు వాఁడు కాఁడు. ఇట్టి సందర్భములలో నతనికి శాంతమనునది మచ్చునకైనఁ గలుగదు. అతని చిత్తవృత్తి యంతయు నామె యెఱుఁగును. ఏమి చెప్పుటకునుఁ దోఁచలేదు. యోచన కుదరలేదు. గుండియ లదరఁదొడంగెను. ఒడలు వదరసాగెను. ఇట్టిలక్షణములతో తత్తఱపడుచు, మఱిమఱియుం బలుమారు వేగిరించుచున్న భర్తనుజూచి యెట్లో యొకింత ధైర్యముఁ బూని, ఏమీ! యంత యవసరమా! ఏమి మునిఁగి పోయినది? ఉంగరముతో నిపుడేమి పని? మీరు సమయాసమయము లాలోచింపరు. కుతప కాలము సమీపించినది. అభ్యాగతులు వచ్చి భోజన మునకుఁ గాచుకొని యున్నవారు. ఇంత వరకును, దేవతార్చనఁ జేయలేదు. మఱియు నగ్ని హోత్రముల మాటయేఁ దలంచకున్నారు. ఈపనులన్నియు నట్టె యుండఁగా స్నానముం జేసి వచ్చినతోడనే యుంగర ముంగరమని కలవరించుచున్నారు. మీకు వెఱ్ఱి పట్టినట్లున్నది. మీయుంగరము పరుగెత్తి పోవదు. కాని శీఘ్రముగా లేచి దేవపూజయు, నౌపాసన హోమమును, పితృతర్పణమును, బ్రహ్మయజ్ఞము, మొదలగు క్రియలు పూర్తిఁ జేయుండి యతిథులును మీరును భోజనముగావింపుఁడు. ఇంకఁ బడికిఁ

బోయియున్న మన పిన్నవాఁ డాకలిచే నకనకలాడుచు నింటికివచ్చె ను. వాఁడు వచ్చువేళ కూడ సమీపించినది. ఇపుడు నేను మడుగు గట్టియున్నాను. మైలయందుండు మీయుంగరము నిపుడే తెచ్చి యొసంగుటకు వలనుకాదు. మాటలు చాలించి మీపనులు నెరవే ర్చుఁడు. అని చెప్పెను. భార్యయగు విమల పలికిన మాటలు వినఁ గానే యజ్ఞదత్తునకుం గలిగిన కోపమింతింత యని చెప్పుటకు సాధ్య ము గాదయ్యెను. నిజము నెఱింగియున్న యతనికి భార్యచెప్పిన కపట పుమాటలు రుచించునా? అతఁ డపుడే లేచి తటాలున భార్యగొంతుఁ గోయవలెనని యుద్దేశించెను. కాని ధర్మశాస్త్రము లెఱింగిన విద్వాంసుఁ డగుటచే నటుల జేసినచో స్త్రీహత్య సంప్రాప్తించునని తలంచి యాతలంపు నుడిగి యామెంగని, భయంకరముగానార్చి, యదలించి, ఓసి దుర్మార్గురాలా! మాయలాఁడీ! యసత్యములు పలుకుదానా! నీవాయుంగరము నెచట నుండి తెచ్చెదవు? అది యెచటనున్నది? నిన్ను లోఁబఱచుకొని, పాపాత్ముఁడును, కులనాశ కుఁడును, నామమాత్ర బ్రాహ్మణుఁడును నగు నీకుమారుఁ డా యుం గరమును, నది మాత్రమే కాక యింటగల నగలన్నిటినింగొని పోయి వేశ్యల కొసఁగియు, జూదము లాడియుం గోలుపుచ్చినదియు, నిల్లుగుల్లఁజేసినదియుఁ జక్కఁగా నేను తెలుసుకొంటిని. ఈవృత్తాంత మును నేనెఱుంగనని కాఁబోలును మైలయందున్నయది యని చెప్పి తివి. మైలపడిన పడితివి కాని, ఏదీ! తెమ్ము చూతము. కపటాత్మురాలా! కుమారునకు లోఁబడి నన్నెన్ని దినములు మోసపుచ్చఁగలవు? కొన్ని నాళ్లకైన నేనుమీతంత్రములం దెలిసికొందుననియు, నటుమీఁద నిక్క ట్టు సంభవించుననియుం దలంపవైతివా? నేనపుడడిగినను, పారశా లకుఁ బోయెనని వేశ్యల యిండ్లలో వేశ్యాలోలుఁడై పడియుండెడి యాదురాత్ముని నడవడిక నాతోఁ జెప్పక కప్పిపెట్టితివి. మొదటనే నాతోఁ జెప్పియున్న నీలాగు వాఁడు దుర్వృత్తి నవలంబించుటయు, నింటంగల సొమ్ము వమ్ముగాఁ దారవోయుటయు, నలుగురిలో పరువుఁ గోలుపోవుటయుం గలుగునా! యపు డందునకుం దగిన ప్రతీకార ములను యోచించి జాగరూకతఁ గలిగి మెలంగకుండుదునా? వాఁ

డానరించు దుష్కార్యమునకును గలిగిన సొమ్మంతయు ప్రయత్నమై పేదవాఁడ నగుటకును, నీవే కారణము. ఛీ! ఛీ! నీముఖంబుఁ జూడ రాగు నీవు మహాపాపివి. కపటాత్మురాలవు. నీతోఁ గూడి కాపురముఁ జేయుట మహా యుపద్రవములకు హేతువగును. నీవింక నాయింట నుండఁ జనదు. నీవును నీముద్దు కుమారుఁడైన యాదుష్టుఁడును నెట కైన జని జీవింపుఁడు. ఇంక నొకక్షణమైన నిలువఁగూడదని, యాబిడ యెన్ని విధములఁ బ్రార్థించినను, ఇరుగు పొరుగు వారా సందడి నెఱిఁగి వచ్చి విషయముం దెలిసికొని, యామె నీమారు మన్నింపుఁ డని యెంతఁగాఁ జెప్పినను వినక మూర్ఖపు పట్టు బట్టి రెండు జాముల కాలమున మిడిమిడి యెండ కాయుచుండఁగా మెడఁబట్టి యింటనుండి వెలుపటికి గెంటివైచి తలుపుమూసి కొనియెను. ఇంకేమి గతిగలదు ? ఆయమ యామధ్యాహ్న కాలమున నిరాహారయై యేడ్పుచుం జేయునది లేక, యావృత్తాంతంబుం జెప్పుటకు కుమా రుని నగరంబునఁగల వీథులన్నిఁటి యందును వెదకెను. కాని యా పి శ్యాలోలుఁ డెచ్చట దేసిచెంతఁ బరుండి యుండెనో యామెకుఁ గనఁ బడఁడయ్యెను. ఆమె కొందఱి నతనిజాడ నడిగెను. కాని వారు మాకుం దెలియ దని చెప్పిపోయిరి. అంత నచ్చటఁ దన నెఱింగిన మనుష్యుఁ డొక్కరుఁడు కనుపించిన వానితో నడిచిన వృత్తాంతంబుం దెలిపి యావిషయంబునుఁ దన కుమారునకుం జెప్పవలసిన దనియుఁ దాను తన పుట్టినింటికిం బోయెదననియుం బలికి బయలుదేరి, యా పురంబున కొక యామడ దూరంబుననుండు నొక గ్రామంబునందలి తన పుట్టినింటికిం జని జరిగిన కథనంతయు వారలకుం జెప్పి, తాను చెప్పి వచ్చిన మనుష్యుని వలన విషయముం దెలుసుకొని కుమారుండుఁ గూడ నచటికి రాఁగలఁడని తలంచి యతనిరాక నిరీక్షించుచు నచ్చటనే యుండెను. విమల కుమారుడగు శ్వేతుఁడు తన తల్లి చెప్పి పోయిన మనుష్యునివలన యావద్వృత్తాంతమును నాలకించి దిగులునుఁ జెంది, దుఃఖించి, అయ్యో ! దైవమా ! నేనే నేరముఁ జేసినను గోపింపక యత్యంతంబగు ప్రేమఁగలదై గృహంబున కేవేళకుఁ బోయినను, నాకన్న పానములఁ జక్కగా విచారించు నాప్రియమైన తల్లి కెంత

దుర్దశ సంప్రాప్తించినది ? ఆమె కింతటి కష్టము వచ్చినది నానిమిత్తముననే కదా ! ఇట్టిసమయమున నేనేమి చేయఁగలను ? ఇంటికిఁ బోవలెననిన కాళ్లు రాకున్నవి. పోయిన నన్ను విచారించు వారెవ్వరున్నారు? ఎక్కడికి పోవుదును?ఎవరి నన్నమిడుమండని యడుగుదును? ఇది వరకు నెవ్వరిని గాని నేనెద్దియు నడిగి యెఱుఁగనే ! ఇంక నాకేమిగతి ? పరదేశినై పోవలసిన కాలము తటస్థించెనే! నాతల్లి యున్నచోటికిం బోదునన్న,దుర్వ్యాపారముం జేసి, యున్న విత్తమును గొల్లఁబెట్టి తుదకు చెడి మాపంచకు వచ్చినాఁడని చులకనఁగాఁ జూచినా మాతా మహాదులు నన్ను నిందింపఁరా ? వారేమి చెప్పినను వినుచు, కడుపు కూటికై సిగ్గు పీడి వారింట నుండుట యుక్తమా ? ఇచ్చటనే యెందైన భోజనముచేసి నేను ప్రేమించిన వేశ్యల యిండ్లఁ బరుండుచుం గాలముఁ గడుపుదు ననినచో, ధనమును సొమ్ములుం దెమ్మనియు నాప్రకారము తేఁజాలవేని యింక మాయిండ్లకు రావలదనియుం గఠినముగాఁ జెప్పి యా వారకాంతలు నన్ను నిరాకరించిరి. వారికిచ్చుటకు నావద్ద నేమియులేదు. ఇంటికిం బోయి దొంగిలియో,మోసపుచ్చియో,యెట్లైన నేదేని యొకవస్తువుం గొనివచ్చి యిచ్చి, యామచ్చకంటులకుం బ్రియంబుఁ గలుగునట్లు చేయఁ దలంచిన, నిపుడింటికిం బోవుటకే యాటంక మేర్పడినది. నాతండ్రి మిక్కిలి కోపిష్ఠుఁడు. నాయందు చాల నసూయం జెంది యున్నాఁడు. ఈతరుణంబున నేనింటికిం జనిన, నతఁడు మండిపడి, పూర్ణమగు రాజసమ్మానమును గలవాఁడు కావున, రాజుగారితోఁ జెప్పి నన్ను దండింపఁజేయును అతని మాట రాజుగారివద్దఁ జెల్లుఁబడిఁ గలిగియున్నందున నెంతపని నైనను జేయించును ఇంకనింటికిఁ బోవుటెలాగు ? ఉన్నంత వరకును ముందు వెనుక యోచింపక నగలుగాను, డబ్బుగను, వస్త్రములు గను, కోరినవస్తువులుగను, భోగము పడుచులను దారఁబోసితిని. ఇపుడు నావద్ద నిచ్చుటకేమియు లేకుండుటఁ బట్టి యావిషయం బెఱిఁగి వేశ్యలు నన్ను ధనముం దెమ్మనియు, కాదేని పొమ్మనియుం జెప్పిరి. ఎంత కష్టకాలము సంప్రాప్తించినది ? చీ ! చీ ! పాడుబ్రతుకు. ఈబ్రతుకునకన్నఁ జచ్చుట యుక్త

మము, కాని యటులఁ జేయుటకు నామనం బొల్లకున్నది. నాస్థితి యిప్పటి కింతకు వచ్చినది. ఇంక నేయేకష్టముల ననుభవింపవలసియున్నదో! దైవమునకే యెరుక. ఇంటికిఁ బోవుటకూడదు. మాతామహుల గృహంబున కరుగుట లజ్జాకరము. యెందేనియు దూరముగా నుండు దేశమునకుం బోయి జీవించుట యుక్తముగాఁ దోఁచుచున్నది. అంతకు మించిన మంచియోచన యేదియుం దోఁచలేదు. అని నానావిధములఁ జింతించి మిక్కుటమైన యాకలి బాధకు తాళజాలక సోలుచు, దైన్యమున, నేను చదివి పండితుఁడనై, యుండిన నాతండ్రి వలె గొప్పతనమును సంపాదించి కీర్తివంతుఁడనై యుండుదునుకదా! బుద్ధిచెడి చదువక నాకతాయల సహవాసముం జేసిన ఫలంబిపుడు నాకనుభవమునకు వచ్చినది. ఈయూరిలో నేను విత్తముఁ గలవాఁడననియు, మంచివాఁడ ననియు, గౌరవ వంతుఁడ ననియు, వేశ్యలందఱును నన్నుఁ గొప్పగాఁ దలంచుచుండిరి. నేఁడిట్టి హీనదశ సంప్రాప్తించెనని తెలిసినంత వారు నన్ను పరిహాసింతురు. కావున నిచ్చోట నుండరాదు. మఱి యెందేనియుం బోవుట లగ్గు. అని నిశ్చయించి యన్యుల కెరుకపడక పట్టణంబు వెలువడి, దక్షిణ దిశాభిముఖుఁడై రెండామడల దూరము పోయి, పెల్లగు నెండకాఁక సోఁకుటం జేసి సొమ్మసిల్లి నడుచుటకు శక్తిలేక యాకటిచిచ్చునఁ దేఁకువఁదప్పియే, మైన నయ్యెనని. యచట దట్టమగు కొమ్మలు నారులును గలిగిన గొప్పదగు మఱ్ఱిచెట్టు కనుపించిన చల్లగాయుండు దాని నీడయందు కొంతసేపు విశ్రమించి పోవఁదలంచి జేరంజని యచటఁ గూర్చుండెను. అట్లు కూర్చుండినపు డతని మనస్సున నెన్నెన్నియో యోచనలు

—శ్వేతుఁడు తన దుర్దశం దలఁచి చింతించుట—

పొడకట్ట నారంభించెను. తాననుభవించిన సుఖంబులును, తల్లి తన పట్లఁ గనపఱచు ప్రేమయు, తానెన్ని తప్పులు చేసినను కోపింపక యామె యింటికి పోయినపుడు భక్ష్యములు, పాలు, పెరుగు, నేయి, రుచికరములైన కూరలు మొదలగు వానితోఁ బెట్టు భోజనమును, నామెకుతనయందుఁ గలిగియున్న యాదరమును నతనికిఁ దలఁపునకువచ్చెను. అవియన్నియుం దలంచి యతఁడు మిక్కిలి దుఃఖా

క్రాంతుఁడై, అయ్యో! నన్నువ్విధంబున నాదరించి యన్నపానములఁ దృప్తి నొందించు వారింక నెవ్వరున్నారు? ఎంతసుఖము ననుభవించితినో, యెంత సంతోషము నొందియుంటినో, యంతకష్టమును, దుఃఖమును నిపుడు చెందవలసిన వాఁడనైతిని. సుఖమును సంతోషమును శాశ్వతమైనవి కావని నాకిపుడు తెల్లమైనది యవి పిమ్మట కష్టదుఃఖములకు హేతువని యెవఁడెఱింగి యుండునో, యతఁడు. సుఖమును, సంతోషమును, లెక్కఁజేయఁడు. నావంటి యవివేకియన్నిటికిని బాల్పడి మిక్కిలి చింతించును. దైవతంత్ర మెవ్వరెఱుంగఁ గలరు? తెలిసిన పెద్దలు, నీళ్లలోచేపల జాడయు, గుఱ్ఱము కడుపులో పుట్టు 'ప్లుత' మనెడి చప్పుడును, ఉరుము పుట్టెడు చోటును పాముకాళ్లును, నాఁడువారి మనస్సును, వానకురి యుటయు, మనుష్యునకుం గలుగు కష్టసుఖములును నెఱుంగుట కష్టమని చెప్పుదురు. ఎవని కేవేళ నెట్టిదశ సంప్రాప్తించునో, యది దేవతలుఁగూడ, నిర్ధారణం జేయఁ జాలరని చెప్పునపుడు సామాన్య మానవులకు గోచరించునా? ఏది వచ్చినపుడు దాని ననుభవింపక తప్పదు. ఇపుడు నేను కష్టపడు కాలము వచ్చెనని చింతించిన నేమిఫలము? కటకటా! యీ యాఁకలి బాధ నన్ను మిక్కిలి పీడించుచున్నది. దైవమా! నేనేమి సేయుదును? యిచ్చోట నెందును కాయగసరులైనను గనుపడలేదు. త్రాగుటకు నీరుసయితము కనుపించలేదు దేహము బడలికచే వివశత్వము నొందుచున్నది. అడుగులు తడఁబడుచున్నవి, నాలుకయుం బెదవులు నెండి పోయినవి. ఈశ్వరా నీవేగతి నాకుం బుడిసెడు నీళ్లైనం దొరుకునట్లు సేయుమని, పరిపరి విధంబుల పరితాపంబు నొందుచు. నేదేని యొకగ్రామంబుచుఁజేరి యందెవ్వరినైనఁ బ్రార్థించి యాఁకటి చిచ్చుఁ జల్లార్పుకున్న నెద్దియుం జేయుటకు శక్తిచాలదని యోచించి మెల్లమెల్లగా నటనుండి కదలి నడువ నారంభించెను. పాపమతనికి నడుచుటకుఁ దగిన బలము లేదయ్యెను. ఏమిసేయును? కొంతదూరము నడుచుచు, మరలఁ గూర్చుండుచు, మరల లేచినడుచుచు, నిట్లు దారి సాగించుచుండఁగా తటాలున సూర్యుఁడస్తమించెను. పక్షులు తమతమ గూళ్లయందుఁజేరి కిలకిలం బలుకుచుండెను. క్రమ

క్రమముగా నంధకారము నీలిగుడారమెత్తిన లాగునఁ బ్రపంచమునంతయుఁ గ్రమ్ముకొనియెను. ఆకాశమున నక్షత్రములు సానఁబట్టిన వజ్రములవలె, తళతళ మెఱయుచుండెను. చెట్లుకొమ్మలమీఁదను, పొదల మీఁదను మిణుగురుఁ బురుగులు మినుకు మినుకుమను కాంతులతో నెగురులాడుచుండెను. సర్పములు పుట్టలనుండి వెలువడి యాహారార్థము మెల్లమెల్లగా నందందు సంచరింప నారంభించెను. దుష్టమృగంబులు గుహలనుండియు బొదలనుండియు బయలువెడలి నలుగడల ధ్వనించుచుఁ దిరుగ నారంభించెను. ఇవ్విధంబున భయంకరమగు నా రాత్రికాలంబున జనసంచారము లేనిదారి యందు శ్వేతుఁడు నిర్భయముగా నొంటరి వాఁడయ్యు సంకోచింపక మెల్లగా నడుచుచునే యుండెను, సమీపమున నేదేనియొక యూరికిం బోయి తన యాకటి బాధ నడంచుకొనం దలంచినవాఁడగుటఁ జేసి, యెంత కష్టమైనను, మార్గ మధ్యమున నాగాఢాంధకారమున నొంటరిగా నిలుచుట కతనికి యోగ్యముగాఁ దోఁచినది కాదు. పట్టుదలతో నడిచి గమ్యస్థానముఁ జేరుట యుక్తమని యతఁడు నిశ్చయించెను. కాని పాప! యెంతనడిచినను నతనికి దారిసాగినది కాదు. రెండు గడియల రాత్రియైనది. యింతవరకును, నేయూరునుఁ నతనికి గనిపించలేదు. శ్వేతుఁడా చీకటిలో పడుచు లేచుచు నెట్లో దారింగనుఁగొని నడిచినడిచి తుదకొక గొప్పగ్రామమువద్దికిం జేరెను. నాటిదినము మహా శివరాత్రి. అది శ్వేతునకుం దెలియదు. అతఁడాయూరు చెంతకుఁ బోవునప్పటి, కచ్చటనుండు వారు కొందఱు నాఁడుశివప్రీతిగా నుపవాసముండి, శివుని నర్చించి నాఁటిరాత్రి జాగరణంబు సేయనెంచి స్నానానుష్ఠానములఁ దీర్చుకొని విభూతి ధారులై పండ్లును, టెంకాయలు, పాలు, పువ్వులు, ధూపదీప నీరాజనాదులొనరించుటకుం దగిన వస్తువులుఁ దాంబూలములుఁ బళ్లెరముల యందిడికొని పాత్రంబులయందు పరిశుద్ధోదకంబులు కొని యచటికి సమీపమునుండు శివాలయమునకుం బోవుచుండిరి. శ్వేతుఁడు వారలం జూచెను. వారు కొనిపోవు వస్తువులయందు కొన్నింటిని హరించితన యాకలిం దీర్చుకొనవలయునని యతనికి తలంపుగలిగెను. ఇంచుక

సేపు యోచించెను. ఆలాగునఁ జేయుటయే యిప్పటికిఁ దగినకార్య మనియతఁడు నిర్ధారణఁ జేసికొని యెను అంతట శివాలయమునకుం బోవుచున్న యాభక్తులకుం దెలియరాని విధంబున యాచీకటిలో వారివెను వెనుకనే తానును శివాలయంబునకుం బోయి ప్రాకారముం బొచ్చి, సమయమును వేచియుండి వారి నేమరించి యచట నా భక్తులగు వారు శివునకర్పించిన ఫలాదుల నపహరింప వలయునను సంకల్పముతో యన్యులకు తాను కనుపించకయుఁ, దనకచట జరుగు పనులన్నియుం గాన్పించు లాగునను, నుందునొక స్థలమునఁ డాఁగి కొనియుండెను అట్టి సమయంబున వచ్చిన నాలుగు జాతుల స్త్రీపురుషులును శుచిర్భూతులై, విభూతి రుద్రాక్ష మాలికలు ధరించి తాము తాము కొని వచ్చిన వస్తు జాలంబుంగొని గర్భగుడిం బొచ్చి యచట నర్చకున కప్పగించి భయభక్తి వినయంబు లెసంగఁ గరంబులు మోడ్చి శివలింగమునకు నమస్కరించి తమతమ శక్త్యానుసారముగాఁ బూజాది కృత్యముల నర్చకుని వలన నెరవేర్పించి తీర్థ ప్రసాదంబులు గొని, సకలలోక రక్షకుఁడును, భక్తజన వాంఛాఫలముల నిచ్చువాఁడును, గంగను జడలయందు ధరించిన వాఁడును, మూఁడు కన్నులు గలవాఁడును, శూలమును ధరించిన వాఁడును, పులితోలు గట్టిన వాఁడును, కపాలము, డమరువు చేతుయందుఁ బట్టిన వాఁడును కైలాస పర్వతముపై నివసించువాఁడును, తనయెడమ తట్టు యెడలి యందు గౌరీదేవిని నిలిపిన వాఁడును, నల్లని విషముతో గూడిన మెడఁగల వాఁడును, ప్రమథ గణములచే సేవింపఁబడు వాఁడును, దిక్కులేని వారికి దిక్కగు వాఁడును, కరుణకు సముద్రము వంటివాఁడును, సమస్త కోరికలు నిచ్చువాఁడును, సమస్త పాపములు నుఁబోఁగొట్టు వాఁడును, చలనము, నాశము, నామము, రూపము, లేనివాఁడును, మిక్కిలి యుత్తమమగు చరిత్రముఁ గలిగి సకలదేవతల చేతను నుతింపఁబడు వాఁడునగు సర్వేశ్వరుని నానా విధముల స్తోత్రముఁజేసి, భేరీమృదంగ కాహళాది నానా విధ వాద్యములును, మంగళ తూర్యములును చెలంగగా కర్పూర నీరాజనంబులును. పునః పుః ప్రదక్షిణ నమస్కారములును గావించి బ్రాహ్మణులకు నానా విధదా

నధర్మము లాచరించినవారై శివ సంబంధమగు పంచాక్షరి జపించు
వారును, శివ పురాణమునుఁ జదువువారును, శివుని కథలం జెప్పు
వారును, శివుని మహాత్త్వంబును వర్ణించు వారును, నై యటనటం
గూర్చుండి చాలసేపు జాగరణంబు గావించి పెల్లుగా నిద్దురమబ్బుపై
కొనుటం జేసి, కొందఱు మాటలాడుటలో తబ్బిబ్బు పడువారును,
కొందఱు మాటలాడు చుండి యితరుల మీఁదికి నొరుగువారును.
కొందఱు, మింట నక్షత్రంబులం గని గడియలు లెక్కించువారును,
కొందఱు, తూఁగాడుచుండి తటుకున మెలఁకువ నొంది యాపు
లించి తూఁగితినేమోయని లేచి యీవ లావలం దిరుగువారును,
కొందఱీలాగు తూగువారలీ మహాదేవుని సన్నిధి కేల వచ్చితిరని యు
సూయపడి పలుకు వారును, కొందఱు కన్నుల నిదుర గ్రమ్మినప్పుడెల్ల
శ్రీకంఠాయ, మహేశ్వరాయ, క్షేమకరాయ, గౌరీనాథాయ, కామ
నాశాయ, శోకదమనాయ, రుద్రాయ, విశ్వాకారాయ, మహాదే
వాయ, నమోన్నమః నమోన్నమః నమోన్నమః యని స్మరించి
యాత్మ ప్రదక్షిణ నమస్కారములు చేసి, తమవ్రతంబు నంతరాయ
ములేక నెరవేరు నటులఁ జేయుమని ప్రార్థించు వారును, కొందఱు
మీరింతదనుక మేల్కొనియుండి యింక గొంతసేపు నిదుర నిలుపు
కొనఁజాలక వ్రతభంగముం జేసికొననేల? యని హెచ్చరించు వారు
నునై, నానా ప్రకారంబుల వర్తించుచు సంపగి పూవువాసన వలన
తుమ్మెద లెట్లు సోలునో, యావిధంబున సైరింపలేని నిద్రమత్తునఁ
గన్నులు మూతలు వడుచున్న బలాత్కారమున విచ్చుచు మాగన్ను
వడియుండిరి శ్వేతుఁ డంతవరకును గంటిమీఁద రెప్పవేయక సమ
యముఁ గాచియుండెను నాఁ డుదయము మొదలతఁడు నిరాహారి
యైయుండుట చేతను, కన్నులు మూసినచోఁ దాఁదలఁచిన కార్య
మునకు సమయ మొకవేళ తటస్థించి తప్పిపోవు నేమోయను భయ
ముచేతను, వానికి నిద్రపట్టలేదు. పాపము! ఆకలి బాధగల వానికె
ట్లు నిద్రవచ్చును? వాఁడవ్విధంబునఁ గాచియుండి యచ్చటి జనులం
దఱును, మాయా స్వరూపిణియగు నిద్రాదేవిచే మోహితులై
యూఁగులాడు చుండుటం గని, యదిమంచి సమయంబనియు, నపుడు

తడవుఁ జేసినచో నంతకంటె యుక్తమగు తరుణము తటస్థించదనియు,
నెంచి తానుండిన చోటువిడిచి, చప్పుడు కాకుండు లాగున మెల్లగాన
డుగులిడుచు మిక్కిలి నేర్పుతో గర్భగుడిం జేరి మోరవాకిలిగా యు
న్నతలుపుల సందున చప్పుడు గానీకచొచ్చి శివలింగంబునుఁ గని
నమస్కరించి, స్వామీ! యాకటి చిచ్చుభరింపఁ జాలక నీకుసమర్పిం
చియున్న యీఫలాదులంగొని పోవఁదలఁపు గొనివచ్చితి. నేరముగాఁ
దలంపకుమని ప్రార్థించి తన పంచనొక్కింత బిరానచించి వత్తిఁజేసి
యచట గిండియలోనుండిన నేతిలోతడిపి సన్నగామండుచున్న యచటి
దీపమున వెలిగించి యావెలుతురులో, లింగము చెంతనుంచి యుండె
డి నానా విధఫల పుష్ప భరితంబగు పళ్లెరముం గాంచి సంతసించి
దాని నెత్తికొని మరలి దేవళము నుండి వెలువడి వచ్చుచు, నా ప
ళ్లెరమునం గల పూవులు మిక్కిలి సుగంధముం గలిగి యుండుటఁ
జేసి యవి తన యుంపుడుకత్తెయగు వేశ్యకొసంగ నెంచెను. ఆసమ
యంబున యాపువ్వులలో నొకటి గాలికెగిరి పోయిన, నదిగని,
యతఁడు శివార్పణ మయ్యెనని చెప్పి తక్కిన వానింగొని పోవుచుం
డెను. అపు డచట నుండిన జనులలో నొకడు శ్వేతుఁడు పళ్లెముం
గొని పోవుట నెట్లో యెఱింగి, దొంగదొంగ యని బిగ్గరగా నరచెను,
అతని యరపుల కందఱును మేలుకొని ఎక్కడ నెక్కడ నని వానినిం
జుట్టుకొని యడిగిన, వాఁడదిగో! ఆలయమువం బ్రవేశించి ఫలపుష్ప
ములతోఁ గూడియున్న గొప్ప పళ్లెరమును గొనిపోవు చున్నాఁడని
చెప్పి, వాఁడు శ్వేతుఁడు పోయిన దిక్కుంజూపెను. అపుడు జనులంద
ఱును నానా ముఖంబులఁ బరువెత్తి యప్పటికి సమీపంబుగానే
పోవుచున్న యాశ్వేతుని గని జుట్టుముట్టి పట్టుకొని తలవరుల కప్ప
గించిరి. దుష్టులైన యాతలవరులు నిర్దయగా నతని మిక్కుటముఁ
గాఁ గొట్టిరి. ఆదెబ్బలకు సైరింపలేక క్రిందఁబడి విల విలఁ దన్నుకొని
తిక్షణంబున శ్వేతుండు ప్రాణంబులు విడిచెను. ఆహా! ఆకలిబాధకై
తస్కరించిన బ్రాహ్మణున కెంతటి విపత్తు గలిగెను? దైవసంకల్ప
మెటులనుండెఁ గాఁబోలు. నెవరెఱుంగుదురు? శివస్వరూపుఁడ వగు
మునిశ్రేష్ఠా! తరువాతఁ దొడరిన విచిత్ర వృత్తాంతంబును వినుండు.

శ్వేతుఁడాలాగున మృతిం జెందుటయు, నాకింకరులు రయంబున వానిం
గొని వచ్చుటకుం బోయి, యంతకు పూర్వమే శివదూతలు వచ్చి
యతనిఁ దోడ్కొని పోవ సిద్ధపడియుండుట వలన వారిం జేరఁ బోజా
లక దూర దూరముగా నిలిచి వారికిఁ బ్రణామంబు లొనరించి, శివ
దూతలగునో మహా మహులారా! ఇది యేమి వింత? మీరీదుష్టుఁ

### రుద్రభట యమకింకర సంవాదము.

డును, మహా పాపాత్ముఁడు నగు వాని చెంతకేలవచ్చితిరి? వీఁడు
కులాచార దూరుఁడును, వేశ్యాలోలుఁడును, జూదగాఁడును, లెక్క
లేని పాపకార్యము లొనరించిన వాఁడును నని మీ రెఱుంగరా?
అన్ని దోషంబులకంటె నెక్కుడగు శివ నిర్మాల్యమును దొంగిలించిన
కిల్బిషము వీని నాపాదించి యుండుట మీ రాలోచింపలేదా? వీఁడు
మీంబోఁటులు సమీపించఁ దగినవాఁడగునా? వీఁడు యమలోక
నివాసార్హుఁడు. మహాధర్మ స్వరూపుండైన దండధరుని యందుఁ
గూడ దయదలంపని శంకరుఁ డీకష్టాత్మునిపైఁ గనికరించుట యాశ్చ
ర్యముగా యున్నది. ప్రభువులగు వారేమిచేసినను, వారినడిగెడి
వారులేరు కాఁబోలు, నకటా! ఇదిచాల నన్యాయముగా నున్నది.
మీ రే యభిప్రాయముతో వీనినిఁ గొని పోవచ్చితిరో తోఁచకున్నది.
అయ్యలారా! మీరు పొరఁబడి యున్నట్లున్నది. వీనిని మీరు ము
ట్టరాదు. మాకప్పగించుఁడు ఈపాపాత్ముఁడు తన జీవితకాలములో
నెపుడైనను, పరమేశ్వరుని ధ్యానించెనా? పూజించెనా? స్మరిం
చెనా? పంచాక్షరి మొదలగు శివమంత్రములను జపించెనా?
శివదర్శనంబుఁ జేసెనా? శివపురాణములు వినియుఁ జదివియు, శివ
భక్తుల నారాధించియు న్నెన్నఁడైన నెఱుంగునా? ఎట్టిమహాత్కా
ర్యముం జేసెనని మీరితనిం గొని పోవ వచ్చితిరి? మీవంటివారు
ధర్మాధర్మములను వివేచనఁ జేయకున్న పిమ్మట నేకార్యమును నెట్లు
జరుగును? ఎవఁడెఁడే యే యాధిపత్యమును వహించెనో, వాఁడు
వాఁ డాయాయధికారమునకు లోఁబడిన కార్యములను నిర్వహింప
వలయును. కాని యొకఁడు చేయవలసిన కార్యమును మఱియొక
విధముగా మఱియొకఁడు చేయఁదలంచుట యధర్మము. ఈపాప

త్ముని మేము కొనిచని పుణ్యమూర్తియు, న్యాయశీలుఁడును నగు నైవస్వతున కప్పగించుట సరియైన పని. ఆమహా మహుఁడు విమర్శించి వీనికిం దగిన సుఖదుఃఖ పదవులు నిర్ణయించుట కర్తవ్యము. కావున మీరు వీనిని విడిచిపొండని చెప్పిన, మదీయ దూతల మాటలు విని శివకింకరులు పకపక నవ్వి యిట్లనిరి ఓయి యమ భటులారా! మీప్రసంగ మింకఁ జాలింపుఁడు. మీవివేక మింత మట్టుకు నని మాకుం దెలియ వచ్చినది. మే మెఱుంగని లాగున మాకే మేమిరో ధర్మశాస్త్రములును, నీతులునుఁ జెప్పుచున్నారు. మీకంటె నెందును మేమంత తెలియని వారమని తలంపకుఁడు. మే మెప్పుడును నధర్మమునఁ బ్రవర్తించు వారము కాము. తెలివియున్న మీరిటులఁ బలుకుదురా? ధర్మసూక్ష్మముల గ్రహించుట మీవంటి యల్పమతులకు సాధ్యముకాదు. మిక్కిలి పుణ్యస్వరూపుఁడైన మా వశమునసుండు యీజీవుని మహాపాపాత్ముఁడని చెప్పుటయుందే మీ తెలివితేట తేర్పడు చున్నవి. ఇట్టి మిమ్ముఁ బెట్టుకొని పుణ్యస్వరూపుఁడైన దండధరుఁ డెవ్విధంబున రాజ్యపాలనంబుఁ జేయునో తోఁచకున్నది. ఓయి భటులారా! యోచింపఁగా మీప్రభువు మీకుం దగిన వాఁడుగా నే యుండునని మాకుందట్టుచున్నది. కాదన్న తాను ధర్మాధర్మములను బాగుగా విచారించక మిమ్మీ పావనుఁడగు బ్రాహ్మణుని జీవంబులు కొనివచ్చుటకుం బంచునా? చాలుఁజాలు. తెలిసియుం దెలియని మాటలు మాని మీరు మీదారిఁ బోవుట మంచిది. శీఘ్రముగాఁ జని యీ వృత్తాంతమును మీప్రభువగు కృతాంతునితోఁ జెప్పుండు. మేమితనిఁ గైలాసంబునకుం దోడ్కొని పోయెదమని చెప్పిరి. వారిమాటలకు నాభటు లాశ్చర్యముం జెంది, యో శివభటులారా! మాకుఁ దెలిసి నంతవరకు నితఁ డేపుణ్య కార్యమునుఁ జేసినట్లు కనుపడదు. మీరితనింగగు పుణ్యాత్ముఁడని చెప్పుచున్నారు గదా! మాయందు కరుణించి కోపము మాని యితఁడేమి సత్కార్యముం జేసెనో, యేపుణ్యము వలన శివ సాయుజ్యము నొంద నర్హుఁడయ్యెనో తెలిపి మాకుఁగల సందేహము నివారణఁ జేయుండు అని ప్రార్థించిన, శివదూతలు సుముఖులై చిఱు

నగవు ముఖంబుల నంకురింప నాకింకరులంగని, యిట్లనిరి. యమ

## రుద్రభటులు యమదూతలకు శ్వేతుని పుణ్యవిశేషంబు జెప్పుట.

భటులారా ! శివ సంబంధంబైన ధర్మ సూక్ష్మము నెఱుంగుట మిగుల కష్టము యెంతటి వారికిని నదిగోచరింపదు. బ్రహ్మ, విష్ణువు, దేవేంద్రుఁడు మొదలగు వారుఁగూడఁ దెలిసి కొనఁజాలరు ఆసూక్ష్మము తెలిసినట్లే యుండును. కాని తుదకు తెలియరానిదే యగును. మీకు మేము తెలిపెదము వినుఁడు. ఈమహాత్ముఁడైన బ్రాహ్మణునియందు నిరుపమానమైన యొకపుణ్యము కలదు. అది సమస్త పాపములను హరించి శాశ్వత శివలోక సుఖము నితనికిం గలిగించినది. అది యెద్దియంటిరేని, యితఁడు పరిపూర్ణముగా శివ రాత్రీ మహావ్రతముఁ గావించి కృతార్థుఁడయ్యెను. దానంజేసియే మేమితనింగొని పోవ వచ్చితి మని చెప్పిరి. యామాటలకబ్బురపడి నా దూతలు, అయ్యలారా! వీఁడు శివరాత్రివ్రతమాచరించెనా? సిగ్గుసిగ్గు. కూడుదొరకక పస్తుపడి శివాలయములో వస్తువుల దొంగిలించితినుటకై వచ్చి సమయము వేచియుండి యచ్చటనుండు వానిందొంగిలి కొనిపోవుట శివరాత్రివ్రతవిధానమా? సర్వముం దెలిసిన మీరివ్విధంబునఁ జెప్పిననిఁక మేమేమనఁగలము? వీఁడెట్లు భక్తుఁడగుననిన వారు మరల నిట్లని చెప్పిరి. యమ దూతలారా! మీరు పొరఁబడి యట్లుతలంచు చున్నారు, అదియే ధర్మసూక్ష్మము నెఱుంగమి యనుట. ఇతఁడుపరిపూర్ణముగా వ్రతము నడిపెను. యెట్లన్న ఈమహా శివరాత్రిదివసంబున నన్నము దొరుకని కారణంబున నైనను పస్తుండుటచే నుపవాస ముండిన ఫలమును తానుగా పూజింప కుండినను, పరమేశ్వరున కన్యులు చేయునట్టియుఁ జేయించు నట్టి పూజలును, ధూపదీపనైవేద్య నీరాజన ప్రదక్షిణ నమస్కారాదులయం దొక్కటియైనను దప్పక చూచు చున్నకతంబున పూజాఫలంబును, నాహారము సంపాదించు కొనుటకై యైనను శివాలయంబున నుండి మేలుకొని సమయంబు వేచియున్నందున జాగరణ ఫలంబును, పదార్థంబులనెటింగి కొని పోవుతలంపున నైనను వస్త్రముంజించి నేతిలో ముంచి శివుని సన్నిధిని వెలిగించుట వలన నీశ్వరాలయమున దీపారాధ

నం జేసిన ఫలమును, నితనికి లభించెను. మఱియు నీపావన దివసంబున లింగదర్శనముం గావించెను. వారువారుఁ జెప్పుకొనుచున్న శివ కథలును, శివపురాణంబులును చక్కఁగా వినుచుండెను వేశ్యకని తలంచియు, గాలికెగిరి పోయిన పూవును శివార్చనంబని తలంచెను. పరమేశ్వరుని యాలయ సమీపంబుననే యీపుణ్యదివసంబున స్థూల శరీరమును విడిచెను. ఇవి యన్నియును బుద్ధి పూర్వకముగాఁ జేయక పోయినను, నితని పూర్వ పుణ్యంబునం జేసి వానికివియే సమకూడిశివరాత్రి వ్రతమితనిచేఁ బూర్ణముగాననుష్ఠింపఁ బడియెను. లోకంబున బ్రహ్మహత్యాది పాతకములం జేసిన వాఁడైనను శివ శివ యని శివ నామస్మరణమునుజేసిన మాత్రమున సమస్త దోషములును తొలఁగి పవిత్రుఁడగునని తెలిసికొనుఁడు. శివమహాత్మ్యం బట్టిదై యుండఁగా నిన్నివిధముల పరమేశ్వరు నారాధించిన యితఁడు పాపాత్ముఁడెట్లగును. ఇతఁడీ జన్మంబున నెన్ని పాపంబులం జేసియుండినను నేటి దివసంబున నితనిచే నాచరింపఁ బడిన వ్రతఫల సిద్ధిచే సమస్త దోషంబులునుఁ దొలంగి పోయెను. శాశ్వత శివసాయుజ్యం బితనికి లభించెను. తెలిసిగాని, తెలియకఁ గాని బుద్ధి పూర్వకముగాఁ గాని, యప్రియమునఁ గాని, ప్రియమునఁ గాని యొకరివలనఁ బ్రోత్సహింపఁ బడికాని, మఱియే కారణము వల్లఁగాని యెవఁడు పరమపావనుఁడగు పరమేశ్వరుని నారాధించునో, లేకతలంచునో యట్టివాఁడు నిర్దోషియై కైలాసంబున నీశ్వరుని సన్నిధియందు నివసించుట కర్హుండగును. పరమేశ్వరుని మహత్త్వంబును, నీశ్వరునికిం బ్రియంబగు నీ శివరాత్రి మహాత్త్వంబునుం, జెప్పుటకు దేవతలకైనం దరంబు గాదు. ఈమహా పుణ్యంబున నితం డుత్తమపద వింజెందెను. కావున వృథా కాలయాపనంబుఁ జేయుట వలన నేమియుం బ్రయోజనములేదు మీరు మీవచ్చిన దారింబట్టి పొండు. మేమితనిం గైలాసంబునకుం దోడ్కొని పోయెద మనిచెప్పి, దివ్యాకారంబు వహించి విభూతి రుద్రాక్ష మాలికాధరుండును, నానా విధప్రవిమలమణిగణఖచిత విభూషణంబులును, రమణీయాంబర శోభితుండును, శివ తేజోమయుండునునై, ప్రకాశిం

చుచున్న యాశ్వేతుని దివ్య స్వరూపముంగాంచి ప్రీతులై పుష్పక విమానంబుపై నిడికొని సమస్త భోగములు విలసిల్లఁ శివదూతలు కైలాసంబునకుం గొనిపోయిరి. యంత మదీయభటు లాశ్చర్యంబొంది సేయునదిలేక చనుదెంచి నడిచిన వర్తమానం బంతయు నాతోడం జెప్పిన, నేనాశివ మహాత్మ్యంబును వినుతించి యంతటిపాపాత్మునకుం గూడ నీశ్వరుని కరుణవలన పుణ్యలోకంబు సంప్రాప్తించెను కదా! యని యచ్చెరువు నొందితి. అయ్యా సానందముని చంద్రా! ఈపాప మతు లంతమాత్రమైననుం బుణ్యము నొనరింపరైరి. పాపసంబైన యీశ్వేతుని చరిత్రంబుఁ జదివినను వినినను, పాపంబులు తొలంగి ముక్తి నొందుదురు. మఱియునొక భిల్లుఁడు మున్నిట్లే శివరాత్రినాఁ డల్పంబగు నొక కార్యంబు బుద్ధి పూర్వకముగాఁ గాక నేదేని నిమిత్తంబునఁజేసి యమృత పదంబునుఁజెందె. నిట్టికార్యములం దెవ్వియైననుం దెలిసికొని, తెలియకకాని యీమష్టు లొనరించినవారు కారు. దానంజేసియే వీరీఘోర బాధల ననుభవించు చున్నారు. అని చెప్పిన వైవస్వతునింగని సానందముని దండపాణీ! చిత్రంబగు శ్వేతునిచరిత్రంబు వినుటచే నామనం బానందంబుఁ జెందినది. ఇపుడు నీవనిన యాబోయ వానికథ యట్టిదో, వాఁడేమి చేసెనో, వానికి శివ సాయుజ్యం బెట్లుగలిగెనో, యా వృత్తాంతమునుఁ దేటపడ వివరింపుమని యడిగెను. అతనిమాటలకు శమనుండు సంతసించి యావ్యాధుని కథనిట్లని చెప్పనారంభించెను. స్వామీ! వినుండు. మున్ను శాకల దేశం

—శమనుఁడు సానందునకు బోయవాని చరిత్రంబుం జెప్పుట.—

బునందు చేరినయొక గ్రామంబున మంపకీలుఁడను పేరుఁగల కిరాతుఁడొకఁడుండెను. వానికి దయ యనునది లేనేలేదు. మహాకఠినుఁడు. మహాక్రూరుఁడు. మహాదుష్టుఁడు. జీవహింస యనిన యతనికిఁగడు సంతోషము. జంతువుల వధించుట యందు వానికింగల ప్రీతి లోకంబున మఱియెవ్వరికిని లేదు. నిరంతరమును లెక్కకు మిక్కిలియగు పక్షులను, మృగములను, వలలొడ్డియు, బాణములు నొడిసెల్లు మొదలగు వాని నుపయోగించియుం బట్టి చంపి కొనివచ్చి సమీపంబునఁ గల జనపథంబున విలిచి యందువలన రాఁబడిన రూకలు గ్రాసంబున

కు వలయు వస్తువులకు వినియోగించు కొని, యమ్ముడు పోఁగా మిగి
లిన జంతువులను పచనముఁ జేయించి తృప్తిగా భుజించి కాలముఁ
బుచ్చుచుండెను. వాఁడు బాణములు వేయుగురి యందును, వలల
నొడ్డు చాతుర్యము నందును, పేరుఁ జెందినవాఁడు. అతఁడు వలనొడ్డి
నపుడు కాని, బాణాదులఁ బ్రయోగించి నపుడుగాని యెన్నియో ప
క్షులును, మృగములునుం జిక్కి వాని వలన వధింపఁబడు చుండును.
కాని యతఁడెన్నఁడును వ్యర్థముగా బ్రయాస పడివచ్చి యెఱుంగఁ
డు. ఆ బోయవాఁడు వాఁడుక ప్రకారముగా నొకనాఁ డుదయమున,
లేచి, నీలిచల్లడమును, నీలిదట్టియు ధరించి, జుంజురు వెండ్రుకలు ము
డివెట్టి తోలు కుళ్లాయిం బెట్టుకొని, చిల్లకోలయు, నంబులును, విం
టెల దబ్బయు, జిగురుఁ బూసిన నూలు కండెలును, వలలును, చిక్క
ములును, త్రాళ్లును, మచ్చికఁజేసి పెంచిన పిట్టలును, మెకములును,
చలిది యన్నపు టుగ్గమునుం గొని ముఖంబునం జిగురు బొట్టుఁబెట్టు
కొని కదలి కొంతదూరంబుసని, నానా విధంబులగు పక్షులును మృ
గంబులును మిక్కుటముగా నుండు నొక్కదట్టమైన యడవింజొచ్చి,
వాని వాని సంచార సమయంబులును, ప్రదేశములును నూహించి
వలలు చిక్కంబులును జిగురుం గండెలును నందందు నొడ్డి పరవఁ దో
లియుఁ, బక్షులపై బాణాది సాధనంబు లుపయోగించియు, నిట్లనేక
విధంబుల నెంతకాల మెంత ప్రయాసఁ బడినను, నాఁడతని కొకపక్షి
గాని, యొక మెకముకాని, చిక్కినది కాదు. అదియేమి చిత్రమోకా
ని, యడవి పందుల నేయఁదలంచి పొంచియుండి, కాంచి వాఁడియగు
బాణంబులు ప్రయోగించినఁ దప్పించుకొని యవిపారి పోవుచుండె
ను. పెంపుడు పులుగుల సాయంబునఁ బక్షులఁబట్టఁ దలఁచి పెంపు
డువానిం గట్టివిడిచిన వానిఁజేర వచ్చుపక్షి యొక్కటియుఁ గనఁబడ
దయ్యెను. జిగురుఁ గండెల నూలు దారములను చెట్లకొమ్మలకుం జు
ట్టిపై పైసంచరించు పులుగులం దోలిన నొక్కటైనను నాదిశకు రాక
నెగిరిపోవుచుండెను. తా నొడ్డియున్న వలలలోఁ జిక్కించుకొనుటకై
కుందేళ్లు లేళ్లు మొదలగువానిని వలలపైకిం దోలిన నవి యటు
బోక తప్పించుకొని పరుగెత్తి పోవుచుండెను. మాటునఁ గూర్చుండి

యాకులతడికె నడ్డముగాఁ బెట్టుకొని దాపునకుఁవచ్చిన మృగములఁ జంపుటకు సన్నద్ధుండై కాచికాచి యెంతకాలము కనుచున్నను, నొక్క మృగంబైనను వానికండ్లకు గోచరింపదయ్యెను. ఇట్లు నానా కష్టములుపడుచు నెట్లును ప్రయోజనంబుఁ గానక మాటిమాటికిని ప్రొద్దువంకఁజూచి. అయ్యో యస్తమానము కావచ్చినదే ఇంతవరకు నొక పక్షిగాని, మృగముగాని, చిక్కదయ్యెనే, నేఁడేమి దుర్దినమో తెలియకున్నది. యెట్టుబెట్టినలాగున నేదియుం గనుపింపకున్నది. కనుపించినను, నాయొడ్డిన వలలం దగుల్కొనుటలేదు. నాచేఁ బ్రయోగింపబడు బాణములు తగిలిపడుటలేదు. నేనేమిచేయుదునని పెక్కువిధఁబులఁ జింతింపుచుండెను. రిక్తహస్తుండై యింటికిఁబోవుట కతనికి యుక్తముగా దోచకుండెను. వాఁ డాలాగున వెతఁబడుచుండగా దిగ్గున సూర్యుఁ డస్తమించెను. అపుడా నిషాదుం డాహ్లాదంబు తొలంగి విషాదముం జెంది తనలో నిట్లని వితర్కింపఁ దొడంగెను. అకటా ! నే నీదినంబున నెట్టివేళలో నిలువెడలితినోకదా ! నేను జేసిన పనులన్నియు వ్యర్థములై పక్షిగాని, మృగముగాని, యొకటేనియుం జిక్కకుండుట యాశ్చర్యముగాయున్నది. నాకు బుద్ధితెలిసిన నాఁట గోలె నేనీ వేటయే వృత్తిగా జీవించుచున్నవాఁడను. యెన్నఁడును నేటివలె వ్యర్థప్రయత్నుఁడ నైనదిలేదు. నా బాణములు గురితప్పిగాని, నాచే నొడ్డఁబడిన వలలంబడక తప్పించుకొనిగాని పక్షులును, మృగములును పరువిడిపోవుటను నే నెఱుఁగనే నెఱుంగను. పందులు, కుందేళ్లు మొదలగునవి వలలం జిక్కినట్లేయుండి తప్పించుకొనిపోయెను. విండ్లదెబ్బ తగిలినట్లేయుండి పిట్ట లెగిరిపోయెను. నేఁ డుదయంబుననుండి యెంత ప్రయాసఁబడినను నొక యెలుకయైనఁ జిక్కకున్నది. అయ్యో ! సూర్యుఁ డస్తమించెనే ! చీకట్లు క్రమ్ముకొనుచున్నవే ! నేనేమిసేయుదును ? నాయింట నాలుబిడ్డలు నే నెవ్వియో తెచ్చెదననియుం, గ్రాసము గావించుకొనవచ్చుననియుం, దారిఁ జూచుచుందురే ! యాఁకటిపెల్లున పసిబిడ్డలు సొటసొటఁ బోవుచుందురే ! యాహారముగతి యట్లుండ సాయంకాలమువరకును నారాక కెదురుసూచుచుండి నా ప్రియమైన భార్య నేను వేళ కిలుఁ

జేరమిచేఁ దిగులుపడి మిక్కిలి కుందుచుండునే! హా! దైవమా! నాకేమియుం దోఁచకున్నది. వా రందఱు నింట నాకటిచేతను, దిగులుచేతను, దుఃఖించుచుండుదురని యెంచి యింటికిఁ బోవ నిశ్చయించితి నేని, ప్రయోజనమేమి కలదు? వట్టిచేతులతోఁ బోయిన, నేమి కొని వచ్చితివని యడిగినచో, నిల్లాలి కేమిచెప్పుదును? ఉదయముననుండి యాకలి బాధఁ బడుచున్న బాలకులు నారాకఁగనినే నెద్దియో యాహారంబునకుం దెచ్చితి ననియుఁ దమ యాకలి దీర్చుకొనవచ్చుననియు నపేక్షతోపరువిడివచ్చి, నాయనా! ఏమి తెచ్చితివి? చూపుమని నన్నుఁ జుట్టుకొందురే! వారికి బిడ్డలారా! ఇదిగో! వీనిందెచ్చితి మీతల్లి పచనముఁ జేసి పెట్టఁగలదు. త్వరపడకుఁడని చెప్పి సమాధాన పరచుటకు నేఁడేమియున్నది? నాదుర్దశయిట్లుండిన నుండెగాని వారి యదృష్టంబున నైన నొక మృగమో, యొకపక్షియో దొరకరాదా! ఇట్టి యిక్కట్టును నేనెప్పుడునుఁ జెందిన వాఁడనుకాను. అని యొకచోటం గూర్చుండి పలువిధంబులఁ దనలో తాను కొంతసేపు పరితాపంబుఁ జెందుచుండి, యాయంధకారమున నేమిచేయుటకును తోఁచక, యెన్నియోయోచనలు గావించెను. కాని యెవ్వియు నతనిమనస్సునకు సరిపడకుండెను. యోచించి యోచించి యా నిషాదుఁడు, వట్టిచేతులతో నింటికిం బోవుటయు, భార్యా బిడ్డలకు పరితాపంబుఁ గలిగించుటయు, యోగ్యము కాదని తుదకు నిష్కర్షఁ గావించుకొనియెను నావంటి వేటకాఁడొక్కపూట నేదో కారణమున, నేజంతువునుఁ జిక్కకున్న మాత్రమునఁ జింతింప వచ్చునా? ఇంత మాత్రముననే యధైర్యము నొందుట శూరుండగు పురుషుని లక్షణమగునా? నేను ధైర్యంబు నవలంబించి నేటిరాత్రి కడకును నేదేని యొక వృక్షముపై నెక్కి ధనుర్బాణములు ధరించి యప్రమత్తుఁడనై కాచియుండెదను. వేగునంతకు లోపల నేదేని యొక మృగమైనం జిక్కక పోవునా? చూతము. కానిమ్ము దేవుఁడు న్నాఁడు. సూర్యోదయంబునకు లోపల ప్రయాసకోర్చి నిద్రఁగాచియుండి, యొకపందినోఁ, జింకనో, దుప్పినో, కుందేలునో పడనేసి కొనిపోయి నాభార్యకును, బిడ్డలకును నాకటి చిచ్చును

చల్లార్చెదను. ఇదియే తగినయోచన, ~~మఱియొకమార్గము లేదని~~ నిశ్చయించి, తన వేటసాధనంబు లన్నియుం గట్టి యొకచెట్టు కొమ్మకుం దగిల్చి, ధనుర్బాణంబులు ధరించి యటనుండి కదలి వెదుళ్లొండొంటి నొరసి కొనుటచేఁ బుట్టిన నిప్పంటుకొని యెండిన యాకులును జెట్లునుం గాలుచున్న యామంటల వెలుతురునఁ బొదలును గంపనులుం దప్పించుకొనుచుఁ గొంతదూరంబు చని, ముందట, గట్టునాడు చుట్టునుం జెట్లుగలదియుఁ బరిపూర్ణముగా నీళ్లుగలదియు, నానావిధములగు పక్షుల సంచారముఁ జేయునదియు, తామరలు కలువలు నల్లుకొని యాకులచేతను పూవులచేతను నిబిడీకృత మైనదియు నగు నొక గొప్పకొలంకు గాన్పించిన సంతోషించి యందుండిగి కరముఖ పాదంబులు కడిగికొని నిర్మలంబులైన జలంబులు వలసినంతఁ ద్రాగి యంత తనలో యిచ్చోటినీరుఁ గ్రోల ననుదెంచు మృగవారంబును సమయింతుంగాక యని నిశ్చయించి తీరంబున నుండు నొక మారేడుచెట్టు నెక్కి దాని కొమ్మలయందుఁ డాఁగి, యడ్డంబుగా నుండు చిఱుగొమ్మలఁ ద్రుంచివైచి యనువుగాఁ గూర్చుండి యేకాగ్రచిత్తంబున బొంచియుండెను. మంచు మిక్కుటంబుగాఁ గురిసి యతనికి స్నానముం జేసినవానికిం బలె నొడలును వస్త్రంబులునుఁ బూర్ణముగాఁ దడసి పోయినను జలింపకఁ దనకంటి చూపున కడ్డముగా నుండు దళములం ద్రుంచి వైచుచుండెను. నాఁడు శివరాత్రి దివసంబుగాని, యది యా వ్యాధుం డెఱుంగఁడు. అట్లయ్యు నతండప్రయత్నముగా ద్రుంచివైచిన బిల్వదళంబు లచట నుండిన యొక పురాతన శివలింగముపైఁ బడుచుండెను. వాఁ డాలాగు మృగంబుల కొరకు వేచి తెల్లవారువరకును మేల్కొని యుండి సూర్యుఁ డుదయించినపిమ్మటఁ జెట్టుదిగి యప్పట్టున నంతవరకు నొక మృగంబును రాఁగానక చూచుచున్న సమయంబున తలఁచని తలంపుగా నచట సమీపమునఁ గల యొక పొదయందుండి యొక బెబ్బులి హఠాత్తుగా వానిపైకి లంఘించి కుత్తుకం గొఱికి రక్తపానముం జేయుటయు నతండు ప్రాణంబులు దొఱఁగె. నంత మదీయ భటులు వానిం గొని వచ్చుటకుం బోయిరి. కాని వారి కాపని సాధ్యము కాదయ్యెను.

### బోయవాఁడు శివసాయుజ్యంబు నొందుట.

వలయున, నంతకు పూర్వమే శివభటులతనిని పూవుల తేరుపై నెక్కించి కైలాసమునకుం గొనిపోవుటకు వచ్చియుండిరి. మద్భటులు వారలం గాంచి యో శివదూతలారా ! ఇదియేమి? మీరేమి చేయఁ బోవుచున్నారు ? వీఁడు మహాపాపి. దుష్టుఁడు. వీని కెల్లపుడును జీవహింసఁ జేయుటయే మహావ్రతము. జీవహింస యందుఁ గల ప్రీతి వీనికిఁ మఱి దేనియందునుఁ గలుగదు. నిరపరాధ జీవుల నెన్నిటి నో సంహరించి యా పాపమునంతయు, నొడిఁగట్టి యున్న నీచుఁడగు వీనిని సమీపించుటఁ గూడ మీవంటి వారికి యోగ్యము కాదే ! అట్లుండగా వీనిని పుష్పరథంబుపై నెక్కించి కొనిపోవుటకుం బ్రయత్నించుట నెంచఁగా మాకెంతయు నాశ్చరము కలుగుచున్నది నరకలోక వాసార్హుఁడగు వీఁడు కైలాసమునకు రాఁదగునా ? మీకేమి వెఱ్ఱి పట్టినట్లున్నది ? అనాలోచితముగా మీరీ పనికిఁ దొరకొంటిరి. పొరబాటుఁ బడితిరా ? ఇట్లు చేయుట ధర్మవిరుద్ధము. మనమే యధర్మ ప్రవర్తకులమైన యెడల నింక మనల నెవరు గణింతురు ? మనము న్యాయాన్యాయములం దెలిసికొని కదా ! ప్రవర్తింప వలయును. ఈపని మంచిది కాగు. వలదు వలదు. వీనిని విడిచి పోవుట యుక్తము ఈదుష్టుని మేము నానాబాధలం బెట్టుచుం గొని పోయి పాప జీవ భయంకరుండును, ధర్మశీలుండు నగు దండధరుని ముందట నిలిపి, యాసత్య స్వరూపుని యాజ్ఞానుసారముగా దండించెదము. ఇదియే వీనికిం జేయవలసిన కార్యము. మీరు తెలియనివారు కారు. అన్ని ధర్మములును మీ రెఱుంగుదురు చక్కఁగా యోచించి మీపొరబాటుం దెలిసికొని వీనిని మాకప్పగింపుఁ డని, బహు ప్రకారకబులం జెప్పిన, శివదూతలు యాభటుల మాటల నాలించి, పకపక నగి, యో యమివేషులగు యమకింకరులారా ! మాకార్యము మీకెట్లో, యట్లే మీమాటలు మాకాశ్చర్యముం గొలుపుచున్నది. మమ్ము పొరఁబడితి మని యనుచున్నారు. కాని, మీరే పొరబాటుఁ జెందినట్లు మేము తలంచెదము. ధర్మసూక్ష్మము నెఱుంగలేక మిక్కిలి పుణ్యవంతుఁడగు వీనిని మహాదోషిఁగా భావించు

టయు, శివసాయుజ్యముం జెందఁ దగిన వానిని నరకబాధలకు లోఁబడఁ జేయఁ దలంచి వచ్చుటయు, మీయవివేకమును వేయి నోళ్లఁ జాటుచున్నది. ఇతఁ డెన్ని పాపములఁ జేసినను నిపుడు గడించిన యనంతమగు పుణ్యము వలన నవి యన్నియుం దొలంగి మిక్కిలి పవిత్రుఁడగుట మీ రెఱుంగరు కాఁబోలు. నితఁడు శివలోక నివాసార్హుఁడుగాని, నరకబాధలం బొందవలసిన వాఁడు కానేరఁడు. ఇప్పుడైననుం దెలిసికొని, వచ్చిన దారిం జూచుకొనుఁడు. అని తిరస్కారముగాఁ బలికిన, నాభటులు వింతపడి, కొంతదడవు యోచించి, వారిమాటల వలనఁ దమ కేదియుం దెలియకున్న, మరలం బలుకరించి, యోశివభటులారా ! ఇటు చూడుండు. మీరు చెప్పిన మాటలకు మాకర్థము కాకున్నది. ఈ నికృష్టుఁడు మహాపుణ్యవంతుఁ డని చెప్పుచున్నారా ? ఆశ్చర్య మాశ్చర్యము. అదియెట్లు ? వీఁడంత పుణ్యకార్య మేది చేసెను ? పుట్టిబుద్ధిఁ దెలిసినది మొదలు నేఁడు చచ్చువరకును, జీవహత్యలు తప్ప, మఱియొక కార్యముం జేసి యెఱుంగఁడే ! వీఁడా పుణ్యాత్ముఁడు. లోకములు తల్లక్రిందై నట్లున్నది. బెండ్లుమునిఁగి, గుండ్లు తేలెడి కాలము వచ్చినది కాఁబోలు లేకున్న నిట్టి విపరీతము కలుగునా ? ఆకాలము వచ్చినపుడే మహాదోషియగు వీఁడు పుణ్యాత్ముఁడగును. ఏది యెట్లున్నను వీనిని మీరు పుణ్యపురుషుఁ డనుచున్నారు కదా ! అదియెట్లో, వీనిచేఁ జేయఁబడిన యాసుకృత మెట్టిదియో, మాయందు దయయుంచి వచియించితి రేని సంతృప్తి నొంది మాదారిని మేము పోయెదమని వినయంబున ప్రార్థించి యడిగిన, చిఱునవ్వు ముఖంబుల మొనయ వారిట్లనిరి. యమభటులారా! కడచిన దివసంబు పావనంబైన మహా శివరాత్రియని మీ రెఱుందురు కదా ! ఎన్ని పాపములం జేసి యెట్టి దోషముల నొడిఁగట్టి యున్నవాఁ డయినను నిన్నటిదినం బీతఁడా శివరాత్రి వ్రతమును పూర్ణముగా ననుష్ఠించిన వాఁడయ్యెను. వీనికా యుద్దేశము పొడమి బుద్ధిపూర్వకముగాఁ జేయలేదు. కాని వీని పూర్వసుకృత విశేషంబున దైవికంబుగా నటులఁ జేయులాగున సమయము తటస్థించెను. స్వకార్య ప్రియుఁడుగా నైనను, నేజంతువును, దొఱకని కారణంబు

న నుపవాసముఁ గావించెను. దట్టముగాఁ గురిసిన మంచునఁ బూర్ణముగాఁ దడిసియుటచే శుద్ధోదకంబుల స్నానముఁ జేసినవాఁడయ్యెను. మృగములరాక వేచికంటిమీఁద ఱెప్పవేయకఁ గాచి చూచుచుండుటచే జాగరణఫలము సిద్ధించెను కన్నులకడ్డమైన దళము లొక్కొక్కటిగాఁ ద్రుంచి రాత్రి కడకునుఁ గ్రిందవైచుచుండిన కారణంబున, నాబిల్వ దళంబులన్నియుం గ్రిందనుండిన శివ లింగముపైఁ బడిన కతంబుచే సర్వేశ్వరునిం బూజించిన వాఁడయ్యెను. ఈకార్యము లన్నియు, నప్రయత్నముగా జరిగినవి. కాని వీఁడుయత్నించి చేసినవికావు. ఐనను తత్ఫలమునుఁ జెందుట కితఁ డర్హుఁడయ్యెను. దానిచే వీని పాపంబులన్నియు నశించి పోయినవి. మిక్కిలి పుణ్యవంతుఁడయ్యెను. శాశ్వతమగు శివలోక సాయుజ్య మితనికి లభించినది. ఈరహస్యము నెఱుంగక మున్నితఁడు చేసిన పాపకృత్యములను లెక్కించి దోషిఁగా భావించి మీరితనిం గొని పోవవచ్చితిరి. లోకంబున నెవ్వఁడుగాని, తెలిసియో, తెలియకనో, గౌరవార్థముగనో, నిర్బంధమువలననో, విరోధంబుచేతనో, ప్రియముచేతనో, యెట్లుగాని త్రిజగన్నాథుండైన పరమేశ్వరుని, నెవఁడు ధ్యానించునో, సేవించునో, పూజించునో, యట్టివాని పాపములన్నియు సూర్యరశ్మిచేఁ దొలంగు గాఢమగు మంచువలె విరిసి, పరిశుద్ధుఁడై పరమపురుషుఁడైన శంకరుని సన్నిధింజేరి నిరుప మానానందము ననుభవించును. ఇది సత్యము. ఈ వ్యాధుని చరిత్రము పావనమైనదగుటచే, దీనినిఁ జదివినను. వినినను, వ్రాసిననుంగూడ పినాకహస్తుని కరుణకుం బాత్రులై, యట్టివారుఁ పుణ్యలోకమునుఁ జెందఁగలరు. భటులారా! వీని పాపములు తొలంగుటకును, నితఁడు పరిశుద్ధుఁడగుటకును, మే మితనిఁ గొనిపోవ వచ్చుటకును, నిమిత్తముం జెప్పితిమి. నేఁడాదిగా నితఁడు శివలోకంబున, శివుని సన్నిధియందుండఁ గలవాఁడు మీరింక మీదారిం జనుండని చెప్పి. వారా బోయయొక్క దివ్యతేజముతోఁ గూడిన మూర్తినిఁ బుష్పరథంబుపై నిడికొని మహావైభవముతోఁ గొనిపోవుటయుం గొంతదడ వట్టె చూచుచుండి యాశివ దూతలు దృష్టి కందనంతటి దూరమేగి నంతట నటనుండి చను

దెంచి, నాభటులీ వృత్తాంతంబంతయుం బూసఁగ్రుచ్చిన చందంబున నాకుం జెప్పిన యాలించి, మిక్కిలి యాశ్చర్యంబుఁజెంది శివ మహాత్త్వమింత యధికమైనది కదా! యని తలంచి, గౌరీ వల్లభుండగు నప్పరమపురుషుని, మహానటుని, పినాక హస్తునిం బెక్కు విధంబుల సంస్మరించి సంతృప్త మానసుండనైతి. నోమునిశేఖరా! యాబోయ వాఁడ ప్రయత్నముగానైన నొకసత్కార్యముం జేసి పుణ్యలోకం బునకేగెను. ఈదుర్మార్గులగు పాప జీవులంతటి కార్యము నప్రయత్న ముగనైనం జేసినవారుకారు. కోటి సంవత్సరములు ఘోరముగాఁ దపస్సుఁజేసిన నెంత ఫలమో, యంతకు రెండంతలపుణ్య మొక శివరాత్రి నాఁడు జాగరణ మొనర్చుటచేఁ గలుగు నని యు, నూరు గొప్ప యజ్ఞములు గావించిన నెంతఫలమో, యంతకు రెండంతల పుణ్యమొక శివరాత్రి దినంబున నుపవాసముగా నుండుటవలనఁ గలు గునని యు, వేయి మారులు భూమిలోఁగల పుణ్యస్థలము లన్నియుం దిరిగి సకల దేవమూర్తులను దర్శించి సకలగంగాది తీర్థములందును స్నానముం జేసిన నెంతఫలమో, యంతకు రెండంతల పుణ్యము మొక శివరాత్రినాఁడు శంభుని సందర్శన మొనర్చుచేఁ గలుగునని యు, పదిలక్షల మహా మంత్రములను వేయి సంవత్సరములు పరిశుద్ధ మనస్కుఁడై జపముం జేసిన నెంతఫలమో, యంతకు రెండంతల పుణ్య మొక శివరాత్రి పూట పరమేశ్వరునిఁ బూజించుటవల్ల గలు గునని యు, సమస్త శాస్త్రములు నెఱింగిన వారును, యోగ్యులునగు పెద్దలు చెప్పుదురు. ఇంత సులభ కార్యంబుల వలన నింత గొప్ప ఫలము లభించుటఁ దెలిసియు, మత్తులైన యీ ఖలు లొక్కనాఁడు నొక్కటియుంజేయక వ్యర్థముగా కాలముంగడపి నరక బాధ లనుభవిం చుచున్నారు. తెలియక చేసిన కార్యంబు వలననే యాబోయ వాఁ డంతటి సుకృతికిం బాత్రుఁడైనపు డింక తత్ప్రభావం బెఱిఁగి, నిర్మ లచిత్తులై యావ్రతం బాచరించు వారి పుణ్యంబు వర్ణింపఁ దరమగు నా? ఇట్లే మఱియొకజారిణీస్త్రీ యప్రయత్న శివపూజా ఫలసిద్ధిచేఁ బుణ్య లోకంబువడసె. నీశ్వరుం డెవరుగాని యెంతయల్పంబగు పూ జఁ గావించినను, పరిపూర్ణ పుణ్యఫలంబు నొసంగు చుండునని చెప్పి

న, నానంద మగ్న మానసుఁడై, సానందముని యరవింద మిత్రనంద నునభినందించి, ధర్మరాజా! నీవిపుడు చెప్పిన యా జారస్త్రీ చరిత్ర ముం జెప్పుము? ఆబిడ తానేమిచేసెనో, మహా దేవుండగు శంభుని నెట్లు పూజించెనో, దాని కీశ్వరుని కటాక్షంబున నెవ్విధంబుగా సాయుజ్యము లభించెనో, యా వృత్తాంతమును వినవలయునని వేడుక కలుగుచున్నది. శివ మహాత్త్వము నెంత వినినను దనివి గలుగదు సుమా! కావున దానిని వచియింపుమని యడిగెను.

అని సూతమహర్షి, సానందాంతకులకుం జరిగిన సంభాషణ ప్రకారంబును వివరించిన, శౌనకాది మునివర్యులు మిక్కిలి శ్రద్ధఁగల వారై యాలకించి యతిశయించిన సంతోషము నొంది, యంతటితోఁ దనివిఁజెందక, మఱియును వినవలయునను కుతూహలము మీరఁగా సూతునింజూచి, స్వామీ! మాయందు కృపఁగలవారలై సానందముని చరిత్రముం జాలవరకుం జెప్పి మమ్ముం గృతార్థులం జేసితిరి. మాప్రార్థన నంగీకరించి యటుపిమ్మట నేమిజరిగినదో, యా వృత్తాంతముం జెప్పి, మాకోరికం దీర్పుఁడని పలువిధంముల నతని స్తోత్రముఁ గావించిరి.

## గద్యము.

ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ చతుర్విధ కవితా విశారదుండగు, పురాణం - పిచ్చయ్యకవిచే రచియింపఁ బడిన సానందోపాఖ్యాన వచనకావ్యమునందు పంచమ ప్రకరణము.

సంపూర్ణము.





శ్రీ రస్తు.

# సానందోపాఖ్యానము.

వచనకావ్యము.



## షష్ఠమ ప్రకరణము



క. శ్రీశర్వ శతానందను,
శేశ ప్రముఖార్చితా! మ ♦ హీధర ధర! యా
కాశ నిభ వర్ణ! సకల,
క్లేశహారా! పన్నగేంద్ర ♦ గిరిసంచారా!.

దేవా! యవధరింపుము.

శౌనకాది మహామునుల వలనం బ్రార్థింపఁబడిన వాఁడై సానందముని చరిత్రంబుఁ దెలుపఁ బూని, తపోనిధియు, సకల ధర్మములును, శాస్త్రములును, నితిహాసములునుం జక్కఁగా నెఱింగిన వాఁడును, నొరులకుం జెప్పుట యందు మిగులఁ జాతుర్యముం గలవాఁడు నైన సూతుఁ డిట్లనియె. మునిశ్రేష్ఠులారా! సానందమునికిని శమనునకును నడిచిన సంభాషణ ప్రకారంబుఁ జెప్పెద వినుండు. ఆలాగున నాకులట వృత్తాంతంబుఁ దెలుపుమని యడిగిన సానందునకు దండధరుండిట్లని చెప్పఁ దొడంగెను. పూర్ణచిత్తాత్మజుఁ డవునుఁ బరిపూర్ణ

—యముఁడు సానందునకు దుశ్శీల చరిత్రముం జెప్పుట.—

వివేక నిధివియునగు సానందముని చంద్రా! యాజారిణీ చరిత్రంబు వినుఁడు. భూలోకంబున మహారాష్ట్ర దేశంబులోఁ జేరిన యొక పురంబునందు, వేదనాథుఁడను పేరుఁగల బ్రాహ్మణుం డొకఁడుం డెనుఁ

అతఁడు. నాలుగు వేదములును వేదాంగములగు శాస్త్రములును,
పదు నెనిమిది పురాణములును, మను విజ్ఞానేశ్వరాపస్తంబాదులచే,
జెప్పఁబడిన ధర్మసూత్రములును, బాగుగా నెఱింగికొని, నిత్యకర్మాను
ష్ఠానములు కాలముఁ దప్పక జరుపుచు, సదాచార సంపదఁగలిగి,
భక్తి, దయ, శాంతము, దాంతి, తృప్తి. సంతోషముఁ గలవాఁడై
యెల్లపుడును నతిథుల నభ్యాగతుల నాదరించుచు, బ్రహ్మతేజంబు
శోభిల్ల సర్వజనాదర పాత్రుండై యొప్పుచుండును. ఎల్లపుడు నత
నికి ముదుసలులైన తలిదండ్రుల కుపచరించుటయు, భగవదారాధ
నఁ జేయుటయు, నతిథి జనుల నాదరించి యన్నపానాదులు విచారిం
చుటయుఁ, దీరుబడి కలిగినపుడు ధర్మశాస్త్రములు పఠించి యాయా
ధర్మముల భేదములం దెలిసికొనుటయుందక్క వేఱుకార్యము లేకుం
డును. సత్పురుషులఁ జెప్పవలసి వచ్చినపుడు మొదటివాఁడుగా నత
నినే చెప్పవలయును. ఇట్టియోగ్యుఁడైన యాబ్రాహ్మణోత్తమునకు
నెందును గొఱంతలేకుండియు నొక్కవిషయంబున మాత్రము మిక్కిలి
క్లేశము ననుభవించకఁ దప్పినదికాదు. అది యతని పూర్వజన్మకర్మ
ఫలముగాని యిప్పటి దోషము కానేరదు ఆదుఃఖ మెద్దియనిన. న
తనికింగల ధర్మపత్ని యోగ్యురాలుగా కుండెను. ఆచింతదప్ప మఱి
యేచింతయు నతని యందుఁ గలుగదు. అదిచాలదా? అంతకంటె
గొప్ప దుఃఖము పురుషున కొండేది కలదు? సంసార భారముంబూ
ని, పతికి బాసటగా నుండి యతని మనస్సునెఱింగి మెలఁగుచుఁ బతి
వ్రతా ధర్మముం దప్పక, నత్తమామలను, పెదసాదులను, భక్తితో
సేవించుటయు, నన్నపానము లొసంగి యాదరించుటయు నుత్తమ
స్త్రీ లక్షణంబని యెఱుఁగి పరువు మరియాదలు తెలిసి, కలిగియు
న్నంత వరకునుఁ దృప్తిఁజెంది దేవభూసుర భక్తివిడువక కాలముగడు
పవలసిన యాయువతి కులాచార ధర్మమును పీటఁబుచ్చి, యత్త
మామలం గవిన నీసడించుచు, భర్త యేదేనిఁ జెప్పిన తిరస్కరించుచు
నతిథులు నభ్యాగతులును వాకిటికి వచ్చినఁ గసరి తిట్టుచు. గృహ
కృత్యంబులు సేయుటమాని దేవతార్చనాది కార్యములకు వలయు
పరికరంబులు సమకూర్చుట నుడిగి, తన బ్రాహ్మణత్వమును లెక్క

సేయక యొల్లపుడును, పరిశుద్ధ జలంబుల స్నానము జేసి మంచియంబరముంగట్టి, సొమ్ములుధరించి తిలకంబుదిద్ది, చందనాది మైపూఁత లలంది యలంకరించుకొని యేవేళఁజూచినను బోరుగిండ్ల యందును, దోటలయందును, దొడ్లయందును, విటకాండ్రకై తిరుగుచున్న భార్యతోఁ గాపురమొనరించుట కష్టముగదా! పాపము! వేదనాథుఁడు సాధువు. మిక్కిలి యోగ్యుఁడు అతఁడేమిసేయఁగలఁడు? భార్యనడవడియతని కొంత మాత్రమును సరిపడినది కాదు. అయినను, శాంతమూర్తియైన యాబ్రాహ్మణుఁడు పెక్కువిధంబుల వారంకులాఁడిని మంచి మార్గమునకుం ద్రిప్పుటకుఁ బ్రయత్నించి చూచెను. కాని, దానిజార వాంఛ దినేదినే యభివృద్ధి యగుచుండెను. అంతట నతఁడా విచారమును విడిచిపెట్టి, దాని కర్మము లాగున నది పోవునుగాక యని యూరకుండెను. అంతకంటెఁ జేయఁగల కార్యమెద్దియుఁ దోచదయ్యెను. ఆబిడపేరు దుశ్శీల. నడవడికిం దగినట్లే పేరునుం గుదిరియుండెను ఆబిడ నిలుపోవని కామ వేదనకులోనై, రాత్రియుం బవలునను భేదములేక, కులగోత్రములను పాటింపక, నెపుడెవఁడు లభించినను వానింగూడి సురత సుఖంబు ననుభవించుచు, లజ్జాభయంబులు విడిచి తిరుగుచున్నం గని యూరి వారందఱును, నయ్యో! మంచి యోగ్యుఁడగు నుత్తమ బ్రాహ్మణునకీ పాపాత్మురాలు భార్యగాఁ దటస్థించెనే! దీనిమూలమున నతని గౌరవమును, నాచారసంపత్తియుం జెడవయ్యెనే! ఇట్టియన్యాయ ప్రవర్తన బ్రాహ్మణస్త్రీకిఁ దగునా? యని నిం

వేదనాథుఁడు భార్య నిల్లు వెడల నడఁచుట

దింప నారంభించిరి. జను లాడుకొనుమాటలు విని తన మనస్సునకు మిక్కిలి వ్యాకులము కలుగుట చేతను, తన నైష్ఠిక వృత్తికింగడుంగడు లోపముగాఁ దోఁచుటచేతను వేదనాథుఁడు యోచించి దుశ్శీల యగు నాదుశ్శీల నొకనాఁడు గృహంబునుండి వెడల నడఁచెను. భర్తవలన నటుల నిరాకృతయైన యాబిడ కొంకులేక నదియే మహాప్రసాదంబుగాఁ భావించి తాను నూతనముగా లోఁబఱచుకొని కామక్రీడలం దనియించుచుండిన యొక దిట్టకాఁడగు శూద్రునకు నడిచిన వృత్తాంతముం జెప్పి పెక్కు విధంబుల వానికి బోధించి మదోన్మత్త

చిత్తమై యాక్రొత్తాతనింగూడ నొక్క నాఁటి రేయిం బురంబు విడిచి దేశాంతరమునకుం జనియెను. మఱునాఁడా వృత్తాంతంబును వేదనాథుఁ డెఱిఁగి తన తోడును వీడెనని తలంచి నిశ్చింతగా నుండెను. యన్య దేశంబునకుం బోయిన దుశ్శీల విటకానితో నొక్క గ్రామంబున వసించి పోవునపు డింటనుండి వెంటం గొనిపోయిన వస్త్రములును, భూషణములును, తన కిచ్చవచ్చినలాగున నలంకరించుకొని, చందన పుష్పాదులు మైకైఁ జేసి మిండని కింపుగా సరస సల్లాపము లాడుచు నెప్పుడును వానిం దన చెంతనుండి పాయనీయక నిరుపాధిగా గొంత కాలము వానింగూడి కాపురము చేయుచుండెను. అయ్యో! పాప మాసుఖ మాశూద్రవిటున కైనను సుఖముగా నుండినది కాదు. యెందువలనననిన, కొన్ని నాళ్లు జరిగిన పిమ్మట యాదుశ్శీల వాఁడుకగాఁ దమకు పక్షులు, మృగములు మొదలగువాని మాంసాదులను దెచ్చి యిచ్చుచున్నవాఁడును, మంచి యవ్వనమునం దున్నవాఁడును, రూపముఁ గలవాఁడునగు నొక బోయవానిం దన చాతుర్యంబున లోఁబఱచుకొని, వానిం దగులుకొని, ఇల్లు వాకిలియుఁ, దల్లిదండ్రులను, బంధువులను, వేయేల తనకుంగల సర్వమును విడుచుకొని, నమ్మి దేశము విడిచివచ్చి తనతోఁ గూడి, తనతోడిదే లోకమని తలంచియున్న యా శూద్రవిటుని గుమ్ములోఁ గలిపి బోయవాని వెంటం బోయెను. ఆహా! కాముకురాండ్రగు స్త్రీలచిత్త మెంత దయారహితమైనది? వారి నెట్లు నమ్మవచ్చును? శూద్రవిటుఁడు దానిని విడిచి యుండఁ జాలక బోయవాని వెంటఁబడి పోవుచున్న యా దుష్టురాలి పిఱుందనం జనుచు, నోయొయ్యారీ! యో ముద్దుగుమ్మా! యో నాప్రాణనాయకీ! యో సుందరీమణీ! అకటా! నేనొక నిమిషమైనను, నిన్ను జూడకున్న ప్రాణంబులు నిలుచునా? నీవింత ద్రోహముం జేసి నన్ను దుఃఖ సాగరమున ముంచి పోవుట ధర్మమగునా! యో బంగరు బొమ్మ! నన్ను కామించి పురంబుననుండి నీవు తోడ్కొని వచ్చునపుడు చెప్పినమాటలును నమ్మికలును, నిపు డెందు బోయెను? నాతోఁగూడి, నను సురత సుఖంబుల దనియించెడి చాతుర్యంబును, నీవగలును, సరసంపు ముద్దు పలుకులును, నీ శృంగార చేష్టలును,

మరువ సాధ్యమగునా? నాయందుఁ గనఁబఱచుచున్న ప్రేమయు, నన్ను తృప్తిఁ బఱచుటయందు నీకుం గలిగియుండిన శ్రద్ధయును, మఱచి, యల్పుఁడగు నొకమ్లేచ్ఛునిం దగులుకొని పోవుటకు నీకేలాగున బుద్ధి పొడమినది? ఇంత క్రూరత్వమును వహించు నంతటి యపరాధమును నేను నీపట్ల నేమిచేసితిని? రారమ్ము. ఇటుమరలి నీకై తపించుచు, వెంటనంటి వచ్చుచున్న నీప్రియుండనగు నన్నుఁజూడుము. నీయమృతంపుఁ బలుకులచే నన్నోదార్చి నాదుఃఖాగ్నిఁ జల్లార్పుము. నీవీ కార్యము నిట్లుసేయుదువనియు, నన్ను విడిచి యన్యునిం జేరుదువనియు నేనెన్నఁడునుం దలంచలేదో, తరుణీమణీ! ఇదినిజమేనా? లేక నాచిత్తము నీయందాయత్తమై యున్నదో, లేదో కనుఁగొనవలయునని తలంచి యిట్లు తంత్రముఁజేసి తెలియఁ బూనితివా! నేనేదియు నిశ్చయింపఁ జాలకున్నాను. నేను నీతోడిదే లోకమని యుండుటం దెలిసియు, నన్నలయింప నేల? నన్నుఁ బరీక్షింప నేల? నీకెన్నఁడును లేని సందేహ మిపుడు గలుగ నేల? చాలుఁజాలు నింక మరలిపోవుద మింటికిరమ్ము. నీయందు లగ్నమై తపించుచున్న నా మానసమునకు శాంతము నాపాదిల్లం జేయుము. నామనస్సున కొక్కింత కష్టముతోచిన నది నీకష్టముగాఁ దలఁచి నన్ను సంతోషపెట్టుటకు సకల ప్రయత్నములునుం జేయుచుండెడి దానవు; నేఁడు నేనింతవాపోవుచున్నను దిటవుగాఁదిరిగియైనచూడక పోవుచుండుట నాకాశ్చర్యముంగొలుపుచున్నది. నా మొఱాలించి రక్షింపుమని దుర్భాగ్యుఁడైన యాశూద్రుఁడు బిగ్గఱఁ బిలిచి ప్రార్థించుచు వెంటనంటి పోవుచున్నఁ గని, క్రూరురాలును, భ్రష్టురాలునగు నాబిడ, తత్పూర్వము తాను వానిపైఁ గలిగియున్న యనురాగమును విడిచి, వానికి తానిచ్చి యున్న మాటయుం బాసయుం దప్పి, దయారహితమైన మనస్సుఁగలదై, నీతోడి సహవాసంబును నేనొల్లను. నీదారిని నీవు పొమ్మని ఖండితంబుగాఁ బలికియైన ననుపక నతఁడేమి చెప్పినను, నెన్నివిధముల వేడుకొను చున్నను, మాఱుఁబలుకక తిరిగిచూడక మౌనముతోఁ బోవుచు తన్నువిడనక వాఁడు వచ్చుటయుం గూతలు పెట్టుటయుఁ గంటకముగాఁ దోఁచి, తన క్రొత్తమిండగాఁడగు బోయవాసం జూచి

ప్రాణనాథా! ఇదిచాలా యుపద్రవముగా యున్నది. అదిగో! యెదు టనుండు కానలో త్వరగాc బ్రవేశింతము. ఆచెట్లమాటున మనజాడ నెఱుంగc జాలక యీ పాపాత్ముcడు కొంతసే పలునిటుందిరిగి, తుద కు నిరాశంజెంది వెడలి పోవును. అంతటితో వీని తోడుసు తప్పును. బిరబిర నడువుమని వానిచేయిం దనచేతc గీలిచి వేగముగా చని యాయడవిం బ్రవేశించిరి. అనురాగ విశేషంబునం జేసి యా శూద్ర

గుశ్శీల బోయవానిచేc బూర్వవిటునిం జంపించుట.

విటుcడు దానిని విడువ మనసురాక, తానును వారివెన్నంటి శీఘ్ర ముగాc బలువిధంబులం బ్రార్థించుచు నమ్మహారణ్యంబుం జొచ్చెను. ఆదుశ్శీల తాను తలచినటులcగాక తన పూర్వవిటుండు వెన్నంటి వచ్చు చుండుటంగని, యాగ్రహంబు వొడమి, బోయవానితో, నోమనోనా యకా! నాప్రియుమైన సుందరాంగా! వీనిబాధనే నింక సైరింపcజాల ను. నా యందు నీకు మక్కువ లేకున్న లాగునc దోcచుచున్నది. యుం డిన నన్నుc దాకcడు నీ ప్రియురాలనగు నన్ను వెన్నుముట్టి, కవయు నెంచి వచ్చుచుండc గన్నులారం గనుచు నూరకుండుదువా? ఛీ! నీమనసు కెక్కని యీ నాజన్మమేల? ఆదుష్టునిచేc జిక్కి వాcడు చేయు దుశ్చేష్టలకు నేను సహించలేక తపించుచుండగాc గన్నులా రcజూచి సంతసించెదవు కాcబోలు, కానిమ్ము నీ యిచ్చరీతిcగాక తప్పను. అపుడుగాని నీమనసు నెమ్మదింజెందదు. నీకన్ను లపుడుగాని చల్లcబడవు అన్యపురుషుని చేతc జిక్కినపు డబల నాకుదాన నే నేమి చేయcగలను? యెట్లు తప్పించుకొననేర్తును? నీకుసామర్థ్యము కలదేని, యీదుర్మార్గునివలనc గలుగు బాధనుండి నన్నుcదప్పించి చే కొమ్ము. లేనియెడల నీచేతులార నిపుడే నాకుత్తుకం దెగవ్రేసి సంతోష మున నీదారింబొమ్ము. పరమనీచుcడును, క్రూరుcడును దుష్టుcడునగువాని చేతc జిక్కువడి బాధనొందుట కంటెc బ్రియుcడవైన నీవలనc దును మcబడి ప్రాణములు కోలుపోపుట శ్రేయము. నితోcడంగూడి రతి కేళియందుc బెనంగవలసిన నాశరీర మానీచునకంట నర్హమగునా? ననుంజంపుము. కాదేని వానినైనం జంపుము. మీయిరువురి యం దును నొకరి యుసురుపోయినcగాని యీకష్టము తొలంగునదికాదు.

ఏమని యెదవు? నీకేదిష్టమో యా కార్యమును శీఘ్రముగాఁ జేసి ముగింపుమని తొందరపెట్ట నొడంగెను. తెలివిలేని వాఁడును, కామ మోహితుఁడును నైన యా బోయవాఁడా మాయలాఁడి మాటల నాలించి, తనకుముందుఁడినవానికిం గలిగిన గతినిఁ జూచు చుండి యుం బిమ్మట తనగతి యెట్టిదోయని యోచింపక తనయం దా బిడ యెక్కుఁడు వలపు నొంది యున్నదనియు,నది తన్ను నెడఁబాసి యింక నుండ నేరదనియు నమ్మి, తనపట్ల నిరపరాధియైన యా శూద్రవిటుని పై నలుకవహించి, ఆహా! నాప్రియమైన ముద్దుగుమ్మా! ఏమి చెప్పె దవు? నాప్రాణ సమానురాలవైన నిన్నితఁడు పట్టి భంగ పరచు చుండగాఁ జూచుచు నేరనట్లుండుటకు నేను వెఱ్ఱివాఁడను గాఁను సుమా! నీ మోమోటమునకై యింతకుమున్ను నీతోఁ గాపురముం జే యుచున్న వాఁడుకావున, నతఁడేదేనియు నీతో సంభాషించి పోవల సి యుండునేమోయని తలంచి నేనేమియుం బలుకక యిన్నక వచ్చు చుంటిని. వాఁడపుడపుడుం బలుకు మాటలు విన్నపుడెల్ల నాకా గ్రహము జనించు చుండెను. కాని నీవు వానినేమియుననక మౌనము గావచ్చు చుండుటంబట్టి వానిని నేనేదియుం జేయఁజాలక నీకు కోప ముజనించునని సందేహముంగొని సైరించి యుండినాఁడను. ఇపు డు నీవేచెప్పితివి. పూర్వ స్నేహితుఁడను మోమోట నీకేలేనపుడు వానితోడ నాకేమి సంబంధ మున్నది. నాశక్తి నింకఁ గనపరచెదను. నీకుందృప్తిని గలిగించెదను. ఇంత మాత్రమునకై నన్ను నిందించు టయు, నిన్ను నిందించు కొనుటయు నేల? ముద్దులాఁడీ! నాచేతులా రనీకుత్తుకం ద్రుంచుమని చెప్పితివి. అట్టి పాపము నొడిఁగట్టు కొను మని చెప్పుటకు నీకు నోరెట్లాడెను? ఆహా! నాప్రాణమా! నిన్ను జం పుటకు నాజేతులాడునా? ఇట్లేలనన్ను తూలనాడెదవు? ఇదిగో యిం కనొక నిమిషంబున నీతోడుసుఁ బాపెదను. అనిచెప్పి యాఅంకులాఁ డికి మనఃప్రియం బొనర్పం బూసి దుష్టుఁడగు కిరాతకుఁడు తటాలున వెనుక వచ్చుచున్న యా నిర్భాగ్యుఁడగు శూద్రుని నెదుర్కొని, యంతటి కార్యము జరుగునని తలంపమిచే నజాగ్రతగా నుండుట వలన వాని కుత్తుక నొక్కవ్రేటునఁ దనచేనున్న వాడియగు కత్తి

తోఁ నరికిన, నాశూద్రుఁడు విగత జీవుఁడయ్యెను. దుర్మార్గు రాలైన యాకులటయొక్క సహవాసము వలన తుదకు శూద్రుఁడు ప్రాణము లు గోలుపోవుట తటస్థించెను. ఆలాగున నాబాపిత తన పూర్వవిటు నిం జంపించి కిరాతునిఁ గూడి, యరణ్యంబున వసించుచు, మృగ సంహారంబుఁగావించి విటకాఁడు దెచ్చిన పొలం దిని మద్యంబుఁద్రావి మహోత్సాహంబుతోఁ గొన్ని దినంబులు వానిని వివిధరీతుల మరుకేళిం దేలించి సంతృప్త చిత్తయై యుండెను. ఇట్లుండగా, సమి ధలును, పత్రములుం, గొనిపోవఁదలంచి యా యరణ్య పరిసర ప్రదే శంబున నుండెడి యొక బ్రాహ్మణుఁ డొకనాఁ డాయడవికిం జనుదెంచి యటునిటుం దిరుగుచు, హటాత్తుగా యా బోయవాని కుటీరము వ ద్దికి వచ్చెను. మంచి రూపమును, యుక్తమగు ప్రాయమునుం గలిగి యున్న వానింజూచి అంకులాఁడియగు దుశ్శీల తనమనం బతనిపైఁ బ్రసరించిన, నకటా! ఇట్టి పురుషునిం గలిసి సుఖింపని యాఁడుదాని జన్మము నొక జన్మమా! ఎట్లయినను నా చాతుర్యముచే నితని లోఁ బఱచుకొని యభీష్టసిద్ధి నొందెదఁగాక. యని నిశ్చయించి బోయవా ని కెఱుక పడని లాగున కుటీరంబునుండి వెలువడి. యా బ్రాహ్మ ణుని చెంతకుం బోయి యతనిసి మాటలకుం దార్చి తన మనోభీష్టము

### దుశ్శీల బ్రాహ్మణునిం గూడియుండి యతనిం జంపుట.

నెఱింగించెను బ్రాహ్మణుం డయ్యెను తెలివి మాలి యతఁడు దాని మాయలకు లోఁబడి యుక్తాయుక్త వివేచనఁ జేయక దానిం గూడి సురత క్రీడలం దేలుచున్న యాసడి నెఱింగి బోయవాఁడు కోపోద్దీపి తుఁడై చను దెంచుచున్నం గని విప్రుఁడు దూరముగాఁ బరువెత్తి పోయెను. ఇంతలో నాటక్కులాఁడి తానేదియు నెఱుంగని దాని వలె నెదురొక్కని ప్రియోక్తు లాడుచున్న బోయవాఁ డోసి మోసపు జాణా! నీచెయిదమును నేనెఱుంగ ననుకొంటివా? నిన్నేమి చేసెద నో చూడుము. అని నిర్దయగా లెస్సగాఁదన్ని కొట్టి, యీడ్చి, నానా బాధలుం బెట్టి ఛీ! నీముఖముంజూడరాదు. నీవింక నాకక్కర లేదు. ఇపుడే నీవిచటనుండి వెడలి నీకిచ్చయుండు చోటునకుం బొమ్ము. తామసించితివేని నిన్ను చంపుదునని బెదరించిన, నదియే చాలునని

యటనుండి కదలివచ్చి, దూరంబునఁ బొదల మాటున నిలిచి తన పాటు జూచుచున్న యా బ్రాహ్మణునిం జేరి వానితోడ వాని మందిరంబునకుం జని, తన చాతుర్యము కొలందిని వానికి దుర్బోధనం గావించి కుటుంబమునుండి వేరు పఱచి, వానితో గూడి కొంతకాలము కాపురముం జేయుచుండెను. ఇట్లుండగా నా బ్రాహ్మణుఁడు కొలఁది దినములు జరిగినంతట దుశ్శీల యందు ప్రియముడించి మఱియొకతెం గలిసి సుఖించుచుండెను. కాని దుశ్శీలను పూర్ణముగా విడిచిన వాఁడు కాఁడు. ఈజాడ నాదుష్టురాలెఱింగి పెక్కు విధంబుల నతని నన్యవనితాసంగమము నుండి మరలింపఁ బ్రయత్నించెను. కాని వాఁడా వాంఛను మానఁడయ్యెను. అంతట నది వానియందు కినుక వహించి, మంచిది కానిమ్ము. నీపని మట్టుఁబెట్టెదనని తనలోఁ దలంచి విషంబుఁ గలిపి కొన్ని భక్ష్యముల జేసి మిక్కిలి మక్కువఁగలదాని వలె వానికిం బెట్టి తినిపించెను. కపటమెఱుఁగని యా బ్రాహ్మణుఁడా పిండివంటలం దిని యుత్తరక్షణంబున విగత జీవుండై క్రిందపడియెను. ఇంక నిటనుఁడరాదని యాబిడ యటనుండి కదలి యొక పురంబునఁదుం జేరి యందొకపురుషుండను నియమము లేక నెపుడెవఁడు లభించునో, వానింగ్గలిసి క్రీడించుచు, నప్పురంబునఁగల, కుక్క మొఱిగిన వెఱచి బయటరాఁజాలని బాలవితంతువులను తన సామర్థ్యంబున విటకాండ్రకుం దార్చుచు, వారికి గర్భంబేర్పడినతరి నా గర్భవిచ్ఛిత్తికిం దగిన యౌషధంబు లిచ్చి భ్రూణహత్య నొడిఁగట్టి కొనుచు, వారిచే సన్మాసింపఁబడి వారిచ్చెడి బహుమానములం గొని యన్నపానాదుల కుపయోగించు కొనుచు, నిట్లు చేయరాని మహాపాప కార్యము లన్నియు జేయుచు కొన్ని దినంబులు గడపెను, పిమ్మట కొన్నాళ్లకు మహా శివరాత్రి దివసంబు సమీపించుటం జేసి యాప

## దుశ్శీల శ్రీశైలంబునకుం బోవుట.

ట్టణంబున నుండి పెక్కండ్రు స్త్రీ పురుషులు శివరాత్రి మహోత్సవంబుం జూచి శివుని సేవించి రాఁదలంచి శ్రీ శైలమునకుం దరలి పోవుచున్న తదుత్సవాలోకన కౌతుకంబు వొడమి దుశ్శీలయు వారి వెంట శ్రీ శైలమునకుం బోయెను. శ్రీశైల మహాత్త్వం బెట్టిద

నిన, పుణ్యశ్లోకులకుం గాని క్రూరకర్ములకా శిఖరావలోకన ఫలంబు లభింపదు. కావున పాపాత్ము రాలైన దుశ్శీలకుం గొంత దూరము పోయి నంతట రెండు నేత్రములును పూర్ణముగా దృష్టిచెడి గుడ్డి దయ్యెను. ఇంకేమి చేయఁగలదు? కూడి వచ్చిన వారిం బ్రార్థించి వారి సహాయము వలన నెట్లెట్లో చిక్కులంబడి తుదకు శ్రీశైలాగ్రంబలి శ్రీ మల్లికార్జున మహాదేవుని సన్నిధికిం జేరి, వీధిలోనం గూర్చుండి చేతనున్న కాసులు వ్రయమైన కారణంబున నచ్చటికి కేతెంచిన మహా జనులను తనకేమేని ధర్మము నొసంగుఁడనియు, నన్నమ్ముం బెట్టింపుఁ డనియు నెలుఁగెత్తి కేకలిడి ప్రార్థించు చుండెను నాఁడు శివరాత్రి యగుటం జేసి యందఱు నుపవసించి యున్న కతంబున నెవ్వరును నాదుశ్శీలకేమియు నియ్యకుండిరి. నాఁడొక శివభక్తుఁడు ప్రదోష కాలంబున శివుని సందర్శించి యారాధించుటకై తీర్థంబును మారేడు పత్రియుం గొని పోవుచుండ, పదముల చప్పుడువిని తనకేమైనం బెట్టుమని మిక్కిలి వేడిన, యా పాపాత్మురాలగు దుశ్శీల దోయిటిలో, తనచేత నుండిన మారేడు దళములు రెండెత్తి వేసి, పుడిసెడు నీళ్లుపోసి చనియెను. యవి యాహార యోగ్యంబులుగా వనుటయుం దనయందు దయఁజూప కతఁడు పరిహాసమునకై యటులఁ గావించెననియు నెంచి, దుశ్శీల మిక్కిలి కోపముం జెంది, తనచేత నవియొసంగిన వాని ముఖంబున నెగయఁజల్లెను. కాని దిక్కు తెలియమిం జేసి సూటి తప్పి, యాపత్ర జలంబు లాబిడ కూర్చున్న చోటునకు మిక్కిలి దాపుగా నుండిన యొక శివలింగ మూర్ధమునం బడియెను నాఁడుదయాదిగా నాహారంబు లేక తపించుచు నారాత్రి కడకును బొత్తుగా నిద్రబట్టక నచ్చటికి వచ్చియున్న శివభక్తులు చెప్పుకొను శివపురాణ కథల వినుచు నెట్లో యారాత్రి కడపెను. మరునాఁడా పాపిని శైలంబు నవరోహించి యొక చెట్టు నీడయందుఁ గూర్చుండి వారివారిని వేడి, కొన్ని ఫలంబులు సంపాదించు కొని వానిం దినుచున్న సమయంబున తొలినాఁటి నుండియు గొంతుఁదడు పకున్నదిగాన కంఠనాళమున ద్రవము లేక గొంతడంచుకొనుటచే నూపిరి దిరుగక నటునిటుం దన్నుకొని క్రిందఁబడి ప్రాణంబులు

విడిచెను అపుడా పాపజీవిం దెచ్చుటకు మదీయ కింకరులు పోయిన

దుశ్శీల. శివసాయుజ్యంబు నొందుట.

శివ దూతలు చనుదెంచి మద్భటులం జేరరానీయక, ఓయమ దూతలారా! ఈస్త్రీ మీరు తలంచిన లాగున, శమన లోకంబున వసింపఁదగినది కాదు. మిక్కిలి పుణ్యాత్మురాలు. ఎట్లనఁగా. నీమహా శివ రాత్రి దివసంబున లభింపకఁ బోవుటచే నైనను, గొంతున నీరుఁబోయక, శుష్కోపవాసముండెను. రాత్రికడకును. నాకలి బాధచేనైనను తెల్లవారుదనుకఁ, గంటిపై ఱెప్పవాల్పక జాగరణముం జేసెను. రాత్రి యంతయును శివపురాణము లాలకించెను. శివరాత్రి ప్రదోష కాలమున బ్రాహ్మణునిపైఁ గోపముచేనైనను, నతఁడొసంగిన బిల్వ పత్రంబులును శుద్ధోదకములును శివలింగముపై వైచెను. ఇదియుఁ గాక శ్రీశైలంబునఁ దనువు విడిచెను ఇంతకంటె మహాపుణ్య కార్యమింకేదికలదు? ఈ కారణమున మున్నట్టి మహాపాతక కృత్యములు చేసియుండినను, నెంత నీచముఁగా బ్రవర్తించి యుండినను నవి యన్నియు సూర్య రశ్మిచేఁ దొలంగి పోవు చీకటివలె నశించి పోయినవి. మిక్కిలి పరిశుద్ధురాలయ్యెను. ఈపుణ్యవతి శివ సాయుజ్యము నొందుట కర్హురాలయ్యెను. మీరీ సూక్ష్మము నాలోచింపక వ్యర్థముగా ప్రయాసపడి యింతదూరము వచ్చితిరి. మేమీమె నిపుడే పూవుల తేరుపై నెక్కించుకొని కైలాసమునకుం బోవుటకై వచ్చితిమి. కావున మీరు శీఘ్రముగాఁ జని, మఱి యేదేనియుం గార్యమునుఁ జూచికొనుఁడు. అని చెప్పి యాశివదూత లామెను పుష్ప రథంబుపై నిడికొని, నాదూతలు నివ్వెరపడి మారుఁబలుక లేక యట్టెచూచుచుండఁ గొని పోయిరి తద్వృత్తాంతమును భటులు నాకెఱింగించిన నేనాశ్చర్యమొంది యా శివ రహస్యంబు నెఱుంగ శక్యముకాదు గదా! యని యెంచి పరమేశ్వరుని దయాళుత్వంబు నభినందించి సంతసించిన వాఁడనైతిని సానందముని చంద్రా! ఇట్టి పసి వర్ణింపరాని పాపకృత్యములు చేసిన యాబ్రాహ్మణస్త్రీ తన పాపఫలము ననుభవింప వలెననిన నెన్ని మహా యుగంబులకునుఁ దీఱునవి కావు. అట్టి ఘోరపాతకము లన్నియు, నప్రయత్నముగా

లభించిన యల్పమగు శివపూజా విశేషంబునఁ దొలంగి శాశ్వత శివసాయుజ్యముం జెందెను. ఇపుడు మీరు కనుచున్న యీపాపులం దొక్కఁడైనను, నాబడ చేసినంత మాత్రపు మంచికార్య మైనను చేసి యెఱుంగరు. ఇట్టి వీరి కెవ్విధమున మేలుకలుగును? ఇట్లే మున్ను మఱియొక చండాలస్త్రీ గోకర్ణ మహాస్థలంబున శివరాత్రి నాఁడు కాకతాళన్యాయంబుగాఁ బొసఁగిన శివపూజా విశేషంబుచే ఘోరపాపంబుల వలన విముక్తయై. ప్రాణాంతంబున, గౌతమాది మహర్షిపుంగవ సముదయంబు బరుదంది చూచుచుండ, శివసాయుజ్యంబునుఁ బొందె. నది యట్లుండెంగాని యొక భ్రష్టురాలగు రాజపత్నికి నాయాసంబుగా శివలోక వాస మహాపుణ్యము సమకూఱె నది మిగుల విచిత్రంబగు విషయంబగున, యమునింజూచి, యాచరిత్రం బెఱుంగ వలయుం జెప్పుమని యడుగుటయు, బ్రీతుండై దండధరుం డామునిమండనున కిట్లనియె. నయ్యా! మునివర్యా యాకథవినుండు.

యముఁడు సానందునకు వసువర్ధని చరిత్రముం జెప్పుట.

కళింగ దేశమున మున్నొక రాజుండెను. అతనిపేరు ధర్మపాలుఁడు. పేరునకుం దగినట్లే యతఁడు, దయ, సత్యము, నీతి, ధైర్యము, శౌర్యము, నౌదార్యము, దేవభూదేవ భక్తి, పరోపకారచింత యాదిగాఁగల శుభలక్షణములు కలవాఁడై, ధర్మముఁ దప్పక ప్రజలను తన బిడ్డలవలె జూచికొనుచు, రాజ్యపాలన మొనర్చు చుండెను. అతని ధర్మపత్ని పేరు వసువర్ధని యాబిడలక్షణములును, గుణములును, భర్తయొక్క గుణలక్షణముల కెదును సంబంధము కలిగి యుండనివై యుండెను ఆబిడ మిక్కిలి సౌందర్యమునంగల చక్కని చుక్క. మంచి ప్రాయమునంగలిగి యౌవన మదముచేఁ దనపతి వలని సురత సుఖంబుచేఁ దనివి నొందక, పరపురుషవాంఛ హెచ్చి సమయము తటస్థించి నపుడు, కులగోత్ర, రూప, యోగ్యతలు పాటింపక యెవఁడు లభించునో, వానితోఁ గూడి క్రీడించి యప్పటికపుడు కొంతతృప్తి నొందుచుండెను. కాని యంతమాత్రమున నైన నిలుపక యావాంఛ నానాటి కామెకు మితిమించి పోయెను. ఇట్లుండగా నంతఃపుర వాసినియైన తనకుఁ దగిన పురుషుఁడు లభించ

కుండుటకుం జింతించి నిరాటంకముగా ప్రతి దినంబునుం, దనమేడ కరుదెంచు పౌరోహితుని, వయసు వానిం దన చాతుర్యంబున వశ్యునిగాఁ జేసికొని, యతనింగూడి యభీష్టంబుఁ దీర్చుకొనుచుండెం గాని యందువలన నామెకుం దృప్తికలిగినది కాదు. ఒకనాఁడు కొందఱు బోయవాండ్రా రాజుం బొడగన నరుదెంచి, వారువారు తాము తాము తెచ్చిన కానుకలు సమర్పించినంత, రాజు వారలనుం దోడ్కొనిపోయి పాకగేహంబున భోజనముం బెట్టింపుఁడని పరిచారకుల కాజ్ఞాపించిన, వారువారిం బాక మందిరంబుచెంత విడిచి వంటలవానికి రాజాజ్ఞం దెలిపి వచ్చిరి అట్టిసమయంబున వసువర్ధని మేడపైనుండి, యాబోయలలో మంచి యౌవనవంతుఁడును, చక్కనివాఁడును నగు నొక్కనింగని, వానింబొంది సుఖింపనెంచి, మేడమీఁదికి రమ్మని సైగఁ జేసిన, రాజపత్ని పిలిచి నపుడు పోకున్న నేమి యుపద్రవమోయని వాఁడచ్చటనుండి యాబిడ చెంతకుం జనినఁ, దటాలున నామె వానిం గౌఁగిలించెను. రాజుభార్య యటులం జేయుట కతఁడు భీతిల్లి గడగడ వడంకుచున్న వసువర్ధని వానిభయంబు మాన్పి శయ్యకుం దార్చి, వానితో సురత కేళిం బెనంగుచున్నతఱి, తలఁపని తలంపుగా రా జంతఃపురంబునకుం జనుదెంచి వారివిం బొడఁగాంచెను. ఇంకేమిగావలయును? అపు డతని హృదయం బెట్లుండును? చెప్పవలయునా! రాజునకు మితి మీఱిన కోపము కలిగెను. అతని ముఖ మెఱ్ఱఁబాఱెను కన్నులయందు విస్ఫులింగకణము లురులు నట్లుండెను బొమలు ముడివడి కటము లదరసాగెను. తక్షణమే యతఁడు నడుమునకుం గట్టుకొనియున్న వరమునుండి వాఁడియైన కరవాలమును జరాలునం దూసి, వారి నిరువురను నొక్కవ్రేటునకుం దెగవ్రేయనెంచి, ఖడ్గంబును మీఁదికెత్తెను. ఆసమయంబున బోయవాఁడు శయ్యనుండి దిగి నిలువంబడి తనకు మృత్యువాసన్నంబయ్యెనని నిశ్చయించి, చేయునది లేక భగవంతుని ధ్యానించుచుండెను. వసువర్ధని యున్ననో, తానుచచ్చినదియు బ్రతికి యున్నదియు నిశ్చయించుకొనలేని స్థితిలోయుండెను. ఆమె మోఁదలు గడగడ వడంకఁదొడంగెను. తాను చేసినది మిక్కిలి గొప్పనేరము. స్వయముగా

రాజు తనకన్నులతో కనుంగొనియెను. ఇంక నేమిచేయుటకును, నేమిచెప్పుటకును నాధారమేమి గలదు? రాజు నడ్డగింపఁగల వారెవ్వరు? ఆమెకు కన్నులు పచ్చనై భ్రమగమ్మెను. వసువర్ధనీ కిరాతపులట్టి దుర్దశలో యుండంగ రాజు వారిని ఖండించెనా? లేదు లేదు. తెగవ్రేయుట కతఁడు కత్తి పైకెత్తఁగనే యొక యోచన కలిగెను. కోపముచే వీరింజంపితి నేని, జీవహింసఁ జేసిన పాపమునకు నేను పాల్పడవలసి వచ్చును. అంతే కాదు. స్త్రీహత్యయు, నరహత్యయుం గూడఁజేసిన వాఁడనగుదున. ఇటు వీరింజంపి యీమహా పాతకమునకు నేనేల పాత్రుఁడను కావలయును? అందువలన (చంపుటవలన) నీదురాత్మురాలు, యోగ్యురాలగు చున్నదా? ఏమియుం బ్రయోజనము లేదని యతఁడు తనలో తానాలోచించెను. వెంటనే ఖడ్గమును మరల వరలోనిమిడ్చి యపుడే సభాకూటంబునకుం జని భటులనుఁ బిలిచి యాబోయవానితో కూడా తన భార్య నాఁ ముమమున పురంబు వెడల నడచిరండని యాజ్ఞాపించెను. వారపుడే వసువర్ధనిని కిరాత సహితంబుగా పురంబుననుండి వెడలంగొట్టి, యింక నీ దిశకు వచ్చినం జంపుదుమని చెప్పివచ్చి యావృత్తాంతంబును రాజుగారికెఱిఁగించిరి. నీతిసంతుఁడగుటంబట్టి యారాజు ధర్మాధర్మ వివేచనం జేసి వెడల నడచెను, గాని, మఱియొకఁడైనచో, వసువర్ధనియుం గిరాతుండునుం జచ్చియే యుందురు. భటులు తమ్ము పురంబునుండి వెడలఁగొట్టి నందుచే చింతింపక వసువర్ధని మిక్కిలి సంతోషముం జెంది బోయవానిఁ గూడి, సింహములు, పులులు, యెలుగు బంట్లు, రేచుకుక్కలు, శివంగులు, ఖోడేండ్లు, జింకలు, కుందేళ్లు, మృగాలు, మొదలగు మృగంబులు గలిగి భయంకరముగాఁ నుండు నరణ్యమునకుంబోయి కుటీరము నేర్పఱుచుకొని, యాబోయవాఁడు వేటాడికొని వచ్చిన మృగముల మాంసమును దిని మద్యపానము సేసి, వానితోఁగూడి క్రీడావినోదంబులఁ గాలముం గడపుచుండగా కొంతకాలమున నాబిడ బోయవానివలన గర్భము ధరించెను నవమాస పూర్తికానున్న సమయంబున వసువర్ధని యొకనాఁడు వానుక మేపకు సమీపంబుననుండు కొలంకునకు నీరుంగొన వచ్చుటకై చని

యెరు. ఆసమయంబున నొక బ్రాహ్మణుండు, బ్రహ్మచారి, సమిత్కుసుమఫలార్థంబుగా వచ్చి వసువర్ధని నీళ్లుతేం బోయిన కొలంకు వెంబడి దిరుగుచుండెను. అభినవమన్మథాకారుండైన యా విప్రకుమారునిం

వసువర్ధనీ సంగమంబువలన బ్రాహ్మణ కుమారుండు మృతుండగుట.

జూడగనే, తాను పూర్ణగర్భవతిగా యుండియు, నావసువర్ధని కతనిం బొందవలయునని కోర్కి జనించి. తన చాతుర్యపు మాటలచే నతని వశీకృతునింగాం జేసికొని యాసమీపంబునందలి యొక పొదరింటికిం దార్చి, వానింగూడి సురత క్రీడలం దేలిన, పూర్ణ గర్భవతీ సంగమ దోషంబువలన నావిప్ర కుమారుండు తత్క్షణంబ మృతినొందెను. అయ్యో! పాపము వాని గతియెట్లైనది? దైవతంత్రమున కెవరేమి చేయంగలరు. హఠాత్తుగా నటుల ప్రాణములం గోలుపోయిన విప్రునింజూచి మిక్కిలి భయముంజెంది యొడలు వదరుట వలనను, సురతక్రీడా విశేషంబున నొడలు మిగుల నలయుట చేతనుం దత్క్షణంబున వసువర్ధనికి గర్భవేదన గలిగి యొకటి రెండు నిమిషముల లోపల నొక పురుష శిశువుకలిగెను. అంతనయ్యింతి యాశిశువు నొక్కపుట్టచెంతం బారవైచి, ఇంటికేగినచో బోయవాండెట్లేని యావృత్తాంతంబు నెఱింగెనేని రాజుచేం దప్పిన చావు బోయచేం గలుగుట నిశ్చయము. కావున నింక వాని యొద్దకుం జనంగూడదని యోచించియటనుండి కదలిపోవుచు, ద్వీపాంతరములకు వ్యాపారార్థముగాం బోవు వర్తకుల సమూహంబునం గలిసికొని, వారిలోని కొందఱు కోడె కాండ్రను లోంబఱచుకొని, వారి సహాయంబున నోడయెక్కి తానును ద్వీపాంతరములకుం బోయెను. ఇక్కడ నడవిలో బ్రాహ్మణకుమారుండు చచ్చినంతట నతనితోం గూడి పత్రంబులు సేకరించుటకై యడవికివచ్చి, యందందు నాకులు గోయుచుండిన విధవరాలగు నా బ్రహ్మచారితోడ బుట్టువు పుల్లెలకుం గొన్ని యాకులు గోసికొని, తమ్ముని కొఱకు వెదకుచుం జనుదెంచి కొలంకు సమీపంబునం జచ్చిపడి యున్నవానిం జూచి, అకటా! దైవమా! యని మూర్ఛాక్రాంతురాలై క్రిందంబడి, కొంత సేపటికిం దెలివినొంది, యనేకవిధంబుల నతని చర్యలం దలంచి వాపోయి వాపోయి తుదకు చే

యునది లేక, యాయడవి యందలి యెండు కట్టెయలేరి చితిఁజేర్చి, యందు సోదరునినిడి దహించి యాకొలంకున స్నానముఁ జేసి వచ్చి నదారిం బట్టి పోవుచుండెను, అపుడచ్చట వసువర్ధని పారవైచి పోయిన శిశువు మిక్కిలి వా పోవుచుండెను. ఆబ్రాహ్మణ వితంతు వది యేమని డాయంజని శిశువగుటంగని యాశ్చర్యంబు జెంది యెత్తుకొని, తమ్మునిం గోలుపడి యతఁడు చచ్చిన కారణం బెఱుఁగకవా పోవుచున్న నాయందు కనికరించి, ఈశిశువు నీశ్వరుండే నాకొసంగెంగాఁబోలునని యెంచి, మహారణ్యంబున ననాథుండై యున్నందున నాకీనన్మ్లేచ్ఛ కులంబునఁ బుట్టినవాఁడు కాఁడని నిశ్చయించి, యింటికిం గొంపోయి జలకం బార్చి, సంకరకుల జాతుఁడై యుండు ననితోఁచినందున, వా బాలకునకు శంకరుండని పేరిడి పిలుచుచుం బెంచుచుండెను. సానందముని చంద్రా! అప్పటిలో వసువర్ధని గతి యే మైనదియు వినుండు. ఆలాగున నోడబేర గాంద్రతోఁ గూడి యోడనెక్కి ప్రయాణము సాగించు చున్న సమయంబున నున్నట్లుండి యొక మహావాతము ప్రభవించి వీఁచుచున్న సముద్ర మల్లకల్లోలమై యా వసువర్ధని యెక్కియున్న యోడ ప్రబలమైన యాగాలికి నిలువఁ జాలక యొడ్డగిల్లి తటాలున మునిఁగి పోయెను అయోడ యందుండి చచ్చిన పాపాత్ములం గొని వచ్చుటకు మృత్యులేగి, యొక్కరొక్కరినిఁగా, పాశంబుల బంధించుచు వసువర్ధనిం బట్టి కట్టంబోయిన యంతలో దిగ్గన నంతరిక్షంబున నుండి శివదూత లరుదెంచి, వలదు వలదు మీరా పుణ్యాత్మురాలి జోలికిం బోవలదు. ఆమెపా

### వసువర్ధని శివ సాయుజ్యంబు నొందుట.

వన స్వరూపురాలు. నరకలోకమున కామె రావలసిన నిమిత్తము లేదు. ఈ పుణ్యాత్మురాలినిఁ గొనిరమ్మని పరమేశ్వరుండు మమ్మిటకుం బుత్తెంచెను. మేమీయామెను కైలాసంబునకుం గొంపోయెద మని చెప్పినా దూతలను నిరాకరించి వసువర్ధని జీవ శరీరమునుం బుష్పకవిమానంబుపై నెక్కించి కొనిపోవుచున్న నాదూతలు వారింజూచి, అయ్యలారా! ఈస్త్రీ యెపుడుగాని యేపుణ్య కార్యమునుం జేసినది లేదే! మీరేమి ధర్మము నెఱింగి యీబిడను శివ లోకంబునకుం

దోడ్కొని పోయెదరు? ఇదియేమి యన్యాయము? ఈపెచేసిన పుణ్యమెద్దియో దయచేసి వివరింపుఁడని ప్రార్థింపఁగా, వారు ప్రసన్నులై యో యమకింకరులారా! ఇదిమహా సూక్ష్మమైన ధర్మము. దీని నందఱును దెలిసి కొనంజాలరు వినుండు లోకంబున నెవ్వఁడు గాని, శంకర శంకరా యని స్మరించిన మాత్రముననే చంద్రశేఖరుఁడటుల తలంచిన వారి సకల పాపములును తొలంగించి సాయుజ్య మొసంగుచున్నాఁడు. అట్లుండఁగా. అట్టి పావనమగు శంకర నామముం బొందిన వానికి జననీ జనకులగు వారు శివ సాయుజ్యముం బొందుట రుదుగాదు. ఈ పుణ్యాత్మురాలి గర్భంబునం గలిగిన వాఁడు, శంకరుఁడను పేరం బరగుటం జేసి, వానితల్లియగు నీమె యెట్టిపాపములం జేసి యుండినను, నవియన్నియుఁ దొలంగి మిక్కిలి పుణ్య స్వరూపిణి యయ్యెను. ఇది ధర్మ సూక్ష్మము. పరమేశ్వరుఁ డిది యెఱింగిన వాఁడు. కావున నీమెం దన లోకంబునకుం దోడుకొని రమ్మని మమ్ముం బనిచె నని చెప్పి శివలోకంబునకుం బోయిరి తరువాత నీవృత్తాంతం బంతయు నేను మద్భటుల వలన నెఱింగి కొంటిని. శివ మహాత్మ్యం బిట్టిది. శివ నామోచ్చారణ ప్రభావం బిందువలన నందఱకుం దేటపడంగలదు. ఇచ్చటి పాపకర్ములు స్వప్నమునం దేనియు నొకనాఁడైనను, నొక మారైనను, శివా! యని యెఱుంగరు. వీరి పాపము లెట్లు తొలంగును? వీరు తామేవిధంబున మేలునొందఁగలరు? ఇట్లేమఱియొక విచిత్రంబగు నితిహాసంబుగలదు. తొల్లియొక రాజపుత్త్రుండు వేశ్యాలోలుండై యుండి భస్మప్రభావంబు వలన తనయుంపుడు కత్తెయగు వెలయాలితోఁగూడిశివ సాయుజ్యంబు నొందెనని చెప్పిన, యమునిఁ జూచి ధర్మరాజా! భస్మప్రభావంబునువిన వేడుకయగుచున్నది. యా యితిహాసంబును వివరింపు మనిన, శమనుం డిట్లనియె.

## శమనుఁడు సానందునకు రాజశేఖరుండను నృపకుమారుని చరిత్రంబుఁ జెప్పుట

యమునానదీ తీరంబున కాంచనాకరమను నొక పట్టణంబుండెను. అది వేదస్వరూపులును, సదాచార సంపన్నులు నగు బ్రాహ్మణోత్తముల చేతను, ధైర్య, స్థైర్య, శౌర్య, దయా, ధర్మ నిరతులగు

రాజులచేతను,ధన కనక రత్న వస్తువాహన భోగ పరిపూర్ణులగు వైశ్యులచేతను, సురధరాసుర భక్తి తత్పరులై సకల సంపదలుం గలిగి వర్థిల్లు శూద్రులచేతను, గుఱ్ఱములుఁ నేనుఁగులు, నొంటెలు, తేర్లు, ధనాగారములు, నాయుధాగారములు, మిద్దెలు, మేడలు, నుద్యానవనములు, నారామములు, పూవులతోటలు, నడబావులు, కృతక్రాదులు మొదలగు వానిచేతను, నొప్పుచు సకల సంపత్సమృద్ధమై పురంబుల కెల్ల నాయకమణిగా నొప్పుచుండును. రాజులకుం గలుగవలసిన సకల శుభలక్షణంబులునుఁ గొఱంత లేక యమరియున్న ధర్మశీలుండైన సుధాముఁడను తేఁడాపురంబున కధిపతియై న్యాయంబుఁ దప్పక రాజ్యపాలనంబుఁ గావించుచుండెను, ఆరాజున కొక కుమారుఁడుండెను. వానిపేరు రాజశేఖరుఁడు. అతఁడు యౌవనవంతుఁడైనది యాదిగా రాజ్యకార్యముల యందు తలంపుం గొనక వేశ్యాలోలుఁడై యెల్లపుడునుఁ గంటికింపగు వెలయాండ్రం గలిసి తన యిచ్చ వచ్చినట్లు తిరుగుచుండెను. మేలైన వస్త్రములు గట్టి భూషణములు ధరించి సుగంధ లేపంబులలంది పుష్పదామంబులు శిగయందును కంఠంబునను నలంకరించుకొని, కుంటెన గాండ్రును, హాస్యగాండ్రును వెంటవచ్చుచుండఁగా విలాసంబుగా వేశవాటికలం దిరుగుటకంటె యతనికి మఱియొక పనియందు మనసు చొరకుండెను. ఇట్లుకొన్నాళ్లు జరిగినంతట యావేశ్యాంగనలలో మిక్కిలిచక్కనిదియు యౌవనవతియునగు సునందయను దానియందతని కెక్కువ వలపుఁ గలిగి దాని నెప్పుడును నెడబాయక గూడి మదన కేళిందేలి యానందించుచుండెను. వేయేల సునందనయనిన నతనికి ప్రాణమనియే చెప్పవలయును. సునంద యొకనిమిషము కానఁబడకున్న నతని ప్రాణము పోవు నట్లే యనవలెను. ఇట్లతఁ డాకాంతం గూడి భోగించుచుం దృప్తుఁడై యుండు కాలంబున నొకనాఁడు సునందపైఁ బాలయలుకఁ జెంది యా బిడను విడిచి తటాలున లేచి యతఁడటనుండి యింటికిం జనియెను. ఆలాగు తానలిగి పోయిన దైన్యముం జెంది సునంద తానెడబాసిన విరహవేదనను సైఁపఁజాలక మరలఁ దనయింటికి రప్పించుకొనుటకై నానాప్రయత్నములుం జేయుననియు, నాలతాంగి యటుల నానా

చిక్కులుం బొందిసంతటంగాని దాని యింటికిం బోఁగూడదనియు, నతఁడు పంతముఁగొని యుండెను. కాని, పాపము అతని పంతము కొనసాగినది కాదు. ఎందువల్లననఁగా యతఁడు తలంచినట్లు సునంద చేయలేను ఇష్టమున్నచోఁ దానే రాఁగలఁదు నేనీతనిం బ్రార్థింప నేల యని మిన్నకుండెను తాను తలంచినట్లుగాక యావేశ్య నిబ్బరముగా నుండుటచే నది రాజశేఖరునికి మిక్కిలి కష్టముగాఁ దోఁచెను. తానుగాఁ బోయిన చులకఁదన మగునని యొకమారును, పోకున్న మనస్సు నిలువదని యొకమారును, నింకనుం గొన్ని దినంబులు నిరీక్షించెదను. నామైత్రిని విడిచి సునంద యెన్నాళ్లు తాలిమితో నుండునో చూచెదఁ గాక యని యొకమారును, నిట్లు పలు విధములుగా యోచించు చుండెను. గాని యాబిడ వద్దనుండి యేకబురును వచ్చినది కాదు. అట్లే కొన్ని దినములు గడచెను. అంతట నతఁడాబిడంజూచి దానితో రతి సల్పకుండిన నింకఁ దాళఁజాలననియు, నాసుందరాంగి చూచుచుండఁగా వీథియందుం జనుచున్నంగాంచి తనయందుఁగల మోహముం బట్టఁజాలక తన యొద్దికివచ్చి ప్రార్థించుననియు, నపుడది సాకుగా దానియింటికిం బోవచ్చుననియుఁ, దలంచి యొకనాఁడు చక్కఁగా శృంగారించుకొని వేశ్య వాటికకుం బైనమై, రాజవీధిం జనుచుండెను. అపుడతనికి మార్గంబున నొక సిద్ధుండెదురుపడి యాశీర్వదించి కుమారా ! నీకు స్త్రీ సంబంధంబైన వ్యామోహము మనంబున నాటియున్నట్లు తోఁచుచున్నది. నీవు మిక్కిలి వలచియున్న కాంత నిన్నువిడిచి యుండుటచే తత్సంబంధమగు వ్యాకులముం జెంది కుందుచున్న వాఁడవని నేను తెలిసికొంటిని. నీవు వలచిన యెమ్మెలాఁడి నీకు దక్కఁగలదు భయపడకు మని చెప్పెను. సిద్ధుఁడు తనవృత్తాంతంబు నంతయు నెఱింగి పూసఁగ్రుచ్చినలాగునం జెప్పినందున రాజశేఖరుఁ డాశ్చర్యమొంది, స్వామీ ! మీరుచెప్పిన తయు నిజమే! నేనాలేమయందు మిక్కిలి వలపుంగొనియున్నాను. కాని యదినన్నొల్లకున్నది ఏమి సేయుదునని కడుదీనముగా నడచిన వృత్తాంతం బంతయు సిద్ధునకుం దెలియపఱచెను. ఆ సిద్ధుఁడు రాజశేఖరుని యందు దయఁ గలవాఁడై, కుమారా ! చింతింప

కుము నీకుమేలగు గాక. నీకోరిక దీరునట్లు చేసెదనని తన కక్షపాల (సాకకుం దగిలించుకొని యున్న సంచి) నుండి యొకవిభూతి యుండం దీసి, రాజశేఖరునిచే నొసంగి, దీనిని నీయొద్ద నుంచుకొనియుండి, నీకే యువతిపైం బ్రియంబు గలుగునో దాని దేహంబునకీ విభూతి యొకింత రాచితివేని యదిమరల నిను వీడక నీయిచ్ఛానుసారంబుగా నీతోంగూడి రతి క్రీడలం దేలుచుండును కాంబట్టి యిది జాగ్రతగా నుంచుకొని యుపయోగించి యభీష్ట సిద్ధినొందుమని చెప్పి సిద్ధుండు తన దారిం బోయెను. అంతట రాజశేఖరుండు సంతోషమునుం జెంది తొలుత నావిభూతిని సునందయందే యుపయోగింప వలయునని నిశ్చయించి, తానువచ్చునట్లు దానికిం జెప్పి పంపక మిన్నకుండి చీక టి పడినంతట మజ్జన భోజనాదులు నెరవేర్చుకొని వెంటనెవ్వరును లేక యొంటరిగా బయలు వెడలి యావేశ్యల గేహంబులకుం జను మార్గంబు లన్నియు నెఱింగియున్న వాండగుటచే రాజమార్గంబునం గాక సందు గొందులంబడి చీకటిలో గుంట మిట్టలు కానరాకున్ననుం నెట్లో వెతలుపడి సునంద యింటి పెరటిదారిం జొచ్చిరాదలంచి

—— రాజశేఖరునకు సర్పదష్టం డగుట. ——

వచ్చుచుండెను. ఆలాగు కామాంధ కారముచే జయింపంబడిన గాఢాంధకారమునం జనుదెంచు నతని నెచ్చటినుండియో పోవుచున్న తాంచుబా మొకటి కాలు తగులుటచేం గినిసి వానికాలి బొటనవ్రే లుంగఱచెను. అట్లు సర్పదష్టుండైన రాజశేఖరుండు దైవికముగాం దనకుం జేకుఱిన విపత్తును గుఱించి యోచించి, విషపరిహార క్రియ లొనరింపం బోయినచోం దన కిడంక (యత్నము) వ్యర్థమగునని యుం త్వరితముగా సునందం జేర నరిగి దానితో సురత క్రీడలందేలి తృప్తి నొంది యనంతరము చికిత్సం జేయించుకొనియెదం గాక. యని నిశ్చయించి బిరబిర సునంద గృహంబునం బ్రవేశించెను. ఆబిడ మజ్జన భోజనము లొనరించి తల్పంబుపై హాయిగా శయనించి యుండెను. రాజశేఖరుండు సునందను చూడంగనే తటాలునం దనయొద్దనుండిన సిద్ధుండిచ్చిన విభూతిం గొంచెము చేతంగొని దాని దేహంబునకుం బూసెను తక్షణంబున సునంద రాజకుమారునిపైం బట్టరానివలపునుం

జెంది సన్నిహితుఁడై యున్నయతనిం గూడి మదన క్రీడలం దేలి వినోదించుచుండెను. రాజశేఖరుఁడు తనకుఁ దటస్థించిన యుపద్రవము నాబిడతోఁ జెప్పిన తనతో క్రీడించుటకు సమ్మతింపకఁ బోవునని సంశయించి చెప్పినవాఁడు కాఁడు. విధిచెయిదమునుఁ దప్పించుకొన నెవరి తరము? అతఁడు కామ సుఖం బనుభవించిపోయి విష పరిహార చికిత్సకుం బూనుకొని యుండెను. కాని రాజశేఖరుని తలంపు నెరవేరినది కాదు. అయ్యవారు వచ్చువరకును నమావాస్య నిలిచి యుండునా? అతనికా క్రూరసర్ప విష మప్పటప్పటికిని రక్తనాళము లన్నిటియందును వ్యాపించెను. అట్టి విషపూరిత దేహుఁడైన యతనితో సంగమించుటఁ జేసి యావిషము సునందకుచు నంటి దేహంబునఁ బ్రసరించెను. వారిరువురు నట్లు సర్ప విషమువలనఁ గలిగిన తాపముచే మూర్ఛితులై యిరువురుఁ గొన్ని నిమిషములలో మృతి

## సర్ప విషమువలన మృతినొందిన సునందా రాజశేఖరులు శివసాయుజ్యంబు నొందుట.

నొందిరి. వారిరువురుం గడుఁ బాపాత్ము లగుటం జేసి వారిం గొనివచ్చుటకు నాకింకరులు పోయిన, శంకరుని కింకరులును నచ్చటికిం జనుదెంచిరి నాభటులు వారలంగని మీ రేల వచ్చితిరని యడిగిన వారలును నా దూతల నట్లే యడిగిరి. రుద్రభటులారా! వీరు పెక్కు పాపకృత్యములు చేసినవారు. శమనుని యుత్తరువుమేరకు మేము వీరిని సంయమనీపురంబునకుం గొంపోవ వచ్చితిమని చెప్పిరి. శివభటు లామాటలువిని చాలుఁ జాలు వీరేల పాపాత్ములైరి? మీరు పొరబాటుఁ బడితిరి కాఁబోలు. పొండు పొండు. వీరిరువురును శిద్ధత్తత్తమైనదియు, పావనమైనదియు నగు విభూతి నలందుకొని మృతిఁ జెందిరి. ఆవిభూతి యొక్క మహిమ వలన వీరు చేసిన పాపంబు లన్నియు నశించి పుటముం బెట్టిన బంగారము వలె స్వచ్ఛమైన పుణ్య స్వరూపములు గలవారలైరి. మహాదేవుని యానతి వలన మేము వీరిం గొనిపోవుటకు వచ్చి యున్నారము. ఇంక మీరు పోవచ్చును. అని చెప్పి వారిని విమానంబులపైఁ గూర్చుండఁ బెట్టుకొని శివలోకమునకుం బోయిరి. ఆవృత్తాంతము మద్భటులు వచ్చి నాతోడఁ జెప్పిన శంకరుని కరుణా విశేషంబును, విభూతి భా

రణ ప్రభావంబునుఁ దలంచి వినుతించి యెట్లుగాని అనఁగా, శివుని నారాధించినను, శివ సంబంధములగు విభూతి, రుద్రాక్ష, బిల్వపత్రాదులు ధరించినను, నట్టివారికిఁ దప్పక పరమశివుఁడు మోక్షంబొసంగుట తథ్యంబని తలంచి సంతసించితిని. ఓగుణనిధీ ! ఋషికుల వరేణ్యా! భస్మ ప్రభావము వింటిరికదా! రుద్రాక్ష యొక్క ప్రభావముం జెప్పెద వినుండు తొల్లి యొక గ్రామంబున నొక శివభక్తుఁడు

## రుద్రాక్షను ధరించుటచే రజకుండు శివసాయుజ్య మొందుట.

తన వస్త్రము చెఱఁగున నొక రుద్రాక్షముం గట్టి యుంచుకొని వలసినపుడెల్లం గొని పూజించు చుండెను. ఒకనాఁడతఁడు తన వస్త్రము నుతికి తెచ్చుటకు చాకలివాని వద్ద నిచ్చెను. కాని యందు తాను ముడి యుంచుకొని యుండిన రుద్రాక్షమునువిప్పి తీసికొనుటకు మఱచెను. చాకలివాఁడా గుడ్డ నుతుక బోయినప్పు డందుఁ గట్టఁబడి యున్నచిఱు మూటంగని దానిని విప్పి రుద్రాక్షమున్న, నదిమరలఁ గొనిపోయి యాభక్తుని కొసంగం దలంచి తనతలపాగ చెఱఁగున ముడిచి కొని వస్త్రములుదికి యారవైచి మడిచి మూటఁగట్టి భార్య చేనిచ్చి నీవీగుడ్డల మూట నెత్తి కొనియింటికిఁబొమ్ము. నే నీసమీపంబునఁ గలయడివికిం జని రాత్రివంటకుం గావలసిన కట్టియలం గొట్టి తెచ్చెదనని చెప్పి యనిచి, గొడ్డలియు దారముం గొని యరణ్యంబునకుం బోయెను. చాకివాఁ డడవియం దందుందిరిగి యొక యెడబాగుగా నెండిన యొక చెట్టుంగాంచి దీనినిం గొట్టితినేని పదిదినముల వరకునుఁ గట్టియలు సమృద్ధముగా నుండునని యోచించి, శివశివాయని మాటిమాటికి నుచ్చరించుచు మహా ప్రయాసముతో యాప్రమానును నఱికి క్రిందఁపడవేసెను కాని యందలి పెద్దకొమ్మ యొకటి పెళపెళ విఱిగి తటాలున వానిపైఁ బడియెను. ఆదెబ్బవలన రజకుఁడు వెంటనే మృతినొందెను. అపుడు మద్భటు లచ్చటికిఁ బోయిరి. శివ భటులును వచ్చిరి. వీరికిని వారికిని వివాదమేర్పడి, వీఁడు కడులోభి పాపాత్ముఁడు, వీనిని శమన పురికిం గొని పోవలయునని నాకింకరులును, వీఁడు కడు పుణ్యాత్ముఁడు వీనియందెన్ని పాపములున్నను నన్నియు నశించి పోయినవి. శర్వుని యుత్తరువు మేరకు

మే మితని శివలోకమునకుం గొనిపోయెద మని కరకంఠుని దూతలును గొంతసేపు పోట్లాడిరి. కాని తుదకు తేజో బలయుక్తులగు శివభటులే గెలిచిరి. వీఁ డెట్లు పుణ్యాత్ముఁ డయ్యెనని మద్భటులు వారల నడిగిన వీఁడ పావనమైన రుద్రాక్షను శిరంబున ధరించి, శివస్మరణం జేయుచు మృతి నొందెను. ఆరుద్రాక్షము యొక్క మాహాత్మ్యమువలన వీని పాపములన్నియు క్షయించినవి వీని కీశ్వరుఁడు సాయుజ్యంబు నొసంగెను. అని చెప్పి వానిఁ దోడ్కొని కైలాసమునకుం బోయిరి. ఇది రుద్రాక్షను ధరించుట వలనఁ గలిగెడి ఫలంబున కుదాహరణము. మహాత్మా! ఇవి కడు నల్ప కార్యములుగాఁ దోఁచినను, నీ క్రియల వలనఁ గలిగెడి ఫలము కడుగొప్పది. ఇట్టి యల్ప కార్యములగు, భస్మ, రుద్రాక్ష, బిల్వ దళముల నొకనాఁడైన నీపాపాత్ములు ధరించియుండ రాదా! వీరదియుం జేసినవారు కారు. వీరి కెవ్విధంబున మంచి కలుగును? అప్రయత్న శివపూజా ఫలంబు వలనం దొల్లి హంసంబునకును గిరాతునకును నీశ్వరుండు సాయుజ్యం బొసంగె నాచరిత్రంబు కడువిచిత్రమై యుండును. దాని నెఱిఁగించెద. నాలకింపుఁడని మునీంద్రునకు మిత్త్రపుత్త్రుండిట్లని చెప్పం దొడంగెను. మునివరా! మున్ను పుళిందదేశమున నొక్కగ్రామంబున నొక బోయవాఁడు వసించుచుండెను. వాఁ డెప్పుడును జంతు హింసఁ గావించి యామాంసము

### యమధర్మరాజు సానందునకు హంస కిరాతుల చరిత్రంబుఁ జెప్పుట.

నమ్మి జీవించు చుండును. వాడు చేసిన జీవ హత్యలను లెక్కపెట్టుటకు దేవతలకుం గూడ సాధ్యము గాకుండెను. మృగ విహంగ సందోహమునకు వాఁడు మిత్తియని చెప్పినచో యది యతిశయోక్తి కానేరదు. ఒకనాఁడా కిరాతుఁడుదయంబునఁ జలిదిఁగుడిచి వలలు, చిక్కంబులు, నంబులు, విండ్లు, మొదలగు వేటకు వలయు సాధనంబులఁ గైకొని, వేఁట కుక్కలను వెంటఁ దీసికొని యడివికిఁ బోయెను. నాటిదినము సాయంకాలము వరకును వాఁడు తనవలననైన మట్టుకును, నెంతగాఁ బ్రయత్నించి యేమి చేసినను నొక యెలుక పిల్లగూడ చిక్కినది కాదు ఆలాగున సాయంకాలము వరకును వాఁడు నానా కష్టములుంబడి విఫల మనోరథుఁడై యింటికి చేతులాడించుచుం బో

వలసిన వాఁడయ్యెను. ఏమిచేయఁ గలఁడు? తానిలు వెడలిన లగ్నం బట్టి దనియు, నాలు బిడ్డలు నిరాహారులై వెతఁబడ వలసి వచ్చినది కదా! యనియుం, జింతాక్రాంతుఁడై, చేయునది లేక వచ్చిన దారిం బట్టి పోవుచుండెను. అపుడే సూర్యుం డస్తమించెను. ఆసమయంబున నొక రాజహంసము ముక్కున నొక కమలముం బట్టుకొని యంబరంబునం బోవుచుండి వానికిం గాన్పించెను, కిరాతుఁడు దానిం జూడఁగనే మరల నాశ యంకురించి, యీహంసముం బడనేసితి నేని నేఁడు నాబిడ్డలు పస్తుపడి యుండకుండుటకు వారికిది యాహారంబు కాఁగలదు ప్రయత్నించి చూచెదను. లాభాలాభముల నెవ రెఱుంగుదురు? ఒకవేళ నీహంసము నాకుం బ్రాప్తించు నేమో! దైవ సంకల్ప మీలాగున్న నది తప్పదు. అని యోచించి చేనున్న పరికరంబులఁగ్రిందనునిచి విల్లెక్కుఁ బెట్టి సూటిఁగాంచి బాణముం బ్రయోగించెను. ఆబాణము గురిగాఁ దగులుట వలన నిరపరాధియై మింట నరుగుచున్న యామరాళము తటాలునఁ గ్రిందఁబడుటయు, దానిముక్కున జల సహితముగాఁ గఱచిపట్టి తెచ్చుచుండిన కమలము, జారి యచ్చోట నుండిన పురాతనమైన దగు నొకశివలింగము శిరము నలంకరించెను. కంజము నందలి జల మాలింగముం దడిపెను. ఉత్తరక్షణంబున హంసము ప్రాణములు విడిచెను. తనగురికిఁ గిరాతుఁడు సంతసించి దానిం గొనుటకు సమీపించు సమయంబున ప్రమథగణ పరివృతుఁడును, శశిముకుటుండును, త్రినేత్రుండును, శూలము, డమరువు, పరశువు, కపాలము మొదలగు వానిని చేతులయందు ధరించి

బోయవాని కీశ్వరుండు ప్రత్యక్షుం బగుట

నవాఁడు సర్పములను హారములుగాఁ గలవాఁడును, విభూతి రుద్రాక్షములు ధరించిన వాఁడును, దయాదృష్టిఁ గలవాఁడును నగు యుమాపతి యుమా సహితంబుగా నందివాహనా రూఢుఁడై యాబోయవానికిం బ్రత్యక్షమై తన్నెఱింగించి, యోయిశబర వల్లభుండా! నిన్ను నేను మెచ్చితిని. నీవు నాకు మిక్కిలి ప్రియుండవు. నీ కేమి కావలయునో కోరుము. నీయభీష్టంబు లొసంగెదను. నేనెంత కాలముగానో యిచ్చట లింగాకృతినుంటిని. నాకెపుడును నెవరివలననుఁ బూజ

జరిగించఁ బడినది లేదు. నేఁడు నీవలన నాదేహము చల్లనగు నట్లు కమలంబులోని నీరు పైఁబడుటయు, నుత్తమం బగు పద్మము నాశిరంబు నలంకరించుటయుం దటస్థించినది. నాకు మిక్కిలి సంతోషము కలిగినది. నాకు సంతోషముఁ గలిగించిన వాఁడవు నీవు గాన, నీవు నాభక్తులలో నుత్తముఁడ వైతివి. ఇంతటి గొప్ప యానందమును నాకా పాదిల్లం జేసిన నీకు సమస్త కోరికలు నొసంగుటకై ప్రియంబుతో వచ్చితిని. ఆలస్యముఁ జేయక కోరికం దెలుపుమనియెను. పరమ శివుని కరుణా కలితములగు మాటలు విని బోయవాఁడు మిగుల సంతోష భయాశ్చర్యములతోఁ గూడిన మనస్సుఁ గలవాఁడై శంకరుని సన్నిధానమందున్న కారణంబున మాధ్యము తొలంగి పరిపూర్ణ మగు సుజ్ఞాన ముదయించిన భక్తి యుక్తుండై ప్రదక్షిణ నమస్కారంబులు గావించి కరంబులు జోడించి ఫాలతలంబునం జేర్చి, దేవేంద్రుఁడు మొదలుగాఁగల దేవతలచే సేవింపఁబడుచు, మహా వైభవముతో కైలాస పర్వతంబున వసించునట్టి జగదీశ్వరా నీకు జయమగు గాక. లోకంబులను సంరక్షించుటకు కర్తవై, దుష్టులకు భీతియు. శిష్టులకుఁ బ్రీతియుం గలిగించుచు శూలాదులైన యాయుధములు ధరించి ప్రకాశించు పుణ్య స్వరూపా! నీకు జయమగుఁగాక. గంగను జడలయందును, చంద్రుని మౌళియందును, ధరించి సగము శరీరమునుఁ బార్వతీ దేవికొసంగి, సకల ముని గణంబులునుఁ గీర్తింప చిదచిద్విలాసుండవై ప్రకాశించు దయానిధీ! నీకు జయమగుఁగాక. చండీశ్వర, నందీశ్వర, భృంగీశ్వరాది ప్రమథులును, వినాయక, కుమార, వీరభద్రాది పుత్త్రులును, భూత గణంబులును, నెల్లపుడునుఁ బరివేష్టించి యుండ నిర్వికారంబున శుద్ధ స్ఫటిక సంకాశ దేహుండవై భక్తుల హృదయ కమలంబులు వికసింపఁ జేయుటకు సూర్యుఁడవుగా నొప్పుచుండు పరమేశ్వరా! నీకు జయమగుఁ గాక. యని యాశబరుఁడు బహు ప్రకారంబుల స్తుతించి పునఃపునః ప్రణామములాచరించి, తండ్రీ! నాయందు మీకింతటి యవ్యాజాను రాగము గలుగుటఁ దలంపగా నిది నాపూర్వజన్మ సుకృతంబుగాఁ దోచుచున్నది. ఈ జన్మమున నేనెట్టి

సుకృతమునం జేసి యెఱుంగను. మీదర్శన మొదవుట వలన నా పాపము లన్నియుం దొలంగెను. నేను కృతార్థుండ నైతిని. మిమ్ము పూజించితి ననియు, వరంబు వేడిన నిచ్చెద ననియు, నాన తిచ్చితిరి. గాని, స్వామీ! నేను మీకెట్టి పూజయుం జేసినది లేదు. ఆహార వాంఛచే నేనీ హంసంబునుం బడనేసితి. నంతియ కాని సదభిప్రాయంబునం గాదు. తాను ముక్కునం గఱచుకొని పోవుచున్న కమలము నాహంసము ప్రాణముం గోలుపోవు నపుడు విడుచుటచే నది మీశిరంబు నలంకరించెను. జలసహిత పంకజంబుం దెచ్చినదియు, మీశిరంబున వైచినదియు నీహంసము గాని నేనుకాదు. కావున మీ రేవరంబీయం దలంచినను, నీహంసమున కొసంగుఁడు. అది పరమ ధర్మము. మీకు నేను ధర్మంబు నెఱింగించఁ గలవాఁడఁ గాను. మీకుం దెలియని దెద్దియును లేదు మీకరుణవలన నేను ధన్యుఁడ నైతిని. అంతియ చాలును దీనపాలా! భక్తసంరక్షకా! దేవా! కరుణించి యీ హంసమునకు కోరిన వరంబు లొసంగి కృతార్థత నొందింపుఁడని చెప్పెను. సయుక్తికముగను, న్యాయముగనుఁ జెప్పిన యాశబరుని మాటలు విని, శంకరుఁడు వానిధర్మబుద్ధికి మిక్కిలి సంతసించి మెచ్చుకొని, తత్క్షణంబున నటఁబడియున్న నిర్జీవ హంసమునుం దనకరంబుల నంటి మేను నివిరిన మాత్రంబున, సర్వేశ్వరుని కరుణా విశేషంబునం జేసి యామరాళము జీవంబు లొంది నిలిచి, స్మరారి సన్నిధాన విశేషంబున జ్ఞానంబు గలిగి, తత్కా

### ఈశ్వరుఁడు చచ్చిన హంసమును బ్రతికించుట

రణంబున నీశ్వరుండు తనకు జీవంబులొసంగుటం దెలిసికొని. పరమానందముం జెందియున్న దానింగని చేరఁదీసి శంకరుఁడో చక్రాంగమా! నీవు జలసహితంబుగా ముక్కునం గఱచుకొని పోవుచుండిన కమలంబును నాశిరంబుపై వైచితివి దానిచే నన్ను పూజించిన ఫలంబునీకు సిద్ధించెను. నివలన నాకుంబూజ ఘటిల్లెను. నేను మిక్కిలి సంతసించి నీపై మిక్కిలి యనురాగముఁ గలవాఁడనై కోరిన వరంబు లొసంగఁ దలంచి వచ్చితిని. నీకెద్ది యిష్టమో దానిం జెప్పుము ఆలస్యముఁ జేయవలదని చెప్పెను. దీనజనమందారుం

డైన భర్గుని మాటలు చక్కఁగా నాలకించి, యాహంసము భక్తి
యుక్తమైన మనస్సుంగలదై, గంగోత్తమాంగాయ, కరుణాంతరం
గాయ, వామదేవాయ, శివాయ, భవాయ, సోమాయ, భీమాయ,
శర్వాయ, భర్గాయ, రుద్రాయ, భవహరాయ, పాపఘ్నాయ, ధర్మ
స్వరూపాయ, సచ్చిదానంద విగ్రహాయ, శరణాగత వత్సలాయ,
బుధజన పూజితాయ, మునిజన లోలాయ, చంద్రశేఖరాయ,
తుభ్యంనమః, తుభ్యంనమః తుభ్యంనమః. అనిస్తుతించి, స్వామీ!
మీకునాయందుఁగల దయావిశేషంబునకు నేనుమిక్కిలి సంతృప్తి
నొందితిని. నాజన్మము పావనంబైనది. నానేరంబులు మన్నించుఁడు.
మీరుకోరిన కోరుకు లొసఁగఁ దలఁచి వరంబు వేఁడుమనుచున్నారు.
కాని. నేను మిమ్ముం బూజింపఁ దలంచి జలసహితంబుగా కమలంబుఁ
గొనివచ్చిన దానను కాను. నేను మిమ్ముం బూజింపలేదు. నాపిల్లల
కొరకు నీళ్లునుఁ గమలముం గొనిపోవుచుంటిని. ఆసమయంబున నీ
కిరాతుఁడు నన్ను బాణంబునోఁ గొట్టెను. ప్రాణంబులు పోవునట్టి
యాబాణ ఘాతచేఁ బట్టుఁ దప్పి నానోటనుండిన కమలము జాతి
వాయువశంబున మీశిరంబుపైఁ బడియెను. అది నాబుద్ధిపూర్వక
ముగా నేనుచేసిన పనికాదు అటుల మీశిరంబునఁ బద్మము పడుట
కీశబరుఁడే కారణము. ఇతఁడు నన్నేయకున్నచో పంకజమును నేను
విడుచుటయు, నది మీశిరంబు నలంకరించుటయు సిద్ధించియుండదు.
కావున యాసత్కార్యము నీపుణ్యాత్ముఁడు చేసెను. మీరేవరం బొ
సంగినను నితని కివ్వవలసి యుండును. ఫలము నొందవలసిన వాఁడొ
కఁడుండఁగా నక్రమముగా తత్ప్రయోజనమునకు మఱియొకఁడు
పాలుపడుట యుక్తమా? మీకుఁ దెలియని న్యాయమేమి కలదు?
జగద్రక్షకా! సమస్త వరములును శబరున కొసంగుఁడు. మీకృప
కుం బాత్రనగుటయే నాకుంజాలును. అని చెప్పెను. హంసను
యొక్క తెలివికిని ధర్మబుద్ధికిని సర్వేశ్వరుఁ డాశ్చర్యమొంది, చిఱు
నగవు మొగంబున జెలువొందగా, శబరునిం జూచి, మీ రొండొరుల
పై నిమిత్తంబునిడి ధర్మంబుగాఁబలికితిరి. మీరిరువురుఁ జెప్పినదియును
యుక్తియుక్తముగా యున్నది మదీయ పూజనమునకు, యాచింపఁ

గా మీరిరువురును గారణభూతులగుచున్నారు. మీరొకరికొకరు వరంబులం బ్రసాదింపుఁడని వేడితిరి. నేను మీలో భేదంబుఁ బాటిం

## ఈశ్వరుండు శబరులకును, హంసయునకును మోక్షమొసంగుట.

పక మీకిరువురకును వరంబు నొసంగెదను. వేఁడుండని యానతిచ్చిన, శబరుఁడును, మరాళమును, నేకవాక్యంబుగా దేవా! పునర్జన్మము నొందక సదా మీచెంతనుండి మిమ్ము సేవించు లాగున నను గ్రహింపుఁడు. ఇహలోక సంబంధమగు నేకోర్కెయు మాకుఁగలుగదని విన్నవించిన నీశ్వరుండు సంతుష్టుండై, వారియిష్టాను సారంబుగా వరంబుఁ లిచ్చి యంతర్ధానంబు నొందెను. అంత శబరుఁడును మరాళమును, స్థూలదేహములు విడిచి, దివ్య శరీరములు దరించి పరమేశ్వర కరుణా సంప్రాపంబులగు దివ్య విమానము లారోహించి దేవతలును, మునులునుఁ బొగడుచుండఁగా సమస్త వైభవములు నతిశయింప శివభటులు దారింజూపగా కైలాసంబునకుఁ బోయిరి. స్వామీ! యాపాటి ధర్మసూక్ష్మమైన, నీఖిలులయందుఁ గలుగదు. కావున వీరిగతి యిట్టిదయ్యెను. ఇంకఁ బోవుదము. చాలఁదడవయ్యె నని యముఁడు సానందమునిం జీరిన, నతఁడు చెప్పిన విషయంబుల నామునివరుండు విని మిక్కిలి యాశ్చర్య మగ్నమానసుఁడై యట నుండి కదలి యముని వెంటఁ గొంతదూరము ముందటికి నరిగి, యచట స్త్రీల జీవంబులు యాతనాశరీరంబులు ధరించి యుండుటయు వారింబట్టి శమన కింకరులు, కులిశంబులచేఁ గొందఱి పొంకం బడఁచుచు, వాఁడి కత్తులచేఁ గొందఱి కండలు కోయుచు, చూరకత్తులచేఁ గొందఱి కుచంబులం దఱుగుచు, వాడి బాడిసలచేఁ గొందఱి శరీరములనుఁ జెక్కుచు, వంక కత్తులచేఁ గొందఱి ముక్కులును జెవులు, నాలుకలుం దుండించుచుఁ, ద్రాళ్లచేఁ గొందఱి వెండ్రుకలు ముడివైచి వ్రేలఁగట్టి క్రిందమంటఁ బెట్టుచు, శూలంబులచేఁ గొందఱి కొట్టలు చిదుకపలగు లగునఁ బొడుచుచు, పోటుకత్తులచేఁ గొందఱి చెవులం గత్తిరించుచు, సమ్మెటలచేఁ గొందఱిని నలినలిగా నలియఁ గొట్టుచు, వేడికొఱవులచేఁ గొందఱిఁ గాల్చుచు, సున్నపు గుంటల యందుఁ గొందఱిఁ ద్రోయుచు, తైలంబుఁ దెరలఁబెట్టి కొందఱిం

బట్టి యందుఁ బడవైచుచు, మండుచున్న యినుప కంబములకుం గొందఱి నంటఁగట్టుచు, పాములు, తేళ్లు మొదలగువానిచేఁ గొందఱి మర్శ్నానంబులం గఱపించుచు క్రిమి కీటక పూర్ణంబులగు మలమూత్ర కూపములలోఁ గొందఱిం ద్రోసి యలయింపుచు, సీసముం గాచి కొందఱి కర్ణంబుల యందును ముక్కుల యందునుం బోయుచు, విషంబునుఁ గొందఱిచేఁ ద్రాగించుచు, నిట్లనేక విధంబుల బాధింపుచున్న యావేదనల సహింపలేక దిక్కులేనివారై యలయుచున్న దుష్టస్త్రీలంగాంచి మునివరుండు సహింపనోపక యముని నిర్దయాళుత్వంబునకు మనంబున వెఱఁగుఁజెంది యతనిం జూచి, సమవర్తీ! నీవు కృపామూర్తి వయ్యు ననాథలగు నీస్త్రీజనంబులయెడ లేశమైనను, దయఁ జూపకున్నాఁడవు. కారణమేమి? నీవంటి ధర్మజ్ఞాన కీర్తాతిశయగుణ మొక గొప్పకళంకముగాఁ దోఁచుచున్నది. ఈస్త్రీలిట్టి మితిలేని బాధ లనుభవించుటకు నిమిత్తమెయ్యది వీరేమి చేసిరి? యా వివరముం దెలుపుము. అనియడిగిన మునికి శమనుం డిట్లనియె అయ్యా! ఈ మగువలు మితిలేని పాపములు చేసినవారు. దానంజేసి వారివారి పాపములకుం దగిన దండన ననుభవిం

శమనుఁడు సానందునకు స్త్రీలు చేసిన పాపముల నెఱిఁగించుట

చుచున్నారు. వీరు కావించిన కిల్బిషంబులను కొన్నింటిని విన్నవించెదను వినుండు. వినిన పిమ్మట నేను వీరిపట్ల నక్రమముగా బ్రవర్తింపలేదని తమకుం దెలియ వచ్చును ఇదిగో! చూడుఁడు. ఈమగువ తన భర్తపై బ్రియంబు మాని, యత్త మామలను, సాధువులను, బంధువులను, తూలనాడి నిరాకరించి యహంకరించి పరపురుషులం గూడి సురతక్రీడలం దేలుచు, దానము, ధర్మము, శీలము, నను మంచిలక్షణంబులకు దూరమగు బుద్ధిఁగలదై సకల దుష్కార్యములు నొనరించుచుండెను. ఇదిగో! ఈకాంత తనకాంతుఁ డన్యకాంతా బ్రియుండై యున్న నతనిం బ్రతిదినంబును నానా దుర్భాషలు నాడుచు నతనికి నన్నోదకంబులు విచారించక తాను మాత్రము తృప్తిగా భుజించి తన యిష్టాను సారముగా వర్తించుచుండెను. ఇదిగో! ఈయింతి పతి యేకార్యముం జేయుమనునో, యందుకు విరోధముగాఁ జేయుచు, నతఁడొక

వేళ నలుకపొడమి యేదేనియు నొకమాఁట ననియెనేని భూతమువలెచె
లరేఁగి భర్తను నోటఁ బలుకరాని తిట్లుతిట్టి యతనికాలితోఁదన్ని మె
డఁబట్టి వెలుపటికిం ద్రోసి తలుపుమూసుకొని నిబ్బరముగా వర్తించు
చుండెను. ఇదిగో! ఈయువతి, యతిథులకు నభ్యాగతులకును నన్న
ముంబెట్టునపుడు పఙ్క్తిభేదనముం జేయుచు భర్త ధర్మముగా నుప
యోగింపఁ దలంచి తెచ్చిన పదార్థముల నాలాగు సేయక తనకుం
బ్రియులైన విటకాండ్రకుం బెట్టుచు, నావృత్తాంతము మగఁడెఱింగి
యేటుల నేలజేసితివని యడిగిన నతని దిట్టికొట్టుచు,నిట్టి యక్రమంబగు
నడవడిం గలిగియుండెను. ఇదిగో! ఈనెలఁత మగఁడు విత్తంబుఁ గడించి
తెచ్చినపుడు సంతోషమున దుర్వ్యయముం జేయుచు లేకున్నపుడు
క్రోధమొంది మొగంబున మెటికలువిరిచి బుగ్గలునులిమి యొడలి కండ
లు వెడలి వచ్చులాగున గోరులతోగీరి, యతని కన్నముం బెట్టక తాను
భుజించి పొరుగిండ్లకుంబోయి తనకుసమానులైన బోటులతోఁగూడి
కామ శాస్త్రంబులును విటుల చరిత్రంబులును, బ్రసంగించుచు
నధర్మమార్గంబునం బ్రవర్తించుచుండెను. ఇదిగో! ఈబోఁటి పర
పురుష వాంఛ మించి కులగోత్రంబులు విచారించక లభించిన వాని
తోడ నెల్లనుం గూడి క్రీడించుచు, తద్వృత్తాంతం బెఱిఁగి భర్త
తర్జన భర్జనంబులం గావించిన, నీర్ష్యాసూయలు గలదై విషప్రయో
గంబున నతనిం జంపి, తోఁడును వీడెనని నిశ్చింతగా మిండగాండ్రతోఁ
గాపురంబుఁ జేయుచుండెను. ఇదిగో! ఈభామ, యౌవన మదంబు
నఁ గన్నుఁగానక పతివ్రతలఁ జూచినపుడును వారి నడవడియు
వారొనరించు సత్కార్యంబులును జూచినపుడును నసహ్యముం జెంది
వారిం బరిహాసింపుచుం దిట్టుచు, పాతివ్రత్యమని యొకటికలదా ?
తృప్తిగా మృష్టాన్నము భుజించి మేలైన వస్త్రములు భూషణములు
పుష్పములు, చందనాదులును నలంకరించుకొని తనకంటికింపైన
వానింగూడి యాసదీర భోగించుటయే స్త్రీలకు సాధ్వీత్వము. ఈ
వ్రతంబులును, గుడ్డివాఁడైనను, కుంటివాఁడైనను, మగఁడే దైవమని
యేవనొంద వానికడుగులకు మడుఁగులొత్తుచు సేవించి వయసు నడవిఁ
గాసిన వెన్నెలవలెఁ జేసి కొనుటయు నొక జన్మమా ? అందువలనం

ప్రయోజనము లేదని తనతోఁడి వారలకు బోధించి వారినందఱిం దుర్వ్యవసాయమునఁ బ్రవర్తిల్లఁజేసి తానును వారివలెనే పెక్కు చెడుకార్యములం జేయుచుండెను. ఇదిగో! ఈచానవంటఁ జేయునపుడు పురువులం దులిపివేయక కట్టెలను పొయ్యిలోఁ బెట్టియు, కూరగాయలయందుండు పురువులం దీసివేయక వండియు నెన్నియో జీవజంతువులం జంపియు, భర్త నొకనాఁడును నంటనీయక, యతఁడు మందటికి వచ్చినపుడెల్ల తనకేదియో రోగము కలిగియున్నటుల కపట వేదన నభినయించుచు కాలముఁ గడపుచుండెను. ఇదిగో! ఈచాతన యింట వలనుగామిచే నంటుఁబడితినని యసత్యముం జెప్పి యటనుండి జారపురుషులతోఁ గూడి తనయిష్టంబు దీర్చుకొనుచు, నిజముగానంటుఁ బడినపుడు కప్పిపుచ్చి యింటిలో నందఱినిం దాకుచు నన్ని కార్యములుం జేయుచు దేవతారాధనకుంగూడ నైవేద్యాదులం బెట్టుచుండెను. ఇదిగో! ఈమాయలాఁడి, పేదవారెంత వేడినను బిచ్చమైనం బెట్టక మిండగాండ్ర కింటఁగల సొమ్మంతయు దారబోసి వారిఁగూడి క్రీడించుటను కడుపునఁ బుట్టినబిడ్డ చూచిన యాబిడ్డ తనవృత్తాంతము నితరులకుం జెప్పునని సంకోచించి చేతులార మెడ బిసికిచంపి, హఠాత్తుగా నేదో దుర్గుణమువలం బిడ్డచనిపోయెననియుం దఱును జాలిపడునట్లు యేడ్చి నమ్మకము గలుగు లాగునటించుచు నిట్లే పెక్కు దుష్కార్యములం జేయుచుండెను అయ్యా! ఇందున్నవారు, మఱియు నిట్టివియు నింతకంటె నధికమైనవియగు ననేక పాపములొనరించిన వారలు గాని సామాన్య దోషులు కారు. ఈస్త్రీలును, నింతకుముందు మీరు చూచిన పాపపురుషులును, నిప్పటి కనుభవించిన కష్టములు పోఁగా మఱియు నిరువది యొనిమిది కోటుల నరకములనుభవించ వలసియున్నవి. యవి యన్నియుం గ్రమముగా ననుభవించి నంతట వీరు వారివారి కర్మానుసారముగా మరల భూలోకంబున జన్మించఁగలరనిన సానందాశ్చర్యంబునొంది. ఔరా! ఇప్పుడనుభవించు నరకబాధలు చాలక, మఱియు నిరువది యొనిమిది కోట్ల నరకములలో నీనిర్భాగ్య జీవులు కష్టము లనుభవింప వలయునా! కటా! వీ రాబాధల నెట్లు సహింపఁ బోయెదరు. అనితలంచి

కంజాప్తనందనునిం జూచి మిత్రనందనా ! నీమాటలు వినఁగా నాకు మిక్కిలి వింతగాఁ దోఁచుచున్నది. ఈపాప జీవులిప్పటికే మీకింకరులు పెట్టుబాధలు సహింపలేక యల్లాడుచుండగా నింకనుఁ వీరికిఁ గోట్లకొలఁది నరక కష్టములు మిగిలియున్న వనుచున్నావు. అయ్యో! వాని నెల్లను వీరు సహింపఁగలరా ! ఎట్లోర్తురు ? ఇంకమీఁద వీరు పోయి బాధలొందవలసిన నరకములెవ్వి ? వివరింపుము. అనియడిగెను. అంత నంతకుం డామునివరునకిట్లనియె అయ్యా ! యీనరక

## శమనుండు సానందునకు నరకంబుల నెఱిఁగించుట

బాధ లనుభవింపక తీరునవి కావు. అవి కోట్లకొలఁది యున్నవనిమున్నే చెప్పితిని గదా! యందు ముఖ్యములైనవి కొన్ని వివరించెదవినుము. నరకంబులలో నెల్ల భయంకరములైనవి కష్టతరములైనవియు నగు ఘోరంబును, నతిఘోరంబును, మహాఘోరంబును, ఘోరాతి ఘోరంబును, ఘోరరూపంబును, తరళంబును, భయానకంబును, కాళరాత్రంబును, భయోత్కటంబును, చండంబును, మహాచండంబును. చండకోలాహలంబునుఁ గరాళంబును, విరాళంబును, వజ్రంబును, త్రికోణంబును, పంచకోణంబును, షట్కోణంబును, సప్త భౌమంబును, దీర్ఘంబును, నష్ట భౌమంబును, మాయయు, మహా మాయయు, రౌరవంబును, సీతంబును, మహా సీతంబును, తమంబును, నుష్ణంబును, నతి తీక్ష్ణంబును, పద్మ సంజీవనంబును, మహా పద్మంబును, శతంబును, అతి లోకంబును, భీమంబును, తీవ్రంబును, మహా వేగంబును, ప్రకంపనంబును, సువిక్రమంబును, కాలసూత్రంబును, ప్రవృశ్చికంబును, సూచీముఖంబును, నేమియు, ఖాదనంబును, సుప్రతీకంబును, కుంభీ పాకంబును, కూపంబును, అంగారరాశియు, భవనంబును, నసృక్పూయహ్రదంబును. విష్ఠాలయంబును, తుండశకునియు, సంవర్తంబును, మహా సంవర్తంబును, పంకలేపంబును, మూత్రవిష్ఠాకూపంబును, పూయకూపంబును, శాతంబును, శిలాశకటాలింగనంబును, ద్విపాదంబును, నతిజరంతిమంబును, నతి దుఃఖంబును, మహా దుఃఖంబును, కశ్మలంబును, నానా యంత్రంబును, సమ్మోహంబును, నతి భంగంబును, తప్తశూలంబును, హాలా

హాలంబును, నేక పాదంబును, నతి కూపంబును, మలంబును, మల పర్వతంబును, ప్రపూరణంబును, తప్త శిలాతలంబును, నను నవియు మఱియుం గొన్నియు, ముఖ్యములైనవి. ఈ చెప్పఁబడిన వానితోఁ జేరి యిరువదియొనిమిదికోట్ల. నరకములు గలవు వీనియన్నిటిలో నను, నీపాపాత్ములు కష్టము లనుభవించ వలసియున్నది యనిచెప్పిన సానందముని యబ్బురంబుగా విని, తనలో, న కటా ! ఈ పాపాత్ములిన్ని నరకముల యందు కష్టపడుటకు సాధ్యమగునా ? వీరిని మన్నింపుమని దండధరునితో చెప్పుట యుక్తముకాదు. అతఁడు న్యాయముగానే వీరికి శిక్షవిధించి యున్నాఁడు. నేనింత దూరము వచ్చి కన్నులార వీరుపడుచున్న కష్టములం జూచి మిన్నక మరలి పోవుటకు నామనం బొల్లకున్నది. యీ కష్టజీవులయందు నాకు మిక్కిలి జాలి గలుగుచున్నది వీరిని యమబాధలనుండి విముక్తులం జేయుటెట్లు ? నాకు సదుపాయము తోచకున్నది. యని కొంతవడి చింతించి, యంతలో ధైర్యము వహించి మరల తనలో ! ఆహా ! నేనెంత వెఱ్ఱివాఁడను? ఈపాపాత్ములను నరక విముక్తులం జేయుటకుం దగనసాధనంబును నేనెఱింగి యుండియు, వెఱఁగుపడి యోచించితిని. సమస్తనరక బాధలును నిమిషంబున నివారించి శాశ్వతంబుగా శివసాయుజ్యంబు నొసంగు పంచాక్షరీ మహామంత్ర మున్నపుడు సంశయింపనేల? యామంత్ర కుఠారంబున నీపాపాత్ముల నరక క్లేశ శుష్కతరు సందోహముం ద్రుంచివైచెదను. పంచాక్షరి మహామంత్రమువలనఁ దొలంగని పాపములును, పొందరాని సుకృతి విశేషంబులును నెందుఁగలవు. ? మంచిది కానిమ్ము నేనిపుడా త్రిలోకపావనమైన మహామంత్ర మీపాపాత్ముల చెవులకు సోకునట్లు పఠించెదను ఆమంత్రంబు నాలించి పరమేశ్వరుని కరుణా విశేషంబున వీరందఱును నరక విముక్తు లగుదురు గాక.

### సానందుఁడు పాపాత్ములను నరక విముక్తులఁ జేయుట

అని నిశ్చయించి తాపస శ్రేష్ఠుఁడును, యోగవిద్యా విశారదుండును శివ భక్తుండును, నిర్మలుండును, తేజోమయ స్వరూపుఁడును, సకల సద్గుణగణ పరి పూర్ణుండును, దయామయుండునగు సానందుఁడు తన చిత్తంబునఁ జిత్తజారిం ధ్యానించి సంస్తుతించి పరమ భక్తి యుక్తంబు

గా సమస్త కల్యాణ ప్రదాయకంబును, సప్తకోటి మహామంత్ర సార్వభౌమంబును, నిఖిల వేదవేదాంత విచార సారంబును, నిర్వాణ సామ్రాజ్య సౌఖ్య సంధాయకంబును, సకల కలుష మహారణ్య దావ పావకంబును, నగు ప్రణవ సంయుత పంచాక్షరీ మహా మంత్రంబును మేఘ గంభీర నిస్వనం బెసంగం బఠించిన, వెంటనున్న ధర్మ ప్రసంగుండాదిగాఁగల మహర్షులందఱును నొక్కమాఱుగా నమ్మంత్రంబును బిగ్గఱగా నుచ్చరింపఁ దొడంగిరి యామంత్ర స్మరణోచ్చారణ స్వనంబు మహాఘోషంబుగా మిన్ను ముట్టుచున్న యాధ్వని యిరువది యెనిమిది కోట్ల నరకముల యందును నరక బాధ లనుభవించుచున్న పాపాత్ములఁ కర్ణరంధ్రములను సోఁకుటయు నద్భుతంబాదవ పరమేశ్వరుని కృపా విశేషంబు వలన వారందఱును నరక బాధలనుండి విముక్తులై శమనుండును, శమనకింకరులును నాశ్చర్యంబుజెంది నివ్వెఱఁబడి కనుచుండ రుద్రగణాకారంబులం దాల్చి భద్ర విమానారూఢులై దేహకాంతులు దిక్కులకుం బ్రసరింప, భస్మవిలేపనాంగులును, రుద్రాక్ష మాలికా ధరులును, బిల్వదళహార శోభితులును, గంగోత్తమాంగులును, జటా మండల మండితులును, గజవ్యాఘ్ర చర్మపరిధానులును, శూల హస్తులును, లలాట నేత్రులును, సితికంఠులును, భుజంగ విభూషణులును, వృష ధ్వజులునునై, యేవంకఁ జూచినను 'శివా త్పరతరం నాస్తి' యనువాక్యంబు సార్థకంబుగా లోకంబు శివమయంబగు నట్లుగా నంతరిక్షంబునఁ దేజరిల్లుచు శివ స్వరూపులైన సానందముని చంద్రుని పరమానంద హృదయారవిందులై సంస్తుతించుచుండిరి. అపుడా మునివరుండు వారినందఱిని గైలాసమునకరుదెండని చెప్పి యనుగ్రహించి, దండధరునిం జూచి చిఱునగవు మొగంబున మొలకలెత్త సుఖంబున నుండుమని దీవించి తానును, ధర్మప్రసంగాది ఋషులును పూర్వము తాను వచ్చిన విమానంబు పైనెక్కి గగన పథంబునం బోవుచుండ దనవెంట, కోటి, దశకోటి, శతకోటి, సంఖ్యలుగల దివ్య విమానంబులపై నారోహించిన యా రుద్ర స్వరూపులు వచ్చుచున్నం గాంచి పరమేశ్వరుని కరుణా విశేషంబును వినుతింపుచు, సంతోష భరితాంతరంగుండై దేవదుందు





(౨౬౯-వ పుట.) సానందుఁడు పాపముక్తులై దివ్యరూపంబులొందిన వారిం గూడి కైలాసంబునకేగి ఈశ్వరుని స్తుతించుట.

భులు మ్రోఁగుచుండ నిర్జరులు పైనుండి పుష్పవర్షముం గురియుచుండ గంధర్వుల గానంబును, నచ్చరల నాట్యంబునుం జెన్నార గన్నులారం గాంచి యానందించుచు, మహా వేగంబున శ్రీ కైలాసంబునకుం బోయి ద్వారంబుకడ విమానంబుడిగి, యందఱును డిగినంత యా రుద్రగణ సహితుండై మహా వైభవంబున, శివలోకంబు సొచ్చి పోవుచు, నెడనెడం గనుపించిన శివ భక్తులకును మునులకును నమస్కరింపుచుం జని చని, యఃభవుని దివ్యభవన ద్వారంబుఁజేరి, బ్రహ్మయు, విష్ణువు, నింద్రుఁడు నాదిగాఁగల దేవకోటులును, నారద, తుంబుర, మార్కండేయ, వశిష్ఠ, విశ్వామిత్ర, చ్యవన, భరద్వాజ, జామదగ్న్యాది మహామునులును, గుద్రగణంబులును, శివ భక్తులను సేవింపగా నవరత్న ఖచితంబగు సింహాసనంబుపై గౌరీ సమేతంబుగాఁ గూర్చుండి కోటి సూర్యుల ప్రకాశముం గలిగి తేజరిల్లువాఁడును, వ్యాఘ్రచర్మ ధరుఁడును, శూల హస్తుండును ఫాల లోచనుండును, భుజంగ భూషణుండును, చంద్ర శేఖరుండును, గంగా జూటుండును, దయా స్వరూపుఁడునగు పరమేశ్వరుని పావన స్వరూపము సందర్శించి, సానందుఁ డానందమును, సంభ్రమంబును, జెంది మేనఁబులకాంకురంబులు మొనయ ననేక సాష్టాంగ దండప్ర

{ సానందుఁడు పాపముక్తులై దివ్యరూపంబు లొందిన వారిం గూడి కైలాసంబున కేగి ఈశ్వరుని స్తుతించుట. }

ణామంబు లాచరించి ఫాలస్థల విన్యస్త హస్తుఁడై యిట్లని సంస్తుతించెను. మేరు పర్వతము విల్లుగాను, భూమి రథంబుగాను, సూర్య చంద్రులు చక్రములు గాను, విష్ణువు బాణముగాను, బ్రహ్మ సారథిగాను, కాగా, రథారోహణంబుఁ జేసిపోయి లోకకంటకులైన త్రిపురాసురుల సంహారముం గావించి భువనంబులు శాంతినొందఁ జేసిన మహాదేవా! నీకు నమస్కారము. ఆర్తులను రక్షించుటయు, నాశ్రితుల మన్నించుటయు వ్రతముగాఁగల పరమ పురుషా నీకు నమస్కారము. భయంకరమైన కాలకూటమున మృతి ప్రాయము గాభక్షించి లోకంబులు రక్షించిన పుణ్య స్వరూపా! నీకు నమస్కారము. నినుఁదలంచు వారికిని, పూజించు వారికిని సకల

పాప ములును బోనడచి శాశ్వత సాయుజ్యంబు నొసఁగుద యని
ధావా నీకు నమస్కారము. సకల దేవతల చేతను, దిక్పతుల
చేతను, మునులచేత నిరంతరమును నుతింపఁ బడు పాదపద్మములు
గలయుభవా ! నీకు నమస్కారము. జగన్నాథా! నీకు నమస్కా
రము, కైలాస నిలయా! నీకు నమస్కారము దేవా! నీవు పరంధా
ముఁడవు. నాది మధ్యాంత రహితుఁడవును, చిదానందుఁ డవును,
వేద వేదాంతా ధారుఁడవును, నుత్పత్తి స్థితిలయ కారణుండవును,
నామ రూప క్రియా శూన్యుండవును, త్రిమూర్తి స్వరూపుఁడును,
జీవ స్వరూపుఁ డవును, కపట నాటక సూత్ర ధారకుఁ డవును, పర
మ పురుషుఁ డవును, సమస్త కల్యాణ గుణ పరిపూర్ణుఁ డవును, లీ
లా విలాస పరిపూర్ణుఁ డవును, క్షరుఁడవును, నక్షరుఁ డవును, జగ
దా రాధ్యుఁడవును, నిర్వి కల్పుఁడవును, నిరా ధారుఁడవును; సత్యా
కారుఁ డవును, పంచ భూతాత్మకుఁ డవును, నగుదువు, చూచు
నట్టి రూపం బులును, వినునట్టి శబ్దంబులును, మనస్సునకుం దోచు
సమస్తంబును నీస్వరూపంబు గాన నీవు కానిది యొక్కటియును
లేదు. పరమేశ్వరా నీదివ్య పాదార విందంబులు సందర్శించు భా
గ్యంబు చేకూరుటం జేసి నేను కృతార్థుఁడ నైతిని. భవత్కృపా విశే
షంబునంజేసి కడలేని నరక బాధ లనుభవించుచున్న వీరందఱును
పాప విముక్తులై దివ్యంబులగు భవ త్స్వరూపంబులు ధరించి యిది
గో వచ్చియున్నారు. తండ్రీ! దయానిధీ! మమ్మందరనుఁ గరుణా
విలోక నంబులం జూచి మన్నింపుము. అని యనేక విధంబుల బ్రస్తు
తించిన పరమేశ్వరుండు సంతోషంబు మీఱ సానందునిఁ
గరంబులు చాచి యందిపట్టి చేర రాఁదిగిచి యతని శరీరంబు
నిజ హస్తంబున నివురుచుఁ బ్రియంబు రెట్టింప నిట్లనియె.

## శంకరుండు సానందుని నాదరించుట.

అనఘా! నీకు నాయందుఁగల భక్తికి మిక్కిలి సంతసించితిని నా
భక్తు లందఱిలోనను నీవు శ్రేష్ఠుఁడవు నీవు నాపుత్రుండవు. నీవు
చేసిన యీ మహాత్కార్యంబును నింక నెవ్వరు చేయఁగలరు? ని వెం
తటివని నైనను తృణ ప్రాయంబుగాఁ దలంచి నెర వేర్పశక్తుండవు నీవు

మదీయ వరదత్త జనితుండవుగాన నీకు మిక్కిలియగు కార్యాబెద్దియు గలుగదు నీయెడ నేనెప్పుడును బ్రసన్నుండనై యుండుదును. లోకంబున నెవ్వఁడు నీకరుణకుం బాత్రుండగునో, యెవ్వనియందు నీవు ప్రీతిని వహింపుదువో. యట్టివాఁడు, నాకరుణకును, నాప్రియమునకును బాత్రుం డగును, ఇది నిక్కము. ఎవఁడు నిన్నుఁ దలంచునో వాఁడు నన్నుఁదలంచిన వాఁడె యగుచున్నాఁడు మునికుమారా! నీవు కడు పరిశుద్ధుఁడవు. సద్గుణంబు లన్నియు నీయందు నెలకొని యున్నవి. నీకరుణావిశేషంబునఁ బాపవిముక్తులై మదాకారంబులుధరించి తేజరిల్లుచున్న ఈజీవులనందఱిని మత్ప్రమథ గణములలోఁ జేర్చి యెల్లపుడును, వీరికి మత్సన్నిధానంబు నొసంగితిని. నీవన్ననో, పావనమూర్తివి. నీకును భేదంబులేదు నీవింక నిందయుండువు గాక యని కరుణాకటాక్ష వీక్షణంబులంగని పలికి యతనిఁ దనచెంత సింహాసనాసీనుం గావించెను. శంకరుఁడాదేశించిన లాగున పాప నిర్ముక్తులై శివ రూపంబులు గలిగిన జీవు లందఱును. పరమానంద కందళిత హృదయారవిందులై, యిందుశేఖరుని ప్రమథ బృందంబునం జేరి సర్వేశుని సేవింపుచుండిరి. ఇట్లు నరకలోకంబున నుండిన పాప జీవులందఱును, నిర్దోషులై సానందుని వలన శివాకారంబులు ధరించి శివలోకంబునకుంబోయి నంతట, యమలోకంబున నొక్కఁడైనను పాపాత్ముడు లేడయ్యెను, యమలోకము పాడుపడి నట్లుండెను. సానందమునియన్ని నరకముల యందున్న స్త్రీపురుష పాపజీవులను శివస్వరూపులం జేసి కైలాసమునకుం దోడ్కొని పోవుటం జూచి నంతట దండధరుండు చేయునది లేక మిక్కిలిచింతాక్రాంతుఁడై, ఆహా! ఈమునివరుండెంత పనిం జేసెను? మున్ను నారదుండెంతఁ జెప్పెనో, యంతయుం జరిగినది ఆమహానుభావుఁడు చక్కగా నెఱింగియే నాకుం దెలిపెను ఇంక నేనేమి చేయుదును? ఇందు నాకేమిపనియున్నది? నేనెవరిపై నధికారముం జూపుదును? మునివరుండు చేసిన కార్యంబు నెఱింగినపుడు అట్టి కార్యముం జేయరాదని చెప్పి వెంటనే యా పాపులను మరల నాకప్పగింపక, శంకరుం డతిప్రీతుండై వారందఱికిని సాయుజ్యం బొసఁగ వచ్చునా? సర్వజ్ఞుండగు తానే యివ్విధంబున నాపాలనం

బును నిరాకరించి నంతట నేనేల యీకొఱగామాలిన యధికారమును వహించి పాలనకుం బాత్రుండను కావలయును, యముండని నాపేరు విన్న మాత్రమున సమస్త జీవ కోటులును భయంబు నొంది కంపించు చుండును, ఇంక నన్నుం జూచిన లక్ష్యపెట్టు వారెవ్వరు? ఛీ! ఛీ! ఈరాజ్యమును. నీ యధికారమును నింక నాకక్కఱలేదు. నేనిపుడే కైలాసమునకుం జని, నాదండ పాశాది సాధనముల నాసర్వేశ్వరుని కప్పగించి, నేనీ యధికారమును వదలు కొంటినని, దీని కిక మీఁద దగిన వాని మఱియొకని నిర్ణయింపుండని చెప్పి శెలవుంగై కొని నాయిచ్చా పోయెద, నింతకంటె నేను చేయవలసిన కార్యంబెద్ది

యమధర్మరాజు కైలాసంబునకుం బోవుట

యును లేదు. అనియోచించి ప్రయాణ సన్నాహముం గావించి కట్టాయితంబైన కాసరంబు నెక్కి, గృధ్రకేతనము మెఱయంగా, చిత్రగుప్తుండు మొదలగు నాప్తులును, కవ్య వాహనాదులగు పితృ దేవ గణంబులును, వీర సేనుండు మొదలైన భటులును, మతంగుండాదిగాఁ గల ఋషులును, పరివేష్టించి వచ్చుచుండఁ గదలి, యుత్తరాభి ముఖుండై చనిచని, పెక్కు లోకంబులు దాఁటి, యఖిల లోకంబులయందును నుత్తమంబైన కైలాసంబుం బొడఁగని బహిర్ద్వారమువద్ద వాహనమునండి దిగి యచటం గావలియున్న నందికేశ్వరునకు నమస్కరించి యనుజ్ఞం గొని లోపలం బ్రవేశించి పోయి, ముందట, నవరంజిచే నిర్మింపఁ బడిన గోడలును, మరకత మణులచే కల్పించిన ద్వార బంధములును, వజ్రపుఁ దలుపులును, నీల స్తంభములును, మాణిక్య మయములగు కిటికీలును, పచ్చల తోరణంబులును ముత్యాల చూరు మొగ్గలును, కెంపుల మేలుకట్లును, బగడంపు బోదెలును చంద్రకాంత శిలా సోపానములును, గలిగి జ్వాజ్వల్యమానంబుగాఁ బ్రకాశించు నదియు, చల్లని చిఱుగాలిచే సమీపారామ శీమలంగల పుష్ప వాసనలు వెదఁ జల్లఁబడి, మనోజ్ఞంబుగా నొప్పునదియు, నానావిధాలంకార శోభితంబును, త్రిలోకాభి రామము, శృంగారంబును నైన పరమేశ్వరుని సభామంటపముం దరిసి, యట నారాయణ చతుర్ముఖ శత ముఖాదులగు దేవ

తులును, దిక్పతులును, విఘ్నేశ్వర వీరభద్ర షణ్ముఖాదులగు కుమారులును, పదనొకండు మంది రుద్రులును, పండ్రెండుమంది సూర్యులును సప్తఋషులం గూడి మార్కండేయ నారద సనకసనంద సనత్కుమారాదు లగు మహా మునులును, సిద్ధులును. యోగులును, చండీశ, భృంగీశ, మహా కాలాదులగు ప్రమథులునుం బరివేష్టించి కొలువ మాణిక్య సింహాసనంబున నీశ్వరుండు గౌరీ సహితుండై నిండుకొలువున్నం గని, యానందంబును భక్తియు వినయంబును, మనంబున బెనంగడాయంజని సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి. దండధరుండు, కోలదండ పాశాదులు ముందిడి కరకమలంబులు ముకు

యమధర్మరాజు ఈశ్వరునిస్తుతించి సానందుఁడుచేసినకార్యంబు విన్నవించుట

ళించి నిలిచి, సకల సద్గుణ పరిపూర్ణుండవును, గంగను శిరంబున ధరించిన వాఁడవును, మునుల చిత్తములలో సంచరించు వాఁడవును సంసార దుఃఖము నడంచి జనన మరణాది సంకటంబుల హరించు వాఁడవును, తాపత్రయము లేనివాఁడవును, సకలలోకముల చేతను, స్తుతింపఁ బడువాఁడవును, మన్మథుని గర్వము నడంచిన వాఁడవును, యోగులచే నాశ్రయింపఁ బడిన వాఁడవును, శరణాగతులను రక్షించు వాఁడవును, భక్తుల కెల్ల కోరికలు నిచ్చువాఁడవును, సకల కార్యములకునుఁ గర్తవైన వాఁడవును, ముల్లోకములను పాలించు వాఁడవును, దేవతలకు ప్రభువవైన వాఁడవును, దీనులయెడ దయఁగల వాఁడవును, నెల్ల క్లేశములనుఁ దొలఁగించు వాఁడవును, సకల కర్మలకును సాక్షివైన వాఁడవును, పుట్టుట, వృద్ధిఁజెందుట, చచ్చుటయను మూఁడవస్థలకును నిమిత్తమైన వాఁడవును, మూఁడు నేత్రములు కలవాఁడవును, లేడి, శూలము, కపాలము, డమరువు, పరశువు, ఖడ్గము మొదలగు వానినిం బట్టుకొని యున్నవాఁడవును, మొదలు, నడుము, తుదలు లేని వాఁడవును. యోగులకైనను నందని వాఁడవును, త్రిపురంబులు సంహరించిన వాఁడవును, నిత్యముగా సత్యమునందును, ధర్మమునందునూ నివసించు వాఁడవును. పదికోట్ల సూర్యులతో సమానమైన తేజస్సుఁగల వాఁడవును, సచ్చిదానంద స్వరూపుఁడవును, నిష్కళంకుఁ డవును, నిర్వికారుఁడవును, నిత్యుఁడవును,

## సానందోపాఖ్యానము.

నిరంజనుఁ డవును, భుజంగ విభూషణుండవును, నంబర కేశుండవును భూత కోటికి నాయకుఁడుగా నుండు వాఁడవును, మృత్యువును జయించిన వాఁడవును, హాలా హలమును మ్రింగిన వాఁడవును, నంధకాసురాదులగు దుష్ట రాక్షసుల సంహరించిన వాఁడవును, దక్ష యాగమును ధ్వంసముం జేసిన వాఁడవును, వృషభ వాహనముంగల వాఁడవును, లీలానంద విలాస విగ్రహుండవును. సజ్జనమందారుఁడవును, ప్రణవా కారుఁడవును, నగు నోయుమామనోహరా ! కైలాస నిలయా ! గిరీశా! పినాకహస్తా! వామదేవా! యష్టమూర్తీ! మహానటా ! జలధితూణీరా ! యనంతా ! పరంధామా! యాశ్రిత జనవత్సలా ! కామితార్థ ప్రదాయకా ! పరమేశ్వరా ! తండ్రీ ! నా నేరంబులు మన్నించి, కరుణావీక్షణంబులు నాపైఁ బ్రసరింపఁ జేయుము. నాకుం బ్రసన్నుండ వగుము. సంరక్షింపుము అని యెంతయుం దైన్యంబున సంస్తుతించి. పునః ప్రణామంబుఁ గావించి, యోదేవా ! నా రాజ్యాధి పత్యముం దగినవాఁడగు నితరునొకని కొసంగి నాయందు కనికరించి. నామొరాలించి నన్నాయాధిపత్యమునుండి తొలంగింపుము నేనింక నధికారంబు వహింపఁజాల నా భారంబుఁ దొలంచుకొని నిర్విచారుండనై మిమ్ముంగొలుచు చుండెద. పాడుపడిన పట్టణమున కధిపతినై యుండుటకంటె మిమ్ముసేవించి కృతార్థుఁడ నగుట యుత్తమంబుగదా ! యుమావల్లభా ! నామన విని బాగుగా నాలింపుము. సానందముని చంద్రుండు నాపట్టణముం జూడవచ్చి నలువైపులం దిరిగి యందందు విశేషంబులం గాంచి యట మహా పాపంబుల నొనర్చుటచే నాచే శిక్షితులై నరకంబులతో బాధపడుచున్న పాపకర్ముల నందఱినిఁ దన పంచాక్షరీ మహామంత్ర ప్రభావంబున నరక విముక్తులంజేసివారికి భవత్స్వరూపంబులు గలిగించి విమానా రూఢులంజేసికొని వచ్చి యిచ్చటంజేర్చి తానేమియు నేరని వాని వలె తమ యర్ధాసనంబు నలంకరించి యున్నవాఁడు. ఇట్టియన్యాయ మెప్పుడును జరిగి యుండలేదు. ఈసానందునిచే పాప విముక్తినొందిన జీవులు లేశమైనను నెన్నఁడును పుణ్యకార్యమెట్టిదియుం జేసిన వారు కారు. మహాఘోర కిల్బిషంబు లొనరించిన

దుష్టులు, మిమ్ముఁ దలంచుటకాని మీచిహ్నంబులు ధరించుటఁగాని వీరెన్నఁడు నెఱుంగరు. ఇదిగో ! చిత్రగుప్తుండు లెక్కలం గొనివచ్చి యున్నవాఁడు. వీరుచేసిన పాపంబులు వివరముగా లిఖింపఁబడి యున్నవి. చిత్తగింపుఁడు. వీరు మీచెంత వసింప నర్హులు కాకుండియు సానందముని ప్రభావంబున మీరూపంబులు ధరించి సంతసించుచున్నారు. నాపట్టణంబున నిప్పుడొకండైనను లేఁడు. అట్టి పాడుపట్టణమును, దాని యాధిపత్యమును నేనొల్లను. మీకుం దెలియని దేదియును లేదు. మున్ను మార్కండేయునిం బట్టి తెచ్చుటకు వచ్చినపుడు మీరు నన్ను శిక్షించి యున్నారు. నాఁటఁగోలె శివభక్తులను, శివచిహ్నధరులనుం డాయవలదని మదీయ కింకరుల కాజ్ఞాపించి నేనును జాగ్రతగాఁ బ్రవర్తించుచుంటిని. ఈ పాపాత్ములయందు మీయందలి భక్తి విశేషంబులు గలిగియున్న, నేను పట్టనేర్తునా? అట్లేదియు వీరియందుఁ గలిగియుండలేదు. ఆలాగున నుండిన పాపుల నీమునివర్యుఁడు నాబారినుండి తప్పించికొనివచ్చి యిటఁ జేర్చి నాపురంబుఁ బాడువడంజేసెను. ఇందలి న్యాయాన్యాయములనుఁ బరిశీలనఁ జేయుటకుం గర్తలైన మీరు విమర్శించి మీకెట్టుల ధర్మముగాఁ దోఁచునో, యవ్విధంబునం జేయుండని మొరఁబెట్టుకొనెను. అతని మాటల నాలకించి సర్వేశ్వరుఁడు మందహాస సుందర వదనారవిందుఁడై, తన చెంత రెండవరుద్రుఁడో యనఁదగి కూర్చుండియున్న సానందమునిం జూపియిట్లనియె దండధరా ! ఆయాస మొందకుము. ఇదిగో !

**ఈశ్వరుఁడు యముని నూరడించి మరల నాధిపత్యంబున నిలుపుట.**

చూడుము. ఈముని శ్రేష్ఠుండగు సానందుఁడు కడు యోగ్యుఁడు, మిక్కిలి తపస్వి, సకల సద్గుణములకు నునికియైనవాఁడు. నాకుమిక్కిలి ప్రియభక్తుఁడు, ఇతనియందు దయాగుణ మెక్కుడుగాఁ గలదు కావున నెన్నఁడును చూచి యెఱుంగని తాను పాపాత్ములనుభవించు ఘోరకష్టములు చూచి యోర్వఁజాలక మనసుకరిగి. పంచాక్షరీ మహామంత్ర ప్రభావ సంపన్నుఁడు గావున, యామహిమచే నటనుండిన పాపాత్ములను నరక విముక్తులంజేసి నాసన్నిధికిం జేర్చెను వీరెట్టి కిల్బిషము లొనరించియున్నను, పంచాక్షరీ మంత్రోచ్చారణము విను

టచే వీరిపాపంబులు నశించి పుణ్యరూపంబులు ధరించిరి. యామంత్రము యొక్క మహిమ నెఱింగిన వాఁడగుట చేతనే ఈముని వరుం డనాయాసంబుగా వీరినందఱి నుత్తమ లోకంబునకుం దేఁగలిగెను. ఇందధర్మంబును లెక్కింప వలనుగాదు. జరిగినంతవరకును జరిగినది. ఇంక నావిచారమును మనస్సున నుంచకూడదు. ముని వలన పాపవిముక్తులు కాఁబడిన వారిఁక నీలోకంబునకు రాఁజాలరు. వీరందఱికిని నేనుమదీయ సన్నిధానంబున నివసింప వరంబు నొసంగి యున్నాఁడను. ఇఁకమీఁదట లోకంబునఁ బాపాత్ములులేకఁ బోవుటయు, నీపట్టణంబునకు రాకఁబోవుటయు లేదు. ఎందఱో కలరు. ఎందఱోవత్తురు. ఇంతమాత్రమునకై నీయాధిపత్యమును విడువనెంచి విరక్తి వహించకూడదు. నీయధికారమునకు నీవేతగినవాఁడవు నిన్ను మించిన ధర్మజ్ఞుఁడును, గుణవంతుఁడును, నీతిమంతుఁడును, పుణ్యశీలుండును, మఱియొకఁడు లేఁడనుట సత్యము, నీవు కొఱంత మాని యెప్పటివలె నీరాజ్యభారమునుఁ దలఁదాల్చి ధర్మపాలనం బొనరింపుము. మతిమంతులు సందర్భా సందర్భములను యోచింపక త్వరపడి యేకార్యము జేయరు. నీవు సకలన్యాయములును బాగుగాఁ దెలిసి, ధర్మరాజను బిరుదుపేరు నొందియుండి యీవిషయంబునకై యింత పరితాపమునుఁ జెందుట యుక్తముకాదు. నీకు విశేషముగా జెప్పవలసినది లేదు. శీఘ్రముగాఁబోయి, నీకార్యములయందుఁ బ్రవేశింపుమని ప్రియంబు రెట్టింప నూరడించి మనస్సున కళంకంబు మాన్చి మరల నతని యధికార మతనికొసంగెను. అమృత తుల్యములగు పరమశివుని మాటలచే మనస్సునఁ దృప్తిఁజెంది, సంతోషంబుతో శంకరునకు దండప్రణామంబు లాచరించి మునిశేఖరుండగు సానందునకు నమస్కరించి, వారివలన ననుజ్ఞవడసి దండధరుండు తన పరివారముం గూడి యటనుండి కదలి స్వపురంబునకుం జనుదెంచి యెప్పటివలె తనయధికారమును వహించి ధర్మ పరిపాలన మొనర్పింప దొడంగెను. సానందముని సర్వేశ్వరుని కరుణకుం బాత్రుఁడై కైలాసంబునఁ బ్రకాశించుచున్నవాఁడు. అని సూతుఁడు శౌనకాది మహర్షులకు, సానందుని జననమాదిగా నతఁడు పరమేశ్వరుని సన్ని

ధికిం జేరువరకునుఁగల యతని చరిత్రంబును నతని తపఃప్రభావంబును వివరముగాఁదెలిపి శంకరునకును, శంకరతుల్యుండగు సానందునకును, నాత్మ ప్రదక్షిణ నమస్కారము లొనరించి, మరల నిట్లనియె.

(ఫలశ్రుతి.)

మునీంద్రులారా! మిక్కిలి పావనంబైనట్టి యీసానందుని చరిత్రమును లోకంబున నెవరు పఠింతురో, యెవరు భక్తిపరులై వింధురో, యెవరు చేతులార వ్రాయుదురో, యట్టివారు సర్వేశ్వరుని కృపకుఁ బాత్రులై, సమస్తపాపముల వలనను విడువఁబడి, పుణ్యవంతులై, పుత్ర, పౌత్ర, ప్రపౌత్ర, కళత్ర, ధన, ధాన్య సంపదలు కొఱంతలేక కలిగి, యారోగ్యమును, సంతోషమును నతిశయింప నిహలోకంబున సమస్తసౌఖ్యముల ననుభవించి దేహాంతమున ననాయాసంబుగా స్థూలదేహముం ద్యజించి యుత్తమంబులగు దివ్యరూపములు ధరించి శాశ్వతంబగు శివలోక సాయుజ్యంబు నొంది యానందింతురు. ఇది సత్యము. శివభక్తులకెల్ల నీశ్వరానుగ్రహము కలుగును గాక. యని పలికి దీవించిన, మునులందఱును సానందుని చరిత్రంబును సాంతముగా శ్రద్ధావధానంబులు గలిగి యాలించి పరమానంద కలితమనస్కులై, సూతునిఁజూచి, మహాత్మా! మీకరుణా విశేషంబు వలన, భవ్యతరమైన చరిత్రము నాలించి కృతార్థులమైతిమి. మాకుం గల యానందంబిట్టిదని చెప్పఁగలవి కాదు. మావిన్నపంబు నాలకించి యేతత్కథం జెప్పి మమ్ము సంతృప్త హృదయులం గావించితిరి యని యనేక విధంబుల నతనిం గొనియాడి ప్రదక్షిణ నమస్కారములం గావించిరి.

సమస్త సన్మంగళానిభవంతు.



శార్దూలవిక్రీడితమాలిక.

శా. శ్రీవత్సాహ్వయ గోత్ర సంభవుఁడ ల ♦ క్ష్మీనారసింహార్యకున్
సావిత్ర్యాంబకు నాత్మజుఁడను మఱి ♦ శ్యామా మహీదేవుఁడన్

భావింపఁదగు వంశ ♦ వర్ధనుఁడ నాపస్తంబ సూత్రుండనే
లావణ్యాన్విత సాధ్వి నాదగు మహా ♦ లక్ష్మీవిభుండన్ నృప
గ్రామావాస సువాసుఁడై వెలయు మం ♦ గానాథపాదద్వయీ
సేవాసక్తుఁడ పిచ్చయాఖ్యుఁడ సుధీ ♦ శ్రేష్ఠప్రియుండన్ కవిన్
శైవప్రీతికరంబుగాఁ దనరు యీ ♦ సానందు చారిత్ర మిం
ష్టావాప్తిప్రదమౌచునే వచనకా ♦ వ్యం బేర్పడన్ జేసితిన్.

క. ఇది పన్నగేశ్వరాచల,
సదనునకు సమర్పణంబు ♦ సలిపితి భక్తిన్
జదివిన వినినన్ వ్రాసిన,
ముదమును సిరిమోక్షము మొసఁగు ♦ మురహరుఁ డుదయన్.

ఆ. ఎంతదాక యుదధు ♦ లెందాక రవిసోము
లెంతదాక తార ♦ లెసఁగుచుండు,
నంతదాక లోక ♦ మందు యీ సత్కృతి
వినుతిఁ జెంది మిగుల ♦ వెలయుఁగాత.

## గద్యము.

ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ చతుర్విధ కవితా
విశారదుండగు, పురాణం - పిచ్చయ్యకవిచే రచియింపఁ
బడిన సానందోపాఖ్యాన వచనకావ్యమునందు
సర్వంబును షష్ఠ ప్రకరణము.

సంపూర్ణము.



శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.